# ధీటవు గుండెలు

## దిమిత్రియ్ మెద్వెదెవ్

అనువాదం :

పుప్పల లక్ష్మణరావు

ప్రజాశక్తి బుక్ హౌస్
కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ-2

ప్రచురణ నెం. 808
ముద్రణ : 1992, ఫిబ్రవరి
కాపీలు : 2,000

వెల : రు. 24-00

ప్రతులకు :
ప్రజాశక్తి బుక్ హౌస్
కారల్‌మార్క్స్‌రోడ్, విజయవాడ-2

ముద్రణ :
ప్రజాశక్తి ప్రెస్,
గవర్నర్‌పేట, విజయవాడ-2

## ఆ వీరుల స్ఫూర్తికి నివాళిగా సమర్పణ – ఈ పునర్ముద్రణ

ప్రసిద్ధికెక్కిన సోవియట్ నవల "ఉక్కుపాదం" తెలుగు అనువాదాన్ని అందచేస్తున్నందుకు సంతోషిస్తున్నాం. పునర్ముద్రణ అయినా సందర్భాన్నిబట్టి దీనికి ప్రత్యేక ప్రాధాన్యత వుందని చెప్పడానికే ఈ నాలుగు మాటలు.

ఆధునిక మానవ చరిత్ర ముఖ్యమైన మలుపుల్లో ఒకటి ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామంలో ఫాసిజం ఓటమి. దాన్ని ఓడించిన మహత్తర దేశం ప్రథమ సోషలిస్టు రాజ్యమైన సోవియట్ యూనియన్. సోవియట్ ప్రజానీకంలో ప్రతి ఒక్కరూ వీరులై శూరులై చైతన్య విస్ఫులింగాలై విజృంభించబట్టే ప్రపంచానికి ఫాసిజం ప్రమాదం తప్పింది. ఈ యుద్ధంలో సోవియట్‌తోపాటు అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ పాలుపంచుకున్నా వాటికి–దానికి పోలికలేదు. సోవియట్ యూనియన్‌పై నాజీ నరహంతకులు ప్రత్యేక కక్షతో, సర్వశక్తులు కేంద్రీకరించి దాడిచేశారు. వారిపై సాగిన మహాయుద్ధంలో మిత్రరాజ్యాలనుంచి సోవియట్‌కు అందాల్సిన సహాయం చాలావరకు అందనే లేదన్నది చారిత్రిక సత్యం. అయినా స్టాలిన్ నేతృత్వంలో సోవియట్ ప్రభుత్వము, కమ్యూనిస్టుపార్టీ, ప్రజానీకమూ వూహాతీతమైన కష్టనష్టాలు భరించి యుద్ధాన్ని కొనసాగించారు. శత్రుశక్తులను సమాధిచేసి తమదేశాన్ని రక్షించు కోవడమేగాక ప్రపంచాన్నే పరిరక్షించారు.

ఆ యుద్ధ సమయంలో సోవియట్ ప్రజానీకం, ప్రత్యేకించి కమ్యూనిస్టులు ప్రదర్శించిన ధైర్యసాహసాలు, త్యాగనిరతి మరపురానివి; మరువరానివి. ఇప్పుడు

చరిత్ర తాత్కాలికంగా తిరగబడింది. ఆ విప్లవాల పురిటిగడ్డ ప్రతిఘాతశక్తుల కైవశమై, విచ్ఛిన్నమవుతోంది. "గ్లాస్‌నాస్త్" పేరుతో మూడేళ్ళ ముందునుంచి గత చరిత్రను తెగనాడుతూ, ఆ వీరుల త్యాగాలపై బురదజల్లుతూ వచ్చిన తప్పుడు విధానాలు సామ్రాజ్యవాదుల పంటపండించి, శ్రామికవర్గ రాజ్యానికి చేటు తెచ్చాయి.

ఈ పరిణామక్రమంలో మహత్తరమైన గత చరిత్ర మరుగుపరచడం జరుగుతోంది. మహానాయకులపై మలిన ప్రచారాలు నడుస్తున్నాయి. గతంలోని త్యాగాలు, మహత్కార్యాలను చూసి గర్వించడం కన్నా శత్రువులను మించిపోయి లోపాలు దాటి చెప్పడం ఫ్యాషనైంది. కమ్యూనిస్టుపార్టీ ద్వారా పైకివచ్చి పాలుతాగి రొమ్ము గుద్దినట్లు విద్రోహులుగా, విప్లవ ప్రతిఘాతకులుగా మారిపోయిన ఎల్ట్సిన్‌వంటి వారు నాటి నాజీలను మించిపోయి విషం కక్కుతున్నారు.

ఈ స్థితిలో సోవియట్ యూనియన్, కమ్యూనిస్టులు నిర్వహించిన సాటిలేని మేటి పాత్రలను గుర్తుకు తెచ్చుకోవడం, ప్రచారం చెయ్యడం ప్రపంచవ్యాపితంగా వున్న విప్లవ పార్టీల విద్యుక్తధర్మం. చరిత్రను పునస్థాపితం చేయడం ఎవరి తరం కాదు; ఆ వారసత్వం రష్యా ఒక్కదానికే పరిమితమూ కాదు. మానవజాతి విద్యా విజ్ఞానాలు, కళాసాహిత్యాలు, రాజకీయ సిద్ధాంతాలు ప్రపంచమంతటికీ చెందినట్లే, విప్లవవీరుల త్యాగాలు, సాహసాల వారసత్వం కూడా విశ్వ ప్రజలందరికీ చెందుతుంది. ఆ అంతర్జాతీయ స్ఫూర్తికి నివాళిగానే ఈ పుస్తక పునర్ముద్రణ.

ద్మిత్రీయ్ మెద్వెదెవ్ రచించిన ఈ పుస్తకం సోవియట్ గెరిల్లాలు నాటి యుద్ధంలో ప్రదర్శించిన వీరత్వాన్ని, సాధించిన ఘనకార్యాలను ఆసక్తికరంగా వివరిస్తుంది. ముఖ్యంగా ఉత్సాహవంతుడు, సాహసికుడు, బుద్ధిశాలి అయిన కుజ్నెత్సోవ్ అనే గెరిల్లా జర్మనీ ఆఫీసర్‌గా వెళ్ళి నాజీలను నమ్మించి ఎన్నెన్నో సాహసాలు చేస్తాడు. గెరిల్లాలు పోటీలుపడి ప్రాణాంతక బాధ్యతలు చేబట్టి, జయప్రదంగా నెరవేరుస్తారు. ఇలాటి అశేషత్యాగాలవల్లనే దేశభక్తమహాయుద్ధంలో సోవియట్ విజయం పొందగలిగింది.

రెండవ ప్రపంచయుద్ధంలో ప్రధానపాత్ర సోవియట్ ప్రజలదికాగా, దాన్ని మరుగుపరచే ప్రయత్నం పాశ్చాత్యదేశాలు ఎప్పుడూ చేస్తుంటాయి. జర్మన్లపై కొంతమంది ఉగ్రవాదులు జరిపిన చెదురుమదురు టెర్రరిస్టు చర్యలనే సినిమా స్టయిల్‌లో, అతిశయోక్తులుగా చూపుతుంటారు. "గన్స్ ఆఫ్ నవరోన్",

"ఆపరేషన్ డేబ్రేక్" వగైరా అనేక చిత్రాలు ఈ కోవకు చెందినవే. చిత్రాలుగా వాటిలో తప్పుపట్టాల్సింది లేకున్నా, వాటి వెనుక వున్న వుద్దేశ్యం మాత్రం సరైంది కాదు. అవన్నీ వ్యక్తిగత వీరకృత్యాలు అయితే, సోవియట్ పుస్తకాల్లో, చిత్రాల్లో మనం మొత్తం ప్రజలందరి శౌర్యప్రతాపాలను గమనిస్తాం. కేవలం సైనికులుగా గాక దేశభక్తులుగా, అంతకుమించి అంతర్జాతీయవాదులుగా చైతన్యంతో పోరాడటం చూస్తాం. ఈ గ్రంథంలో ఒకచోట గెరిల్లాలు ప్రాణంమీదకు వచ్చినా మద్యం ముట్టుకొనడానికి నిరాకరిస్తారు. సుందరయ్యగారి 'వీరతెలంగాణా విప్లవపోరాటం'లో కూడా సరిగ్గా యిలాంటి అంశాలు మనం చూడగలగడం యాదృచ్ఛికం కాదు. ఎందుకంటే ఉభయులూ కమ్యూనిస్టులు గనుక! ఆ చైతన్యమే మళ్ళీ మేల్కొంటుంది. విప్లవ ద్రోహులకు పాఠంచెప్పి అరుణపతాకాన్ని మళ్ళీ సమున్నతంగా ఎగురవేస్తుంది! ఇది ముమ్మాటికీ తథ్యం!!

— ప్రచురణకర్తలు

# రిహార్సల్

1942 ఏప్రిల్ నెలలో ఒకరోజు ఉదయాన గెరిల్లాలుగా శిక్షణ పొంద బోయే వ్యక్తులు కొందరు తూషినొ విమానాశ్రయం దగ్గర ఒక జట్టుగా సమావేశ మయ్యారు. వారందరూ విమానంనుండి తమ తొలి పారషూట్ జంప్ కోసం అక్కడకు వచ్చారు. అక్కడున్నవారిలో నేనుతప్ప అంతవరకు పారషూట్‌తో జంప్ చేసినవారు మరెవ్వరూలేరు. వారిలో చాలామంది ఆందోళనపడుతూండడం నేను గమనించాను. కొందరు ఉత్సాహంగా నవ్వుతూ బాతాఖానీ మొదలెట్టారు, కాని ఈ "ఉత్సాహవంతులు" విమానాశ్రయం కేసి సారించుతూన్న గాభరా చూపులను బట్టి వారి మనస్థితి ఎలా వుండెనో స్పష్టంగా తెలిసిపోతూనేవుంది.

వారి మనస్సులలో వున్నది పిరికితనం కాదని నాకు తెలుసు. గెరిల్లాలలో చేరేందుకు వారందరూ ఏ నిర్బంధమూ లేకుండా స్వచ్ఛందంగా వచ్చినవారే. శత్రు ఆక్రమిత ప్రాంతాలలో తమకు ఎదురుకాబోయే ప్రమాదాలను గురించి వారికి స్పష్టంగా తెలుసును. గెరిల్లా దళాలలో చేరేందుకని ఎంతోమంది వాలంటీర్లువచ్చారు, కాని వారందరిలోనూ ఏభైమంది మాత్రమే—నిష్కర్షగా విశ్వాసపాత్రులూ, నిర్భయులైనవారు—ఎంపిక అయ్యారు. ఇప్పుడు వీరందరూ కూడా ఆందోళనతో గాభరా పడుతున్నారు. ఈ ఆందోళనా, గాభరా కేవలం సహజమూ సాధారణమూ అనే విషయం తొలిసారి పారషూటుతో జంప్‌చేసిన వారందరూ ఎరుగుదురు.

నేను వాచీ చూసుకున్నాను. ఇంకా పూర్తిగా ముప్పై నిమిషాల వ్యవధి వుంది.

అలెక్సాండ్ర్ లుకిన్ నాకు కాస్త దూరంగా కూచున్నాడు. అతడు

మా డిటాచ్‌మెంట్‌కి రికాన్నిసెన్స్ శాఖ నాయకుడుగా వుండబోతున్నాడు. అతడు కూడా అందరిలాగానే గాబరాపడుతూ, సిగరెట్టుమీద సిగరెట్టు కాల్చేస్తున్నాడు.

"లుకిన్!" అని నేను అతనివైపు తిరిగి, అందరికీ వినబడాలనే ఉద్దేశం తోనే అతనిని దగ్గరగా పిలిచాను. "అదేమిటండీ, సిగరెట్లు అలా ఊదిపారేస్తున్నా రేమిటి? ఉరకడం ఏమంత సరదాగా వుండదనీ, కాస్త భయంవేస్తుందనా?" అని అడిగాను.

అందరకూ ఆసక్తిదాయకంగా వుండే ఈ సంభాషణను నేను ఏదో ఒక ఉద్దేశంతో ప్రారంభించానన్న సంగతి లుకిన్ గ్రహించి:

"ఇప్పుడేమనుకున్నా కార్యంలేదు. భయం వేయనీయండి, భయం వేయక పోనీయండి, ఏమైనాసరే ఉరకక తప్పదుకదా!" అని జవాబు చెప్పాడు.

మా మాటలు అందరూ విన్నారు. అందరూ మౌనంగా వూరుకున్నారు.

"జంప్‌చేయడమంటే తనకు భయంవేస్తూందని తమ కమాండరే ఏ దాప రికమూ లేకుండా ఒప్పుకుంటున్నాడే! ఇదేమిటి?" అని అక్కడవారందరూ ఆశ్చర్య పడ్డారు. వారందరూ మౌనంగా వుండడం చూసి, అరగంటవరకూ ఇలా కనిపెట్టు కుని వుండడం వీరందరికీ మరీ చికాకుగా వుంటుందన్న సంగతి గ్రహించి, చికాకు పోగొట్టేందుకు ఇదే తరుణమని, ఓ కథనం మొదలుపెట్టాను:

"నిజమే, మీకిది కొత్త అనుభవమే. కాని నేను పాతకాపునే. ఈ వేళ నాది మూడో జంప్ అవుతుంది. మొట్టమొదటిసారి నేను జంప్‌చేయడం చాలాకాలం కిందట, 1907లో. అప్పటికింకా 'పారషూట్ జంప్' అనే మాటే ఎవ్వరూ వినలేదు. ఆ రోజుల్లో నేను బైలోరష్యాలో బేజిత్స అనే ఓ పెద్ద కార్మికబస్తీలో వుంటూండే వాణ్ణి. సెంట్ నికొలస్ దినంనాడు మా నాన్న పుట్టినరోజు అవడంచేత ఆనాడు మా ఇంటికి అతిథులు వస్తారని కనిపెట్టుకున్నాం. అతిథులందరూ చాలామటుకు ముసలాళ్లే. నాకప్పుడు ఎనిమిదేళ్లు. మరి ముసలాళ్ళందరితోనూ కూచోవడమంటే నాకు సహజంగానే చికాకేసి, ఇంట్లో వాళ్ళందరూ పనితొందరలో వుండడం చూసి, మా నాన్న కాల్చే పొగాకులో కొంత పొగాకు తస్కరించి, ఓ ఉప్పు హెర్రింగ్ చేపను సంగ్రహించి, పుట్టినరోజు 'పిరోగ్' బజ్జిలోనుంచి ఇంతముక్క కోసి ఇవన్నీ పట్టుకుని, మా ఇంటికి చేరువగావున్న అగ్నిమాపకదళపు గోపురంమీద కావలివానిగా పనిచేస్తూన్న గవ్రీలిచ్ దగ్గరకు పరుగెత్తాను.

"గోపురంమీద కావలి కాస్తూన్న ముసలాడు గవ్రీలిచ్, నేనూ చాలా

కాలంగా నేస్తులం. అతడు మంచి మంచి కథలు చెబుతూండేవాడు. ఆ కథలు విన డానికి నేను చెవి కోసుకునేవాణ్ణి. అవి వింటూ రోజంతసేపూ అక్కడే గడిపేవాణ్ణి. ఆ గోపురంమీద నిలబడి చూస్తే మా బస్తీ యావత్తూ కనబడుతుంది.

"నేను తెచ్చిన పిరోగ్‌ముక్కను గవ్రీలిచ్ నోట్లో వేసుకుని, మంచి రుచిగావుందని మెచ్చుకున్నాడు, చేపలిన్నాడు. ఇక పొగాకును కాగితంలో చుట్టి సిగరెట్టు తయారుచేసి దాన్ని ముట్టించేలోపున, 'మంత్రంవేసిన లివాసి' కథ అప్పుడే ప్రారంభించి, మంచి సరదాగా చెప్పుకుపోతున్నాడు. ఆగోపురంమీద 2 గంటలసేపు కూచున్నాం. గవ్రీలిచ్ అలసిపోయి, కునుకు మొదలెట్టాడు. నాకు మరే పనీ లేకపోవడంతో, సిగరెట్టు కాల్చడానికే నిశ్చయించుకుని. సిగరెట్టు తయారుచేసి, దాన్ని ముట్టించి, దాబుగా దమ్ముపీల్చుతూ, అలవాటు లేకపోవడంచేత ఉక్కిరిబిక్కిరైపోతూ, గోపురం ప్లాట్ ఫారంపైన ఇటూ అటూ పచారుచేశాను. పచారుచేస్తూ కిందకి చూశాను: చూసేసరికి అగపడ్డాడు—నాన్న! నాన్న తన చేతికర్రను నావైపు ఝళిపించి, గోపురపు దిశగా రాసాగాడు. నాన్నచేత ఇక దెబ్బలు తప్పవని నిశ్చయం చేసుకున్నాను. అందుకు రెండు కారణాలు: మొదటిది, గోపురం ఎక్కవద్దని నాన్న ఇదివరకే నాతో గట్టిగా చెప్పాడు; రెండోది, నేను సిగరెట్టు కాల్చుతుండగా ఆయన కంట బడిపోయాను.

"ఏమిటి చేయడం? ఎలా తప్పించుకోవడం?—అని ఆలోచించుతూండే సరికి, అక్కడ వున్న పెద్ద కేన్వాసు గొడుగు అగపడింది. గవ్రీలిచ్ భార్య మార్కెట్టుకెళ్ళి, ఎండకీ, వానకీ ఆ గొడుగు మంచిదని దానిని అక్కడ వేసుక్కూచుని సూర్యకాంత గింజలు అమ్ముకునేది. మరైతే, ఈ గొడుగును గోపురంలో వుంచుతున్నావెందుకని నేను గవ్రీలిచ్‌ని అడగ్గా, అతగాడు కొంటెగా కన్నుగీటి: 'ఇది ఎంతో ముఖ్యమైన వస్తువు, అబ్బాయ్! అసలు గోపురానికే నిప్పంటుకుంటుం దనుకో—నిప్పేసే తగలబడుతూంటే, ఇహ నేను కిందకి దిగడం ఎలా? అప్పుడు ఈ గొడుగు విప్పి, దాన్ని పట్టుకుని కిందకి ఉరికేస్తా!' అన్నాడు.

"గవ్రీలిచ్ తమాషాకే అన్నాడు. కాని నాన్న అగపడేసరికి, నాకు ఎంతగా హడలేసి పోయిందంటే, ఇక ముందు వెనుకలు ఆలోచించకుండా, చప్పున ఆ గొడుగు తీసి, దాన్ని విప్పి పట్టుకుని కిందకి ఉరికేశా. ఆయ్ బాబోయ్, నిజంగా ఘోరమే అనిపించింది!

"ఉరుకుతూన్నంతసేపూ గొడుగును మాత్రం చేతిలోనుంచి వదిలిపెట్ట లేదు. ఎగిరి, గొడుగుతో సహా పొరుగింటి పైకప్పుమీద పడ్డాను. పడడంలో నాకు బాగా దెబ్బలు తగిలాయి, మోకాళ్ళు చెక్కుకుపోయాయి. అయితే యేం, ఇంటి పై

కప్పుమీదనుండి కిందకి గంతేసి, పక్క సందులోకి పారిపోయి, ఇక ఏం జరగబో తుందో చూదామని సందుమొగిని నుంచుని చూస్తున్నాను.....

"అప్పటికప్పుడే నాన్న మెట్లెక్కి గోపురం మీదకెళ్ళడం నాకగపడింది. ఆయనకు గ్ర్రీలిచ్ ఎదురుగా వెళ్ళి, ఎదురింటి పైకప్పుమీద నేను వదలిపెట్టేసిన గొడుగు చూపెట్టి, ఏమిటేమిటో చెప్పాడు.

"ఆ తరువాత ఇక నాన్న నాకు అగపడలేదు: బహుశా నా కోసం వెతక డానికే ఆయన నిశ్చయించుకునుంటాడు. అందుకని నేను అక్కడనుంచి పలాయనం చిత్తగించి, మరి మూడు వీధులు దాటి, సాయంకాలానికి ఇల్లుచేరుకున్నాను. అయితే తేం, నాన్నచేత దెబ్బలు మాత్రం తప్పలేదు.

"అదీ నా మొట్టమొదటి పారషూట్ జంప్. చూశారా మరి—నేను ఏ విధంగా పారషూట్ జంపింగ్ క్రీడలో మార్గదర్శకుడనయానో!"

కథ చెబుతూండగా శ్రోతల ముఖాల్లో ఉల్లాసరేఖలు అగపడడం కని పెట్టాను. కథ అంతటితో ఆపి, వాచీ చూసుకున్నాను. ఇంకా మరో పదినిమిషా లుంది. కథ పూర్తి చేసేందుకు వేళ వుంటుంది కదా అనుకుని, కథనం కానిచ్చాను:

"రెండో సారి, నిజమైన పారషూటుతో నిజమైన విమానం నుండి జంప్ చేశాను. అది ఈ మధ్యనే జరిగింది. యుద్ధం మొదలైన తరువాత, క్రితం ఆగస్టు లోనే నేను ఒక డిటాచ్‌మెంటుతో యుద్ధశ్రేణి దాటి శత్రు ప్రదేశంలోకి వెళ్ళాల్సి వుండెనేమో, పారషూటుతో జంప్‌చేయడం చేతవునా అని నన్ను అడిగారు. నాకది తొలిసారి కాదని తొణకూ బెణకూ లేకుండా జవాబు చెప్పేశాను. నా జవాబు విని, నన్ను విమానాశ్రయానికి తీసుకెళ్ళారు. పారషూటుని ఎలా తెరవడమో ఓ ఐదు నిమిషాల్లో నాకు బోధపరచేసి, ఓ చిన్న "U-2" విమానంలో తీసుకెళ్ళారు నన్ను. ఆ విమానంలోనుంచి జంప్‌చేశాను. నిజం చెప్పాలంటే, నాకు భయమే వేసింది. తరు వాత తెలిసింది, అదంతా వృథాప్రయాసే అయిందని. మేం కాలినడకనే యుద్ధ శ్రేణిని దాటాం. ఇహ ఇప్పుడు ఇది నా మూడో జంప్ కాబోతుంది. కల్లా కపటమూ లేకుండా చెబుతున్నాను: నాకు నిజంగా భయం వేసింది. అయితే ఒకటి—మనం కేవలం రెండు సార్లే జంప్‌చేయాల్సి వుంటుంది. దాంతో జర్మన్ శ్రేణి వెనుక ప్రాంతం చేరుకుంటాం. మొదటిసారి ఈ వేళ; రెండోసారి, మరి కొద్ది రోజుల తరు వాత ఆ పైన—మన అసలు పని మనకి వుండనే వుంది. ఇహ—తయారవుదాం. అదుగో, మనకోసం వస్తున్నారు!"

నా కథ మా కామ్రేడ్లకి ఉత్సాహం కల్గించినట్టే అవుపడింది. వారి మనసు కుదుటబడింది: తమ కమాండరుకే కొంత గాభరా అనిపించుతూంటే, తాము గాభరా పడడంలో సిగ్గుపడాల్సింది ఏమీ లేదనిపించింది వారికి.

విమానం ఎక్కాం.

పారషూట్ జంప్‌లు అన్నీ సరిగానే జరిగిపోయాయి. కాని కొంత తికమక కూడా జరగకపోలేదు. నేను ఓ పెద్ద బర్చ్‌చెట్టుమీద వాలాను. నా పారషూట్ చెట్టు కొమ్మల్లో చిక్కుకుంది, జీనుపట్టీల్లోనుంచి గుంజుకుని బయటపడి, చెట్టుమీద నుండి కిందకి పాకి దిగాల్సివచ్చింది.

మరో కామ్రేడ్ విమానాశ్రయానికి చేరువలో వున్న రెండు చెట్ల మధ్య చిక్కుకున్నాడు. కామ్రేడ్లు అతడిదగ్గరకు పరుగెత్తి వెళ్ళి:

"ఇదిగో! ఒక్క ఊగు ఊగి, ఓ చెట్టుకొమ్మ అందుకుని, చెట్టుదిగి వచ్చేయ్!" అంటూ కేకవేశారు.

వారు చెప్పినట్టూ చేయడానికి అతడు ప్రయత్నించాడు, కాని కార్యం లేకపోయింది. వేరొక పారషూటుని తెచ్చి, దానిని ఆ రెండు చెట్ల మధ్యనూ వల మాదిరిగా పట్టుకుందుకు కదమ కామ్రేడ్లు నిశ్చయించారు. ఇకప్పుడు:

"పారషూట్ పట్టీలను విప్పేసుకుని, కిందకి ఉరికేయ్!" అని వారు అతనికి సలహాచెప్పారు.

తొలి ప్రయత్నంలో అపజయం పొందిన ఆ పారషూటిస్ట్, రక్షణవల మీదకి ఉరుకుతూన్న సర్కస్ ఆటకాడులా అగపడ్డాడు.

మేము విమానాశ్రయంనుండి మాస్కోకు ఒక లారీమీద వెళ్లాం. అప్పటికప్పుడే మధ్యాహ్నం దాటింది. కాని వీధులన్నీ నిర్మానుష్యంగా అగపడ్డాయి. బంతులతో ఆడుకుంటూ, స్కిప్పింగ్ తాళ్ళతో గంతులేస్తూ, ట్రైసికిళ్ళెక్కి తిరుగుతూండిన పిల్లలతో శాంతిదినాల్లో కిక్కిరిసి వుండిన త్వెర్‌స్కోయ్ బూల్వారూ, సోవియట్ స్క్వేయ చౌకూ కూడా నిర్జనంగానే వున్నాయి. పిల్లలనూ, తల్లులనూ, ముసలవ్వలనూ తూర్పున సురక్షిత ప్రాంతాలకి తరలించి వేశారు. ఎన్నో ఆఫీసులనూ, ఫ్యాక్టరీలనూ కూడా తరలించివేశారు. ముఖ్యపట్టణం సగం ఖాళీగా వుంది. మాస్కోనుండి రెండు మూడు వందల కిలోమీటర్ల దూరంవరకూ నాజీలు వెనక్కి తరిమివేయబడ్డారు. అయినప్పటికీ శత్రువిమానాలు మాత్రం దాడులు సాగించుతూనే వున్నాయి.

శత్రు శ్రేణిని దాటేందుకు మా సన్నాహాలు పూర్తి కావస్తున్నాయి. నిజమే— ఈ సన్నాహాలకోసం ఏమంత విశేషకాలం మేం వినియోగించలేదు, అంతా వెళ్లాళ్ళలోపే. మా క్యాంపుని పట్టణానికి దగ్గరగా వున్న ఓ అడవిలో ఏర్పరచుకున్నాం. మా షూటింగ్ తర్ఫీదూ, టోపోగ్రఫీ క్లాసులూ కూడా ఆ అడవిలోనే. మాకు కొంత సాప్పర్ తర్ఫీదు సహితం ఇచ్చారు: బల్లకట్టు తెప్పలు నిర్మించడం నేర్చుకున్నాం, మేం నిర్మించిన తెప్పలమీదనే అక్కడకు దగ్గరలో వున్న సరస్సును దాటాం.

గెరిల్లాలుగా వారి భావిజీవితం గురించి నా మనుషులతో ప్రసంగించేందుకు డిటాచ్‌మెంటు కమాండరుగా నాకు దొరికిన ప్రతి అవకాశాన్నీ వినియోగించుకున్నాను. వారందరికంటె నాకే హెచ్చు అనుభవం వుండెను. ఏమంటే, 1941 ఆగస్టు నుండి 1942 ఫిబ్రవరి వరకు బైలోరష్యాలోని బ్ర్యాన్‌స్క్ అడవుల్లో ఒక గెరిల్లా డిటాచ్‌మెంటుకి కమాండరుగా పనిచేశాను. మా ఎదటవున్న ప్రమాదాలను గురించి కామ్రేడ్లతో వివరించాను. ప్రాణాపాయం గురించి చెప్పాను. కాని వారిని భయపెట్టకుండా వుండేందుకని ఇలా అన్నాను:

"నా అనుభవంవల్ల నేను చెబుతున్నాను — జర్మన్ శ్రేణి వెనుకప్రాంతాల్లో నిజమైన అధికారం గెరిల్లాలదే. ప్రజలు గెరిల్లాలను ఎర్రసైన్యపు ప్రతినిధులుగానూ, సోవియట్ ప్రభుత్వపు ప్రతినిధులుగానూ భావించుకుంటారు. ఇందువల్లనే గెరిల్లా సైనికుడు తాను ఎక్కడ వుంటూన్నా సరే, ఏ పనిచేస్తూన్నా సరే, మన మహనీయ సోవియట్ మాతృభూమి కీర్తిని నిల్పేటట్టుగా ప్రవర్తించాలి!"

మా డిటాచ్‌మెంటులో వున్నవారిలో చాలామంది ఉక్రైనియన్ సైనికులు. ఇది యాదృచ్ఛికమేమీ కాదు. మేము ఉక్రైనియాలోని రోవ్నొ ప్రాంతానికి—సార్నీ, రకీత్నొయె, బెరెజ్నొ పట్టణాల మధ్య బ్రహ్మాండమైన అరణ్యాలు విస్తరించివున్న ప్రాంతానికి—వెళ్తున్నాం. మా హెడ్‌క్వార్టర్సుని సార్నీ అరణ్యాలలో ఏర్పరచుకోబోతున్నాం.

కాని ఈ అరణ్యాలలోకి వెంటనే విమానాల్లో దిగడం ఏమంత సులువైన పనిగా పరిణమించలేదు. ఈ అరణ్యాలు జర్మన్ ఆక్రమిత ప్రాంతాల్లో జర్మన్ యుద్ధ శ్రేణి వెనుక ఎంతో దూరాన వున్నాయి. జర్మన్ ఆక్రమిత ప్రాంతాలకు వెళ్ళాలంటే విమానంమీద రాత్రిపూటే వెళ్ళాలి. పగలు వెళ్తే, విమానాన్ని వాళ్లు ఏ క్షణమైనా కూల్చివేయగల్గే ప్రమాదం వుంటుంది. వసంతకాలంలో రాత్రి అట్టే సేపు వుండదు, వున్న కొద్ది గంటల్లోనూ మాస్కోనుండి సార్నీ అరణ్యాలకి వచ్చి, అక్కడనుంచి మళ్ళీ మాస్కోకి చీకటిమాటున తిరిగి వెళ్ళిపోవడానికి విమానానికి

వేసవాలదు. అంతేకాకుండా, ఆ అరణ్యాల గగనసీమల్లో సోవియట్ విమానాలు ప్రత్యక్షమైతే, అవి వెంటనే జర్మన్ల కళ్ళబడతాయి. ఇక దానితో గెరిల్లా డిటాచ్ మెంటు గొప్ప ప్రమాదంలో చిక్కుకుంటుంది. ఈ కారణాలచేత, డిటాచ్మెంటుని రోవ్నొ ప్రాంతపు సరిహద్దునవున్న మోతీర్ అరణ్యాలలోని ముహోయేది గ్రామా నికి విమానాలమీద పంపడానికీ, అక్కడనుండి డిటాచ్మెంటు కాలినడకనే సార్నీ అరణ్యాలకు బయల్దేరేటట్టూ నిర్ణయమైంది.

## పారషూట్ జంప్

డిటాచ్మెంటుని యుద్ధశ్రేణి వెనుకప్రాంతంలోకి విమానాలమీద పంపే టందుకు, దానిని అనేక గ్రూపులకింద విడదీశాం. మొదటి గ్రూపులో పధ్నాల్గు రున్నారు. ఈ మొదటి గ్రూపును మే నెల చివరిరోజుల్లో యుద్ధశ్రేణి వెనుకప్రాంతం లోకి పంపించాం. ధైర్యశాలీ, యువకుడూ - యువకుడే అయినప్పటికీ - అదివరకే గెరిల్లా సైనికునిగా అనుభవం గడించిన సాష త్వోరొగొవ్ ఈ గ్రూపుకి నాయకుడుగా నియమించబడ్డాడు.

సాష సైనికుడుగా పనిచేసిన ఆర్మీ యూనిట్టు యుద్ధం మొదట్లోనే శత్రు, చక్రబంధంలో ఇరుక్కుంది. తోటి కామ్రేడ్లతోసహా సాష బైలోరష్యన్ అరణ్యాల లోకి తప్పించుకు పారిపోయి, గెరిల్లాలతో చేరాడు. 1941 అక్టోబరులో సాషగ్రూపు, అప్పట్లో బైలోరష్యాలో గెరిల్లా చర్యలు సాగించుతూండిన నా డిటాచ్మెంటులో చేరింది.

అనతికాలంలోనే సాష మంచి గెరిల్లా సైనికునిగా పేరు సంపాదించుకుని, డిటాచ్మెంటు అంతటికీ రికాన్నిసెన్సు శాఖ కమాండరుగా నియమించబడ్డాడు. అతడు యుద్ధ చర్యలను జయప్రదంగా నడిపించాడు. తర్వాత 1942 ఆరంభంలో అతడు నా డిటాచ్మెంటుతో కలిసి మాస్కోకి తిరిగి వెళ్ళిపోయాడు.

కొత్త డిటాచ్మెంటులో చేరిన సైనికుల జాబితాలో మొదటి పేరు సాషదే యుద్ధశ్రేణి వెనుక ప్రాంతాలకు విమానంలో వెళ్ళినవారిలో అతడే మొదటివాడు. విమానంమీద వెళ్ళి, ముహోయేది గ్రామానికి దగ్గరగావున్న మోతీర్ అరణ్యాలలో దిగడమూ, కడమ గ్రూపులను రప్పించి వాటిని కలుసుకునేందుకు అనుకూలమైన స్థలాన్ని ఏర్పాటుచేయడమూ — ఈ కార్యాలు అతనికి ఒప్పగించబడ్డాయి.

ఈ కార్యాలను నిర్వర్తించడంలో ఒకవేళ అతడికి ఏదైనా ప్రమాదం గాని, అంతరాయంగాని సంభవించినప్పటికీ, ముందుగా ఏర్పాటుచేసుకున్న ప్రకారం కడమ డిటాచ్మెంటు మాత్రం, ఏది ఏమైనా సరే, ముహోయేది గ్రామం దగ్గరకు

వచ్చి కలుసుకోవడం జరిగి తీరుతుందని, అతడు బయల్దేరేముందు అతడిని హెచ్చరించాం.

అతడు బయల్దేరిన రెండు రోజుల తరువాత, అతడు రేడియో చేశాడు – గ్రూపును మోజిర్ అరణ్యాలలో దింపడం బదులు పైలట్ పొరపాటుచేసి జితోమిర్ నగరానికి దక్షిణంగావున్న ఒక స్థలానికి తీసుకెళ్ళి అక్కడ దింపాడని. అనగా – ఈ స్థలం మోజిర్ అరణ్యాల ఆవల రమారమి మూడువందల కిలోమీటర్ల దూరాన వుందన్నమాట; చెట్టూ చేమా అక్కడ లేకపోవడంచేత, ఎంతో కష్టంమీదకాని మాటు దొరకని స్థలం అయింది అది. తన గ్రూపు ముహొయేది గ్రామానికి వెళ్తొందని సాష మరుసటి రోజు రేడియో ద్వారా రిపోర్టు చేశాడు.

సాష ప్రసారం చేస్తూన్న రిపోర్టును మేము వింటూండగా, మధ్యలో తటాలున ప్రసారం ఆగిపోయింది. సాష మళ్ళీ రేడియో చేస్తాడేమో అని రెండ్రోజులు చూశాం, మూడు రోజులు చూశాం. కాని సాషనుండి ఏ ప్రసారమూ అందలేదు.

ఏమిటి జరిగి వుంటుందా అని ఆలోచించాం.

కొచెతోక్కవ్ నాయకత్వాన మరొక గ్రూపును పంపించేందుకు నిశ్చయం చేశాం. ఈ గ్రూపు మనుషులు పారషూట్లతో దిగుతూ, అక్కడ ఏదో వాగువ ఒకటి వుంది కాబోలు, అందులో దిగబడ్డారు. మనుషులు పూర్తిగా తడిసి ముద్ద అయిపోయారు, వాళ్ళ సామగ్రి తడిముద్ద అయింది. వాళ్ళు అసలు బతికి బయట పడ్డమే బ్రహ్మాండమైంది.

కొద్దిసేపు తరువాత కొచెతోక్కవ్ రేడియో చేశాడు – ముహొయేది గ్రామానికి ముప్పై కిలోమీటర్ల ఆవల, చెర్నిగొవ్ – ఒవ్రూచ్ రైల్వేలైనుమీదవున్న తోల్‌స్తియ్ లెస్ స్టేషనుకు దగ్గరగా వున్నామని.

కొచెతోక్కవ్ ఆచోట దిగి, మేం పంపించబోయే పారాషూటిస్టులు ఎక్కడ దిగాలో ఆ స్థలం వారికి తెలిసేటట్టు అక్కడ సిగ్నల్సును ఏర్పాటుచేస్తున్నామని రేడియో ద్వారా రిపోర్టు చేశాడు.

ఈ కబురు వినడంతో అందరికీ ఉత్సాహం వేసింది. దానితో మూడో గ్రూపును, మా చెప్పుచేతల్లో వున్న స్థలానికి పంపించుతూన్నట్టుగా తోల్‌స్తియ్ లెస్‌కు పంపించేశాం. మా డిటాచ్‌మెంటుకి చీఫ్–ఆఫ్–స్టాఫ్‌గా వుంటూన్న పమూన్ ఈ గ్రూపుకి కమాండరుగా నియమించబడ్డాడు. అతడికి రేడియో ఆపరేటరు లేడు – మాకు రేడియో ఆపరేటర్లు అసలు తక్కువగా వున్నారు. కాని అతని మనుషుల్లో

ఇద్దరికి మోజిర్ అరణ్యాలు బాగా తెలుసును, తోల్ స్తియ్ లెస్ స్టేషను కూడా వాళ్ళకి ఎరికే.

మరొక గ్రూపు కూడా బయల్దేరడానికి తయారుగా వుందని, వీరు దిగాల్సిన చోటు ఎక్కడ వున్నదీ వీరికి తెలిసేందుకు సిగ్నలుగా అక్కడ నెగడి ఒకటి వెలిగించి వుంచాలనీ మేము కొచెతోక్కొవ్‌కి తెలియజేశాం.

కట్టకడసారి గ్రూపును తీసుకువెళ్ళిన విమానం మాస్కో సురక్షితంగా చేరింది. తోల్ స్తియ్ లెస్ స్టేషన్ దగ్గర నెగడి అగపడిందనీ, నెగడి అగపడిన తరువాత పారషూటిస్టులు జంప్‌చేశారనీ విమాన పైలట్ రిపోర్టుచేశాడు.

కాని, సిగ్నలుగా వెలిగించిన నెగడి రాత్రి అంతా మండుతూనే వుండెననీ, విమానం ఏదీ అక్కడకు రాలేదనీ, పారషూటిస్టులు ఎవ్వరూ అక్కడ దిగలేదనీ కొచెతోక్కొవ్ ఆ మరునాడు రేడియోచేశాడు. ఇదేదో చిత్రంగా వుందే – అనుకున్నాం. పమూస్ నాయకత్వాన పంపిన పారషూటిస్టుల గ్రూపు సరైన స్థలంలో దిగలేదనీ, మరెక్కడో దిగిందనీ ఇప్పుడు స్పష్టమైంది. పమూస్ గ్రూపులో రేడియో అపరేటరు లేకపోవడంచేత, అతడివద్గరనుండి ఏ కబురూ మాకు అందే అవకాశం లేదని కూడా స్పష్టమైంది.

త్వెరొగొవ్‌నుండి ఏకబురూ లేదు. పమూస్ ఎక్కడున్నాడో తెలియదు.... నేను స్వయంగా వెళ్ళి కనుక్కుంటాననీ. అందుకు అనుమతి ఇవ్వవలసిందనీ కమాండ్‌ని అడిగాను. ఏమంటే, కామ్రేడ్లు ఎక్కడున్నారో ఏమిటో వెతికి తెలుసు కోవడమూ, కదమ గ్రూపులను అక్కడకు పంపించేందుకు తగినఏర్పాట్లు చేయడమూ అవసరం కదా మరి.

కాని నేను మాస్కోలో వుండిపోవలసివచ్చింది. నా పొలిటికల్ డెప్యూటీ అయినట్టి, ఈ డిటాచ్‌మెంటుని ఆర్గనైజు చేయడంలో నాకు తోడ్పడినట్టి సెర్గేయ్ స్తేహొవ్ నాయకత్వాన ఆ తరువాతి గ్రూపు బయల్దేరింది. అదేమిదురదృష్టమో మరి, స్తేహొవ్ గ్రూపు కూడా కొచెతోక్కొవ్ ఏర్పాటుచేసిన గుర్తులను కనుక్కోలేక పోయింది. తన గ్రూపు ఎక్కడో ఒకచోట మూడురోజుల క్రితం దిగినట్టూ, తాను ఎక్కడ దిగినదీ స్థలనిర్దేశం చేయలేకుండా వున్నట్టూ మనుషులను రికాన్నిసెన్స్ మీద పంపించినట్టూ, కాని వారెవ్వరూ తిరిగిరానట్టూ, స్తేహొవ్ రేడియోద్వారా రిపోర్టు చేశాడు.

నా ఆందోళనకు ఇక మేరలేకపోయింది ఎలాగైతేనేమి నేను స్వయంగా అక్కడకు వెళ్ళేందుకు నాకు అనుమతి దొరికింది.

రికాన్ని సెన్స్ శాఖ కమాండరు అలెక్సాండ్ర్ ఒ.కీప్, రేడియో ఆపరేటరు లీద షెర్ స్తన్యోవ, ఇంకా మరికొందరు స్పానిష్ సైనికులూ నాతోకూడా వెళ్ళేందుకు నిర్ణయమైంది.

స్వేచ్ఛాయుత స్పెయిన్ కోసం యుద్ధంచేసి, విదేశాలలో ప్రవాస జీవితాలు గడపవలసి వచ్చిన స్పానిష్ కామ్రేడ్లు చాలామంది ఆ రోజుల్లో మాస్కోలో వుంటూండేవారు. నాజీలతో యుద్ధం ప్రారంభం అయినప్పుడు, ఈ స్పానియార్డులు తమను యుద్ధశ్రేణికి పంపించవలసిందని సోవియట్ ప్రభుత్వాన్ని కోరారు. గెరిల్లా డిటాచ్‌మెంట్లు ఏర్పాటుచేయబడుతూన్నట్లు వీరిలో చాలామంది తెలుసుకుని, వీటిలో చేరతామని పట్టుబట్టారు. పద్దెనమండుగురు స్పానిష్ కామ్రేడ్లు నా డిటాచ్‌మెంటులో చేరతామని ముందుకొచ్చారు. నాజీ జర్మనీకి వ్యతిరేకంగా సోవియట్ యూనియన్ చేస్తూన్న యుద్ధంలో సోవియట్ యూనియన్‌తో కలసి పోరాడ్డంవల్ల నాజీ ఆక్రమిత దేశాలన్నిటికి విమోచన కల్గించే కార్యంలో తాము తోడ్పడుతున్నామని నా దగ్గరకు వచ్చిన తొలిరోజే వారు ఉద్ఘోషించారు.

జూన్ 20 సాయంకాలం నా గ్రూపుతో కలిసి నేను విమానాశ్రయానికి వెళ్ళాను.

విమానాశ్రయానికి బంధువులెవ్వరూ రాలేదు. వారందరికీ నేను ఇంటి దగ్గరే వీడ్కోలు చెప్పేశాను: అదే నయమనిపించింది.

నేనిదివరకు కమాండ్‌చేసిన డిటాచ్‌మెంటుకు చెందిన కామ్రేడ్లు నాకు వీడ్కోలు చెప్పేందుకు విమానాశ్రయానికి వచ్చారు.

వీడ్కోల్పులు చప్పచప్పనే అయిపోయాయి. బయల్దేరడానికి సిద్ధంగా వున్న విమానం ఎక్కాం. ఇంజను గర్జించింది. మాస్కోకి వీడ్కోలు చెప్పేశాం.

అందరూ మంచి సరదాగా హుషారుగా వున్నారు. ఏదో విలాసయాత్ర మీద బయల్దేరుతూన్నట్టుగా. విమానం ఎగరడం ప్రారంభమైన మరునిమిషంనుండీ కామ్రేడ్లు పాటలు పాడడం—తొలుత రష్యన్ పాటలూ, తరువాత స్పానిష్ పాటలూ— మొదలెట్టారు.

యుద్ధశ్రేణిని సమీపించాం. ఆ రోజుల్లో యుద్ధశ్రేణి అట్టే దూరానలేదు—తూల నగరానికి కాస్త పడమటను వుంది. ఇక్కడ కళ్ళు పొడిచేస్తూన్న సెర్చిలైటు కిరణాల్లో తటాలున విమానం చిక్కుకుంది. జర్మన్లు ఫిరంగికాల్పులు మొదలెట్టారు. కాని మా విమానాన్ని జాగ్రత్తగా నడిపించుకుని ఈ ప్రమాదాలనుండి సురక్షితంగా

బయట పడ్డాం. రెండుగంటల సేపు ఎంతో విసుగుదలతో ప్రయాణంచేసిన తరువాత, ఇక విమానంనుంచి జంప్ చేయడానికి తయారుకమ్మని ఆర్డరు వచ్చింది.

నేను కిటికీలోనుంచి చూశాను. కిందకు నేలమీద, ముందుగానే ఏర్పరచుకున్నట్టుగా, సిగ్నల్సు రూపంలో మండుతూన్న నెగళ్లు స్పష్టంగా అగపడ్డాయి. విమానం కొద్దికొద్దిగా కిందికి దిగుతూ వలయం తిరిగింది. విమానపు వెనక తలుపు దగ్గర ఒకరి వెనుక ఒకరం వరుసతీర్చి నుంచున్నాం. మాతో కూడా వస్తూన్న మేజరు మా పారషూట్లు వాటంతట అవే గాలిలో తెరచుకుందుకు విమానంలోనే మా పారషూట్ రిలీజ్ తాళ్ళను చిన్న చెక్క బద్దలకు తగిలించాడు.

మేం సిద్ధంగా వున్నాం. నా వెనుక నుంచున్న లీవ షెర్ స్తెన్యోవ ఉద్రేక పడుతూ:

"కామ్రేడ్ కమాండర్! మీ రిలీజ్ తాడు ఎక్కడుందండీ?" అని నన్నడిగింది.

నేను వెనక్కి తిరిగి చూసుకున్నాను. నా రిలీజ్ తాడు చెక్కబద్దకు తగిలించలేదు. తగిలించకపోయినా విమానం నుండి జంప్‌చేసి గాలిలో దిగుతూన్నప్పుడు నే నేమంత గాభరా పడిపోయి మతిపోగొట్టుకొని వుండనే; నేను చేయవలసినదంతా రిలీజ్ తాడుని సకాలంలో గుంజడమే. అయినప్పటికి లీద హెచ్చరిక చేయడం మంచిదే అయింది.

"జంప్ చేయండి"! అని ఆర్డరు విన్న తరువాత నా గుండె దడదడ కొట్టుకుంది.

అందరికంటె ముందు నేను జంప్ చేశాను. కొద్ది సెకండ్లలో నా పారషూట్ తెరచుకుంది.

నేను చుట్టూ పరికించాను. మేం చాలా ఎత్తునుంచే జంప్ చేశాం—సుమారు తొమ్మిదివందల మీటర్ల ఎత్తునుండి ఆకాశాన చంద్రుడు వెలుగుతున్నాడు, కిందను నేలమీద మండుతూన్న నెగళ్ళు స్పష్టంగా కనబడుతున్నాయి. కాని అవి అంతకంతకు దూరమై పోతున్నాయి: గాలి నన్ను దూరంగా తీసుకుపోతూంది. నాకు ఊర్ధ్వంగానూ, ఇటువైపూ అటువైపూ పారషూట్లు గాలిలో నల్లని చుక్కల్లా అవుపడుతున్నాయి. ఒక పారాషూట్ మరీ వేగంగా కిందికి దిగిపోతూ నా పక్కనుంచే వెళ్ళిపోయింది. "ఆ పారషూట్ పూర్తిగా తెరచుకోలేదే, ఆ మనిషి ప్రమాదంలో పడ్డాడే!" అనుకున్నాను.

కింద అంతా అడవి పారషూటుతో జంప్‌చేస్తూన్నప్పుడు రూల్సు ప్రకారం, చేతులు గుండెలపైన అడ్డంగా పెట్టుకుని, పట్టీలను గుంజాను. సరిగా ఆ సమయానికే వాయుప్రవాహం, ఒకటి నన్ను ఢీకొట్టి, ఒక పక్కకు నెట్టింది. ఇక దానితో, నేను దుబ్బున నేలమీద దిగాను.

గాలి నన్ను అడవి అంచుకు రమారమి సలభై మీటర్ల దూరంగా లాక్కుపోయింది.

నేను దిగినచోటుకే అందరూ చేరేటట్టుగా అక్కడ ఒక నెగడి వేస్తానని ముందుగా ఏర్పాటుచేసుకున్నాం కాని నాకు దెబ్బలు తగలడంచేత, లేచి నుంచుని నెగడికోసం చిదుగులు పోగుచేయలేకపోయాను. నా పారషూటుని దగ్గరగా లాక్కుని దానికి నిప్పు అంటించాను తరువాత, సుమారు పదిహేను మీటర్ల దూరంలోవున్న పొదల దగ్గరకు పాకుకుని వెళ్ళి, నా సబ్‌మెషీన్‌గన్నుని తయారుగా పట్టుకుని, ఆ పొదలలో దాగుని, ఏమి జరుగుతుందో చూదామని కాచుకునున్నాను ఆ నెగడి చూసి అక్కడకు మిత్రుడే వచ్చునో శత్రువే వచ్చునో – ఎవరు చెప్పగలరు?

ఎవరో కాని సన్నసన్నగా అక్కడకు రావడం చూశాను.

"సంకేతపు మాట?" అని నేను దబాయించాను.

"మాస్కో!" అని జవాబు వచ్చింది.

"ఎలగ్గొడ్డు!" అని నేను పలికి, ఇంకా ఇలా అన్నాను: "నీ పారషూటుని మంటలో పడేసి నా దగ్గరకి రా!"

"సరేనండి!"

అలా అంటూ లుకిన్ నా దగ్గరకి వచ్చాడు. అతనివెంట లీద షెర్‌స్త్నోవ్య వుంది, ఆమెవెంట కదమవారున్నారు.

అక్కడికి మూడో నాల్గో కిలోమీటర్ల దూరంనుండి కుక్కల అరపులు–వాటిని ఎవరో అల్లరిపెట్టుతూన్నట్టుగా – విధివిరామం లేకుండా వినబడుతున్నాయి. దీన్నిబట్టి అక్కడికి దగ్గరలో ఏదో ఒక గ్రామం వున్నట్టు స్పష్టమైంది.

గ్రూపు అంతా నా చుట్టూ చేరింది. నేను లేచి, ఎంతో కష్టంమీద నిటారుగా నుంచున్నాను. బాధ హెచ్చుగానే వున్నప్పటికి, నిభాయించుకుని, సరదాగానూ హుషారుగానూ అగపడ్డానికి ప్రయత్నిస్తూ:

"చూశారా మరి! మన రెండో జంప్‌కే గమ్యం చేరుకున్నాం!" అన్నాను.

తర్వాత, నా దిక్సూచి తీసి, మేం ఎక్కడున్నదీ స్థాననిర్దేశం చేసేందుకు ప్రయత్నించాను. దిక్సూచీ, నక్షత్రాలతో నిండిన ఆకాశమూ, రైల్వేలైనూ—వీటిని బట్టి ఇహ ఎటు వెళ్ళడమో వెంటనే తెలిసిపోయింది. తోల్‌స్తోయ్ లెస్ స్టేషను అక్కడికి అతిసమీపంలోనే వుండాలన్నమాట.

మాస్కోనుంచి సుమారు వెయ్యి కిలోమీటర్లూ, యుద్ధశ్రేణినుంచి సుమారు ఆరువందల కిలోమీటర్లూ దూరంగా శత్రుశ్రేణి వెనుకను మేం వున్నాం.

## సమావేశం

అడవి అంచుపక్కనుంచే తోల్‌స్తోయ్ లెస్ స్టేషన్ దిశగా వెళ్లాం. అప్పటికప్పుడే తెల్లవారుతూంది. మంచు వొత్తుగా పడివుండడంచేత, గడ్డిపైన మా అడుగుజాడలు స్పష్టంగా కనబడిపోతున్నాయి. జాడలు కనబడకుండా వుండేందుకని మనిషికీ మనిషికీ రెండుమూడు మీటర్ల దూరం ఉండేటట్టుగా "గెరిల్లా అంగలు" వేసుకుంటూ—ముందు నడిచిన మనిషి అడుగుజాడల్లో వెనుకవాడి అడుగులు పడేటట్టుగా ఒకరివెంట ఒకరు ఒకే వరుసలో — నడవాలని ఆర్డరుచేశాను.

ఒకవేళ ఎవరైనా గనుక మా ఆచూకీ కనిపెట్టేందుకు ప్రయత్నించినట్టయితే, మేం ఎంతమందిమి వున్నామో—పదిమందిమే వున్నామో, నూరుమందిమే వున్నామో—తెలుసుకుందుకు వారికి కష్టమవుతుంది. ముందుజాగ్రత్త అనేది గెరిల్లాకి ప్రథమ సూత్రం.

బాగా తెల్లవారిపోయింది. ఎక్కడా ఏ చప్పుడూ లేదు. కాని ప్రతి ఆకు రెపరెప, ప్రతి కొమ్మ పెళపెళ నేను చెవులు రిక్కించుకుని అతిజాగ్రత్తగావిన్నాను. ఇంతవరకూ ఏ ప్రమాదమూ తటస్థించనప్పటికీ, "సాగిలబడండి!" "మాటుచూసుకోండి!" అనే ఆర్డర్లకు ఇంతకు ముందుగా ఏర్పరచుకున్న సంజ్ఞలను ఇప్పుడు నేను చేస్తూ, కామ్రేడ్లను అప్రమత్తులనుగా వుంచాను.

ఇలా మేం ఒక ఐదు కిలోమీటర్లు నడిచేసరికి, దూరాన రెండు ఆకారాలు అగపడ్డాయి.

"సాగిలబడిండి!" అని నేను ఆర్డరు ఇచ్చి, లుకిన్ని రమ్మని :

"లుకిన్! మన డిటాచ్‌మెంటుకి మీరు రికాన్నిసెన్స్ శాఖ కమాండరు కాబట్టి, మీరే మన మొదటి స్కౌటుగా కూడా వుండాలి. ఆ మనుషులెవరో తెలుసుకోండి! స్నేహితులే అయితే, తోల్‌స్తోయ్ లెస్‌కి దారి కనుక్కోండి!" అన్నాను.

లుకిన్ తనతో కూడా స్పానిష్ కామ్రేడ్ ఫ్లొరెణాక్స్‌ని తీసుకుని వెళ్లాడు. వారిద్దరూ వెళ్తూండగా వారివెంట నా చూపులు సారించాను. ముందు అగపడుతూన్న ఆ ఇద్దరు బాటసారులతోనూ లుకిన్ మాట్లాడడమూ, తరువాత వారిద్దరితోనూ కర చాలనం చేయడమూ, వారికి వీడ్కోలుచెప్పి వారిదగ్గరనుండి వచ్చివేయడమూ చూశాను.

లుకిన్ తిరిగివచ్చి, ఆ బాటసారులిద్దరూ ఒక డెబ్బైయ్యేళ్ళ ముసలవ్వా, ఆమెమనుమడూ అనీ, తాను మాట్లాడుతూన్నది. గెరిల్లాలతో అనిముసలవ్వ తెలుసు కోగానే, చేతులు గుండెలమీద పెట్టుకుని భొళ్ళున ఏడ్చేసిందనీ చెప్పాడు.

"బంగారు తండ్రులు! మిమ్మల్ని చూసి నాకు ఎంత సంతోషంగావుందో ఏం చెప్పను! ఆ వెధవల్ని మీరు ఎప్పుడు తరిమేస్తారో కదా...మమ్మల్ని శుత్రంగా నాశనం చేసేశారు!" అందిట.

తోల్‌స్తియ్ లెస్ స్టేషను పది కిలోమీటర్ల లోపునే వుందనీ, కాని రైల్వే లైను అవతలి పక్కకు వెళ్ళవద్దనీ, గ్రామంనిండా పోలీసులు వున్నారనీ ముసలవ్వ హెచ్చరిక చేసిందట.

లుకిన్ ఆమెకు ఒక చాక్లేటు అచ్చూ, కొన్నిపంచదారముక్కలూ ఇచ్చాడు. సుమారు తొమ్మిదిగంటల వేళకు తోల్‌స్తియ్ లెస్ స్టేషను సమీపానికి వచ్చాం. విశ్రాంతి తీసుకోమని ఆర్డరిచ్చాను. అంతదూరం మార్చిచేయడం కామ్రేడ్లకి అల వాటు లేకపోవడం చేత వారు బాగా అలసిపోయారు, చాలమందికి పాదాలు పొలపొల పొక్కి బొబ్బలు లేచాయి.

స్టేషనునీ, లెవెల్ క్రాసింగునీ, రోడ్డునీ కనిపెట్టుతూ వుండేందుకని సెంట్రీలను ఏర్పాటుచేశాను. రేడియో ట్రాన్స్‌మీటర్‌ని పైకితీయవలసిందనీ, సరైన స్థలంలో దిగామనీ, కొచెతోక్కోవ్ గ్రూపుకోసం వెతుకుతున్నామనీ మాస్కోకు రిపోర్టు చేయవలసిందనీ లీదషెర్‌స్త్నోవ్యను ఆజ్ఞాపించాను.

సరిగా ఆ సమయానికే గస్తీచౌకీనుండి సెంట్రీ ఒకడు ముగ్గురు మనుషు లను మాదగ్గరకు తీసుకువచ్చాడు. వారికేసి చూతును కదా—వారి ముఖాలు సంతో షంతో వెలిగిపోతున్నాయి : వారు మరెవ్వరూ కారు—కొచెతోక్కోవ్ గ్రూపువాళ్లు.

"లీద! ప్రసారం అవసరంలేదు, ఆపేయ్!" అన్నాను.

మేము సరాసరి కొచెతోక్కోవ్ క్యాంపుకి వెళ్ళాం.

ఈ సమావేశంవల్ల కల్గిన ఆనందాన్ని వర్ణించడం కష్టమే. వారి వార్తలు వారూ, మా వార్తలు మేమూ–ఇక్కడి జీవితం గురించి వారూ, మాస్కో గురించి మేమూ–ఎవరు తొలుత చెబుతామా అని పందెంవేసుకున్నట్టుగా, అందరం ఒక్క సారే మాట్లాడ్డం మొదలెట్టాం.

స్త్రెహోవూ, అతని గ్రూపూ అప్పటికప్పుడే కొచెత్కోవ్ క్యాంపులోనే వున్నారు. కాని సాష త్వోరొగొవ్ గురించి కాని, పమూన్ గురించి కాని, వారు ఆకాశంలోకి అంతర్ధానమై పోయినట్టుగా, ఏ కబురూ లేదు.

కొచెత్కోవ్‌కి కూడా కొన్ని చిక్కులు సంభవించాయట. అతని గ్రూపు విమానంలోనుంచి జంప్‌చేసిన తరువాత, కలాష్నికొవ్ అనే వయసుమళ్ళిన గెరిల్లా సైనికుడు పొదుగ్గావున్న చెట్లమధ్యను చిక్కుకున్నాడు. అతనికోసం చాలసేపు వెతికారు. అతడు ఎక్కడున్నాడో చివరికి తెలిసింది. కాని అతడు తన క్రామేత్ల మధ్య వున్నట్టు తెలుసుకున్న తరువాత, వారు తనను విడిపించే వరకూ ఆగకుండా, చెట్లలో చిక్కుకున్న పారషూటు తాళ్ళను తన కైజారుతో కోసేసి, కిందకుపడ్డాడు. లేచేందుకు ప్రయత్నించేసరికి లేవలేకపోయాడు–కాలు విరిగిపోయింది ఇప్పుడతడు తోల్ స్తియ్ లెస్ స్టేషనుకి అరకిలోమీటరు దూరంలో వున్న ఒక రైల్వేలైను వాచ్ మేను గుడిసెలో మంచంపట్టి వున్నాడు. మా డిటాచ్‌మెంటు డాక్టరు, త్సెప్సార్ స్కీయ్, ఇంకా మరికొందరు గెరిల్లాలూ రోజూ రహస్యంగా వెళ్ళి అతణ్ణి చూసి వస్తున్నారట.

ఒక గంటలోపుగానే మా కోసం మధ్యాహ్నం భోజనం ఆ క్యాంపువాళ్ళు సిద్ధంచేశారు. పంది కొవ్వుతో వేయించిన గుర్రపిల్ల కాలేయము వడ్డించారు. మంచి రుచిగానే వుండెను.

ఇక ఒక నిమిషం కూడా ఆలస్యం చేయడానికి వీల్లేదనుకుని, స్కౌట్లను వెంటనే నాల్గు దిక్కులా పంపించాం. కదమ గ్రూపులు అక్కడకు వచ్చి చేరుకునే వరకూ మేం అక్కడ వుండేందుకు వీలుంటుందేమో అన్న సంగతి, జర్మన్లకు ఆ క్యాంపు గురించి ఆమాకి ఏమైనా తెలిసిందేమో అన్నసంగతి మేము తెలుసుకోవాల్సి వుండెను. క్యాంపు కాపరా కోసమని సెంట్రీలను ఏ విధంగా ఏర్పాటుచేశారో తెలుసుకుందుకని సాయంకాలం అవుతూండగా నేను స్వయంగా తనిఖీకి బయల్దేరాను. క్యాంపుచుట్టూ నడిచాను, పెద్ద ఖాళీజాగాను దాటి, అడవిలోపలికి వెళ్ళాను.

ఆ రైల్వేస్టేషనుకి తోల్ స్తియ్ లెస్* అని వూరకనే పేరురాలేదు. చెట్లు నిజంగా మహావృక్షాలే—పురాతనపు ఓక్, బర్చ్, పైన్, స్ప్రూస్ వృక్షాలు.వాటినడుమ పొదలూ, తీగెలూ దట్టంగా మొలచి అదంతా అభేద్యమైన అరణ్యప్రాంతమైంది. నేను నడుస్తూండిన చోట ఒక్క కాలిబాట అయినా లేదు. దారి తప్పిపోయానన్న సంగతి నాకు మరో గడియకల్లా తేటతెల్లమై, ఇహ వెనక్కి తిరిగాను. మరొక పది నిమిషాలు నడిచానో లేదో, అది కూడా సరైన తోవ కాదనిపించింది. సరిగా ఆ వేళకి పొద్దు దిగిపోయింది. ఇకదానితో ఎక్కడున్నానో ఏమిటో కేవలం అయోమయమైపోయింది.

"ఛీ, ఛీ! ఇంత సిగ్గుచేటా! డిటాచ్‌మెంటు కమాండరునేమిటి,తొలిరోజునే దారి తప్పిపోవడమేమిటి!" అనుకున్నాను.

నాకు మంచి తెలివితేటలున్నాయని నేనుఅనుకుంటూంటానన్న సంగతినేను ఒప్పుకుంటాను. బైలోరష్యాలో పుట్టిన నేను చిన్నతనంలో పుట్టగొడుగులూ, అడవి పండ్లూ ఏరడానికి తరచుగా అడవిలోకి వెళ్ళేవాణ్ణి. పొద్దుచూసీ, చెట్లకొమ్మలూ వేళ్ళూ చూసీ ఎటు ఉత్తరమో ఎటు దక్షిణమో నేను చెప్పగల్గుతాను. ఏడు నెలలుగా నేను గెరిల్లా సైనికునిగా గడపుతూన్న జీవితం కూడా నాకు కొన్ని సంగతులను నేర్పింది. అయినప్పటికీ, ఇక్కడ నేను పప్పులో కాలువేశాను. పారషూటుతోదిగుతూ కిందపడగా తగిలిన దెబ్బకి నా వీపు ఇంకా నొప్పి పెట్టుతూనే వుంది. కాని, చిన్నతనంలో చెట్లు ఎక్కిపోయినట్టు, ఒక మహావృక్షం గబగబా ఎక్కిపోయాను. ఎక్కిపోయి-నాలుగు దిక్కులూ పరికించాను. ఎటుపక్క చూసినా మహారణ్యమే. కాని అల్లంత దూరంలో అరణ్యంలోనుంచి సన్నని పొగ మరచుట్టలా పైకిలేస్తూంది దాని అర్థం-అక్కడ ఒక క్యాంపు వుందన్నమాట. నా దిక్సూచి తీసి, ఆ స్థలం ఏ దిశగా ఎక్కడ వుందో నిర్దేశించి, చెట్టు దిగిపోయి, అటువైపు నడిచాను.

గాఢాంధకారంలో చేరుకున్నాను క్యాంపు. గెరిల్లాలందరూ నెగడి చుట్టూ కూచున్నారు. నేను వెళ్ళి అక్కడ వున్న ఒక చెట్టు మొద్దుపైన కూర్చున్నాను. విశ్రాంతి తీసుకుంటూ నేను వారి సంభాషణ వినాలనుకున్నాను. రీవస్ గురించి వారు మాట్లాడుకుంటున్నారు. మా స్పానిష్ కామ్రేడ్లలో రీవస్ ఒకడు. రీవస్ ఏరోప్లేన్ మెకానిక్కుగా వుంటూండేవాడు. విమానాలు మరమ్మతు చేయడంలో నిపుణునిగా

---

* "తోల్ స్తియ్ లెస్" అంటే రష్యన్ భాషలో మహారణ్యం అని అర్థం.—సం



ఈ పుస్తక రచయిత, గెరిల్లా డిటాచ్‌మెంటు నాయకుడు ద్మిత్రియ్ మెద్వేదెవ్ *1944* సం. ఫొటో



ఎడమ నుండి : రేడియో ఆపరేటర్ లీద షెర్
స్త్న్యోవ, డాక్టర్ ఆల్బర్ట్ త్సెసార్స్కియ్,
డిప్యూటీ కమిస్సార్ అలెక్సాంద్ర్ లుకీన్,
ద్మిత్రియ్ మెద్వేదెవ్, స్కౌట్ వలెన్తిన్
సెమ్యోనొవ్.



నికొలాయ్ స్త్రుతీన్‌స్కీయ్-యుద్ధానంతరం ల్వోవ్
పట్టణ పరిపాలక సమితి అధ్యక్షుడు



వలెన్తీన దావ్గేర్.

అతణ్ణి మా డిటాచ్‌మెంటులో చేర్చుకున్నాం. అతడు స్తేహోవ్ గ్రూపుతో వచ్చాడు. యువక గెరిల్లా సైనికుడొకడు అంటున్నాడు :

"మేమందరం నెగడి చుట్టూ చేరాం. హాజరుపట్టీ పిలిచారు. రీవన్‌మాత్రం అక్కడలేడు. అతణ్ణి వెతకడంకోసం బయల్దేరాం. చీకటి, కన్ను పొడుచుకున్నా ఏమీ కానరాలేదు. 'రీవన్, రీవన్!' అంటూ ఉండుండి అతణ్ణి పిలుస్తూ, ఆ రాత్రి అంతా వెతికాం– ఎక్కడా కనబడలేదు. తెల్లవారింది. అతణ్ణి వెతకమని కమాండర్ మమ్మల్ని మళ్ళీ పంపించాడు. ఆ రోజంతా అతడికోసం అడవి నాలుగు మూలలా తిరిగాం. రీవన్ మాత్రం అగపడలేదు! సాయంకాలం అవుతూంది– అడవిలో నాకు ఓ బాడువ అవుపడింది. బాడువ నట్టనడుమ ఏకాకిగా సుతారంగా ఏస్పెన్ చెట్టు వుంది. ఆ చెట్టు వెనుక ఎవడో ఓ మనిషి దాగుని వుండటం చూశాను. అతగాడెవడో కనిపెట్టుదామని పొదల్లోకి దూరాను. మనిషి అంతా అగపడుతూనే వున్నాడు గాని, తల మాత్రం చెట్టు చాటున వుంది. అతడు మన యూనిఫారంలోనే వున్నాడు. అతడు రీవన్ అని పోల్చుకున్నాను. నేను నిటారుగా నిలబడి: 'రీవన్! బయటికి రా!' అని కేకవేశాను. అందుకు అతడు: 'మాటుచూసుకో! మాటుచూసుకో!' అని జవాబిచ్చాడు, అంతే. ఎలాగైతే ఏమి, చిట్టచివరకు చెట్టు వెనుకనుండి అతడు బయటికి వచ్చాడు. సంతోషంతో తనభాషలో ఏమిటేమిటో చెప్పి, నన్ను కౌగలించుకున్నాడు. తర్వాత, తటాలున తన షర్టు కిందనుండి ఒక బతికివున్న పావురాయిని బయటికి తీశాడు. దానిని ఎక్కడ పట్టాడో, ఏమిఅవసరమొచ్చి పట్టాడో– మరి నాకు తెలీదు!"

గెరిల్లాలు రీవన్‌కేసి చూసి ఫక్కున నవ్వారు. వాళ్ళందరూ దేనిని గురించి సంభాషించుతున్నారో పోల్చుకుని, అర్భకుడూ వామనుడూ అయిన రీవన్, తన నల్లని కళ్ళు ప్రకాశించుతూ వుండగా, తను కూడా నవ్వాడు.

"పావురాయిని ఏం జేశాడు? తిన్నాడా?" అని ఎవరో అడిగారు.

"ఈగమీదనైనా వేలువేయని మనిషి, రీవన్ దాన్ని చంపుతాడా? అబ్బే! దానికి మేతకోసం చూస్తున్నాడు. దాన్ని అట్టే రోజులు పెంచనేలేదు, అది నాల్గు రోజులుండి పారిపోయింది."

ఇది జరిగిన సుమారు ఆరునెలలకి, రీవన్ కాస్త రష్యన్ నేర్చుకున్న తరువాత, ఓనాడు మాతో చెప్పాడు–తనకానాడు అడవిలో ఒంటరిగా వున్నప్పుడు ఎంత భయం వేసిందో, రాత్రిపూట మిణుగురుపురుగులను చూసి పెద్దపులికళ్లు అనుకున్నాడట. తన కాళ్ళమేద్దను తిరిగి కలుసుకుందుకు కొన్నాళ్లు పట్టినట్లయితే, పావురాయిని వండుకుని తిందామని దాన్ని పట్టుకున్నాడట.

అందరూ మంచి ఉత్సాహంగా వున్నారు. మరెందుకో కాని, ఈ కొత్త పరిస్థితులు వారిని మరింత ఉత్సాహపరచాయి. మగ్గిపోయి తళతళ భాసించుతూన్న కర్రముక్కలతో తాము నాటిన "పూల మడిని" గెరిల్లాలు మాకు చూపించారు. మా రేడియో ఆపరేటరు, లీద ఆ "పూల మడి" లోనుండి ఒక కర్రముక్క తీసి, తన తలలో పెట్టుకునే సరికి, ఆ "పువ్వు" వజ్రంలా మెరిసింది.

"వాళ్ళ సరదాలు తీరనీయ్!" అనుకున్నాను. దోమలతో, చెమ్మతో, సన్నగా మండుతూన్న నెగళ్ళతో అలరారుతూన్న అరణ్యాలలోని "కవిత"ను నేను ఎరుగుదును.

రెండు రోజుల తరువాత ఇంకా మరొక పారాషూటిస్టు గ్రూపు కూడా అక్కడకు వచ్చి మమ్మల్ని కలుసుకుంది.

మేం వేసిన నెగళ్ళకు ఊర్ధ్వంగా ఆ విమానం ఎంతో ఎత్తున ఎగిరింది. నెగళ్ళు ఎంత వెలుగ్గా మండాయంటే, ఆ వెలుగులో విమానమూ, మేఘాలూ తళతళ ప్రకాశించాయి.

విమానం మా నెగళ్ళ సిగ్నల్సును చూసి, మా దృష్టిపథంలోనుంచి ఒక ప్రక్కగా మళ్ళి, మూడువందల మీటర్ల ఎత్తున మళ్ళీ అగపడింది. పారాషూటిస్టులు విమానంలోనుంచి జంప్ చేయడం మొదలెట్టారు. నెగళ్ళ మంటల వెలుగులో పార షూట్ల గొడుగులు మాకు స్పష్టంగా అగపడ్డాయి. వాటిని గాలిప్రవాహం మేమున్న చోటకు దూరంగా తీసుకుపోతూంది.

అదాటుగా నెగళ్లకు సరాసరి ఊర్ధ్వంగా ఎనభై మీటర్లకంటె ఎత్తునే పారషూట్లు రెండు తెరచుకున్నాయి. ఒక పారషూటిస్ట్ సరాసరి నెగడి దగ్గరే దిగాడు. రెండో పారషూటిస్ట్ కొంత దూరంలోవున్న ఒక దుంగమీద పడిపోవడంతో, పార షూటిస్టు కాలుకి దెబ్బతగిలింది. ఆ పారషూటిస్ట్ అమ్మాయి. మా డిటాచ్‌మెంటులో మెడికల్ నర్సుగా చేరడానికి వచ్చిన మరూస్య షతాలోవ. ఇలా ఎందుకు జరిగిందో ఎవ్వరికీ అర్థంకాలేదు. కాని పారషూట్లను మేము జాగ్రత్తగా పరిశీలించిన తర్వాత అప్పుడు మాకు తెలిసింది-అవి విమానంలో వున్నప్పుడే వాటి ఆటోమాటిక్ రిలీజ్ తాళ్ళను బల్లచెక్కలకి తగిలించక పోవడంచేత పారషూట్లు సకాలంలో తెరచుకో లేదని స్పష్టమైంది. రెండువందల మీటర్ల పై చిలుకు దూరం కిందకి దిగిన తరు వాత, పారషూటిస్టులే స్వయంగా తమ పారషూట్లను తెరచారు. మా పారషూటిస్ట్ కామ్రేడ్లు ధీలేవాళ్ళు! గుండె నిబ్బరాన్ని పోగొట్టుకోకుండా వారు ప్రదర్శించిన సాహ సాన్ని ఎంతైనా మెచ్చుకోవలసిందే!

పారషూటిస్టులు దిగేందుకు ఆ ఖాళీస్థలం అనువుగాలేదు–రైల్వే పట్టాలూ, గోడుగాళ్ళూ, కలప అడితీలతోనూ నిండుగా వున్న రైల్వేస్టేషనుకు మరీ చేరువగా వుంది. విమానంమీదనుంచి పారషూటుతో ఆ స్థలం దగ్గర దిగడమంటే వొళ్ళు ముక్కచెక్కలు చేసుకోవడమన్నమాటే. ఆ స్థలానికి మనుషులను పంపించడం తాత్కాలికంగా ఆపుచేయవలసిందని మాస్కోకి రేడియోచేశాం.

ఈ లోపుగా మా స్కౌట్లు గాభరాపుట్టించే భోగట్టా తీసుకొచ్చారు. ప్రతి రాత్రీ ఇరవై, ముప్పై విమానాలు ఆ ప్రాంతానికి వచ్చి అక్కడ పారషూటిస్టులను దింపుతున్నాయనీ, ఏకంగా ఒక డివిజనుకి డివిజనూ అక్కడ మోహరించబడుతూం దనీ ఆ చుట్టుపక్కల పుకార్లు లేచాయట. ఈ పుకార్లు జర్మన్ల చెవినిబడి వుంటాయనడంలో సందేహంలేదు. ఆ డివిజనుమీదకి వారు ఒక పెద్ద స్పెషల్ సైన్యాన్ని అక్కడకు పంపడం కేవలం సంభవమే. మరి, మేమేమో డెబ్బైమందిమే వున్నాం.

## తొలి అగ్నిపరీక్ష

జూన్ 28న మేము ఆ క్యాంపును వదిలిపెట్టేశాం. జర్మన్లు మామీదికి స్పెషల్ సైన్యాన్ని పంపనున్నారన్న విషయం ప్రత్యక్షంగా కనబడుతూనే వుండెను. రైల్వేస్టేషనుని నిగాలో వుంచేందుకని ఐదుగురు గెరిల్లా సైనికులను ఒక చౌకీగా ఏర్పాటుచేసి, వారిని క్యాంపులో వుంచాం. మంచంపట్టి ఇంకా రైల్వేలైను వాచ్‌మేను గుడిసెలోనే వున్న కలాష్నికొవ్‌కి చికిత్సచేసేందుకు మా డాక్టరు త్సెస్పార్స్కీయ్‌ని కూడా ఆ చౌకీలోనే వుండమన్నాం. కలాష్నికొవ్ కాలు ఇంకా పలాత్త్రి కట్టులోనే వుండడంచేత అతణ్ణి మాతో తీసుకెళ్ళేందుకు వీల్లేకపోయింది.

బ్రహ్మాండంగా విస్తరించివున్న ఒక అరణ్యంలోకి డిటాచ్‌మెంటును ఉత్తరదిశగా నడిపించి తీసుకెళ్ళాను. పది కిలోమీటర్లు నడచిన తరువాత, అడవి మధ్యనుండి పొగరావడం కనబడింది. అదేమిటో తెలుసుకుని రమ్మని ముగ్గురు స్కౌట్లని పంపించాను.

"అదేదో గుడిసె అక్కడ వున్నట్టుంది. తిండికి ఏమైనా ఇవ్వగలరా అని అడగండి. సంభాషణలోకి దిగి, జర్మన్ల గురించి ఏదైనా భోగట్టా సంపాదించడానికి ప్రయత్నించండి" అని స్కౌట్లని ఆదేశించాను.

మరి కాస్సేపటికల్లా స్కౌట్లు తిరిగివచ్చేసి, ఆ గుడిసెలో ఫారెస్టు గార్డు ఒకడు వుంటున్నాడనీ, ఉల్లగడ్డలు పది తప్ప మరేమీ ఇవ్వలేదనీ, తనకే విషయమూ తెలియదంటూ అతడు మాతో సంభాషణలోకి దిగనేలేదనీ చెప్పారు.

ఒక కిలోమీటరు నడిచామో లేనేలేదో, అనుమానాస్పదుడుగా అగపడు తూన్న ఒక మనిషిని తాము నిలువరించినట్టు మా పార్శ్వపు గస్తీలు మాకు కబురు చేశాయి. ఆ మనిషి గుఱ్ఱమెక్కి దౌడుతీస్తూ, మమ్మల్ని చూసి, ఆగి:

"మీ నాయకుడెక్కడున్నాడు?" అని గెరిల్లాలను అడిగాడు, మా వరుసలు చూసి, మేము పోలీసులమే అనుకుని.

"ఏం? ఆయనతో నీకేం పని?" అని గెరిల్లాలు అతగాణ్ణి ప్రశ్నించారు.

"గుఱ్ఱపుటంకలిద్దరు ఇప్పుడే నా దగ్గరకొచ్చి, జర్మన్ల గురించి నన్ను తెగట్టా అడిగారు. బహుశా గెరిల్లాలే అయివుంటారు. వాళ్ళు అల్లదిగో ఆ దిక్కున వెళ్ళిపోయారు."

వీడు మరెవ్వడూ కాడు, మా స్కౌట్లకి ఉర్లగడ్డలు ఇచ్చిన ఫారెస్టు గార్డే.

ఆ మనిషిని ప్రశ్నించగా, గెరిల్లాలు తనకు అగపడినట్టు జర్మన్లతో చెప్పేందుకని జిల్లా కేంద్రమైన హాబ్నోయెకి తాను వెళ్తూన్నట్టు అతడు ఒప్పుకున్నాడు. గెరిల్లాలను పట్టి యిచ్చినవారికి బహుమానాలు యిస్తామని జర్మన్లు ఖరారు చేశారట. తన గురించి అతడు చెప్పుకుంటూ, ఒక క్రిమినలు కేసులో సోవియట్ కోర్టు తనకు శిక్ష చెప్పిందని చెప్పాడు.

స్పష్టంగా కనబడుతూనే వుంది: నేరస్థుడుదేశద్రోహిగా తయారయ్యాడు' వాణ్ణి అక్కడికక్కడే తుపాకితో కాల్చేశాం.

ఈ ఉదంతం జరిగిన తరువాత, మేము మరింత జాగ్రత్తమీద వున్నాం. అప్పటికే మా మనుషులందరూ బాగా అలసిపోయినప్పటికీ వారికి విశ్రాంతి యివ్వకుండా, ముందుకు సాగిపోవడానికే నిశ్చయించాను. మార్చి చేస్తుండగానే, మధ్యాహ్నం సుమారు మూడు గంటలకు, ఒక్కొక్కరం ఒక్కొక్క ముక్క వండిన మాంసం తిన్నాం. మా దగ్గర బ్రెడ్డు లేకపోయింది.

దురదృష్టవశాత్తూ వర్షం – అసలైన జడివాన – మొదలైంది. బట్టలూ జోళ్లూ శుభ్రంగా నానిపోయాయి. దానితో మరీ చికాకు అనిపించిపోయింది. ఒక గంట నడిచాం, మరో గంట నడిచాం. వానవెలిసే సూచనలు ఏవీ కనబడలేదు. మేము మాత్రం ఆగకుండా, ఆ ప్రమాద కరమైన స్థలానికి ఇంకా ఇంకా దూరంగా వెళ్లిపోయాం. రాత్రి అవుతూందనగా, అందరం చిత్తుగా అలసిపోయున్నామేమో, ఇప్పుడు ఆగుదామని నిశ్చయించాను. వాన వెలిసింది. కాని ఆ కీకారణ్యంలో

మాత్రం అంతా చితచితలాడుతూంది. చెట్లనుంచి పెద్దపెద్దనీటిబొట్లు రాలుతున్నాయి. మబ్బులు కమ్ముకున్నట్టున్నాయి దోమలు. ఇంత దూరం మార్చిచేయడం అలవాటు లేక, మనుషులు అక్కడికక్కడే కూలబడి, నేలమీదనే పడుకుని నిద్రపోయారు.

మరునాడు, ఆ అరణ్యంలో బ్రహ్మాండమైన దేవదారు మహావృక్షాల మధ్యనే, తాత్కాలిక శిబిరం కోసం తగిన స్థలాన్ని చూసుకున్నాం. బహుశ అక్కడకు చేరువగానే గుగ్గిలం పోగుచేసే వ్యాపారసంస్థ ఒకటి పనిచేసి వుండాలి. ప్రతి చెట్టుకి "బాణం" ఆకారంలో ఒక గంటు వుంది. ఆ గంటులోనుంచి కారే గుగ్గిలాన్ని పట్టేందుకు చెట్టుకు ఒక చిన్న డబ్బా కట్టివుంది. దోమల బాధనుండి తప్పించుకొని హాయిగా నిద్రపోయేందుకు వీలుగా వుండేందుకని, పారషూట్ల గుడ్డలతో అప గుడారాలు చప్పున తయారుచేసి వేసుకున్నాం. అక్కడకు దగ్గరగావున్న ఒక ఖాళీ జాగాను పారషూటిస్టులు దిగేందుకు వీలైన స్థలంగా ఏర్పాటుచేశాం. ఆ రోజునే మా డిటాచ్ మెంటుని అనేక యూనిట్లుగా విభజించి, స్కౌట్లను నియమించాం. స్కౌట్లు చేయవలసిన పనులను గురించి—జర్మన్లు మా ఆచూకిని కనిపెట్టారా అనే విషయం గురించీ, ఆ గ్రామాలలోని ప్రజల జీవిత పరిస్థితులను గురించీ తెలుసుకోవడం—వారికి వివరించి చెప్పి, వారిని నాలుగు చెరగులా పంపించాం.

జూన్ 25 ఉదయాన క్యాంపు గార్డులు ఒక ఆసామిని మా దగ్గరకు తీసుకువచ్చారు. ఆతడు ఆ చుట్టుపక్కల మనిషినని చెప్తున్నాడు. అతగాడు మా క్యాంపుకి కాస్త దూరంగా చాటుమాటున పొంచివుండి ఆ స్థలాన్ని కనిపెట్టుతూండగా క్యాంపు గార్డులు ఆ ఆసామిని పట్టుకున్నారు. అతణ్ణి సోదాచేయగా, అతడు జర్మన్ పోలీసుల పక్షాన పనిచేస్తూన్నట్టుగా రాసివున్న ఐడెంటిటీ కార్డు అతడి దగ్గర దొరికింది. దానితో ఇహ మా అనుమానాలు స్థిరపడిపోయాయి — జర్మన్లు మా కోసం వెతకుతున్నారనీ, బహుశా వాళ్ళకి మా జాడ అప్పుడే తెలిసివుంటుందనీ మేం నిశ్చయించుకున్నాం.

ఆ రాత్రి అలారమ్ సిగ్నలు కూడా ఇవ్వడం జరిగింది. అరణ్యంలో ఏదో రెపరెపలాడినట్టుగా ఒక సెంట్రీకి వినబడింది, కాని చీకటిమూలాన అతడికి ఏమీ కనబడిందికాదు తనకు ఏదో చప్పుడు వినబడిందన్న సంగతిని క్యాంపుకు పరుగున వెళ్ళి రిపోర్టుచేయవలసిందని తనతో కూడావున్న రెండవ సెంట్రీని అతడు గుసగుస గొంతుకతో ఆర్డరుచేశాడు.

క్యాంపులో అలారమ్ సిగ్నలు ఇవ్వబడింది. కొద్ది నిమిషాలలో డిటాచ్ మెంటు యావత్తూ యుద్ధానికి తయారుగా వుంది.

కాని చుట్టుపక్కల అంతా నిశ్శబ్దం. అరణ్యప్రశాంతతను ఏదీ భగ్నం

చేయడంలేదు. ఆ చుట్టుపక్కల అంతా వెతికాం. కాని అనుమానాస్పదమైనది ఏదీ కనబడలేదు.

ఓ గంట తరువాత "ఆల్ క్లియర్" సిగ్నలు ఇచ్చారు. కాని ఆ రాత్రి మరి నాకు నిద్రపట్టలేదు. ఏమంటే, అలారమ్ సిగ్నల్ ఫలితంగా మాలో వున్న లోపాలు బయటపడ్డాయి: యూనిఫారాలు వేసుకుని తయారయ్యేందుకు చాలామందికి పదిహేను, ఇరవై నిమిషాలు పట్టింది; రాత్రి రిజర్వు డ్యూటీలో వుండవలసినవాళ్లు యూనిఫారాలు వేసుకునే నిద్రపోవాలని రూల్సులో వున్నప్పటికీ, అందుకు విరుద్ధంగా చాలామంది కామ్రేడ్లు యూనిఫారాలు తీసేసి పడుకున్నారు. యూనిట్ కమాండర్లనూ, క్రమశిక్షణను అతిక్రమించిన మనుషులనూ పిలిపించి, బాగా చివాట్లు పెట్టాను.

క్రితం రాత్రి ఏ చోటయితే సెంట్రీ అలికిడి విన్నాడో ఆ చోటుకు లుకిన్ ఉదయాన వెళ్ళాడు. తన సబ్‌మెషీన్‌గన్ను ట్రిగ్గరుమీద వేలు సిద్ధంగా వుంచి, అతిజాగ్రత్తగా అడుగులు వేసుకుంటూ వెళ్ళి ఆ స్థలం అంతా పరీక్షించాడు. తను నుంచున్న చోటుకు కాస్త దగ్గరగా వున్న పొదల్లోనుంచి తటాలున ఏదో పరుగెత్తి ఒక పక్కకు పారిపోయింది ఏమిటి జరిగిందో అర్థంచేసుకోకుండానే లుకిన్ చటున తన సబ్‌మెషీన్‌గన్నుతో దానిపై ఒకబారు బాదాడు. అదొక చిన్న అడవి మేకపిల్ల. మే మే అంటూ లుకిన్‌కి మరొక మేకపిల్ల అరుపు వినబడింది. లుకిన్ వాటిని పట్టుకుని, ఆ జయచిహ్నాలతో క్యాంపు చేరుకుని :

"రాత్రి మన సెంట్రీలను హడలగొట్టి వాళ్ళ ప్రాణాలు తీసినవిఇవిగో!" అని వాటిని చూపించాడు.

"ఎంత ముద్దొస్తున్నాయో! మాకిచ్చేయండి వీటిని!" అంటూ లిద, మరూస్యలిద్దరూ ముచ్చటపడుతూ కిచకిచమన్నారు.

కాని లుకిన్‌చే దెబ్బతిని గాయపడిన మేకపిల్లను మాత్రం చంపేయవలసి వచ్చింది. రెండో దాన్ని అమ్మాయిలిద్దరికి ఇచ్చేశాం.

"అది మళ్ళీ 'మే మే' అని అరుస్తే మాత్రం అలారమ్ సిగ్నలు ఇవ్వకండి!" అని మనుషులు హాస్యమాడారు.

ఆ రోజు సాయంకాలం బాగా పొద్దుపోయిన తర్వాత, తోల్‌స్తియు లెస్‌నుండి డాక్టర్ త్సెస్సార్‌స్కియ్‌తో సహా యాంత్రు చౌకీదళమూ హఠాత్తుగా క్యాంపుకి వచ్చేసింది. నాజీలు అకస్మాత్తుగా ఆ చౌకీపైన దాడిచేసి, ఇంకా మంచంపట్టివున్న కలాష్నికొవ్‌నూ, రైల్వేలైను వాచ్‌మేననీ పట్టుకున్నారని వారు చెప్పారు.

జర్మన్లు సరిగా ఎక్కడ వున్నారో ఆ సంగతీ, మా క్యాంపు ఎక్కడ వున్నదీ వాళ్ళు తెలుసుకున్నారో లేదో అన్న సంగతీ తెలుసుకుని రావలసిందని ఒక స్కౌటు గ్రూపును పంపించాం.

ఇంకా అందరూ నిద్రలోవుండగా, తెల్లవారేముందే స్కౌట్లు బయల్దేరారు. వారు అట్టే దూరం వెళ్ళనేలేదు. క్యాంపుకి మూడు వందల మీటర్ల దూరంలో ఒకచిన్న ఏటి అవలివొడ్డున మన స్కౌట్లు జర్మన్ సైనికులను చూశారు. స్కౌట్లు వెంటనే కాల్పులు ప్రారంభించారు. అక్షరాలా రెండు నిమిషాలలో క్యాంపుయావత్తూ యుద్ధానికి సిద్ధమైంది. నా గుడారంలో వుంటున్న సెర్గేయ్ స్తెహొవ్ గుడారంలో నుంచి ముందుగా బయటకు పరుగెత్తాడు. లిలీఫ్ స్క్వాడ్‌కి నాయకత్వం వహించి కాల్పులు జరుగుతూన్న స్థలానికి పరుగెత్తాడు. రేడియో స్టేషనూ, స్టాఫ్ డాక్యు మెంట్లూ వున్న గుడారంలో నేను వుంటూ క్యాంపులోనే వుండిపోయాను.

కాల్పులు అంతకంతకు మరింత తీవ్రమయ్యాయి. ఏటిదగ్గర అసలైన యుద్ధం జరుగుతూందన్నమాటే.

మరి కాస్సేపటికి కాల్పుల చప్పుడు క్యాంపుకి చేరువనున్న పక్కనుండి వినబడింది. ఇక ఆలస్యం చేయడానికి వీల్లేకపోయింది. కొచెతోక్ వ్‌ని రెండవ గెరిల్లా గ్రూపుతో పంపించి, క్యాంపు చుట్టూ అదనపు చౌకీలను నియమించాను.

ప్రతి కేక, ప్రతి బుల్లెట్టుచప్పుడూ అరణ్యంలో బిగ్గరగా మారుమోగింది "ఏయ్, రష్యన్లూ ! లొంగిపొండి !" అనే కేకలూ, ఈ కేకలను ముంచివేస్తూ : "హుర్రా, హుర్రా ! ముందుకు పదండి !" అంటూన్న గెరిల్లాల అరుపులూ మాకు స్పష్టంగా వినపడ్డాయి.

మరొక అరగంటలో మా తొలి క్షతగాత్రుణ్ణి క్యాంపుకి తీసుకువచ్చారు. అతడు మా స్పానిష్ కామ్రేడ్లలో ఒకడైన ఫ్లోరెజాక్స్. క్షతగాత్రులకోసమని డాక్టర్ త్సెస్సార్‌స్కియ్ మెడికల్‌నర్సు మరూస్య షతాలొవ ఒక గుడారాన్నిసిద్ధం చేసి వుంచారు. ఫ్లోరెజాక్స్‌కి పేలుడుబుల్లెట్టు తగిలి, ప్రమాదకరంగా గాయపడ్డాడు. త్సెస్సార్‌స్కియ్ వెంటనే ఆపరేషను మొదలుపెట్టాడు.

మరి కాస్సేపట్లో యుద్ధ ఖైదీలను తీసుకొచ్చారు: ఇద్దరు జర్మన్లనూ, జర్మన్ పోలీసుల యూనిఫారంలో వున్న ముగ్గురు దేశద్రోహులనూ జర్మన్ భాష ధారాళంగా మాట్లాడగల్గే త్సెస్సార్‌స్కియ్ ఇంకా ఆపరేషను చేస్తూండటంచేత, పోలీసులను మేమే మొదట ప్రశ్నించడం ఆరంభించాం.

వారిని మా డిటాచ్‌మెంటు మీదకే వాస్తవంగా పంపించారనీ, నూట అరవైమంది మనుషులున్న వారి పురోగామిదళం మా క్యాంపుపై రెండువైపుల నుండి దాడిచేసిందనీ, పోరాటం సాగుతూండగానే అదనపు బలాలకోసమని జర్మన్ కమాండరు హాబ్నోయెకి రేడియోచేశాడనీ ఖైదీలు చెప్పారు.

యుద్ధం చప్పుడు అప్పుడే మణిగిపోతూంది, కాల్పులు అంతకంతకు మరింత దూరంనుండి వినవస్తున్నాయి. మన మనుషులు నాజీలను తరిమికొడుతున్నారు.

కాల్పులను పిసరంతైనా లెక్కచేయక త్సెస్నార్‌స్కీయ్ ఇంకా ఆపరేషన్ చేస్తూనే వున్నాడు, ఫ్లోరెజాక్స్‌పై ఆపరేషను ముగిసిన వెనువెంటనే మరో ఇద్దరు క్షతగాత్రులు అక్కడ ప్రత్యక్ష మయ్యారు.

వారి గాయాలను త్సెస్నార్‌స్కీయ్ మంచి నేర్పుగా కడిగి, వాటికి కట్టు కట్టాడు. తాను చికిత్స చేస్తూన్నంతసేపూ అతడు :

"మరేం గాభరాపడకండి. మరి నాల్గురోజుల్లో మీకు నయమైపోతుంది. పెద్దగాయమేమీ కాదులెండి!" అని వారితో నెమ్మదిగా అనేవాడు.

వొళ్ళంతా రక్తాలుకారుతూ కోస్త్య పస్తనోగొవ్ యుద్ధరంగంనుంచి అక్కడకు వచ్చాడు. అతడిచేయి అదేమిటో అష్టావక్రంగా తిరిగిపోయింది.

"తగిన శాస్తిచేశాం వెధవలకి!" అన్నాడు పస్తనోగొవ్ నీరసపడిన గొంతుకతో. అలా అని, మనిషి అమాంతం అక్కడ కుప్పకూలిపోయాడు.

త్సెస్నార్‌స్కీయ్ అతణ్ణి లేవదీసి, నేలపైన పరచివున్న వాటర్‌ప్రూఫ్ కేప్‌మీద పడుకోబెట్టి, చేయి తనిఖీచేయడం మొదలెట్టాడు. ఎముకలు చితికిపోయాయి. చర్మం వూడొచ్చేసింది, కేవలం స్నాయువుల పట్టుతో మాత్రమే చేయి వేలాడుతూంది.

యుద్ధం రెండు గంటలసేపు సాగింది. మనవాళ్ళు జర్మన్లను ఎంతో దూరంవరకూ తరిమికొట్టుతూనే వున్నారు. కాని ఇహ తరమడం మానివేసి,క్యాంపుకు తిరిగి వచ్చివేయ వలసిందని వారిని ఆజ్ఞాపించుతూ, హర్కారాలను వారివెంట పంపించాను.

మొదటి పరీక్షను తట్టుకుని నిలబడ్డాం. ఈ పోరాటంలో పాల్గొన్న ఇరవై ఐదుగురు గెరిల్లాలు నూటఅరవైమంది నాజీలను అడ్డుకొని, వారిని వెనక్కి తరిమే

శారు. నలభై మంది జర్మన్లు హతులయ్యారు, వారిలో ఏడుగురు ఆఫీసర్లు. జర్మన్లు తమ క్షతగాత్రులను తమతో తీసుకుని వెళ్ళిపోవడంచేత, వారిలో ఎంతమంది గాయపడ్డారో మాకు తెలియలేదు. సబ్‌మెషీన్‌గన్నులూ, రైఫిళ్లూ, చేతిబాంబులూ,పిస్టల్సూ మా వశమయ్యాయి.

ఈ పోరాటంలో మాకు ఒక గొప్ప నష్టం వాటిల్లింది. ఎల్లప్పుడూ ధైర్యంగానూ, సంతోషంగానూ వుంటూ సర్వదా జీవకళతో ఉప్పొంగుతూ వుండిన మాస్కో వాస్తవ్యుడు, తోల్యా కొవ్‌చీన్‌స్కీయ్ నేలకొరిగాడు. తోల్యా కొమ్‌సొమోల్ సభ్యుడు, స్కేటింగులో జాతీయ రికార్డును స్థాపించాడు. మా డిటాచ్‌మెంటులో స్వచ్ఛందంగా చేరాడు, అనతికాలంలో అందరి ప్రేమనూ చూరగొన్నాడు.

ఎంతో దూరంలోవున్న మోజిర్ అరణ్యాలలో ఒక ఖాళీజాగాలో గోయి తవ్వాం. తోల్యా భౌతికకాయాన్ని ఆ గోతిలోకి దించి, సమాధి పక్కను నగ్న శిరస్సులతో మౌనంగా నుంచున్నాం. "యువక మిత్రుడా! నీకిదే మా వీడ్కోలు! నీ మరణానికి మేం పగతీర్చుకుంటాం!" అన్నాను, అంతకంటె మరేమీ నానోటంట వచ్చిందికాదు. అలా అని నేను మొదటి పిడికెడు మట్టిని సమాధిలో పోశాను.

మా సైనికులందరూ ఒకరివెంట ఒకరు వరుసగా సమాధి పక్కనుండి వెళ్తూ ఒక్కొక్కరు ఒక్కొక్క పిడికెడు మట్టిని సమాధిలో పోశారు.

తరువాత సమాధిని పూడ్చి, సమాధిని ప్రేమపూర్వకంగా పచ్చికపెళ్లలతో కప్పాం.

మేము మా క్యాంపును వెంటనే వదలిపెట్టేయాల్సి వచ్చింది. జర్మన్లు గనుక అదనపు బలాలతో తిరిగివచ్చివుండినట్టయితే, మా "డివిజను"కు గొప్ప చిక్కే సంభవించివుండేది.

అక్కడనుంచి వైదొలగడానికి సిగ్నలు ఇచ్చాను.

మాకు మూడు నాటుబండ్లు వున్నాయి. గాయపడినవారిని వీటిలో ఎక్కించాం. మేము రోడ్డువెంట వెళ్ళకుండా, అడవిలోనుంచే సరాసరి దారిచేసుకుంటూ వెళ్లాం. మా వరుసలో చిట్టచివరవున్న గ్రూపువారు మా జాడలు ఏవీ కనబడకుండా వుండేందుకని వాటిని తుడిచిపెట్టేస్తూ వుండేవారు.

ముప్పై లారీలనిండావున్న జర్మన్‌సైనికులు నాల్గురోజులపాటు మమ్మల్ని వెంబడించారు. కాని వారిదంతా వృథా ప్రయాసే అయింది!

వారి లారీలకు సాధ్యంగాని కాలిబాటలవెంట మేం వెళ్లాం. మేం రాత్రి పూట బయల్దేరేవారం. రష్యన్ గడ్డపైన రాత్రిచీకటిని ఎదుర్కొనడమంటే జర్మన్లకి సింహ స్వప్నమే.

## దారిలో

మేము ఒక నెలకుపైగా ప్రమాదాన్ని ఎదుర్కొంటూ శత్రు ఆక్రమిత ప్రాంతంలో తిరిగాం.

తోల్ స్తిరియ్ లెస్‌నుండి సార్నీ అరణ్యాలకు రెండువందల కిలోమీటర్లకు పైగా వుంటుంది. రైలుమీద వెళ్ళినా, కారుమీద వెళ్ళినా ఇంతదూరం వున్నట్టు అనిపించనే అనిపించదు. పెద్ద రోడ్ల వెంట ప్రయాణంచేసి, రాత్రిపూట ఎవరి గుడిసెలోనో బసచేసి హాయిగా నిద్రపోయేమాటుంటే,కాలినడకను వెళ్ళినప్పటికైనా ఏమంత కష్టమనిపించదు. కాని గెరిల్లాలకు అడుగడుగునా పిడుగుపడుతూ అడుగు ఆమడలా వుంటుంది.

మేం రోడ్డువెంట వెళ్ళకుండా,ఎవ్వరూ గమనించని అడవిదార్ల వెంటనూ, బాడువల మధ్యనుండీ, కాలిబాటలను అనుసరించి వెళ్ళేవారం. కుక్కలు కూడా మమ్మల్ని పసిపట్టకుండావుండేందుకని గ్రామాలలోనుంచి వెళ్ళడంమాని, గ్రామాలను వదలిపెట్టేసి డొంకతిరుగుడు దార్ల వెంబడి వెళ్ళేవారం.

రాత్రిపూట తరలివెళ్ళి, పగటిపూట వుత్తనేలమీదనే పడుకునేవారం. బాడువలలో నడచినప్పుడు చిత్తుగా నానిపోయేవారం, కుండపోతగా కురిసిన వానలో తగుల్కొని తడిముద్ద అయిపోయేవారం. దోమల బాధ ఇహ చెప్పేందుకు వీల్లేదు. అవి దోమతెర్ల కిందనుండి దూరిపోయి,ముఖమూ మెడా కరిచేసి, చెవుల్లోకి, ముక్కులోకి, కళ్ళలోకి దూరిపోయేవి.

మా దగ్గర బ్రెడ్డు కాని, ఉర్లగడ్డలు కాని లేకపోవడంచేత, మేమురోజుల తరబడి అర్ధాకలితో వుండేవారం. పల్లెల్లోకి, గూడేల్లోకి మా స్కౌట్లు మాత్రమే వెళ్ళేవారు – అదైనా, గెరిల్లా డిటాచ్‌మెంటు ఆ చుట్టుపక్కల తిరుగుతూందనే సంగతి ఎవ్వరికీ తెలియకుండా వుండే విధంగా ఎంతో జాగ్రత్త తీసుకుని మరీ వెళ్ళేవారు.

మమ్మల్ని నాజీలు వేటాడుతున్నారనీ, మమ్మల్ని పసిపట్టేందుకని వారి ఏజెంట్లు ఆవులు కాసేవాళ్ళలాగానూ, అడవిపండ్లు ఏరుకునే మనుషులలాగానూ

మారువేషాలు వేసుకుని అడవుల్లో తిరుగుతున్నారనీ స్థానిక ప్రజలవల్ల మా స్కౌట్లు తెలుసుకున్నారు.

మా స్కౌట్లలో పురోగామి స్కౌటుకు అనుమానస్పదులలా అగపడిన మనుషులు తారసిల్లడం ఒక్కొక్కప్పుడు తటస్థించేది. అలాటి సమయాల్లో, యావత్తు డిటాచ్‌మెంటూ అక్కడికక్కడే, హర్కారా వచ్చి "అంతా సురక్షితం" అనే సిగ్నలు ఇచ్చేవరకూ, నేలమీద బోర్లపడి, గంట, రెండు గంటలు, మూడు గంటలు అలాగే కదలకుండా పడుకుని అక్కడే వుండిపోయేది.

దారిలో ఎదురయ్యేందుకు అవకాశంవున్న ఇబ్బందులూ, ఇక్కట్లూ అన్నీ మాకు ఎదురయ్యాయి. మ్యాపుమీద రెండువందల కిలోమీటర్లేవున్న దూరం వాస్తవంగా ఐదువందలూ, అంతకంటే హెచ్చుగానూ పరిణమించేది.

ఇక స్కౌట్లకు ఆ దూరం అంతకు రెండింతలయ్యేది— రెండింతలేమిటి, నాల్గింతలు కూడా అయ్యేది. డిటాచ్‌మెంటు ఆ రోజుకి ఆగినప్పుడు, మరుచటినాటికి ఏర్పరచుకున్న దారివెంట స్కౌట్లుముందుగానేవెళ్ళి మజిలీచేసేందుకు వీలుగావుండే కొత్త స్థలాలనుచూసి, డిటాచ్‌మెంట్ వున్నచోటికి తిరిగివచ్చి, తాము పరిశీలించి వచ్చిన బాటమీదుగా డిటాచ్‌మెంటుని తీసుకెళ్లవలసివచ్చేది.

జర్మన్లు హఠాత్తుదాడి చేసేందుకు అవకాశం లేకుండా వుండేందుకని, ఇతర స్కౌట్లను ఈ పార్శ్వానికీ, ఆ పార్శ్వానికీ పంపించేవారం.

అందరికంటే హెచ్చు కష్టాలు అనుభవించినవారు క్షతగాత్రులు. అడవి దార్లలోనూ, కాలిబాటలలోనూ చెట్లవేళ్లు, చెట్లమొదళ్లూ కావలసినన్ని అడ్డుగావుండి, తోవ అంతా గతుకులతోనూ, గోతులతోనూ నిండివుండేది. వీటినుండి నాటుబండ్లు వెళ్లేటప్పుడు, బండి కుదిపిన ప్రతి పర్యాయమూ క్షతగాత్రులు యమయాతన అనుభవించేవారు—నెత్తురుకారుతున్న గాయాలు సూదులు పెట్టి పొడిచినట్టే సలుపు పెట్టేవి. బాడువల్లో నుండి బండ్లు వెళ్తూన్నప్పుడు, బండ్లు ఇరుసులవరకూ బురదలో దిగబడిపోయి, బండ్లను గుర్రాలు లాగలేకపోయేవి. ఇటప్పుడు గుర్రాలను విప్పేసి, బండ్లను మేమే లాగేవారం.

గాయపడిన కామ్రేడ్ల పట్ల వారి మిత్రులు తీసుకుంటూండిన జాగ్రత్తను చూసినప్పుడు మనస్సు చలించి పోయేది. వీరి కోసమని స్కౌట్లు మీగడ, గ్రుడ్లూ మాత్రమే కాకుండా తెల్ల బ్రెడ్డు సహితం సంపాదించి ఇచ్చేవారు.

డాక్టర్ త్సెస్పార్‌స్కియ్, నర్సు మరూస్యలు గాయపడిన కామ్రేడ్లను

ఒక్క నిమిషమైనా పదిలిపెట్టకుండా ఈ కామ్రేడ్లున్న బండ్లతోనే ఎల్లప్పుడూ నడుస్తూ వారికి ఉపచారాలు చేస్తూండేవారు.

ఇన్నికష్టాలు భరించుతూన్నప్పటికీ, మాలో ఒక్కరైనా కూడా అధైర్య పడలేదు. విశ్రాంతికోసమని దారిలో ఆగినప్పుడు, అందరూ మెల్లగా పాటలు పాడే వారు, గాయపడినవారు కూడా వీరితో కలిసి పాడేవారు. తరచు హాస్యాలూ విన బడేవి. అంతేకాదు అప్పుడప్పుడు డాన్సులు కూడా వుంటూండేవి. అదృష్టవంతులు మాత్రమే డాన్సుచేయగల్గేవారు, సహజంగానే మరి – ఏమంటే, విశ్రాంతికోసమని మార్గమధ్యంలో ఆగి అగడంతో, పుళ్లుపడి నెత్తురుకారుతూన్న కాళ్లకు కట్టుకట్టించుకుందుకని చాలామంది కామ్రేడ్లు త్సెస్సార్స్కీయ్ దగ్గరకు వెళ్లేవారు, పాపం.

ప్రతిరోజూ రేడియో ద్వారా మాస్కోతో మాకు సంబంధం వుంటూండేది, యుద్ధ చర్యలను గురించి మాస్కోనుండి వెలువడే రేడియో ప్రకటనలను వింటూండే వారం. ఈ ప్రకటనలను వింటూండగా వాటిని మేం రాసుకుని, వాటికి నకళ్లు తయారుచేసి, నకళ్లను తొలుత గెరిల్లా కామ్రేడ్లకు చదివి వినిపించిన తరువాత వాటిని స్కౌట్లు గ్రామాలకూ, గూడేలకూ తీసుకువెళ్లి అక్కడివారికి పంచి పెట్టేవారు.

యుద్ధం గురించి రైతులు నిజం తెలుసుకున్నారు. మాస్కో, లెనిన్ గ్రాడ్లను అప్పుడే పట్టుకున్నామని నాజీలు చేస్తూన్న ప్రచారం శుద్ధ అబద్ధమని రైతులకు తెలిసిపోయింది.

పల్లెటూళ్లలో రైతులు ఎలా జీవించుతూన్నదీ మాకు స్కౌట్లద్వారా తెలుస్తూండేది. ఆక్రమణదార్లు పౌరులను దోచుకుని హత్యచేసేవారు, ప్రజలను నిర్బంధించి శ్రమాకలితమైన పనులను చేయించేవారు, యువతీ యువకులను బానిస జీవితం గడపేందుకు జర్మనీకి రవాణాచేసేవారు.

ఒక పల్లెటూరి స్త్రీ మా స్కౌట్లతో ఇలా చెప్పింది:

"నా కూతురు అన్యూతను తీసుకుపోయారు. దాన్ని తీసుకుపోతారనగా దానితో చెప్పాను, నాపేర ఉత్తరం రాయమనీ, కాని జాగ్రత్తగా రాయాల్సిందనీ, అక్కడ పరిస్థితులు గడ్డుగా వున్నప్పుడు వుత్తరంలో పువ్వు బొమ్మ చిత్రించమనీ చెప్పాను. వాళ్లు వాస్తవాన్ని ఎలాగూ రాయనీయరని నాకు తెలుసు. దాని దగ్గర నుండి ఈ మధ్యనే వుత్తరం వచ్చింది. పరిస్థితులకేమీ ఫర్వాలేదు, బాగానే వున్నా

యని రాయడమేమో రాసింది కాని, ఆవుత్తరంలో పన్నెండు పువ్వుల బొమ్మలు చిత్రించింది...."

మా డిటాచ్‌మెంటు ముహోయేది గ్రామం దిశగా వెళ్తోంది.

సాష త్వొరొగొవూ,పషూనూ ఇంకా బతికే వుండినట్టయితే, మేం నిర్ణయించుకున్న సంకేతస్థలం దగ్గర వారు మాకోసం వెతుకుతూ వుండాలని మేం లెక్కవేసుకున్నాం.

ఎవరో తెగువపరులైన పధ్నాల్గురు గెరిల్లాల గురించి ఆ ప్రాంతపు రైతులు కథలు చెప్పుకుంటున్నారనీ, వాటిని తాము దారిలోనే విన్నామనీ స్కౌట్లు మాతో చెప్పారు. ఒక పెద్దనాజీ యూనిట్టుని నాశనంచేసి వేసినట్టి ఎర్రసైన్యపు పారాషూటు దళాన్ని గురించిన గాథగా మొదట్లో ఈ వార్త మాకుచేరింది. ఆ తరువాత మరింత స్పష్టమైన సమాచారం మాకు అందుతూవచ్చింది. మా స్కౌట్లు ప్రత్యక్షసాక్షులను కలుసుకోవడంకూడా జరిగింది. అసలు విషయం ఈవిధంగా జరిగినట్టు చిట్టచివరకు మేము నిర్ధారణ చేయగల్గాం:

త్వొరొగొవూ, అతని గ్రూపువారి విమానంనుండి జితోమిర్‌కి దక్షిణంగా వున్న ప్రాంతంలోకి జంప్‌చేసిన తరువాత, వారు ఆ వూరి పక్కనుండి పడమటి పొలిమేర దిక్కుగాసాగి, ఉత్తరదిశగా ముహోయేది గ్రామంవైపు మళ్ళారు. విశ్రాంతి కోసమని ఒక గ్రామంలో మజిలీచేశారు. వారు బసచేసిన గుడిసెను ఆ రాత్రే జర్మన్లు చుట్టుముట్టి:

"ఏయ్, రష్యన్లూ! లొంగిపొండి!" అని కేకలు పెట్టారు.

"బోల్షివిక్‌లు ఎన్నడూ లొంగరు!" అని మనవాళ్ళు బదులుచెప్పి, ఆ గుడిసె కిటికీల్లోనుండి కాల్పులు మొదలుపెట్టారు.

పోరాటం మరుసటి రోజంతా సాగింది. మనవాళ్ళ కాల్పులకు ఏభైమందికి పైగా నాజీలు చచ్చిపోయారు. పధ్నాలుగు గెరిల్లాలలోనూ ఐదుగురు మాత్రమే మిగిలారు.

చీకటిపడిన తరువాత జర్మన్లు ఆ గుడిసెకు నిప్పంటించారు. కాని గెరిల్లాలు ఆ గుడిసెలోనుంచి ఎలాగో బయటకు వచ్చేసి, తుపాకులు కాల్చుతూ అక్కడనుండి తప్పించుకుని అడవిలోకి పారిపోగల్గారు

గాయాలతో బాధపడుతూ అలసిపోయి వారు ఆ రాత్రే సుమారు పది

కిలోమీటర్లు నడిచారు. తెల్లవారిన తరవాత వారు చూసుకునే సరికి, జర్మన్లు ఇంకా తమను వెంబడించుతూన్నట్లు కనిపెట్టారు. గెరిల్లాలు ఒక గ్రామం చేరుకుని, ఆ గ్రామం పొలిమేరలో వున్న ఒక గుడిసెలోకి ప్రవేశించారు. వారిని మళ్ళీ ఈసారి కూడా జర్మన్లు చుట్టుముట్టేశారు. మళ్ళీ ఈ సారికూడా కొన్నిగంటలసేపు పోరాటం చెలరేగింది. చిట్టచివరకు గుడిసెలోనుండి తుపాకికాల్పులు ఆగిపోయాయి. అప్పుడు జర్మన్లు ఆ గుడిసెలోపలికి వెళ్ళి చూసేసరికి, ముగ్గురు గెరిల్లాలు చచ్చిపోయి యున్నారు. కడమ ఇద్దరు గెరిల్లాలు ఎలా తప్పించుకు పారిపోగల్గారో మరితప్పించుకు పారిపోయారు. పల్లెప్రజలు చెప్పిన కథలనుబట్టీ, గెరిల్లాలు ధరించిన దుస్తులను గురించి వారు ఇచ్చిన వివరాలనుబట్టీ చనిపోయినవారిలో ఒకరు సాష త్వోరొగొవ్ అని మాకు స్పష్టమైంది.

ఈ గ్రూపును గురించి ఇంతకంటె అధికం మరి మాకు తెలియరాలేదు. యుద్ధం అయిపోయాక, త్వోరొగొవ్ గ్రూపులో బతికి బయటపడిన ఇద్దరి కామ్రేడ్ల లోనూ ఒకడు నన్ను చూడ్డానికి వచ్చాడు. ఇతడితోకూడా తప్పించుకు పారిపోయిన రెండవ కామ్రేడు స్పెయిన్‌దేశస్థుడు. వీరిద్దరూ అడవులలోపడి ఎన్నో రోజులు అలా తిరిగారట. చిట్టచివరకి వారు ఒక గెరిల్లా డిటాచ్‌మెంటును కలుసుకుని, దానిలో చేరారట. యుద్ధం అయిపోయేవరకూ వారు ఆ డిటాచ్‌మెంటులోనే వున్నారట. ఈ విధంగా అంతమైంది త్వోరొగొవ్‌కి చెందిన అమరవీరుల కథ.

పారాషూటిస్టులవలె ఓవరాల్సు తొడుక్కొని, గుడ్డటోపీలు పెట్టుకున్న మనుషులు ఎవరో కొందరు తమ దగ్గరకు వచ్చి ఉర్లగడ్డలూ, పాలూ, బ్రెడ్డూ కొనుక్కొని వెళ్ళారనీ, ఆ మనుషులు మళ్ళీ వస్తామన్నారనీ ముహోయేది గ్రామానికి చేరువ నున్న ఒక గూడెంలోని ప్రజలు మాతో చెప్పారు.

ఈ మనుషులు ఎవరో తెలుసుకుందామని మేము మాటువేసుకుని కాచు కున్నాం. ఆ గూడెంలో చిట్టచివరి గుడిసెకు దగ్గరగావున్న పొదల్లో వలెన్‌తీన్ సెమ్యోనొవ్, ఇంకా కొందరు గెరిల్లాలు దాగున్నారు. ఆరు గంటలసేపు అలా దాగు కున్న తరవాత, ముగ్గురు మనుషులు రోడ్డుమీదనుండి ఆ గుడిసె దిశగా రావడం గెరిల్లాలకు కనబడింది. గెరిల్లాలు తమ సబ్‌మెషిన్‌గన్నులను గురిపెట్టి సిద్ధంగా వున్నారు. కాని ఆ ముగ్గురూ అక్కడకు వచ్చేసరికి, సెమ్యోనొవ్: "తుర్రాల్లూ! వీళ్ళు మరెవ్వరూకాదు! ఆ మనిషి షెవ్‌చూక్, రెండోవాడు దార్‌బేక్ అబ్దియీమొవ్!" అని కేకవేశాడు. సెమ్యోనొవ్ మాటుతాగానుండి పరుగున బయటికి వచ్చేసి తమ కామ్రేడ్లను కౌగలించుకున్నారు. ఆ వచ్చినవారు ముగ్గురూ పహూన్ గ్రూపుకు చెందిన గెరిల్లాలు.

మరికొన్ని గంటల తరువాత, పషూనూ అతని మనుషులూ అక్కడకు వచ్చి మమ్మల్ని కలుసుకున్నారు. ఫొటోగ్రాఫ్ కెమేరాలున్నవారు ఆ సమావేశానికి ఫొటోలు తీశారు. అది నిజంగా మరువరాని సమావేశమే మరి! అంతకుముందు కొద్ది రోజుల క్రితమే మేం మాస్కోలో ఒకరికొకరం వీడ్కోలు చెప్పుకున్నాం. కాని నీటుగా, కండలుతిరిగిన వస్తాదులుగా వుండిన ఆనాటి యువకులు ఈనాడు గడ్డాలు బాచుల్లా తయారయ్యారు.

వారు మాకోసం నెంరోజులకు పైగా వెతికారు. తోల్ స్తియ్ లెస్‌కి సుమారు నూట ఎనభై కిలోమీటర్ల ఆవలవున్న హోయ్‌నికి రైలుస్టేషనుకు ఎక్కడో చేరువగా వారు విమానం నుండి జంప్‌చేసి దిగారు. అక్కడ మండుతూండిన నెగళ్ళనుచూసి, అదే సంకేతస్థలం అని పైలట్ పొరపాటుపడినందువల్ల వారు అక్కడ దిగారు. రైల్వేలైనుమీద నిర్బంధంగా పనిచేయించేందుకు తరలించబడిన స్థానిక ప్రజలు ఆ నెగళ్ళు వేసుకున్నట్టు వారికి తరువాత తెలిసింది. గెరిల్లాలు విమానంనుండి జంప్ చేయడం జర్మన్‌పోలీసులు చూసి, గెరిల్లాలపై కాల్పులు మొదలెట్టారు. అదృష్ట వశాత్తూ ఆ సమయానికి వీస్తూన్న గాలి పారాషూటిస్టులను ఆ నెగళ్ళ దగ్గరనుండి దూరంగా లాక్కుపోయింది. అయినప్పటికీ, పారాషూటిస్టు ఒకడు ఇంకా గాలిలోనే వుండగా తుపాకి కాల్పులకి అహుతి అయిపోయాడు. కడమవారు నేలమీద దిగి, మాటు వెనుక దాగి, పషూన్ ఇచ్చిన సిగ్నలు అందుకుని, అందరూ ఒక చోట చేరారు.

తమను వెంటాడుతూన్న శత్రువుకి అగపడకుండా దాగుంటూ వారు అనేకదినాల తరబడి బాడువల్లోనుండి దారిచేసుకుంటూ వచ్చారు. తరువాత వారు ప్రిప్యాత్ నదీతీరం చేరి, పడవలమీద నది దాటారు. వారు తోల్ స్తియ్ లెస్‌ను చేరు కునేప్పటికి, మేమప్పుడే అక్కడనుంచి వెళ్ళిపోయాం. మా జాడలను వారు కనీ పెట్టుతూ, వాటి వెంట వచ్చి, మమ్మల్ని కలుసుకున్నారు.

పూర్తి డిటాచ్‌మెంటు ఇప్పుడు కూడింది. మేమందరమూ మొత్తం ఎనభై ఐదు మందిమి! జులై 21న మేం విశ్రాంతికోసమని ఆగినప్పుడు, సెర్గేయ్ స్తెహొవ్ పార్టీ సభ్యులందరినీ, కేండిడేటు సభ్యులందరినీ సమావేశపరచాడు. మా డిటాచ్ మెంటులో జరిగిన పార్టీ సమావేశాల్లో అదే మొదటి సమావేశం.

మా పార్టీ యూనిట్టు చాలా చిన్నది-పదిహేనుగురు సభ్యులూ, నలుగురు కేండిడేటు సభ్యులూ, అంతే. ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాటంలో కమ్యూనిస్టులు ధరించవలసిన నాయక పాత్ర, యుద్ధంలోనూ, జీవితంలోనూ కమ్యూనిస్టులు చూప వలసిన దృష్టాంతం, డిటాచ్‌మెంటులో క్రమశిక్షణ, కొమ్‌సామోల్ ఆర్గనైజేషను చేయవలసిన పని-ఈ విషయాలకు సంబంధించిన ప్రధాన సమస్యలను గురించి ఈ

మొదటి సమావేశంలో చర్చించాం. ఆనాటినుండి మా డిటాచ్‌మెంటులో సుసంఘటిత మైన పార్టీ, కొమ్‌సొమోల్ జీవితం ప్రారంభమైంది.

ప్రతిదినమూ విశ్రాంతికోసం ఆగినప్పుడు, వివిధ యుద్ధశ్రేణుల పరిస్థితులను గురించీ, దేశంలో జీవితం గురించీ, జర్మన్ శ్రేణుల వెనుకప్రాంతాల్లో వున్న సోవియట్ ప్రజల కర్తవ్యాలను గురించి సెర్గేయ్ స్తెహోవ్ తన తోటి కామ్రేడ్లతో ముచ్చటించేవాడు ఈ రాజకీయ ప్రసంగాలను సరదాగా ఆసక్తిజనకంగా వుండే రీతిలో ఎలా సాగించడమో అతనికి చక్కగా తెలిసివుండడంచేత, అతడు ప్రసంగిం చుతూండినప్పుడల్లా అతని చుట్టూ జనం మూగివుండేవారు.

జ్లాయ్ పల్లెకు చేరువగా ఒక బయలుజాగా వుంది. పారాషూటిస్టులు దిగేం దుకూ, వారిని మేము కలుసుకునేందుకూ ఆ జాగా అనువుగావుంది. ఆ జాగా సరిగా ఎక్కడ వున్నదీ స్థలనిర్దేశ వివరాలను మాస్కోకి రేడియోచేశాం. మరుచటి రాత్రి విమానంమీద పన్నెండుగురు గెరిల్లా సైనికులు అక్కడ దిగారు.

వారిలో నికొలాయ్ కుజ్నెత్సోవ్ వుండడం చూసి నాకెంతో ఆనందం కల్గింది. అతని కోసం నేను ఎంతకాలంగానో కనిపెట్టుకున్నాను. ఈ పుస్తకం లోని కథనం చాలా వరకు అతని గురించే.

## డిటాచ్‌మెంటు పెద్దదవుతూంది

ఎర్రసైన్యంలో ఇంతకుముందు సైనికులుగానూ, జూనియర్ కమాండర్లు గానూ సర్వీసు చేసినవారు మాకు గ్రామాల్లోనూ, పల్లెల్లోనూ తారసపడ్డారు. తమ యూనిట్లు శత్రు చక్రబంధంలో చిక్కుకున్న తరువాత, తాము సైన్యానికి చెందిన వారమని పైకి తెలియకుండా వుండేందుకని, వారిలో కొందరు స్థానిక ప్రజలలాగానే జీవితం గడుపుతున్నారు. కొందరు జర్మన్ యుద్ధఖైదీ క్యాంపులలోనుండి తప్పించుకు పారిపోయారు. వీరు కూడా పల్లెల్లో అజ్ఞాతవాస జీవితం గడుపుతున్నారు.

మేము గెరిల్లాలమని వారు తెలుసుకోగానే, తాము మా డిటాచ్‌మెటులో చేరతామనీ, అందుకు అనుమతించవలసిందనీ నన్ను కోరారు. ఏ రోజుకా రోజు మా స్కౌట్లు కొత్తవారిని చాలా మందిని తీసుకొస్తూండేవారు.

ఒబ్రూచ్ నగరానికి సమీపంలో ఒక ఫారెస్టు ఆఫీసరుని మేం కలుసు కోవడం తటస్థించింది. ఎవరో గెరిల్లాలు కొందరు ఆ చుట్టుపక్కల అడవుల్లో కొంత కాలంనుండి వుంటున్నారని అతడు మాతో చెప్పాడు. కాని ఎన్నో ప్రయత్నాలు చేసిన తర్వాత కాని మేము వీరిని కలుసుకోలేకపోయాం. మమ్మల్ని కలుసుకుందుకు

వారు భయపడ్డారు, మేమెవరమో వారికి తెలియదాయె, అందుకని వారు మమ్మల్ని తప్పించుకుని తిరుగుతూ, మా కంటబడకుండా దాగునేవారు. ఓట్టచివరకు వారిలో యిద్దరిని మేము కలుసుకోవడం తటస్థించింది. మేము ఎవరమో వారు తెలుసుకున్న తరువాత, వారు కడమవారిని తీసుకొచ్చారు వారు ఇరవైమంది. వారందరూ ఫాసిస్టు ఖైదుల్లోనుండి తప్పించుకుని బయటపడిన ఎర్రసైనికులే.

అయినప్పటికీ, వారినందరినీ మా డిటాచ్‌మెంటులోకి ఏ వాకబూ చేయకుండా సరాసరి తీసుకోలేకపోయాం. వారిలో ప్రతి ఒక్కరినీ వేరువేరుగా పిలచి, అతడు ఎవడో, ఎక్కడనుంచి వచ్చాడో, ఏ యూనిట్టులో సెర్వ్ చేశాడో అన్ని విషయాలూ వివరంగా అడిగి తెలుసుకున్నాం.

ఆ తరువాత కొత్తవారిలో ప్రతివారినీ సాఫ్‌సీదాగా సోదాచేశాం. సెర్గెయ్ స్తేహొవ్, నేనూ దగ్గర వుండగా ఇద్దరు గెరిల్లా సైనికులు ఈ సోదా జరిపారు.

ఒక మనిషి జేబులో చీట్లపేకలు కనబడ్డాయి. ఆ పేకదస్తాను స్తేహొవ్ తీసుకుని, ఆ మనిషికి ధన్యవాదాలు చెప్పాడు. ఆ మనిషికేమీ అర్థంగాక తబ్బిబ్బు పడ్డాడు.

"ధన్యవాదాలు! ముసురు రోజుల్లో నెగడి రాజబెట్టేందుకు ఇవి చక్కగా పనికొస్తాయి!" అన్నాడు స్తేహొవ్.

నిండుగా వున్న వోద్కా సీసా మరొక మనిషి జేబులో అగపడింది.

"దీనికూ్కడా ధన్యవాదాలు! మాదగ్గర వోద్కా బొత్తిగా లేదు, అవసరానికి బాగా ఉపయోగపడుతుంది!" అన్నాడు స్తేహొవ్.

ప్రశ్నలూ తనిఖీలూ అయిపోయిన తరువాత, స్తేహొవ్ కొత్తవారినందరినీ ఒక వరుసలో నిలబెట్టి, మా రూల్సు ఏమిటో వారికి తెలియజేశాడు :

"మిమ్మల్ని మా డిటాచ్‌మెంటులోకి చేర్చుకుంటాం. కాని మేం కఠినమైన క్రమశిక్షణను పాటించుతామనే సంగతి మీరు తెలుసుకోవాలి. కమాండరు యిచ్చిన ఆర్డరును ఏమైనా సరే మారుమాటాడకుండా తు. చ. శిరసావహించాలి. అవిధేయత నేరానికి పాల్పడిన వారు శిక్షకు లోనవుతారు. మద్యపానం అసలు నిషిద్ధం. చీట్లపేకాట నిషిద్ధం. ప్రజల నుండి ఏ వస్తువైనా సరే తీసుకుందుకు వీల్లేదు. లూటీ చేస్తూండగా పట్టుబడినవారు అక్కడికక్కడే తుపాకితూటాకి గురి అవుతారు. శత్రువు నుండి పట్టుకున్న వస్తువులు జప్తు చేయబడి, సప్లై ప్లటూనుకి ఒప్పగించి వేయబడుతాయి. అవి కమాండరుకి తోచిన ప్రకారం పంపిణీచేయబడుతాయి. వొగాకు సహితం ఎవరిమట్టుకు వారు కుక్తంచేసుకుందుకు వీల్లేదు..."

ఈ కింది మాటలతో స్తేహొవ్ ముగించాడు :

"మీలో కొందరికి ఆయుధాలు లేవు. వాటిని మీకు బహూమతిచేసే వుద్దేశం మాకులేదు. మీ ఆయుధాలను మీరు పోగొట్టుకున్నారు—కొత్త ఆయుధాలను యుద్ధంలో సంపాదించుకొండి. మనం శత్రువుతో తరుచుగా భీషణయుద్ధం చేస్తూం టాం నేను చెబుతూన్నది మీకు అర్థమైంది కదా ?"

సాయంకాలం నెగడిచుట్టూ కూచుని వున్నప్పుడు, తాము జర్మన్ ఖైదీ క్యాంపులలో పడినపాట్లూ, అనుభవించిన హింసలూ వారుచెప్పడం మొదలుపెట్టారు.

వయస్సుమళ్ళిన ఒక సైబీరియన్ ఎర్రసైనికుడు చెప్పిన మాటలు నాకు ఇప్పటికీ స్పష్టంగా జ్ఞాపకం వున్నాయి :

"అక్కడ అలా కూచున్నాం— ఒకరోజు, రెండ్రోజులు, మూడ్రోజులు. తినడానికి ఏమీ ఇవ్వలేదు. కొసకి దాహానికి గుక్కెడు నీళ్లైనా ఇవ్వలేదు. మాలో కొందరు ఇక ఓర్చుకోలేక, మతిపోయి, పరాకుమాటలు ఆరంభించారు...ఒక జర్మన్ కావలి సైనికుడు వచ్చి, తటాలున నీళ్ళ కుళాయి విప్పాడు. మా మనుషులు నీళ్ళ కోసం పరుగెత్తారు. ఆ వెధవ తన మెషీన్‌గన్‌గన్నుతో వాళ్ళనందరినీ అక్కడి కక్కడే కాల్చిపారేశాడు..."

ప్రధాన భూభాగంతో మా సంబంధం ఒక క్షణమాత్రమైనా ఆగిపోలేదు. మా యావత్తు కార్యకలాపమూ ఆ సంబంధంపైనే ఆధారపడివుందాయె. అందుకనే మా రేడియో సంబంధానికి మేము గొప్ప ప్రాముఖ్యత ఇచ్చి, మా రేడియో ఆపరేటర్లను కంటిపాపలా కాపాడుకున్నాం.

మేం మార్చిమీద వున్నప్పుడు, ప్రతి రేడియో ఆపరేటరుకి సబ్‌మెషీన్ గన్నులతో సాయుధులైన ఇద్దరు అంగరక్షకులు వుండేవారు. రేడియో సామాను మోయడంలో రేడియో ఆపరేటర్లకు వీరు సాయపడేవారు.

ప్రసంగవశాత్తూ ఇక్కడ ఒక విషయం చెబుతాను. ఈరేడియోసామాను "పోర్టబుల్" అని పేరుకి చెప్పబడినా, అది చులకనైనది కానేకాదు. రిసీవర్ ట్రాన్స్‌మిటరూ, దాని "కి" "పోషణ"—కేతోడ్, ఏనోడ్‌డ్రై బేటరీలూ—ఇవన్నీ ఒక చేతి పెట్టెలో అమర్చి వుంటాయి. ఈ చేతిపెట్టెనేగాక, మాస్కోనుంచి వస్తూన్న ప్రసారాలను వినేందుకు పనికివచ్చేటట్టి పాక్షికంగా ఉపయోగించబడిన బేటరీల రూపంలో అదనపు "పోషణ"ను కూడా మోసుకెళ్ళవలసి వచ్చేది.

మాస్కోతో ముందుగానే నిర్ణయించుకున్న వేళకు ప్రతిరోజూ మేము

మాస్కోతో రేడియోద్వారా మాట్లాడేవారం. ఆ వేళకు మేముగనుక మార్చిచేస్తూ వుండి, మా మార్చిని తాత్కాలికంగా ఆపుచేసేందుకు వీలులేని పక్షంలో, రేడియో ఆపరేటరు రక్షణకోసం ముప్పై మంది సైనికులను కేటాయించి, రేడియోఆపరేటరును అక్కడ వుంచేసి, మేము ముందుకు సాగిపోయేవారం. రేడియో ఆపరేటరుమాస్కోతో సంబంధం స్థాపించుకుని, తన పని పూర్తిచేసుకుని, మమ్మల్ని మళ్ళీ కలుసుకుని, మాస్కోనుంచి అందిన సమాచారాన్ని మాకు రిపోర్టుచేసేది.

ఆగస్టు నెల దగ్గిరపడుతూంది. కాని మేము క్యాంపు స్థాపించుకోకుండా ఇంకా మార్చిచేస్తూనే వున్నాం. అప్పటికప్పుడే మేం కోవెల్ – కీయెవ్ రైల్వేలైను దాటాం, గమ్యస్థానానికి సుమారు నలభై కిలోమీటర్ల దూరంలో వున్నాం.

బుద్కిస్నొవిదోవిచి స్టేషను డబుల్ లైను దగ్గర మేము ఆగేసరికల్లా, స్థానిక వాసులు మా స్కౌట్లతో, మేము రైల్వేలైను దాటుతూండినప్పుడే మమ్మల్ని జర్మన్లు చూశారనీ, మరుసటినాడు పెందలాడే మామీద దాడిచేసేందుకు సిద్ధమవుతున్నారనీ చెప్పారు. మేము జర్మన్లకోసం కనిపెట్టుకోలేదు. ఈ సమాచారం తెలిసిన వెంటనే, మేము పషూన్‌కి ఏభైమంది మనుషులనిచ్చి జర్మన్లపై దాడిచేయవలసిందని పంపించాం.

బుద్కిస్నొవిదోవిచి స్టేషనును గెరిల్లాలు రాత్రిపూట సమీపించారు. సైడింగులో నిలబడివున్న ఒకరైలులో జర్మను సైనికులున్నారని స్కౌట్లుచెప్పారు.

మనవాళ్ళు చడీచప్పుడూ లేకుండా రైలు వాగన్లను సమీపించి, వాటి దగ్గరకు పాకుతుంటూ వెళ్తున్నారు. కాని పరిస్థితి ఎలావుందో పషూన్ ఇంకా తెలుసుకునే లోపునే, అక్కడ బహుశ జర్మన్లు కాపలా వుంచిన కుక్క మనవాళ్ళ అలికిడి విని మొరగడంతో జర్మన్ సెంట్రీలలో ఒకడు "ఎవరది?" అని సవాలు చేశాడు. జవాబు రాకపోవడంతో ఆ సెంట్రీ సిగ్నలు రూపంగా రెండుసార్లు తుపాకి కాల్చాడు. ఇక మరి జాప్యంచేసేందుకు వీల్లేక, కాల్పులు ప్రారంభించమని పషూన్ తన మనుషులకి ఆర్డరిచ్చాడు. నాజీ సైనికులతో కిటకిటలాడుతూన్న రైలువాగన్ల మీద చేతిబాంబుల వర్షం కురిసింది. సబ్‌మెషీన్‌గన్లనుండీ, మెషీన్‌గన్లనుండీ కాల్పులు చెలరేగాయి. రైలు సమీపంలో వున్న ఒక పెట్రోలు డ్రమ్ముకి ఒక పేలుడు బుల్లెట్టు తగలడంతో అది భగ్గున మండింది. ఆ మంటలకి రైలు వాగన్లు అంటుకుని బ్రహ్మాండమైన చిచ్చు బయల్దేరింది.

మమ్మల్ని మట్టిపాల్జేసేందుకని జర్మన్లు పంపిన స్పెషల్ సైన్యం తెల్ల

వారేప్పటికల్లా బుగ్గిపాలైంది. జర్మన్లలో కొద్దిమంది మాత్రమే తప్పించుకుని పారి పోగల్గారు.

ఈ దాడి ఫలితంగా రైఫిళ్ళు, చేతిబాంబులు, తూటాలు, ఇంకా ఫ్లాష్‌లైట్లు వగైరా ఇతర సామాన్లూ, మాకు ఎంతో అవసరంగా వున్నట్టి, ముఖ్యంగా చక్కెర, సాకరిన్ వంటి ఆహారపదార్థాలూ పెద్దఎత్తున పక్షూన్ చేతికి చిక్కాయి.

మా స్పానిష్ కామ్రేడ్లలో ఒకడైన ఆంటోనియోబ్లాంకో యీ దాడిలో మరణించాడు. అతడి వయస్సు ఇరవైరెండేళ్ళే. కాని తొలి పాదంలోనే అంతమైన అతని జీవితం వీరోచిత మార్గాన నడిచింది. 1936 లో అతడింకా పదహారేండ్ల కుర్రవాడుగానే వుండినప్పటికీ, స్పానిష్ ప్రజా సేనలో చేరి ఫాసిస్టులపై యుద్ధం చేశాడు. తరువాత అతడు సోవియట్ యూనియన్‌లో ప్రవాసజీవితం గడిపాడు. మా డిటాచ్‌మెంటులో స్వచ్ఛంద సైనికునిగా చేరాడు.

ఆంటోనియో బ్లాంకో వీరునివలె మరణించాడు. అతడు ఒక రైల్వే వాగను దగ్గరకు పరుగెత్తి వెళ్ళి, చేతిబాంబును అందులోకి విసిరాడు.

* * *

బుద్కీ స్నొవిదోవిచి స్టేషను యుద్ధం జరిగిన మరి రెండు రోజులకు మేం సార్నె అరణ్యాలలో అడుగుపెట్టాం.

## క్యాంపు

క్యాంపు ఏర్పాటుచేసుకున్న స్థలం మంచి విశాలంగానూ సదుపాయం గానూ వుంది. సార్నె అరణ్యాలు కొన్నివందల కిలోమీటర్లు విస్తరించి వున్నాయి, కాని అరణ్యాలన్నీ కలిసిపోయి ఏకంగా ఒకేఒక మహారణ్య కీకారణ్యమైపోలేదు. అడవులూ, పొలాలూ, పల్లెలూ ఒకదానితరువాత ఒకటి ఇంచుమించు వరుసక్రమం ఏర్పరచినట్టు వుంటాయి. ప్రతి ఆరు, ఎనిమిది కిలోమీటర్లకీ ఒక గూడెమో, ఒక గ్రామమో ఎదురవుతుంది. ఈ కారణంచేత, మేము చూసుకున్నచోటు శత్రువు కంటబడకుండా మా డిటాచ్‌మెంటు దాగివుండేందుకు చక్కగా అమరింది. అంతే కాకుండా ఆ స్థలానికి దగ్గరగా ప్రజలు కూడా వున్నారు – మాకిది ఎంతో అంత ముఖ్యమైన విషయం కూడానూ.

మాకు మాస్కోలో ఒప్పజెప్పిన ప్రధాన కర్తవ్యం: పశ్చిమ ఉక్రైనియా లోని వూళ్ళనూ, రైల్వేజంక్షన్లనూ శ్రద్ధగా కనిపెట్టుతూ వుండడం. శత్రుసైనికబలాల సంఖ్య, యుద్ధసామగ్రి ఫ్యాక్టరీలూ, స్టోర్సు ఎక్కడ వుంటూన్నదీ, స్టాఫ్ హెడ్

క్వార్టర్సులు ఎక్కడ స్థాపించినదీ, సైనికబలాలూ, ఆయుధాలూ ఎన్నెన్ని ఎక్కడెక్కడకు తరలించబడుతూన్నదీ, ఇంకా మేము తెలుసుకోగల్గిన ఇతర మిలిటరీ రహస్యాలూ—వీటిని గురించి మేము మాస్కోకి తెలియజేస్తూండాలి. అదేసమయంలో మేము నాలుగు చెరగులా, వీలైన చోట్లల్లా శత్రువుపైన దెబ్బతీస్తూండాలి.

ఒక అడవిలో, రూద్న్యి—బొబ్రొవ్స్కయ గ్రామానికి దగ్గరగా, రోవ్నొ నగరానికి సుమారు నూటఇరవై కిలోమీటర్ల దూరంలో మేం మకాం ఏర్పరచుకున్నాం. అది ఆగస్టు నెల. వాతావరణం వెచ్చగావుంది. అందువల్ని మేము గోతులు తవ్వి వాటిపై కప్పునేసి గుడిసెలు వేసుకోవడం బదులు, మా వాటర్ప్రూఫ్ కేవ్‌లతో చిన్న చిన్న గుడారాలు వేసుకున్నాం. వాటర్ప్రూఫ్‌లు లేనివాళ్ళు చెట్ల కొమ్మలతో పాకలు వేసుకున్నారు. ఇందుకు అన్నిటికంటెనూ ఫర్ చెట్ల కొమ్మలు బాగాఉపయోగపడ్డాయి. కొమ్మలు వొత్తుగా పాతితే, పాక వెచ్చగా వుంటుంది; వాన కురిసినప్పటికీ ముళ్ళల్లా వున్న ఆకులవెంట వర్షపునీరు జారిపోతుందే కాని పాకలోపలికి కారదు. కొమ్మలు నేలపైన పరచి వాటిమీద పడుకుంటే స్ప్రింగు మంచంమీద పడుకున్నట్టే వుంటుంది, "ముళ్ళు" గుచ్చుకోకుండా వుండేందుకని కొమ్మలపైన ఆకూ అలమూ పరచేవారం.

మా క్యాంపు ఈ విధంగా వుంటుంది : క్యాంపు నట్టనడుమ నెగడి, నెగడి చుట్టూ స్టాఫ్ హెడ్‌క్వార్టర్స్ కోసమని నీటుగా వాటర్ప్రూఫ్ కేవ్‌ల గుడారాలు. స్టాఫ్ హెడ్‌క్వార్టర్సుకి కాస్త దూరాన మెడికల్ కోర్, రేడియో యూనిట్టు, హెడ్‌క్వార్టర్స్ వంటసాల గుడారాలు ముక్కోణంగా వున్నాయి. ఈ ముక్కోణానికి మరి కాస్త దూరంగా రికాన్నిసెన్స్ యూనిట్ల గుడిసెలు.

మా "ఈగ్రామం" అంతటినీ ఒక్క రోజులో నిర్మించేశాం. మరుసటి రోజుకి అప్పుడే మా మనుషులను స్థానిక ప్రజలతో పరిచయంచేసుకుందుకూ,వారిలో నమ్మకస్తులెవరో తెలుసుకుందుకూ, జర్మన్ల గురించి సమాచారం సేకరించేందుకూ, ఆహారసామగ్రిని సంపాదించేందుకూ పంపించేశాను.

ఈ పనిమీద వెళ్ళిన తొలి జట్టు క్రామేర్లందరికీ ఉక్రెయినియన్ భాష తెలుసు. ఆ భాష తెలిసినవారు మాలో చాలామందే వున్నారు. కాని వారందరినీ రికాన్నిసెన్సుమీద పంపేందుకు వీలుపడలేదు. సుదీర్ఘమైన మార్చిలు చేయడంవల్ల చాలామంది వేసుకున్న బూట్లు ఎక్కడికక్కడికి చిరిగిపోయి కన్నాలుపడిపోయాయి. మా దగ్గర అదనంగా బూట్లూ, యూనిఫారాలూ లేవు. ఇహ తొలిరోజునే జర్మన్ సప్లై డిపోలపై దాడిచేయలేముకద!

ఈ "వృత్త కాళ్ళ మనుమలు" మొగాలు వేలాడేసుకుని, క్యాంపులో వుండి-పోయి, గుడారాల్లోనూ, గుడిసెల్లోనూ "ఇంటి చాకిరీ" చేయడం మొదలుపెట్టారు.

వీరిలో ఒకడు, ర్యజాన్ ప్రాంతపు మనిషి, కొరొల్యోవ్:

"ఆడదాన్ని ఇంట్లో వుంచేసినట్టు నన్ను ఇంట్లో వుంచేశారు!" అంటూ గట్టిగా మూల్గాడు.

"అయితే, షాపుకెళ్ళి ఓ జత కిడ్ లెదర్ బూట్లు కొనుక్కొని వచ్చేయి" అతడితో కూడా వుండిపోయిన కడమ కామ్రేడ్లు అతణ్ణి ఎగతాళి చేశారు.

అతడు సప్లై ప్లటూనుకు వెళ్ళి, గొడ్డలి ఇవ్వమని అడిగి, గొడ్డలి పుచ్చుకుని, తన కమాండరు సరపూలోవ్ దగ్గరకు వెళ్ళి:

"కామ్రేడ్ కమాండర్! ఓ అరగంట సేపు నేను క్యాంపు విడిచిపెట్టి వెళ్ళేందుకు అనుమతించండి!" అని అడిగాడు.

"ఎందుకు వెళ్తావ్, ఎక్కడికెళ్తావ్?"

"అడవిలోకి వెళ్ళి, లిండెన్ చెట్ల బెరడు చెక్కుకుని వస్తా."

"ఎందుకని?"

"నాకోసం ఓ జత నారజోళ్ళు తయారుచేసుకుందామని."

సరపూలొవ్ ఒక నిమిషం ఆలోచించి:

"సరే! కాని, కామ్రేడ్ కొరొల్యోవ్, ఆలస్యంగా మాత్రం రాకూడదు సుమా!" అన్నాడు.

"ఆలస్యం చేయనండి!"

అరగంట తరువాత కొరొల్యోవ్ అడవినుంచి తిరిగివచ్చేసి, తన గుడారం దగ్గర ఒక చెట్టు దిమ్మమీద కూచుని, తన పని ప్రారంభించాడు. అతడు మొదట లిండెన్ బెరడును పట్టీలుగా చీరాడు. తరువాత చెక్కతో జోడు అచ్చు తయారుచేసుకుని, ఇక దానిమీద నారతాళ్ళతో జోడు అల్లడం మొదలుపెట్టాడు.

"ఏం, కామ్రేడ్ కొరొల్యోవ్! మంచి షోకైన బూట్లు తయారుచేస్తున్నావే! నిన్ను చూసి ఏ ఇంగ్లీషు లార్డో అనుకోగలరయ్యా!" అంటూ అతణ్ణి కామ్రేడ్లు వేళాకోళం ఆడడం మొదలెట్టారు.

కొరొల్యోవ్ మౌనంగా తన పనిచేసుకుంటూ కూచున్నాడు.

ఒక గంట పోయిన తరువాత, సరపూలొవ్ అక్కడకు వచ్చి చూసేసరికి, కొరొల్యోవ్ ఒక జోడు అల్లడం పూర్తిచేసి, దాన్ని తొడుక్కొని చూస్తున్నాడు.

"జోడు ఇలా ఇయ్యవయ్యా, చూద్దాం" అన్నాడు సరపూలొవ్.

సరపూలొవ్ ఆ జోడు అందుకుని, దాన్ని ఇటూ అటూ తిప్పి పరిశీలించి, దాన్ని తీసుకుని, మాటామంతీ లేకుండా అక్కడనుంచి వెళ్ళిపోయాడు. కొరొల్యోవ్‌కి ఏమీ అర్థంగాక, తబ్బిబ్బుపడి, ఆ చెట్టుదిమ్మమీద అలా కూచుని:

"దాన్ని బహుశా విసిరి పారేస్తాడు. నా పని అంతా దండుగై పోయింది!" అని వ్యసనపడ్డాడు.

కాని మరి కాస్సేపట్లో సరపూలొవ్ అక్కడకు తిరిగివచ్చి:

"కామ్రేడ్ కొరొల్యోవ్! నీ జోడు హెడ్‌క్వార్టర్స్‌లో చూపెట్టాను. తన కొక జత అల్లవలసిందని పొలిటికల్ డిప్యూటీ స్తేహొవ్ ఆర్డరు జారీచేశాడు. అంతే కాదు, ఒక్కొక్క యూనిట్టునుండి ఇద్దరు అప్రెంటిస్‌లను నీ దగ్గరకు పంపించా ల్సిందని ప్లటూన్ కమాండర్లందరికీ ఆర్డర్లు జారీచేశాడు" అని చెప్పాడు.

మరో పది నిమిషాలకల్లా "అప్రెంటిస్‌లు" ప్రత్యక్షమయ్యారు.

"కామ్రేడ్ కొరొల్యోవ్ ఎక్కడున్నాడో తెలుసా?" అని వాళ్ళు కొరొల్యోవ్‌ని అడిగారు.

"నేనే" అన్నాడు కొరొల్యోవ్.

"నారజోళ్ళు అల్లడం నేర్చుకుందుకు మమ్మల్ని నీ దగ్గరికి పంపించారు" అన్నాడు వాళ్ళు.

ఎనమండుగురు అప్రెంటిసులు వచ్చారక్కడికి. వారిలో కొందరు ఆ పని నేర్చుకుందుకు అట్టే ఉత్సాహంగా లేనట్టు అగుపడ్డారు కొరొల్యోవ్‌కి. అందుకని కొరొల్యోవ్ తన పాఠాన్ని "ప్రచారోపన్యాసం"తో ప్రారంభించాడు.

"ఇదిగో, కుర్రాళ్ళూ! మీరేమంత ముఖం ముడుచుకోనక్కర్లేదు. ఇది చక్కని వృత్తి. నారజోళ్ళు పురాతనమైన రష్యన్ పాదరక్షలు. ఈనాడు మనం గడ్డు పరిస్థితుల్లో ఉంటున్నాం. జోళ్ళు దొరకడంలేదని ఏడుపు ప్రారంభించుతామా ఎక్కడైనా? మన పల్లెటూరి సోదరుల జోళ్ళనే మనం కాజేస్తామా? మనం ఫాసిస్టుల కింకా తగిన శాస్తి చేయనేలేదాయె. అసలు నేను చెప్పేది వినండి: మన గెరిల్లాపనికి

మామూలు బూట్లకంటే నారజోళ్ళే మంచివి. ఏమంటే నారజోళ్ళతో నడచినప్పుడు అవి ఏ చప్పుడూ చేయవు. శత్రువు ఏమరుపాటుగా వున్నప్పుడు కనిపెట్టి దాడి చేయడానికి మనం నారజోళ్ళు తొడుక్కుంటేనే శత్రువుకి ఏ చప్పుడూ వినబడదు. ఇక రాత్రిపూట దాడి చెయ్యాలంటే, నారజోళ్ళు మనం తొడుక్కుని వెళ్తే, కుక్కలకి సహితం మన అలికిడి తెలీదు. పోతే, కాళ్ళు పుళ్ళు పడవు కదా. ఇహ, ఇప్పుడు జాగ్రత్తగా చూసి, నేనెలా చేస్తానో మీరూ అలాగే చేయండి. ఇదిగో, నార ఇలా పట్టుకుని..."

మొదటిపాఠం నేర్చుకుంటూన్నప్పుడే, ప్రతి అప్రెంటిసూ ఒక జత నారజోళ్ళు అల్లేశాడు. అవి అందవికారంగానే వున్నప్పటికీ, తొడుక్కోవడానికి వీలుగానే వున్నాయి. మరి రెండురోజులకల్లా చాలామంది కొత్తనారజోళ్ళు తొడుక్కొనితిరగడం మొదలుపెట్టారు, ప్రస్తుతానికి జోళ్ళ కొరత తీరిపోయింది.

అడవిలో మేము క్యాంపు జీవితం సాగించుతూండిన కాలంలో ఎన్నో వస్తువులు మాకు కొరవడ్డాయి. కాని ఏదో ఒక ఉపాయం ఆలోచించి ఆ కొరత లన్నింటినీ తీర్చుకోగల్గాం. డిటాచ్‌మెంటుకి నిజంగా అత్యావశ్యకమైన అవసరాలను అధిగమించే విషయంలో, కామ్రేడ్లలో అంతవరకూ గుప్తంగా వుండిన శక్తిసామర్థ్యాలూ, తెలివితేటలూ బయటపడసాగాయి. ఈ కామ్రేడ్లలో ఒకడు స్పెయిన్ దేశస్థుడు రీవస్. మొదటిరోజుల్లో అతడు మతిపోయినట్టు వుండేవాడు. తను పట్టుకున్న పావురాయితో అరణ్యంలో ఒంటరిగా గడిపిన ఆ పాడు రాత్రి అనుభవంతో అతని మనస్సు దెబ్బతిన్నట్టు అవుపడింది.

అతణ్ణి పోరాటపు ప్లటూనులో చేర్చాం. కాని అర్భకుడవడంచేత కడమ కామ్రేడ్లతో కలిసి సరిగా పనిచేయలేకపోయేవాడు. దూరపు మార్చిలు చేయలేక పోయేవాడు. తరుచు అతణ్ణి, గాయపడినవారితోపాటు బండి ఎక్కించి తీసుకెళ్ళవలసి వచ్చేది. అతనికి రష్యన్ ఒక్కముక్క అయినా వచ్చేదికాదు. అతనుఎయిర్‌క్రాఫ్ట్ మెకానిక్. కాని అతణ్ణి మేము ఆ పనిలో ఉపయోగించుకోలేకపోయాం. సెంట్రీ డ్యూటీ చేయడం అతని జీవితంలో ఇదే తొలిసారి. ఆ పని అతడికి అలవాటులేకపోవడంచేత, మనిషి అలసిపోయి, కంగారుపడిపోయి, అలా నిలబడి, అక్కడ పడివున్న చెట్టుకొమ్మ ఒకటి తీసి, తన చాకుతో దానిని ఓ చేతికర్రలా చెక్కుతూ, సెంట్రీ పాటించవలసిన నిబంధనలను ఆ విధంగా అతిక్రమించేవాడు. ఒకసారి అతని కమాండరు అతణ్ణి డ్యూటీనుంచి రిలీవ్‌చేయడం మరచిపోయాడు. ఇహదానితో అతడు పూర్తిగా బేజారెత్తిపోయాడు. మేము అతని గురించి ఆలోచించి, అక్కడకు రాబోయే తొలి విమానంలోనే అతడు మాస్కో తిరిగివెళ్ళిపోవడం మంచిదని అతనికి

సూచించాం. రీవస్ అందుకు ఒప్పుకున్నాడు, కాని ఎవ్వరూ అనుకోనని సంగతి ఒకటి జరిగింది. దానితో అతని జీవితం అంతా పూర్తిగా మారిపోయింది.

క్యాంపులో కామ్రేడ్ ఒకడు చెడిపోయిన సబ్‌మెషీన్‌గన్ను ఒకదానితో తంటాలు పడుతూండడం, ఎలాగో మరి, రీవస్ కంటబడింది. రీవస్ అక్కడకువెళ్ళి, ఆ సబ్‌మెషీన్ గన్నుని చూసి, తలవూపి :

"అచ్చచ్చా! మరమ్మతా ?" అన్నాడు.

"'అచ్చచ్చా' అంటావేమిటి? దీని సిగదరగా! దీన్ని మరమ్మతు చేయడమెలాగో నా కసలు అర్థమే కాకుండా వుందే!" అన్నాడు ఆ మనిషి చికాకు పడుతూ.

"ఏయ్! మరమ్మతు చేస్తా!" అని, రీవస్ ఆ సబ్‌మెషీన్‌గన్నుని తీసుకుని చూశాడు.

దాని డిస్క్‌స్ప్రింగు విరిగిపోయింది. బుర్కి-స్నోవిదోవిధ జంక్షన్ దగ్గర జరిగిన యుద్ధంలో మాకు విజయచిహ్నాలుగా దొరికిన వస్తువులలో గ్రామఫోను ఒకటి కూడా వుంది. ఈ గ్రామఫోనుకున్న స్ప్రింగును రీవస్ ఊడతీసి, ఆ సబ్‌మెషీన్‌గన్నుకి అమర్చాడు. అది మళ్ళీసరికొత్తదానిలా తయారైంది.

దీనితో రీవస్ ఎదుట నూతన జీవితం ఆవిష్కృతమైంది. కామ్రేడ్లు రీవస్ కోసం వెతుక్కుంటూ అతనిదగ్గరకు రావడం మొదలుపెట్టారు. అతనికోసమని స్క్రూట్లు వైస్‌పటకార్లూ, కత్తెర సుత్తులూ, ఆకురాళ్ళూ సంపాదించి, అతనికిచ్చారు. మరి నాలుగు రోజులకల్లా ఆ మనిషి వెనకటిమనిషి కానేకాడనిపించింది : రంపంతోనూ, డ్రిల్లుతోనూ, ఉలితోనూ రోజ స్తమానమూ ఏదో ఓపనిలో మునిగివుండేవాడు. తుప్పుపట్టిపోయినబోల్టుని, ఇతర పనిముట్టు ఏదీ లేకుండానే, కేవలం ఒక్క ఆకురాతితోనే అసలైనమెషీన్‌గన్ను స్ట్రైయికర్‌గా తయారుచేశాడు—దీనికి ఫ్యాక్టరీలో తయారైన వస్తువుకీఏమీ తేడా లేదు.

రీవస్ ముఖానికి కళ వచ్చింది. మనిషి నవ్వుతూ సరదాగా తయారయ్యాడు. కాస్త వొళ్ళుచేయడం కూడా మొదలెట్టాడు. ఒక చిన్న పెట్టెనిండా పనిముట్లు పెట్టుకుని, పెట్టెచేతబట్టుకుని ఉదయానే తన గుడారంలోనుంచి బయటకు వచ్చి, ఆయుధాల మరమ్మతు ప్రారంభించేవాడు. "ఖాతాదార్లు" చాలామందే గనుక వుండిన పక్షంలో, నెగడి వెలుగున రాత్రిపూట కూడా పనిచేసేవాడు. ఆ తరువాతి రోజుల్లో తనకోసమని చిన్న దీపం తయారు చేసుకున్నాడు. దీన్ని తన స్పానిష్

భాషలో "మరిపోసా" అనేవాడు. "మరిపోసా" దీపం వెలిగేందుకు కిరసనాయిలు లేకపోవడం చేత, అందుకు బదులు గుర్రపు కొవ్వో, గొడ్డు కొవ్వో ఉపయోగించే వాడు. ఎందుకూ పనికిరావని మామూలుగా పారవేసే ఆయుధాలను రివస్ మరమ్మత్తు చేసేవాడు, అవి "సర్వీసులోకి తిరిగి వెళ్ళిపోయేవి."

"ఆ మనిషి చేతిలో గొప్ప విద్యవుందండీ!" అని అతని గురించి అనే వారు గెరిల్లాలు.

వారి మాటలు అక్షరాలా నిజం—ఏ వస్తువు పాడైపోయినా సరే, అతడు ఇట్టే మరమ్మతు చేసేవాడు.

"రివస్! నా వాచీ ఆగిపోయిందోయ్!"

"మరమ్మతు చేస్తా!"

"రివస్! నా సిగరెట్ లైటరు వెలగడం లేదోయ్!"

"మరమ్మతు చేస్తా!"

కొన్ని రోజులు పోయిన తరువాత విమానం వచ్చింది. విమానంవచ్చింది కదా, మాస్కో వెళ్ళిపోతావా?—అని రివస్‌ని అడిగేసరికి మనిషి హడలిపోయాడు:

"లేదు, లేదు. నేను పనికొస్తున్నాను. మరమ్మతు!" అని చేతులు వూపుతూ గోల పెట్టాడు

ఈవిధంగా మా డిటాచ్‌మెంటుకి ఆయుధాలు బాగుచేసే కమ్మరిదొరికాడు.

మా దగ్గర ఫీల్డ్ వంటపొయ్యిలు లేవు. వంటవాళ్ళు లేనేలేరనుకోండి నిజం చెప్పాలంటే, మేం అక్కడకు వచ్చినప్పుడు మా దగ్గర ఆహారపదార్థాలే లేవు. పల్లెటూళ్ళలో రైతులు దయతలచి ఏమిటి ఇస్తే అదే తిని కాలక్షేపంచేసేవారం.

ఆహారపదార్థాల పంపిణీ గురించి మేం ఏర్పరచుకున్న నిబంధనను అతి కఠినంగా పాటించేవారం. మా స్కౌట్లు తీసుకొనివచ్చే వస్తువులు యావత్తూ, చిట్ట చివరి గింజకూడా, సప్లై ప్లటూనుకి ఇచ్చివేయబడాలి. ఈ ప్లటూనే వాటిని పంపిణీ చేస్తుంది. ఏ వస్తువైనా సరే ఏ కామ్రేడూ తన సొంతానికి ఉపయోగించుకుందుకు వీల్లేదు.

ప్రతి యూనిట్టుకి వంటసాల వుండేది – మెడికల్ కోర్, హెడ్‌క్వార్టర్స్ స్టాఫ్, రేడియో ఆపరేటర్లు, స్కౌట్లు—వీరందరికీ సమిష్టిగా ఒక వంటసాల వుండేది.

హెడ్‌క్వార్టర్సు వంటకి ఒక వంటవాడున్నాడు. అతడు కజఖ్‌స్థాన్ మనిషి. పేరు దార్‌బేక్ అబ్దుయిూమొవ్. అతడు తన సొంత "వ్యంజనం" ఒకదానిని ఒక ముద్దను-సృష్టించి వడ్డించేవాడు. మాంసాన్ని నీళ్ళలో ఉడికించి, మాంసం తీసేసి, ఆ మాంసపు సూప్‌లో గోధుమపిండి కలిపేయడం. అదంతా ఒక జిగురు ముద్దలా తయారవుతుంది. దానికి మేం హాస్యానికి, "కజఖ్‌స్థాన్ జావ" అని పేరు పెట్టాం. మాంసపు ముక్కలు నంజుకుని ఆ ముద్ద తినేవారం—మా దగ్గర బ్రెడ్డు అసలు లేదు.

గోధుమపిండి బొత్తిగా లేనప్పుడు—ఇది తరుచుగానే సంభవించుతూండేది—ఆ సూప్‌లో ఉర్లగడలు ఉడికించి, వాటిని ముద్దచేసేవారం.

ఇహ గోధుమపిండీ, ఉర్లగడ్డలూ రెండూ లేనప్పుడు పొలాల్లో కోతకి సిద్ధంగా వున్న గోధుమను గానీ, "రై" ని గానీ కోసుకొచ్చి వాటిని వండుకునే వారం. గింజలను నీటిలో పోసి, వాటిని రాత్రి అంతా నెగడిమీద ఉడకబెట్టేవారం. అయినప్పటికీ గింజ పూర్తిగా మెత్తబడేదికాదు.

మాకు గోధుమపిండి అందిన తరువాత దానితో బ్రెడ్డు బదులు, పలచని రొట్టెలు కాల్చుకున్నాం. ఈ రొట్టెలను తయారుచేయడంలో దార్‌బేక్ అందెవేసిన చేయి. పిండి వొత్తి పెనంమీద వుంచి, పెనంపైన మరొక పెనం బోర్లించి, వాటిని నివ్వుల్లో వుంచేవాడు. రొట్టె వుడికి భేషైన "కజఖ్‌స్థాన్ రొట్టె" తయారయ్యేది.

అక్కడ మొలుస్తూన్న "పచ్చిక" చాలా ఉపయోగపడింది. పుట్ట కొక్కులూ, స్ట్రా బెర్రీలూ, బిల్‌బెర్రీలూ అడవిలో పుష్కలంగా వున్నాయి. వీటిని ఏరి, పోగుచేసే పనిని యూనిట్లు అర్గనైజుచేశాయి. బిల్‌బెర్రీలను కోసుకుని తినడంలో చేతులూ, మూతులూ పళ్లూ, నాలుకలూ కారునలుపెక్కిపోయేవి బిల్‌బెర్రీలను మెస్ దబ్బాలలో పోసి, నిప్పులమీద కొద్దిగా "ఉడికించే" సరికి, అదొకరకం జామ్‌లా తయారయ్యేది. శత్రువుపై దాడిచేసినప్పుడు, మాకు సాకరిన్ దొరికినప్పుడల్లా, సాకరిన్ని బిల్‌బెర్రీ జామ్‌లో కలిపేసరికి, టీ తాగేటప్పుడు మంచి ఫలహారం కింద ఉపయోగపడేది. టీ కాచుకుందుకు మాకు తేయాకు లేకపోవడంచేత, మరుగు నీళ్ళలో ఆకులూ, పువ్వులూ పడేసి, టీ బదులు ఆ కషాయమే తాగేవారం.

* * *

మరికొద్ది రోజుల్లోనే మా క్యాంపుకోసం మరో కొత్త జాగా చూసుకోవలసి వచ్చింది. నెగళ్ళ పొగకి, ఆహారపదార్థాల వాసనకి, బయట పారవేసిన చెత్తకి అక్కడ కాకులు చేరసాగాయి. కాకులు అక్కడ ఎగురుతూండటంవల్ల శత్రువుకి

ా అమ్మాకి తెలిసిపోతుందని భయపడ్డాం. ఇదే కాకుండా, అక్కడి నూతిసీళ్ళు ుంచివి కాకపోవడంతో, క్యాంపును మరొక చోటకు మార్చాల్సిందేనని డాక్టర్ ్సెస్పార్స్కియ్‌కి పట్టుపట్టాడు. అక్కడనుండి ఇరవై కిలోమీటర్ల దూరంలో ున్న మరొక చోటకి మారడానికి నిశ్చయించుకున్నాం. తరువాతి రోజుల్లో అనేక ారణాలవల్ల మేము తరుచు క్యాంపు మార్చుతూండడంచేత, "బసల" మార్పులకు ుం అలవాటుపడిపోయాం.

క్యాంపులో త్సెస్పార్స్కియ్‌కి చేతినిండా పనివుండేది. ఆస్పత్రి గుడారాల ార్పాట్లన్నీ సరిగా వున్నాయో లేదో చూస్తూండేవాడు, గాయపడినవారికి చికిత్స స్తూండేవాడు, శిబిర పారిశుధ్యంపై అజమాయిషీ చేస్తూండేవాడు, చుట్టుపక్కల ్రామాలకు వెళ్ళి అక్కడి రోగులకు మందులూ మాకులూ ఇచ్చేవాడు, అన్ని నులూ వేళ ప్రకారం చేసేవాడు.

గెరిల్లాలకు త్వరలోనే అతనిమీద గౌరవం ఏర్పడింది. అతనిది చల్లని యి అని అందరికీ గొప్ప నమ్మకం కుదిరింది. క్షతగాత్రులనూ, రోగులనూ అతడు ంతో చక్కగా ఆదరించేవాడు.

రష్యన్ భాష ఒక్క ముక్క అయినా ఎరగని ఫ్లోరెకాక్స్ గాయపడి ప్పుడు, అతని గాయాలను గురించి అతనితో త్సెస్పార్స్కియ్ సంజ్ఞలతోనూ ిభినయంచేసీ బోధపరచి చెప్పి, తను మళ్ళీ బలికి బట్టకట్టగల్గుతాననే నమ్మకమే ాకుండా, తను మళ్ళీ గొప్ప సైనికుడను కాగలననే ఆత్మవిశ్వాసం కూడా అతనిలో ల్గించాడు.

కోస్త్య పస్తనోగావ్ చెయ్యి విరిగినప్పుడు, త్సెస్పార్స్కియ్ స్వయంగా ాదేశాలు ఇస్తూ, అక్కడే నుంచుని చెక్కబల్లలను చిత్రికపట్టించి స్ప్లింట్స్ తయారు ాయించి, అవి వేసి కోస్త్య చేతికి కట్టుకట్టాడు. విరిగిన ఎముక అతుక్కుని, మరికొద్ది ోజులకే కోస్త్య రివాల్వరును ఉపయోగించగల్గాడు.

"మరి నాల్గురోజులకల్లా మనం మెడికల్ జిమ్నాస్టిక్స్ మొదలెట్టామంటే, ు చెయ్యి ఇహ మామూలుగా అయిపోతుంది" అని డాక్టరు ధైర్యంచెప్పి కోస్త్య ునసు కుదుటపరచాడు.

సమర్థుడూ అనుభవజ్ఞుడూ అయిన డాక్టరు గురించి మనం చెప్పుకుంటూ ున్నప్పుడు, ఆ డాక్టరు వయస్సుమళ్ళినవాడనీ, చక్కని పిల్లిగడ్డం వుంటుందనీ. ుళ్ళద్దాలపైనుండి రోగికేసి కరుణారస వీక్షణాలను ప్రసరించుతూన్న వ్యక్తి అ

అతన్ని మన మనస్సులో మనం సాధారణంగా చిత్రించుకుంటాం. త్సెస్సార్‌స్కీయ్ విషయంలో ఈ చిత్రణ అసలు నప్పనే నప్పదు.

అల్బర్ట్ త్సెస్సార్‌స్కీయ్ వయస్సు ఇరవైఒక్కయేడు. యుద్ధం మరొక నెలలో మొదలవుతుందనగా అతడు మాస్కోలో ఒక మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లో చదువు పూర్తి చేశాడు. అతడు స్కిఫ్లొసోవ్‌స్కి ఇన్‌స్టిట్యూట్‌లో శస్త్రచికిత్స నేర్చు కున్నాడు. యుద్ధం ప్రారంభమవగానే, తనను యుద్ధశ్రేణికి పంపించవలసిందని త్సెస్సార్‌స్కీయ్ మాస్కో కొమ్‌సొమోల్ కమిటీకి దరఖాస్తు పెట్టుకున్నాడు. జూలైలో అతణ్ణి మాస్కో గారిజన్‌లో ఒక యూనిట్టుకి పంపించారు.

మా డిటాచ్‌మెంటు ఏర్పడుతూన్నప్పుడు, త్సెస్సార్‌స్కీయ్ స్నేహితులు కొందరు ఇందులో చేరుతామని స్వచ్ఛందంగా ముందుకొచ్చారు. తన స్నేహితుల దగ్గరనుండి త్సెస్సార్‌స్కీయ్ నా టెలిఫోను నంబరు తెలుసుకొని, నాకు టెలిఫోను చేశాడు. ఫలానారోజున కలుసుకుని మాట్లాడుకుందుకు నిశ్చయమైంది. ఆ రోజున నా దగ్గరికి వచ్చాడు—పొడగరి, స్ఫురద్రూపి, నల్లని జుట్టు, యువకుడు.

"కామ్రేడ్ మెద్వేదెవ్! మీ గెరిల్లా గ్రూపులో నన్ను కూడా చేర్చుకుని, నన్ను రియర్ యూనిట్టునుండి బదిలీ చేయించండి" అన్నాడు.

"మీరు ఏమి పనిచేయగలరు?"

"నాకు ఫీల్డ్ సర్జరీ తెలుసును. జర్మన్ మాట్లాడగలను."

"సర్జనూ, జబ్బులన్నీ కుదర్చగల వైద్యుడూ, ధైర్యశాలైన సైనికుడూ—ఈ ముగ్గురి పనులూ చేతనైన మనిషి మాకు కావాలి."

"ఎవరిని గురించి వారు చెప్పుకోవడం కష్టం. కాని మీ డిటాచ్‌మెంటులో వున్న బజానొవ్, స్మ్యయిలోవ్‌స్కీయ్ గార్లను నా గురించి వాకబుచేయండి."

వెంటనే ఒక దరఖాస్తు రాయమని త్సెస్సార్‌స్కీయ్‌తో చెప్పాను. నేను ఆ దరఖాస్తు తీసుకుని త్సెస్సార్‌స్కీయ్ సెర్వుచేస్తూన్న డివిజను కమాండింగ్ జనరల్‌ని వెళ్ళి చూశాను.

"కర్నల్ మెద్వేదెవ్ డిటాచ్‌మెంటుకి బదిలీచేయవలసింది" అని కమాండింగ్ జనరల్ దరఖాస్తుపైన రాశాడు.

దాన్ని పట్టుకుని త్సెస్సార్‌స్కీయ్ తన బదలాయింపును పూర్తి చేయించు కునేందుకు తన డివిజనుకి మంచి సరదాగా విమానంమీద వెళ్ళిపోయాడు.

మేము మరి కొద్దిరోజుల్లోనే బయల్దేరాల్సి వుండెను. అతడు ఒక్క నిమిష మైనా కాలయాపన చేయలేదు. తనకు అవసరమవుతాయని తాను అనుకున్న మెడికల్ సామగ్రినీ, శస్త్రచికిత్స సాధనాలనూ జాగ్రత్త చేసుకున్నాడు. ఆపరేషన్లకి హాజరయ్యాడు, అనుభవజ్ఞులైన సర్జన్లను సలహా అడిగాడు. వైద్యగ్రంథాలు తిరగవేశాడు-ఇన్ని పనులూ చేస్తూనే యుద్ధానికి తయారీలో వుండేందుకు అవసరమైన తర్ఫీదు-తనూ కదమ అందరితోనూ కలిసి తాను కూడా పొందాడు.

అతడు నాతో కలిసి విమానంమీద వెళ్ళాల్సి వుండెను. కాని తోల్ స్తోయ్ లస్ దగ్గర కలాష్నికొవ్ గాయపడ్డాడనీ, వైద్యచికిత్స వెంటనే అవసరమనీ మాకు తెలియగానే, నేను త్సెస్సార్‌స్కియ్‌ని పిలిచి :

"మీరు ఈవేళ బయల్దేరగలరా?" అని అడిగాను.

అప్పటికప్పుడే సాయంకాలం అవుతూంది.

"ఏ నిమిషం బయల్దేరమన్నా నేను సిద్ధమే" అన్నాడు త్సెస్సార్‌స్కియ్.

"మరి రెండు గంటల్లో మీరు బయల్దేరండి."

"సరేనండి."

మా డిటాచ్‌మెంటులో చేరేముందు కొద్దిరోజుల క్రితమే అతడు పెళ్ళిచేసుకున్నాడు. భార్యకు వీడ్కోలు చెప్పడానికని అతడు ఇంటికి పరుగెత్తాడు, కాని ఆమె ఇంట్లో లేదు, ఎక్కడికో వెళ్ళింది ఆమెను చూడకుండానే అతడు ఇంటినుండి తిరిగి వచ్చేశాడు.

త్సెస్సార్‌స్కియ్ అలసట అంటే ఏమిటో ఎరగని మనిషి. ఎప్పుడూ ఏదో పనిలో మునిగే వుంటాడు, ఎవరికో వొకరికి ఏ సాయమో చేస్తూనేవుంటాడు. ఎప్పుడూ ఏ పనిమీదో అలా తిరుగుతూనే వుంటాడు.

ఎండ అయేది, వాన అయేది, వాతావరణంతో నిమిత్తం లేకుండా, ప్రతి దినమూ ఒక్కొక్క యూనిట్టు మనుషులనూ షర్టులు విప్పించేసి వారిని తనిఖీచేసేవాడు. చెవులు శుభ్రంగాలేనివారినీ, చేతులు మురికిగా వున్నవారినీ చీవాట్లుపెట్టి వెంటనే వెళ్ళి కడుక్కు రమ్మని పంపించేసేవాడు. ఒక్క మనిషి వంటిమీద ఒకే ఒక పేను కనబడినాసరే, మనుషులందరినీ, యావత్తు డిటాచ్‌మెంటునీ, మళ్ళీ నిర్బంధంగా స్నానంచేయించేవాడు. వెచ్చగావున్న రోజుల్లో అందరూ ఏట్లోనో, నూతి దగ్గరో స్నానంచేసేవారు. చలి ఆరంభించగానే, నెగళ్ళమీద వెచ్చచేసిన నీళ్ళతో నిప్పుసెగ దగ్గరనే స్నానం చేసేవారు.

గెరిల్లాలు ఏమీ మూలిగేవారుకారు : ఒకసారి త్సెస్పార్స్కీయ్ ఏదైనా చెప్పాడంటేసరి—ఇహ దానికి తిరుగులేదు, అంతే! చుట్టుపక్కల గ్రామాలలో టైఫస్ జ్వరమూ, నులిగడుపూ స్వైరవిహారం చేస్తూన్నప్పటికీ, మా క్యాంపులో దీనంతటి ఫలితంగా ఒక్కరికైనా సరే ఈ జబ్బులు సోకలేదు.

మేమింకా మా గమ్యస్థానానికి మార్చిచేస్తూ వున్న రోజుల్లోనే "మనం జయించి తీరతాం" అనే మా డిటాచ్‌మెంటు పత్రికను మేం ప్రారంభించాం. ఆ పత్రికకు త్సెస్పార్స్కీయ్ క్రమశః వ్యాసాలు రాసేవాడు. పత్రికను మామూలు స్కూలు డ్రాయింగు బుక్కు కాగితాలమీద రాసేవారం. ప్రతి సంచికలోనూ "వైద్యశాస్త్ర సమస్యలు" అనే శీర్షికతో ఓ మూడుపేజీల వ్యాసం తప్పనిసరిగా వుండేది. తన వ్యాసాలలో త్సెస్పార్స్కీయ్ పారిశుధ్యంకోసం "యుద్ధం" చేసేవాడు.

"వ్యాప్త వ్యాధులపై మనం యుద్ధం ప్రకటించుతున్నాం. ఈ యుద్ధంలో మనకు ఒకే ఒక ఆయుధం వుంది.—అది శుభ్రత. మన శ్రేణులలో అశుభ్రత—దేశద్రోహమే" అని మా డాక్టరు రాశాడు. నాకు బాగాజ్ఞాపకంవుంది—ఒకసంచికలో ఒక వ్యంగ్య చిత్రం వుంది: బాదువనేలలో ఒక పందిపిల్ల నీళ్ళు తాగుతూంది, ఆ బాదువనేలలోనే ఒక గెరిల్లా కూడా నీళ్ళు తాగుతున్నాడు. బొమ్మకింద యీ పద్యం వుంది :

"పందిని పోలిన సైనికుడే
సంకటము తెచ్చిపెట్టు మనకందరకు
దండిగనుండు కుళ్ళునీట క్రిములు,
కంపు, మురికి, సూక్ష్మజీవులు."

పద్యంకింద సంతకంలేదు. కాని అది అల్లినది త్సెస్పార్స్కీయ్ అని నా నమ్మకం. అతడికి పద్యాలు అల్లడమంటే సరదా. కాని పత్రికలో "గంభీర" విషయాలపై తనురాసిన పద్యాలకింద మాత్రమే అతడు తన పేరు రాసుకునేవాడు.

త్సెస్పార్స్కీయ్ గ్రామాలకు తరుచుగా వెళ్తూండేవాడు.

"డాక్టరుని పంపించారు గెరిల్లాలు!" అని ఒకగుడిసెనుండి ఒక గుడిసెకు

కబురు పాకిపోయేది. జబ్బు అనీ, నొప్పి అనీ జనం తండోపతండాలుగా వచ్చిపడే వారు డాక్టరుని చూడ్డానికి.

జర్మను ఆక్రమణకిందవున్న ప్రాంతాల్లో ప్రజలకు వైద్యసహాయమే వుండేదికాదు, చాలామంది జబ్బులతో బాధపడుతూండేవారు. ఆకలికి రోగాలకి ఎందరో ఆహుతైపోయారు. రకరకాల జబ్బులతో తీసుకుంటూన్న వాళ్ళందరూ త్సెస్సార్స్కీయ్ దగ్గరికి వచ్చిపడేవారు.

పిల్లల్ని చూస్తే మరీ జాలివేసేది. సరైన ఆహారం లేకపోవడంతో వాళ్ళని ఏ జబ్బుపడితే ఆ జబ్బే పట్టుకుని పీడించేది. పిల్లల్ని కుక్కగుడ్డల్లో చుట్టబెట్టి చేతుల్లో పెట్టుకుని తీసుకొచ్చేవారు తల్లితండ్రులు.

త్సెస్సార్స్కీయ్ గ్రామాలకు వెళ్ళడం కొద్దిరోజులపాటు ఆలస్యమయ్యే సరికల్లా అతనికోసమని ప్రజలు మా స్కౌట్లద్వారా కబురు పంపించేవారు. ఆ కబురు అందుకొని డాక్టరు వెంటనే అక్కడకు వెళ్ళేవాడు. వెళ్ళి ఎవరిగుడిసెలోనో ఒక గుడిసెలో ఆగి, తన తెల్ల అంగరకా వేసుకుని, ఆ గుడిసెలోనే రోగులనుతనిఖీ చేసి మందులిచ్చేవాడు.

అందరం కలిసి ఇష్టాగోష్టిగా మాట్లాడుకుంటూన్నప్పుడు, తనకు కళ అన్నా, సారస్వతమన్నా ఎంతో అభిలాష అనీ, అందులోనూ ముఖ్యంగా నాటక రంగమంటే మరీ ఆసక్తి అనీ త్సెస్సార్స్కీయ్ తరుచు అంటూండేవాడు.

"యుద్ధం అయిపోయాక నేను ఏదైనా ఒక థియేటర్‌లో చేరుతాను. నటుడుగా వుండాలని వుంది నాకు" అని అతని అనేవాడు.

అతనికి ఎప్పుడైనా సాయంకాలం కాస్త తీరికగా వున్నప్పుడు, గెరిల్లా లందరూ నెగడిచుట్టూ కూచుని వుండగా, త్సెస్సార్స్కీయ్ పద్యాలు చదవడం ప్రారంభించేవాడు. పుష్కిన్, నెక్రాసోవ్, మయకొవ్‌స్కీయ్‌ల పద్యాలను కంఠతా చదివేవాడు. అతని కంఠస్వరం మహామృదువుగా ఎంతో ఇంపుగా వుండేది.

"సోవియట్ ప్యాస్‌పోర్టు గురించి పద్యాలు" అనే మయకోవ్‌స్కీయ్ ఖండకావ్యాన్ని శత్రుశ్రేణి వెనుక ప్రాంతంలో ఎక్కడోవున్న ఈ చోట మేం ఎంతో శ్రద్ధతో విన్నాం :

"నా చేతిలో
 ఈ సోవియట్ ప్యాస్‌పోర్టు వుందని
కొడవలి సుత్తి చిత్రించి వున్న
 ఈ ప్యాస్‌పోర్టు వుందని
ఎంతటి ఆనందంతో
 ఈ సాయుధపోలీసుల జట్టు
 నన్ను చితుకబాది
ముక్కలుకోసి
 శూలారోపణ చేసివుండేదో !"

మరికొంత కాలానికి మాలోనుంచి ఇతర "నటులు" — పాటకులు, ఎకార్డియాన్ వాయించేవాళ్ళు—ప్రత్యక్షమయారు. కాని తొలిరోజుల్లో మా సైనికుల శారీరక బాధనూ, కుటుంబం గురించి బెంగనూ ఉపశమింప జేసేందుకు మాకు కేవలం త్సెస్సార్‌స్కీయ్ ఒక్కడే వుండేవాడు.

## ఘోరమైన "నూతన వ్యవస్థ"

మేము అంతకుముందు పత్రికలలో మాత్రమే చదివిన విషయాలను పశ్చిమ ఉక్రైనియాలోని గ్రామాలలోనూ మేము కళ్లారా చూశాం.

నాజీలు రైతులను నిలువునా దోచుకున్నారు, వారి దగ్గరవున్న తిండి గింజలనూ పశువులనూ పట్టుకుపోయేవారు. ఈ దోపిడీని ప్రతిఘటించినవారిని తుపాకులతో కాల్చివేసేవారు, ఉరికంబాలకు వేలాడదీసేవారు, బతికివుండగానే దహనం చేసేవారు, విషవాయువుతో నిండిన "గదుల్లో"కి తోసివేసి చంపేసేవారు. యువతీ యువకులను జర్మనీకి తోలుకుపోయేవారు. తప్పించుకొనేందుకు దాగున్నవారిని వేట కుక్కలచేత పట్టించేవారు. పట్టుబడినవారిని చితుకబాది జర్మనీకి తోలేవారు, లేదా చావబాది చిత్రవధచేసేవారు.

దీనికి "నూతన వ్యవస్థ" అని వారు పేరుపెట్టారు.

రైతులపైన దుర్భరమైన పన్నులు విధించారు. గుమ్మంలో కాపలావున్న కుక్కకి సహితం మూడువందల రూబుళ్ళ పన్ను కట్టాల్సివచ్చింది. ఆకలి, దారిద్ర్యం, భయంకరమైన రోగాలూ ప్రజలను తుడిచిపెట్టేశాయి. కొన్ని జిల్లాల్లో అసలు వైద్యసహాయమే లేకపోయింది.

ఇది కూడా "నూతన వ్యవస్థే"

పశ్చిమ ఉక్రైనియాలో నాజీలు ఆక్రమించుకున్న ప్రతిపూరిలోనూ ప్రతి పల్లెలోనూ నివసించుతూండిన యూదులందరూ నిర్బంధంగా రిజిష్టరు చేయించ బడ్డారు. వారి ఆస్తులు జప్తుచేసేవారు. నాజీలు అంతటితో ఆగక వారిని రాళ్ళ గనులలో పనికి పంపించేవారు.

రోవ్నొలోనూ, ఆ చుట్టుపక్కల ప్రాంతాల్లోనూ నివసించుతూండిన యూదు జనాభాను నాజీలు, తామిదివరకే తయారుచేసి వుంచుకుని పథకం ప్రకారం, ఆగస్టు చివరి రోజుల్లో నిర్దాక్షిణ్యంగా నిర్మూలన చేసివేశారు. నాజీలు యూదులను పెద్ద పెద్ద గుంపులుగా పోగుచేసి, వారిని పూరి బయటకు తీసుకుపోయి, వారి శవాలను పూడ్చిపెట్టేందుకు వారిచేతనే గోతులు తవ్వించి, వారిని తుపాకులతో కాల్చి చంపేశారు. కాల్పులకు చనిపోయినవారెవరో, గాయపడి ఇంకా బతికివున్న వారెవరో చూడకుండానే అందరినీ ఆ గోతుల్లోకి ఈడ్చేసి పూడ్చిపెట్టేశారు.

ఆ నరభక్షకులు ఎవ్వరినీ వదిలిపెట్టలేదు—వృద్ధులనూ వదిలిపెట్టలేదు' పసికందులనూ వదిలిపెట్టలేదు.

ఏ కొద్దిమంది మాత్రమో తప్పించుకుని పారిపోగల్గారు. పారిపోగల్గారే కాని, వారి ప్రాణాలకు మాత్రం రక్షణలేకపోయింది. యూదులకు సాయంచేసిన వారిని చంపిపారేస్తామని జర్మన్లు ప్రజలను హెచ్చరించారు. ఒక్కొక్క యూదుడ్ని పట్టితెచ్చి తమకు ఒప్పజెప్పినందుకు ఒక్కొక్క కిలోగ్రాము ఉప్పు చొప్పున ద్రోహు లకు బహుమతులిస్తామని జర్మన్లు ప్రకటించారు.

ఇది కూడా నాజీల "నూతన వ్యవస్థ."

ప్రజలు నాజీలను ద్వేషించారు. కేవలం ఎర్రసైన్యం వల్లనే తమకు విముక్తి లభించుతుందని నమ్మి, అందుకోసం వారు నిరీక్షించారు. ఆ కారణంచేతనే గెరిల్లాలమూ, ప్రజల దూతలమూ సోవియట్ ప్రభుత్వ దూతలమూ, అయిన మేము పల్లెలకూ గ్రామాలకూ వెళ్ళినప్పుడు అక్కడివారు మమ్మల్ని సంతోషంతో కలుసు కునేవారు. కాని, గెరిల్లాలతో సంబంధం పెట్టుకున్నందుకు శిక్ష మరణదండనే. అంతేకాదు, గెరిల్లాలతో సంబంధం పెట్టుకోకపోయినా సరే, వారి జాడ తెలిసివుండ డమూ, తెలిసివుండి కూడా వారిని పట్టి ఇవ్వకపోవడమూ — ఇందుకు కూడా శిక్ష మరణదండనే. తమ కిరాతకానికి తగిన శిక్ష తాము అనుభవించే సమయం ఆసన్న మవుతూందని దురాక్రమణదారులు అప్పట్లో ఏ మాత్రమూ అనుకోలేదు.

ఫాసిస్టుల ఘాతుకాలను వివరించుతూ, జర్మన్ ప్రధాన యుద్ధనేరస్థులపై జరిగిన విచారణను ప్రదర్శించినట్టి "ప్రజాన్యాయం" అనే సినిమా చిత్రాన్ని నేను

చూసినప్పుడు, 1942 లో కాస్త్రోపోల్, లూద్విపోల్, రకితొన్నాయె, సార్ని ఇంకా పశ్చిమ ఉక్రైనియాలోని ఇతర జిల్లాలలోనూ, నగరాలలోనూ నేను కళ్ళారా చూడని కొత్త విషయాలేవీ అందులో లేవనే నాకనిపించింది.

రక్తసిక్తమైన బాధలను అనుభవించుతూన్న దేశాన్ని దోచుకుంటూ శత్రువులు సౌఖ్యంగా జీవించారు. జర్మన్ ఉద్యోగులు తమ భార్యలనూ, బంధువు లందరనూ రప్పించారు, పట్టణాలలోనూ గ్రామాలలోనూ వున్న మంచి ఇళ్ళను ఆక్రమించుకున్నారు. ఉద్యోగుల్లో చాలామందికి ఎస్టేట్లకు ఎస్టేట్లు ముట్టాయి. వారి కోసమని మన రైతులు ఈ భూములు దున్నాల్సివచ్చింది.

"నూతన వ్యవస్థ"కి ఆధారం నాజీ సన్నీలూ, సబ్ మెషిన్ గన్నులూ, ఉరికంబాలూనూ కాని "నూతన వ్యవస్థకు" తోడ్పడినట్టీ, నాజీ ఘాతుకాలకు ఊత ఇచ్చినట్టీ ద్రోహులు రష్యన్లలోనూ ఉన్నారు.

యుద్ధానికి బాగా ముందుగానే ఉక్రైనియన్ జాతీయవాదులను తమ ఏజంట్లుగా జర్మన్లు నియమించి వీరిని దొంగచాటుగా సోవియట్ యూనియన్‌లోకి పంపించారు గూఢచారులూ,దేశద్రోహులైన వీరు వెనుకటికులాకోలనూ, నేరగాళ్ళనూ రౌడీ ముఠాలుగా ఆర్గనైజు చేశారు ఇహ యుద్ధం మొదలవగానే ఈ ముఠాల మను షులు సమిష్టిక్షేత్రాలను దోచుకోవడమూ, కమ్యూనిస్టులనూ, కొమ్‌సొమోల్ సభ్యు లనూ, సమష్టి క్షేత్ర కార్యకర్తలనూ హత్యచేయడమూ మొదలెట్టారు. వీరు "మహా మహుడు హిట్లర్"కి అనుకూలంగానూ, రష్యాకి వ్యతిరేకంగానూ, సోవియట్ ప్రభు త్వానికి వ్యతిరేకంగానూ ప్రజలలో ప్రచారం సాగించారు.

పశ్చిమ ఉక్రేనియాను జర్మన్లు ఆక్రమించుకున్న తరువాత, ఈ దేశ ద్రోహులలో కొందరు నాజీపోలీసు బలగాల్లో చేరారు. కడమవారు రౌడీముఠాల్లోనే వుండి, ఘాతుకాలు సాగించుతూనే వచ్చారు. వీరికి జర్మన్లు ఆయుధాలు ఇచ్చి గెరిల్లాల మీదకి పంపుతూండేవారు.

ఒక రోజున మేము సార్ని అరణ్యాలకి వెళ్తూండగా ఒక జనవాసానికి జనవాసమూ తటాలున ఎదురైంది. అందులో వున్నవారందరూ ఇదివరకు ఒక పెద్ద గ్రామంలో నివసించుతూండేవారట. ఇప్పుడు వారందరూ ఇక్కడ గుడిసెలూ, పాకలూ వేసుకుని వుంటున్నారు. ఆ గ్రామానికి చెందిన పెద్ద సమష్టి క్షేత్రపు అధ్యక్షుడు, అరవైయ్యేళ్ళ వృద్ధుడు, ఆ సమష్టి క్షేత్రం అనుభవించిన అష్టకష్టాలను మాకు వివరించాడు. సమష్టి క్షేత్రపు ఆస్తి అంతా దోచుకొని తీసుకుపోయారట,

చాలామందిని చంపేశారట, ఎంతోమందినో జర్మనీకి పంపించేశారట. కదమవారిని రక్షించడానికని అతడు వారనందరినీ అడవిలోకి తీసుకువచ్చేశాడట.

ఇదంతా చెబుతూన్నప్పుడు అతడు పలుసార్లు "హైదమాక్"ల గురించి చెబుతూ వచ్చాడు.

"ఎవరు వీళ్ళు!" అని మేం అడిగాం.

"వీళ్లెవరో మీకు తెలియదూ? అదేమిటి!" అని అతడు ఆశ్చర్యపోయాడు. "వాళ్ళు దేశద్రోహులు, గొంతుకలుకోసే వెధవలు, రాక్షసిముండాకొడుకులు. ఇదిగో, వాళ్ళ దినపత్రిక. తాము హిట్లర్‌కి ఎలా అమ్ముడుపోయినదీ ఆ వెధవలు వాళ్లంతట వాళ్ళే ఎలా రాసుకుంటున్నారో చూడండి!" అన్నాడు.

"హైదమాక్" అని పేరుగల వార్తాపత్రిక సంచికలను కొన్ని ఆ ముసలాయన మాకు చూపెట్టాడు. ఒక సంచిక తీసి చూశాను. అందులో ఈ వాక్యం నా కంటబడింది.

"ఇష్టముంటే జల్సాచేసుకో-దోపిడి సాగించు, స్వతంత్రంగా సంపాదించుకుంటానంటే నిన్ను వద్దన్నవాడెవడు? ఏం ఫర్వాలేదు..."

ఈ "హైదమాక్" బందిపోటు దొంగలు నాజీల అనుగ్రహం సంపాదించడానికని నానా తంటాలూ పడుతున్నారు. వారి "స్వామిభక్తిపరాయణత"కు ప్రతిఫలంగా, వారిని ప్రజలమీదపడి దోచుకోమన్నారు నాజీలు. ఈ బందిపోటుదొంగలు ఏమి చేసినా ఎవ్వరూ నోరెత్తడానికే వీల్లేకపోయింది!

ఈ నాజీ "నూతన వ్యవస్థ"కి వీరు పట్టుగొమ్మలు.

నిరాయుధులై శాంతియుతంగా జీవించుతూన్న ప్రజలపైబడి దోచుకోవడంలో శౌర్యపరాక్రమాలను ప్రదర్శించిన యీ బందిపోటు దొంగలు "గెరిల్లా" అనే మాట తమ చెవినిబడేసరికల్లా పిరికితనంతో గజగజ వణికిపోయేవారు.

బుద్కీ-స్నొవిదోవిచి జంక్షన్ యుద్ధం జరిగిన మరికొద్దిరోజులకల్లా ఒక వేయిమంది గెరిల్లాల వరకూ ఆ జిల్లాలో అగపడ్డారనే వదంతి ఆ చుట్టుపక్కలంతా వ్యాపించి పోయింది. ఆ ప్రాంతంలోని పరిస్థితులను గురించి సమాచారం సేకరించవలసిందిగా మా గ్రూపులను పంపించడం ఎప్పుడైతే ప్రారంభించామో, ఇహప్పుడు ఈ వదంతులు మితిమేరలు లేకుండా పెచ్చుపెరిగిపోయాయి. ఏకంగా ఒక గెరిల్లా

సైన్యానికి గెరిల్లా సైన్యమే అరణ్యంలో పొంచి వుందని ప్రజలు చెప్పుకోవడం మొదలెట్టారు.

అప్పుడప్పుడు మా కోసం విమానాలు ఆయుధాలనూ, మందుగుండు సామగ్రినీ, ఆహారపదార్థాలను పడవేస్తూండేవి. ఈ విమానాలు సహజంగానే ప్రజలకు అగుపడేవి. ఇవి అగుపడడంతో, బ్రహ్మాండమైన గెరిల్లాసేన ఒకటి అక్కడ వున్నదనే పుకార్లు ఆ జిల్లా అంతటా మరింత దృఢంగా నాటుకుపోయాయి.

జర్మన్లకి కంగారెత్తింది స్పెషల్ సైనికబలాలనూ,ఆయుధాలనూ పంపించాల్సిందని కోరుతూ కబుర్ల మీద కబుర్లు రోవ్నో చేరాయి. ఈ సహాయం కోసం ద్రోహాలు నిరీక్షించుతూ తాత్కాలికంగా బయటికి రాకుండా దాగున్నారు.

ఈ లోపున మా పనులు మేం మరింత చురుకుగా సాగించాం.

గెరిల్లా సైన్యం అక్కడ అగుపడిందనే వదంతి కేవలం అబద్ధంకాదు. మేము వందమందమీ, రెండువందలమందిమీ కాదు–అబ్బో, అంతకంటె ఎంతో హెచ్చు. వాస్తవానికి, స్థానిక ప్రజలందరూ గెరిల్లాలే మాకు సహాయం చేసేందుకూ, లేదా జర్మన్లకి హానిచేసేందుకూ తనకు దొరికిన రవంత అవకాశాన్ని సహితమూ వినియోగించుకో గల్గిన ప్రతి సోవియట్ పౌరుడూ ఒక్క నిమిషమైనా వెనుదీయకుండా ఆ అవకాశాన్ని వినియోగించుకున్నాడు. ప్రజలకు నాజీలపై బద్ధవైరం పుట్టిపోయింది. ఇందులోనే వుండెను మా బలం కూడా.

కేవలం మా డిటాచ్‌మెంటుతోనే మేం ఏ కార్యానికైనా ఉపక్రమించి వుండిన పక్షంలో, మేం ఏమీ చేయలేకపోవడమే కాకుండా, మేం త్వరలోనే జర్మన్లకి దొరికిపోయుండేవారమే. అసలు సంగతి ఏమిటంటే–మాకు సహాయం చేసినవారూ, మమ్మల్ని కాపాడినవారూ ప్రజలే. శత్రుశ్రేణి వెనుకప్రాంతంలో వీరే మా పట్టుగొమ్మ, వీరే మా ప్రాపు.

పది, పదిహేనుగురు గెరిల్లాలతో చౌకీలను పెద్ద గ్రామాల్లో స్థాపించాం, ఈ గెరిల్లా చౌకీలను గ్రామస్థులు సోవియట్ కమాండాంట్ ఆఫీసులు అనేవారు. వారు మిగుల్చుకున్న ఆహారపదార్థాలను మా కోసం అక్కడికి తెచ్చి యిచ్చేవారు.

స్కౌటింగు కార్యకలాపలలో ప్రజలు మాకు సాయంచేసేవారు. కోళ్ళూ, కూరగాయ బుట్టలూ పట్టుకుని వారు పొరుగు పల్లెలకూ, జిల్లా కేంద్రాలకూ, దగ్గరగా వున్న రైల్వేస్టేషన్లకూ అమ్మకానికెళ్తూ, వారు అక్కడ చూసినదీ విన్నదీ తరువాత మాకు చెప్పేవారు.అనుమానానికి ఏవిధంగానూ అవకాశమివ్వని ఆడపిల్లలూ

ముసలమ్మలూ, చిన్నపిల్లలూ ఈ పనిని మరీ చక్కగా చేసుకొచ్చేవారు. స్థానిక వాసులు ప్రజలను ఎరుగుదురు, రోడ్లూ బాటలూ వారికి బాగా తెలుసును. వారు మాకు ఎనలేని సాయంచేసేవారు.

నాజీల "నూతన వ్యవస్థ"లో జోక్యం కల్గజేసుకోవలసిందని జీవితానుభవం మమ్మల్ని ఆజ్ఞాపించింది. మా కార్యకలాపాలను కేవలమూ రికాన్నిసెన్స్ పనికి మాత్రమే పరిమితం చేయడానికి వీల్లేకపోయింది.

నాజీ ఆక్రమణదారుల దురాగతాలనుండి మన ప్రజలను రక్షించే కర్తవ్యాన్ని స్వల్ప కార్యంతో, క్లెసొవా జిల్లాలో వున్న "అల్యాబిన్" ఫారమును తగలబెట్టడంతో మొదలు పెట్టాం. ఈ ఫారమ్ సార్ని పట్నంలో వున్న గెస్టాపో* చీఫ్ సూపరింటెండెంటు, మేనేజర్ ఖిబ్బర్‌ది. ఈ ఫారమ్ మేనేజరు తమను నానాకష్టాలూ పెట్టుతున్నాడని రైతులు మాతో మొరపెట్టుకున్నారు.

మా హెడ్‌క్వార్టర్సు ఇరవై ఐదుగురు గెరిల్లా సైనికులను పషూన్ నాయకత్వంకింద ఒక గ్రూపుగా ఏర్పరచింది. ఈ ఫారముకి ఎట్లా వెళ్ళడమో రైతులే దారి చూపెట్టారు. అందులో ఏర్పాట్లు ఎలా వున్నాయో, ఏవి ఎక్కడ వున్నాయో ఆ వివరాలన్నీ వారే చెప్పారు.

దాడి రాత్రిపూట జరిపాం. ఎస్టేటు కావలిభటులు మమ్మల్ని ప్రతిఘటించేందుకు ప్రయత్నించనే లేదు. వారిని వెంటనే నిరాయుధులను చేసివేయడం జరిగింది. ఇక తెల్లవారేసరికల్లా బ్రెడ్డు, వెన్న, గోధుమనూక, చక్కెర, తేనె, కోడిగుడ్లు, జాతి పండులు—వీటితో నిండిన ఒక బండ్ల వరుస, ఈ బండ్ల వరుస వెనుక ఒక ఆవులమంద మా క్యాంపు చేరుకుంది. మందిలో వున్న ఆవులలో మంచి పాడి ఆవులను రైతులకి యిచ్చివేశాం, కడమ వస్తువులను కూడా వాళ్ళతో పంచుకున్నాం.

ఆహారపదార్థాల సేకరణ కోసం మేం జరిపిన పెద్ద సంగ్రామ చర్యలలో యిదే మొదటిది కాని యిందులో మేం సాధించినది యింత మాత్రమే కాదు.

పషూన్ యిద్దరు బందీలను పట్టుకుని క్యాంపుకి తీసుకొచ్చాడు. ఇద్దరిలోనూ ఒకడు— ఖిబ్బర్ ఫారమ్ మేనేజరు, ఎవడిపైనైతే ప్రజలు ఫిర్యాదు చేశారో ఆ మనిషి. నెమోవిచ్ అనే రెండోవాడు దేశద్రోహి అని తేలింది. జాతిరీత్యా ఉక్రైనియన్ అయిన యితగాడు యుద్ధానికి పూర్వంనుండీ జర్మన్ గూఢచారిగా ఉండేవాడు. గూఢచారులను తర్ఫీదుచేసేందుకు గెస్టాపో స్థాపించిన స్కూలులో యితడు శిక్షణ

* గెస్టాపో—నాజీ జర్మన్ ప్రభుత్వపు రహస్య పోలీసు.—సం.

పొందాడు. నాజీలు వచ్చిన తరువాత, తను ఒక ఉపాధ్యాయుడనని చెప్పుతుంటూ, చిన్నచిన్న బస్తీలలోనూ, గ్రామాలలోనూ తిరుగుతూ, సోవియట్ కార్యకర్తల ఎక్కడైతే వున్నారో ఆచూకీ కనిపెట్టుతూ, వారిని నాజీలకి పట్టి యిస్తూ వచ్చాడు. సోవియట్ యూనియన్‌లోకి నాజీలు రహస్యంగా పంపిన ఏజెంట్లూ యితగాడూ ఒకే గెస్టాపొ ట్రైనింగు స్కూలులో తర్ఫీదు పొంది వుండడంచేత, వాళ్ళలో చాలా మందిని యితగాడు ఎరుగును.

ఇతణ్ణి మాస్కో పంపించడానికి నిర్ణయించాం. అయితే విమానం వచ్చే వరకు యితణ్ణి ఎక్కడ భద్రంగా వుంచడమా అనే సమస్య మాకు ఎదురైంది. ఒక కేన్వాసు సంచి తయారుచేసి, అతన్ని ఆ సంచిలో వుంచాం. అతడి తల మాత్రం పైకి కనబడింది. అతడి తలపైన బూడిదెరంగు టోపీ పెట్టాం.

జర్మన్లు ఆక్రమించుకున్న ఫారములపై వరుసపెట్టి దాడిచేయడం ప్రారంభించాం. ఆ చుట్టుపక్కల జిల్లాలలోని అనేక ఎస్టేట్లనూ, పాలనుండి వెన్న తయారు చేసేందుకు జర్మన్లు స్థాపించిన అన్ని క్రీమరిలనూ ధ్వంసంచేసివేశాం.

తరువాత, రిఖ్టర్‌ని మేం రకరకాలుగా "కాల్చుకున్నాం" : అతడి రెండో ఎస్టేటుని ధ్వంసం చేసేశాం, అతడి మోటారుకార్లు రెండింటినీ పట్టుకుపోయాం. ఇక ఏకంగా అతణ్ణే పట్టుకున్నంత పనిచేశాం. అతగాడు హడలిపోయి, తన సొంత రక్షణకోసమని సైనికబలాలను హుటాహుటిని పంపించవలసిందనీ, లేకుంటే గెరిల్లాలు తనను చంపిపారేస్తారనీ గోలపెడుతూ రోవ్నోకి కబుర్లు పంపించాడు.

రోవ్నో ప్రాంతపు గ్రామాలపైనా,గూడేలపైనా మేం చేసిన మొట్టమొదటి దాడులలోనే మా గెరిల్లాలు ఉక్రైనియన్ జాతీయవాదుల "వీరయోధుల"తో తలపడ్డారు. ఇక సర్వసాధారణంగా అన్ని దాడులలోనూ బందిపోటు దొంగలు పలాయనం చిత్తగించారు.

సంగతులు నవ్వులాటకింద తయారయ్యాయి.

ఒకరోజున మా కొమ్‌సొమోల్ ఆర్గనైజేషను కార్యదర్శి వలెన్‌తీన్ సెమ్యోనొవ్ వీరిచేత మహా బాగా కంగుతినిపించాడు వీరి స్నేహితుడైనట్టు నటించుతూ ఇతడు కొందరు స్కౌట్లను వెంటబెట్టుకొని వీరి ముఠా హెడ్‌క్వార్టర్సుకి వెళ్ళాడు. అక్కడతొమ్మండుగురు హైదమాకీలున్నారు. తమబందిపోటు "నేస్తుల" వార్తాహరుడనని వలెన్‌తీన్ వీళ్ళతో చెప్పాడు. తదుపరి జరిగిన సంభాషణలో, ఆ బందిపోటు దొంగలలో ఒకడు వలెన్‌తీన్ దగ్గర సబ్‌మెషీన్‌గన్ను వుండడం చూసి, అది ఎంతబాగుందో అని ఆశ్చర్యపడ్డాడు.

"దీన్ని ఒక ఎర్ర సైన్యపు కమాండరు దగ్గరనుండి లాక్కున్నాను" అని వలెన్‌తీన్ డాబుకొట్టాడు.

దానికంటె తన తగ్గర వున్నదే మంచిదని మరొక బందిపోటు దొంగ బడాయి పల్కాడు.

"ఛీ, ఛీ! నాదే మంచిది. నాది ఎంత బాగా పనిచేస్తుందో చూపిస్తాను చూడు!" అన్నాడు వలెన్‌తీన్.

అలా అని, తన సబ్‌మెషీన్‌గన్నుని పైకెత్తి ఒక్క రౌండుతో బందిపోటు దొంగలందరినీ అక్కడికక్కడే కాల్చిపారేసి, అక్కడున్న ఇద్దరు సెంట్రీలనూ పట్టుకుని క్యాంపుకి తీసుకొచ్చేశాడు.

ఇంకా ఇరవైయ్యేళ్ళయినా నిండని సెమ్యోనొవ్ పెంకెకుర్రాడిలా అగపడతాడు. కాని నిజానికి అతడు అలుపు, అలసటలు ఎరగని గంభీరుడూ, ఉపాయశాలీ, ధైర్యశాలీ అయిన స్కౌటు. అతడు ఒక వ్యాయామవిద్య ఇన్‌స్టిట్యూట్‌లో చదివాడు. ఒక విధంగా చెప్పాలంటే, కుటుంబ సాంప్రదాయానుసారం గెరిల్లా అయ్యాడు: అంతర్యుద్ధ కాలంలో అతడితండ్రి ఉక్రైనియన్ గెరిల్లాగాపోరాడాడు.

సెమ్యోనొవ్ ఎప్పుడు దాడిమీద వెళ్ళినా ఏదో ఒక జయచిహ్నాన్ని పట్టుకునే తిరిగి వచ్చేవాడు.

"బందిపోటు దొంగలను పట్టుకొచ్చాను" అని ఒకనాడు అతడు నాకు రిపోర్టుచేశాడు.

"ఎలా జరిగిందికదా?" అని నేను ప్రశ్నించాను.

"మమ్మల్ని చూడగానే వాళ్ళు 'త్రిశూలం' సంజ్ఞ చేశారు."

"ఏమిటి?"

"వాళ్ళ రాజలాంఛనం మూడు కోరదంతాలు. వాళ్లు దాన్ని 'త్రిశూలం' అంటారు."

"ఆ సంగతి నాకు తెలుసు. కాని దానికి, దీనికి సంబంధమేమిటో నాకేమీ అర్థంకావడం లేదు."

"మరేంలేదు. వాళ్ళు మమ్మల్ని చూడగానే రెండుచేతులూ పైకెత్తేశారు. పైకెత్తిన చేతులురెండూ, వాటి మధ్యన తలకాయ – త్రిశూలం అయిందిగా!"

ఆనాటినుండి బందిపోటు దొంగలు ఎప్పుడు తొంగిపోయినా, "వాళ్ళు త్రికాలం సంజ్ఞ చేశారు" అనడం గెరిల్లాలకు పరిపాటి అయిపోయింది.

* * *

మా డిటాచ్‌మెంటు దినదిన ప్రవర్ధమానమైంది. సమిష్టి వ్యవసాయదార్లు తమ కొమాళ్ళను మా డిటాచ్‌మెంటులో చేరేందుకు పంపించారు, జర్మన్లకు అగ పడకుండా దాచివేసిన దుస్తులనూ, జోళ్ళనూ తమ కొమాళ్ళకిచ్చి, వారినిదీవించి మా దగ్గరకు పంపించేవారు. అనేక గ్రామాలనుంచి పది, పదిహేను మంది చొప్పున యువకులువచ్చి మా డిటాచ్‌మెంటులో చేరారు పీర,బొల్షియె సెలీశ్ఛ, మాలియెసెలీశ్ఛ వంటి గ్రామాల నుంచి కుటుంబానికి ఒకరుచొప్పున చేరారు.

రేడియో ద్వారా వివిధ యుద్ధ శ్రేణులనుండి మాకు అందిన రోజువారీ ప్రకటనలను స్థానిక ప్రజలకు పంచిపెట్టేవారం. ఇవి ప్రజలలో ఉత్తేజం కల్గించి, అంతిమ విజయం తమదే అనే విశ్వాసాన్ని పటిష్టంచేశాయి.

కొత్త గెరిల్లాలు ఒక నిర్దిత కార్యక్రమాన్ని అనుసరించి ఇరవైరోజుల పాటు శిక్షణ పొందేవారు. అచ్చమైన మిలిటరీ పాఠశాలలలో లాగానే వారు క్యాంపు జీవితం అలవరచుకున్నారు, మిలిటరీ మార్చింగు నేర్చుకున్నారు, అటవీయుద్ధపు ఎత్తుగడలలో తర్ఫీదుపొందారు. ఆయుధాల ఉపయోగాన్ని నేర్చుకున్నారు. శిక్షణ పూర్తి అయ్యాక, వారిని ఒక కమీషను పరీక్షచేసింది. ఆ పరీక్షలో చాలామంది "ప్రథమ శ్రేణిలో" ఉత్తీర్ణులయారు.

గెరిల్లాలు వెళ్ళిచూచిన పల్లెలలోని రైతులు జర్మన్లకు పన్నులు చెల్లించ డమూ, ఆహారపదార్థాలు సప్లైచేయడమూ ఇక మానివేశారు. అంతకుముందు జర్మన్లు హైదమాక్‌ల సాయంతో ప్రజలనుండి సులువుగా పన్నులు వసూలుచేయ గల్గేవారు.ఇప్పుడు పోలీసులు పల్లెల్లోకి వెళ్ళేసరికల్లా. వారికి తుపాకిగుళ్ళు ఎదురవు తున్నాయి.

తమపై నాజీలు విధించిన భయానకమైన "నూతన వ్యవస్థ"ను ప్రజలు గెరిల్లాల సహాయంతో ఈ విధంగా ప్రతిఘటించారు.

గెరిల్లాలపై చర్యతీసుకునేందుకు జర్మన్లకు శక్తిలేకపోయింది. అవకాశం దొరికినప్పుడల్లా జర్మన్లమీదపడి దెబ్బకొట్టేవారం. పరిస్థితులు మాకు అనుకూలంగా లేనప్పుడు మేం ముఖాముఖీ యుద్ధాన్ని తప్పించుకునేవారం. జర్మన్ల స్పెషల్ సైనిక బలాలకు దొరకకుండా తప్పించుకోవడంలో మాకు ఏకష్టమూ వుండేదికాదు.

పీదుమిక్కిలి జర్మన్లు ఏ మాత్రమూ అనుకోని స్థలాలలోనూ సమయాలలోనూ మేం ప్రత్యక్షమయ్యేవారం.

ఈ సందర్భాలకు అనుకూలంగా మాకు కొన్ని గెరిల్లా సూత్రాలు కూడా వుండేవి. వాటిలో ఇవి కొన్ని :

జాగ్రత్తమీద వుండు: నీ కోసమే చూస్తున్నాడు శత్రువు.

నువ్వు భయపడకు: నిర్భయులకు శత్రువే భయపడతాడు.

నువ్వు ఏ చోట అగపడవని శత్రువు అనుకుంటాడో ఆ చోటనే నువ్వు అగపడాలి.

తంత్రం పన్నాలి, శత్రువును తప్పుదారి పట్టించాలి.

అడవిలోకి ఎంత దూరంగా వెళ్తే అంత తక్కువమంది జర్మన్లు ఎదురవుతారు.

## తండ్రీ, కూతురూ

సార్ని రైల్వే జంక్షనులోనూ, క్లేసొవా స్టేషనులోనూ బలమైన జర్మన్ గారిజన్ సేవలున్నాయి. పీక్తొర్ కొచెతోక్వ్ నాయకత్వాన మన గెరిల్లాలు ఒక పెద్ద గ్రూపుగా ఏర్పడి, ఈ రెండు రైల్వేస్టేషన్లనూ కట్టుదిట్టమైన నిగామీద వుంచారు.

ఈ స్టేషన్ల చుట్టుపక్కల జనపదాలను ఎరిగినవారితో పీక్తొర్ సంబంధాలు ఏర్పరచుకొన్నాడు. తమ వంతు పనిగా వీరు సార్నిలోనూ, క్లేసొవాలోనూ వున్న తమ బంధు మిత్రులలో నమ్మకస్థులను కలుసుకుని, వారితో సంబంధాలు పెట్టుకున్నారు. ఈ విధంగా కొద్దికాలంలో కొచెతోక్వ్‌కి చాలామందికి సహాయకులు దొరికారు.

1942 అక్టోబరులో పీక్తొర్‌కి కబురు అందింది-క్లేసొవా ఫారెస్టుఆఫీసులో పనిచేస్తూన్న ఒకానొక మనిషి తనను కలుసుకొన గోరుతున్నాడని, ఈ మనిషిని కలుసుకుందుకు తనకు అభ్యంతరంలేదని పీక్తొర్ తెలియజేసి, అతణ్ణికలుసుకున్నాడు.

"నా పేరు కాన్‌స్తన్‌తీన్ దొవ్గేర్" అన్నాడు అరవైయ్యేళ్ళ ముసలతను ఒకడు తనంతటతానే పరిచయంచేసుకుంటూ.

"మీరు చెప్పబోయేదేమిటి!" అని అడిగాడు కొచెతోక్కొవ్, ఆ మనిషిని అనుమానంతో చూస్తూ.

"నేను చెప్పగల్గేదంతా మీ కష్టదే తెలియనే తెలుసు."

"విషయమేమిటో చెప్పండి"

"విషయమేమిటో చెప్పమంటారా? చెప్తా వినండి. నేను సోవియట్ పౌరుణ్ణి. ఇక్కడ గెరిల్లాలున్నారనే సంగతి వినగానే, మీతో చేరాలని నిశ్చయించుకున్నాను."

"మీరు లేకుండానే మా పనులు మేం చేసుకుంటాం లెండి" అన్నాడు కొచెతోక్కొవ్ కటుక్కున, కట్టెవిరిచి పొయ్యిలో పెట్టినట్టు.

మరి, ఎందుచేతనోగాని, ఈ మనిషి గెస్టాపో ఏజెంటు అనిపించింది కొచెతోక్కొవ్‌కి.

కొచెతోక్కొవ్ ఏమి అనుకుంటున్నదీ దొవ్గేర్ గ్రహించుకోవడంచేత అతడి ముఖం వెలవెలబోయింది.

"నన్ను నమ్మరా? మిమల్ని పట్టి ఇచ్చేస్తాననే మీరు అనుకుంటున్నారా? నాది పెద్ద కుటుంబం–తల్లి, భార్య, ముగ్గురు ఆడపిల్లలు. మీమీద నేను ఏమి ద్రోహం తలపెట్టినా అందుకు వాళ్ళందరూ బాధ్యత వహిస్తారు."

అతడి కంఠస్వరం ఎంత మనఃపూర్వకంగానూ ఎంత కృతనిశ్చితంగానూ ధ్వనించిందంటే, ఇక కొచెతోక్కొవ్ అనుమానం సడలసాగింది.

"కాని, మీకు అప్పుడే వయస్సు మళ్ళిందే, గెరిల్లాలతో కలసి పనిచేయడం మీకు కష్టంకాదూ!" అన్నాడు కొచెతోక్కొవ్.

"తుపాకి పట్టుకుని మార్చి చేయడం, తుపాకి పేల్చడం కష్టమైన పనులే. నాకూ తెలుసును అందునా, నేను ఏనాడూ సైన్యంలో సెర్వీచేయలేదు కూడాను. అయినప్పటికీ నేను మీకు ఇతర విధాల ఉపయోగపడతాను..."

కాన్‌స్తన్‌తీన్ దొవ్గేర్ విప్లవానికి ముందురోజుల్లో ఫారెస్ట్రీ ఇన్‌స్టిట్యూట్‌లో చదువు పూర్తిచేసి, ఉద్యోగంలో చేరాడు. కొన్నాళ్ళకి రోవ్నొలో వున్న క్లేసొవొ ప్రాంతపు అటవీశాఖలో సీనియర్ ఫారెస్ట్ ఆఫీసరుగా పనిచేస్తూ, రోవ్నొ ప్రాంతంలోనే స్థిరపడిపోయాడు. పశ్చిమ ఉక్రైనియా ఎదుర్కొనవలసి వచ్చిన అన్ని అగ్నిపరీక్షలనూ కడమ ప్రజలతో కలిసి ఇతడు కూడా అనుభవించాడు. 1920లో పెట్టుబడిదార్ల సాయుధబలాలను ఉపయోగించి ఈ భూభాగాన్ని మన మాతృదేశంనుండి విడగొట్టేశారు. ఇది జరిగిన పందొమ్మిదేళ్ళ తరువాత, 1939లో,

పశ్చిమ ఉక్రేనియా తిరిగి సోవియట్‌లో చేరింది, పశ్చిమ ఉక్రేనియన్ ప్రజలు సోవియట్ భ్రాతృ కుటుంబంలో అంతర్భాగమయ్యారు. కాని యుద్ధం ప్రజ్వరిల్లగానే ఈ ప్రాంతంలో నాజీ మూకలు ప్రత్యక్షమయ్యాయి.

దొవ్గేర్ సీనియర్ ఫారెస్టు ఆఫీసరు కాబట్టి సోవియట్ గెరిల్లాలు అరణ్యంలో సరిగా ఏచోట వున్నదీ అతడికి ఖచ్చితంగా తెలుసును. అతడు మాతో త్వరగా సంబంధాలు నెలకొల్పుకొన్నాడు. కాని అతణ్ణి పరీక్షకు మొదట లోను చేయనిదే అతనికి ఏ కార్యమూ మేము ఒప్పగించలేకపోయాం. ఇందుకు తగిన అవకాశం త్వరలోనే సంభవించగా, అప్పుడు మేం తెలుసుకున్నాం అతడు నిజమైన సోవియట్ దేశభక్తుడని.

మాపైన దాడిచేయడానికిగాను పంపబడిన స్పెషల్ సేనాబలాలకమాండరు ఇతర ఫారెస్టు ఆఫీసర్లతో పాటు ఇతణ్ణికూడా తన ఎదుట హాజరు కావలసిందని ఆజ్ఞాపించాడు.

"నా విభాగంలో గెరిల్లాలు అసలు మీకు కనబడనే కనబడరు" అని అన్ని ప్రశ్నలకు అతడు ఒకటే జవాబు యిచ్చాడు, "కాని వాళ్ళు 20వ స్క్వేరులో మీకు కనబడితే కనబడొచ్చు."

మేం యిదివరకే క్యాంపు ఎత్తివేసిన స్థలాలను అతడు, మా అనుమతి పొందినమీదట, జర్మన్లకి సూచించాడు. బాడువలతో నిండిన ఆ అరణ్య ప్రదేశాలను జర్మన్లు అదేపనిగా గాలించారు కాని ఏ ఫలితమూ లేకపోయింది కూలిపోతూ కూలిపోతూ వున్న పాకలూ, నెగళ్ళు ఆరిపోగా మిగిలిన బూడిదా బుగ్గి—ఇవి తప్ప వారికి మరేమీ కనబడలేదు.

మరికొద్ది రోజులకి కొచెతోక్ అప్పగించిన మొదటి కార్యాన్ని దొవ్గేర్ నిర్వహించాడు. ఆక్రమణదార్లను గురించి అతడు ఆసక్తిజనకమైన సమాచారం, ముఖ్యంగా రోవ్నొ నగరం గురించి విలువైన భోగట్టా మాకు అందించాడు. జర్మన్ల ప్రధాన కార్యాలయాలు – రైశ్కమిస్సారియాట్*, గెస్టాపొ ఆఫీసులు – ఎక్కడ వున్నాయో, ఉక్రైనియా రాష్ట్రపు రైశ్కమిస్సారూ,** ఉక్రైనియన్ ప్రజాహంతకుడూ ఏరిక్ కోక్ నివసించుతూన్న మహాసౌధం ఏ వీథిలో ఎక్కడ వుందో అతడు మాతో చెప్పాడు.

---

*రైశ్కమిస్సారియాట్—యిక్కడ: ఉక్రైనియాలోని ఫాసిస్టు జర్మనీ కేంద్ర ప్రభుత్వ కార్యాచరణ శాఖ.—సం.

**రైశ్కమిస్సార్—జర్మన్ కేంద్రప్రభుత్వ ప్రతినిధి. ఇక్కడ: ఉక్రైనియాలోని జర్మన్ కేంద్రప్రభుత్వ ప్రతినిధి —సం

మేము దొమ్గేర్‌ని మా పనిమీద కోవెల్, సార్ని, రకిత్నొయె, రోవ్నొ నగరాలకి అనేక పర్యాయాలు పంపించాం. తెలివైనవాడూ, గడుసరీ అయిన యితడు మామూలు మనుషులు ఏ మాత్రమూ తెలుసుకోలేని విషయాలను గురించి భోగట్టా తీసుకువచ్చేవాడు.

అతణ్ణి ముఖాముఖీ కలుసుకుందుకు మాకు ఎప్పుడోగాని వీలయ్యేదికాదు. అందుకని అతడు తన పెద్ద కుమార్తె వాల్యను కొచెత్కొవ్‌కు పరిచయం చేశాడు. వాల్యకి పదిహేడేళ్ళు. కాని పొట్టిగా నీరసంగా వుండి, నల్లని చేరదేసి కళ్ళుంటాయేమో, మనిషి యింకా బాగా చిన్నపిల్లలా కనబడుతుంది. వీర గ్రామంలో వున్న జొళిమిల్లులో బుక్కీపరు ఉద్యోగం చేస్తూంది వాల్య. ఆమె తన తండ్రికీ, కొచెత్కొవ్‌కి మధ్య హర్కారాగా మొదట పనిచేసింది. కాని మరికొద్ది రోజులకే ఆమె తనకు సొంతంగా ఒప్పగించిన పనులను నెరవేర్చుతూ వచ్చింది. ఆమె క్లెసొవా, సార్ని నగరాలకు వెళ్ళి, అక్కడ వున్న తన స్నేహితుల ద్వారా మాకు ఉపయోగపడే సమాచారాన్ని సేకరించుకుని మాకు తెలియజేస్తూండేది.

క్లెసొవా జిల్లాకు చెందిన వీర గ్రామంలో జర్మన్లకు ఒక మెషినరీ కార్ఖానా వుంది. ఆ కార్ఖానాలో రైల్వే యింజన్లనూ, ట్రాక్టర్లనూ, లారీలనూ మరమ్మతు చేస్తూండేవారు. ఆ గ్రామంలో ఒక ఎలెక్ట్రిక్ పవర్ హౌసు కూడా వుంది. క్లెసొవా రైల్వేస్టేషనునుండి కార్ఖానాకు ఒక బ్రాంచి లైను వుంది.

యావత్తు కార్ఖానా సామాగ్రినీ పశ్చిమాన వున్న మరి ఏ వూరికో తరలించివేయడానికి జర్మన్లు అన్ని ఏర్పాట్లూ చేస్తున్నారని కొచెత్కొవ్‌తో వాల్య చెప్పింది. ఇది జరగకుండా వుండేందుకని కార్ఖానానీ, క్లెసొవా స్టేషను దగ్గరవున్న వంతెననూ పేల్చివేద్దామని కొచెత్కొవ్ ప్రతిపాదించాడు.

కార్ఖానాలోని ఏర్పాట్లను గురించీ, కార్ఖానా భద్రతకోసం వుంచిన కావలి భటుల సంఖ్యను గురించీ సవివరమైన సమాచారాన్ని కొచెత్కొవ్ స్థానికవాసులనుండి సంపాదించిన తరువాత, ఇరవైమంది మనుషులున్న ఒక గ్రూపును అతడక్కడకు తీసుకెళ్ళాడు. ఈ గ్రూపుతో మా సాపర్లు—మాలికొవ్, ఫదేయెవ్, స్పెయిన్ దేశస్థుడు గ్రొస్—కూడా వెళ్ళారు.

వీరందరూ తమ గమ్యస్థానాన్ని రాత్రిపూట చేరుకుని, మూడు గ్రూపులుగా విడిపోయారు. ఒక గ్రూపు గ్రొస్ నాయకత్వంకింద కార్ఖానాకి వెళ్ళింది. రెండవ గ్రూపు మాలికొవ్ నాయకత్వంకింద ఎలెక్ట్రిక్ పవర్ హౌసులోకి వెళ్ళింది. మూడవ గ్రూపు కొచెత్కొవ్, ఫదేయెవ్‌లతో కలిసి ఇంజన్ డిపోకి వెళ్ళింది. ఈ మూడు

గ్రూపులు అక్కడ కాపలావున్న భటులను చడీచప్పుడూ లేకుండా హజామతుచేసి, యావత్తు స్థలంలోనూ మందుపాతరలు పాతాయి.

అన్ని ఏర్పాట్లూ పూర్తి అయిన తర్వాత, కొచెతోక్ఓవ్ సిగ్నలు యివ్వ డంతో మందుపాతరలు పేలాయి. చెవులు చిల్లులుపడేటట్టు పేలుడులు ధ్వనించాయి. రైల్వే యింజన్ డిపోలోనూ, కార్ఖానాలోనూ, పవర్ హౌసులోనూ మంటలు లేచాయి. అంతా బాగా జరిగిపోయినట్టే అగపడింది. కాని గెరిల్లాలు తిరిగి తమ సాంకేతిక స్థలంలో కలుసుకున్నప్పుడు, కొచెతోక్ఓవ్ వ్యసనపడుతూ అన్నాడు :

"అంతా పాడుచేశాం. డిపోలో రెండే రెండు యింజన్లు వున్నాయి. యాభై వాగన్లతో వున్న మూడో యింజను యింకా బ్రాంచి లైనుమీదే వుందాయె. దాన్ని అక్కడే అలాగే వుండనిచ్చేస్తామా?"

"ఏమైనా సరే, దాన్ని పేల్చివేయడమే మంచిది."

"దాన్ని పేల్చివేయడమే మంచిది...నిజమే, కాని ఎలా పేల్చివేయడం? మన దగ్గర ఒక మందుపాతర మిగిలింది. దాన్ని వంతెనకోసం అట్టేపెట్టామాయె."

ఈ చిక్కులోనుంచి బయటపడేందుకు గ్రోన్ ఒకఉపాయం కనిపెట్టాడు. వంతెన, యింజను, వాగన్లు—అన్నింటినీ ఒక్క మందుపాతరతోనే ఎలా పేల్చివేయ డమో అతడు చెప్పాడు.

ఆ కార్యం ఈ విధంగా నెరవేర్చాం. మాలికొవ్, ఫదేయెవ్, ఇంకా మరి కొందరు గెరిల్లాలూ వంతెన దగ్గరికి వెళ్ళి మందుపాత్రను వంతెన కింద పాతారు. కడమ మనుషులు ఇంజనుదగ్గరకి వెళ్లారు. మా మనుషులలో ఒకడు, ఇదివరకు ఇంజనులో ఫైర్‌మేనుగా పనిచేసిన నెచిపొరూక్,ఇంజను ఎక్కి ఫర్నేసు రాజబెట్టాడు. వంతెనకింద మందుపాతర పాతడం పూర్తిఅయింది. ఇంజనుకూడా బయల్దేరేందుకు తయారుగా వుంది. నెచిపొరూక్ ఇంజనులో థ్రాటిల్‌ను బాగా తెరచి, ఇంజనులోనుంచి బయటకు గంతేశాడు. ఇంజను క్షణక్షణానికీ వేగం పుంజుకుని వంతెనమీదకి వచ్చే సరికల్లా మందుపాతర పేలింది. వంతెనకింద ప్రవహించుతూన్న నదిలోకి ఇంజను బోల్తాకొట్టింది. బోల్తా కొట్టడంలో ఓ ఇరవై వాగన్లను కూడా కిందకి ఈడ్చేసింది.

ఈ విధ్వంసన కార్యం జర్మన్లలో గొప్ప అలజడిని రేకెత్తించింది. కొద్ది రోజులైన తరువాత ప్రత్యేకపు కమీషను ఒకటి దర్యాప్తుచేయడానికి అక్కడకువచ్చి, మొత్తం నష్టం కొన్ని మిలియన్ల మార్కులు వుంటుందని అంచనా వేసింది.

"మనసు నిండిపోయిందయ్యా!" అన్నాడు కొచెతోక్ఓవ్ క్యాంపులో, "ఆహా, గ్రోన్ గొప్ప ఆలోచన చెప్పాడు కదూ! అద్భుతమే, నిజంగా అద్భుతమే!"

కొచెత్కోవ్ అంటే గెరిల్లాలకి ఇష్టమే, కాని అతణ్ణి వారు అస్తమాను హాస్యం చేసేవారు. ఏమంటే, వీక్తొర్ నెమ్మదిగా మాట్లాడలేకపోయేవాడు, అతడి గొంతు పెద్దది, బొంయ్‌మంటూ మారుమోగేది. అందుకని అతణ్ణి అందరూ గేలిచేసేవారు.

గెరిల్లాలు తరుచు రాత్రిళ్ళు బయల్దేరేవారేమో, నిశ్శబ్దంగా నడిచేవారు, ఏ మాత్రం అలికిడి లేకుండా వుండేందుకు చెట్ల ఆకులనైనా రెమ్మలనైనా ముట్టుకునే వారుకారు.

"మాట్లాడకండి!" అని కొచెత్కోవ్ ఆజ్ఞాపించేవాడు, ఎవరైనా గుస గుసమంటూన్నట్లు తనకి వినబడేసరికి. కాని ఆజ్ఞాపించినప్పుడు తన గొంతుక ఎంత బిగ్గరగా వుండేదంటే చుట్టుపక్కల పల్లెల్లో వున్న కుక్కలు మొరగడం మొదలేట్టేవి.

ఒకసారి ఒక కథ జరిగింది. దీని తరువాత కొచెత్కోవ్‌ను హాస్యం చేయడం మరీ హెచ్చు అయిపోయింది. ఒకనాటి రాత్రి కొచెత్కోవ్ నాయకత్వాన ఒక స్కౌటు గ్రూపు రికాన్నిసెన్సుమీద బయల్దేరింది. గ్రూపులో పదిహేనుమంది వున్నారు. తోవలో ఒక ఏరు దాటవలసివచ్చింది.

"బట్టలు విడిచేయండి!" అని కొచెత్కోవ్ ఆజ్ఞాపించాడు.

గెరిల్లాలు బట్టలు తీసేసి, చలిలో వణుకుతూ నీటిలోకి దిగి, వెన్నెట్లో ఏరుదాటి, అవతలి వొడ్డు చేరుకుని దుస్తులు వేసుకోబోయేసరికి :

"వేసుకోవద్దు! బట్టలు వేసుకోకుండా మనం ఇలాగే నడుద్దాం. ఈ నది తాలూకా ఉపనదిని మనం దాటాల్సివుంది. అది దాటిన తరువాతే బట్టలు వేసుకో వచ్చు ఏకంగా" అన్నాడు కొచెత్కోవ్.

మనుషులు నగ్నంగానే ముందుకు సాగారు. ఒక కిలోమీటరు నడిచారు రెండు కిలోమీటర్లు, ఉపనది ఇంతకీరాదు, అంతకీరాదు. చలి వణికించేస్తూంది, దోమలు కుట్టేస్తున్నాయి.

"ఉపనది ఎక్కడుంది ?" అని మనుషులు అడిగారు.

"మాట్లాడకండి!" అని ఆజ్ఞాపించాడు కొచెత్కోవ్.

గ్రూపు ముందుకు సాగింది. సుమారు ఐదు కిలోమీటర్లు నడిచిన తరు

వాత, అప్పుడు అర్థమైంది కొచెత్కోవ్‌కి. తన మ్యాపు తనను తప్పుదారి పట్టించిందని.

"ఆగండి! బట్టలు వేసుకోండి!" అని కొచెత్కోవ్ ఆజ్ఞాపించాడు, పొరపాటు ఏదీ జరగనట్టు.

ఇది జరిగిన తరువాత చాలాకాలం వరకూ మేం కొచెత్కోవ్‌ని హాస్యం చేస్తూండేవారం. మేం ఎంత హాస్యమాడినా అతడేమీ అనుకునేవాడుకాదు, ఆహాస్యం మరెవరిగురించో అన్నట్టు తనుకూడా అందరితోనూ కలిసి నవ్వేవాడు.

• • •

ఫిదారొవ్ అనే ఒకానొక మనిషితో మేం సంబంధం పెట్టుకోవడం మంచిదని 1932 చివరి రోజుల్లో దొవ్గేర్ మాకు సూచించాడు.

"ఈ మనిషివల్ల ఉపయోగం వుంటుంది. కోవెల్ రైల్వేలో ఇంజనీరుగా వుంటూండేవాడు. యుద్ధం ఆరంభమవుతుందనగా ఇతడు సార్నీ స్టేషను మాష్టరుగా పనిచేశాడు. సార్నీలోనూ, కోవెల్‌లోనూ అతనికి తెలిసినవాళ్ళు చాలమందివున్నారు ఫిదారొవ్ పార్టీ సభ్యుడు. అజ్ఞాతవాస కార్యకర్తగా నమ్మకస్థుడు" అన్నాడు దొవ్గేర్.

"ఇప్పుడు ఎక్కడున్నాడు?"

"జర్మన్ల చేతిలో అతడు ఎన్నో కష్టాలు అనుభవించాడు. తరువాత అతడు అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోయాడు. ఇప్పుడు సార్నీ దగ్గరలో వున్న ఒక పిండిమిల్లులో ఉద్యోగం సంపాదించి అక్కడ పనిచేస్తున్నాడు"

మా పనికి సరిగా ఉపయోగపడే మనుషుల్ని ఎంచి మాకు ఒప్పచెప్పడంలో కాన్‌స్తన్‌తీవ్ దొవ్గేర్‌కు గొప్ప తెలివితేటలుండేవి. ఈ విషయంలో అతడు ఎన్నడూ పొరపాటు చేయడని మాకు గట్టి నమ్మకం కుదిరిపోయింది.

ఫిదారొవ్‌తో కొచెత్కోవ్ సంబంధం నెలకొల్పుకున్నాడు. మరి ఒక ఆరువారాలలోపునే ఫిదారొవ్ సార్నీ రైల్వే జంక్షనులో పనిచేస్తూన్న కార్మికులనూ, ఇంజన్ డ్రైవర్లనూ, గ్యాంగు మనుషులనూ, ఉద్యోగస్థులనూ కూడగట్టుకొని, ఒక శక్తివంతమైన ఆవేక్షణ, విధ్వంస గ్రూపును ఆర్గనైజ్ చేశాడు.

కోవెల్—కోరొస్తెన్, సార్నీ—రోవ్నొ రైల్వేలైన్లపై సాగే రాకపోకలూ, రవాణాల గురించి—ఎన్ని రైళ్ళు నడుస్తున్నాయో, రైళ్ళపై వెళ్తూన్న సైనికబలాల

సంఖ్య, వాటి వివరాలు, వాటి గమ్యస్థానాలు, రవాణా కాబడుతూన్న ఆయుధాలు, సామగ్రి గురించి—సమాచారాన్ని ఇతడు క్రమశః మాకు పంపించుతూండేవాడు. ఈ రిపోర్టులు మాకు అందిన వెంటనే వాటిని మేము హైకమాండుకు అంద జేసేవారం.

ఫిదారొవ్ గ్రూపు కేవలం రహస్య సమాచారం అందివ్వడమే కాకుండా, సైనికబలాలను రవాణా చేస్తూన్న రైళ్ళను పేల్చివేయడమూ, వంతెనలు కూల్చి వేయడమూ మొదలైన విధ్వంసకార్యాలను కూడా అనతికాలంలో ఆరంభించింది. దొవ్గేర్, వాల్యల ద్వారా కొచెతొక్లోవ్ ఎప్పటికప్పుడు ఫిదారొవ్‌తో సంబంధాలు నిల్పుకుంటూండేవాడు.

## "పౌల్ సీబెర్ట్"

రోవ్నొ—కాస్తొపొల్ రోడ్డుపైన మూడు నాటుబండ్లు నడుస్తున్నాయి. గుర్రాలు మూడూ మంచి పుష్టిగా ఒళ్ళు నిగనిగలాడుతూ హుషారుగానే వున్నప్పటికి బండ్లు మాత్రం తాపీగానే నడుస్తున్నాయి.

మొదటి బండిలో ఒక జర్మన్ ఆఫీసరు ఉన్నాడు. అతడు నిటారుగా కూచున్నాడు. నాలుగు చెరగులా పరికించుతూ అతడు సారించుతూన్న చూపులు అతి గర్వంగానూ, ఉదాసీనంగానూ, నిర్లక్ష్యంగానూ వున్నాయి. అతడి పక్కను, ఖాకీ యూనిఫారం తొడుక్కున్న మనిషి ఒకడున్నాడు. అతడి చొక్కా దండకు తెల్లని గుడ్డపట్టీ వుంది, అతడు పెట్టుకున్న గుడ్డటోపీకి త్రిశూలం బాడ్జి వుంది. ఇది నాజీలకింద గులామగిరికి కుదుయకున్న దేశద్రోహులు ధరించే యూనిఫారం.

కడమ రెండు బండ్ల నిండా పోలీసులున్నారు. వాళ్ళు రకరకాల దుస్తుల్లో వున్నారు: కొందరు ఆర్మీ పంట్లాంలూ మామూలుగా పల్లెటూరివాళ్ళు వేసుకునే సూట్లూ తొడుక్కున్నారు; కొందరు సైనిక కోట్లు తొడుక్కొని సివిలియన్ టోపీలు పెట్టుకున్నారు; కొందరు భుజంపట్టీలు లేని ఎర్రసైనికుల షర్టులు తొడుక్కున్నారు. ఈ దుస్తులన్నీ దొంగతనంగా సంపాదించినవని ప్రత్యక్షంగానే తెలిసిపోతూంది. కాని ప్రతి చొక్కా దండపైనా "షూట్జ్ పొలీత్సై" అని జర్మన్‌లో వున్న తెల్లని పట్టీ వుంది. ఈ పట్టీలను ఉక్రైనియన్లు "జాగ్రత్తలు" అనేవారు. ఆ మాట సరిగా సరిపోయింది. కూడాను. ఎందుకంటే: ఈ పట్టీవున్న మనిషితో బహు జాగ్రత్తగా మెలగాల్సివుంటుందని దాని అర్థం.

మొదటి బండిలో వున్న జర్మన్ ఆఫీసరూ, పోలీసు మనిషీ — ఇతగాడు

సూపరింటెండెంటులా వున్నాడు—ఎంతో గంభీర ముద్రతో వుండగా, కదమ రెండు బండ్లలో వున్న మనుషులు గొంతుకలు చించుకుని పాటలు పాడుతూ. నాటుపొగాకు సిగరెట్లు కాల్చుతూ నానా హంగామా చేస్తున్నారు.

అవిధేయత చూపినదనే నేరాన్ని ఏదో ఒక గ్రామంపై మోపి, ఆ గ్రామాన్ని ధ్వంసం చేసేందుకు నాజీ ఆఫీసర్ల నాయకత్వాన బందిపోటు దొంగలు బయలువెడలుతూండే దృశ్యం ఆ రోజుల్లో సర్వసాధారణమే.

రోడ్డు బయలు ప్రదేశంమీద సూటిగా వెళ్తూంది. రోడ్డుకు ఇటూ అటూ పొలాలూ, పచ్చిక బయళ్ళూ వున్నాయి, కొద్దిపాటి దూరంలో అడవి వుంది. రోడ్డు పైన రాకపోకలు ధారాళంగా సాగుతున్నాయి. బండ్ల పక్కనుండి అప్పుడప్పుడు జర్మన్ లారీలూ, కార్లూ గొప్ప వేగంతో వెళ్తున్నాయి. బండ్లు రోడ్డు అంచునే వున్న కాలువ వొడ్డును అంటిపెట్టుకుని మెల్లగా నడుస్తున్నాయి.

వెనుకనుండి వచ్చిన కార్లూ, ఎదుటనుండి వచ్చిన కార్లూ బండ్లను దాటిన ప్రతిపర్యాయమూ ఆ జర్మన్ ఆఫీసరు మరింత నిటారుగా కూచుని, వెనుక బండ్లలో వున్న అల్లరి జట్టును కోపంతో చివాట్లు పెట్టుతూ, అతడు నాజీ పద్ధతిలో కుడిచేయి ముందుకు చాచి : "హైల్ హిట్లర్!" అని సెల్యూట్ చేసేవాడు. తన తోటిఆఫీసర్లు దర్జాగా సౌఖ్యమైన కార్లలో ఝామ్మని ప్రయాణంచేస్తూండగా, తను నాటుబండిలో కూచుని, "హీనజాతి"కి చెందిన అల్లరిచిల్లరి మూకతో వెళ్ళవలసి వచ్చినందుకు తన కెంతో తలవంపులు అనిపించుతూన్న సంగతి అతని ముఖంలో స్పష్టంగా కనబడుతూనే వుంది.

రోడ్డువార పల్లెలలో వున్న ప్రజలను హడలుగొట్టుతూ ఆ బండ్లు మూడు గంటలై నడుస్తున్నాయి.

ఆ బండ్లను దూరంనుంచే చూసి, గ్రామస్థులు గుడిసెలలోకి పారిపోయి, భీతావహులై కిటికీలలోనుంచి తొంగిచూశారు.

మంచి దాబుగా వున్న పెద్ద కారు ఒకటి ఆ బండ్లకి ఎదురుగా వచ్చింది. రోడ్డుకి ఇటూ అటూ పొలాలు బారుగా విస్తరించి వున్నాయి. బండిలో వున్న ఆఫీసరు లేచినిలబడి, నాలుగు చెరగుల శ్రద్ధగా పరికించాడు. కారు ముందూ, కారు వెనకా ఒక మనిషి కాని, ఒక బండి కాని ఏదీ లేదు—రోడ్డు ఖాళీగా వుంది, బండిలో నిలబడిన ఆఫీసరు వెంటవస్తూన్న రెండు బండ్లవైపు తిరిగి, చేయిఎత్తాడు. పాటలూ, కేకలూ తటాలున ఆగిపోయాయి. అందరూ అప్రమత్తులుగా వున్నారు.

కారు దగ్గరపడుతూంది. ఆఫీసరు పక్కను కూర్చున్న మనిషి బండిలో నుంచి గంతేసి, చప్పున ముందుకెళ్ళాడు. కారు సరాసరి తన ఎదటకు వచ్చేసరికి, ఆ మనిషి డ్రిల్లుచేస్తూన్నట్టుగా ఏ హడావుడీ లేకుండా ఒక టాంకు విధ్వంసక గ్రెనేడ్‌ని ఆ కారుకేసి విసిరాడు. గ్రెనేడ్ సరిగా కారు వెనకాతల పేలింది. నిగనిగ లాడుతూన్న ఆ "ఓపెల్-ఎడ్మిరల్" కారు గ్రెనేడ్ పేలుడుకి బోల్తాకొట్టి, రోడ్డు పక్క వున్న కాలువలోకి తిరగబడింది.

రెండు బండ్లలో వున్న మనుషులు రోడ్డుమీదికి గంతేసి, తుపాకులు సిద్ధంగా పట్టుకుని, తిరగబడివున్న కారుదగ్గరకు పరుగెత్తారు. అప్పటికప్పుడే జర్మన్ ఆఫీసరు కారు దగ్గరనుంచుని వున్నాడు. గ్రెనేడ్ విసిరిన మనిషితో ఆ ఆఫీసరు:

"భేష్, ప్రిహోద్కో! తలవెంట్రుక వాసి అయినా వార లేకుండా మహా బాగా లెక్కకట్టి కొట్టావయ్యా! కారు బోల్తా కొట్టినా, లోపలి ప్యాసెంజర్లకి ఏమీ దెబ్బతగిలి వుండదులే. వాళ్ళని పైకి లాక్కురండి!" అన్నాడు చక్కని రష్యన్‌లో.

ఏ గాయాలూ తగలకుండా, కేవలం భయంతోనే తబ్బిబ్బుపడుతూన్న ఇద్దరు నాజీ ఆఫీసర్లను కారులోనుంచి బయటికి తీసుకొచ్చారు. ఈ ఇద్దరితోనూ, జర్మన్ ఆఫీసరు జర్మన్ భాషలో :

"అయ్యా! మీరిద్దరూ మరేమీ ఆందోళనపడకండి. నేను జర్మన్ సేనకు చెందిన లెఫ్టినెంట్ పౌల్ సీబెర్టుని. తమరిద్దరి పరిచయ భాగ్యం నాకు కల్గలేదండి!" అన్నాడు

"నేను మేజర్ కౌంట్ హాస్‌న్ని, రైళ్ఛకమిస్సారియాట్‌లో ఒక విభాగానికి నాయకుణ్ణి" అని ఆ ఇద్దరిలోనూ ఒకడు – వయసుమళ్ళిన ఎరుపు జుట్టు స్థూలకాయుడు– తన యూనిఫారం సవరించుకుంటూ అని, "మరి, ఈయన" అంటూ రెండవ వ్యక్తిని చూపించి, "బెర్లిన్‌నుంచి ఇప్పుడే వచ్చిన రైళ్ఛ రవాణాశాఖ సహాదారుడు రైన్" అన్నాడు.

"మిమల్ని కలుసుకోవడం నాకు చాలా సంతోషం" అన్నాడు జర్మన్ ఆఫీసరు. "మీ కారుకి చిన్న ప్రమాదం జరిగింది. తమరిద్దరూ నా బండిలోకి దయ చేయండి!"

"ఏమిటిదంతా?" అని కౌంటు దబాయించాడు, మండిపడుతూనూ, "ఏమిటయ్యా దీని అర్థం?"

హాస్ ఇంకా మరికొన్ని ప్రశ్నలు వేయాలనుకున్నాడు, కాని ఆఫీసరు

తన మనుషులకేసి తల వూపాడు. వారు ఆ నాజీలను ఇద్దరినీ పట్టుకుని, చేతులూ కాళ్ళూ కలియగట్టేసి, ఒక బండిలో పడేశారు.

బండ్లు నడక సాగించి, రోడ్డు మలుపు తిరిగేచోట రోడ్డును విడిచిపెట్టేసి, పక్కదారి పట్టి, మా చౌకి ఒక దానిని చేరుకుంది. అక్కడ జర్మన్ ఆఫీసరు తన దుస్తులను మార్చేసి, తన అసలు పారషూటిస్టు ఓవరాల్సు వేసుకుని ప్రత్యక్ష మయ్యాడు. ఇంతకీ అతడు మరెవ్వరోకాదు – గెరిల్లా సైనికుడు నికొలాయ్ కుజ్నెత్సోవ్.

ఖ్లాయ్ గ్రామం దగ్గరలో పారషూటుతో దిగి మమ్మల్ని చేరుకున్నట్టీ, నేను కల్సుకుందుకు ఎంతో ఆత్రపడుతూన్నట్టి ఆ కుజ్నెత్సోవే ఇతడు.

ఇతడు ఉరల్స్ ప్రాంతపు మనిషి. గంభీరమూ కఠినమూ అయిన అతని ముఖమూ, అందునా ప్రత్యేకమూ ఉక్కురంగువంటి ధూసర నయనాలూ అతని అద్భుత బుద్ధి విశేషాన్ని చాటిచెబుతున్నాయి.

పొడుగు, పొడుగుకు తగిన శరీరం, ధైర్యం, బలం – ఇన్ని విశేషాలతో అతడు అనతి కాలంలోనే మా స్కౌట్లందరిలోనూ ఉత్తముడనిపించుకొన్నాడు.

కుజ్నెత్సోవ్ జర్మన్‌భాషను అనర్గళంగా మాట్లాడుతాడు. అతడుబాల్యం నుండీ జర్మన్ మాట్లాడేవాడు. జర్మనీనుండి వలసవచ్చిన కుటుంబాలు పొరుగు గ్రామంలో వుంటూండేవి. కుజ్నెత్సోవ్ వారిదగ్గర జర్మన్ భాష నేర్చుకోవడమే కాకుండా, జర్మన్ జీవితం గురించీ, జర్మన్ల ఆచార వ్యవహారాలను గురించీ, జర్మన్ స్వభావం గురించీ కూడా అతడు క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. అతడు బడిలో చదువు కుంటూన్నప్పుడూ, అటు తర్వాత ఇన్‌స్టిట్యూట్‌లోనూ జర్మన్‌భాష అధ్యయనాన్ని కొనసాగించాడు. వృత్తిరీత్యా అతడు ఇంజనీరు.

అతడు స్వతహాగా బహుభాషాకోవిదుడని మేం త్వరలోనే గ్రహించు కున్నాం. అతడికి ఉక్రైనియన్ భాష ఒక్క ముక్క అయినా తెలిసేదికాదు. కాని అతడు మా డిటాచ్‌మెంటుని ఉక్రైనియాలో కలుసుకుని, ఆ గ్రామాలలో అతడు పర్యటించడం మొదలుపెట్టగానే, ఉక్రైనియన్ భాషను అతిత్వరగా నేర్చేసుకుని, ఆ భాష ధారాళంగా మాట్లాడుతూ ఉక్రైనియన్ పాటలు ఎంత చక్కగా పాడేవాడంటే, అతడు ఉక్రైనియనే అనుకునేవారు రైతులు.

పోలిష్ ప్రజలు నివశించే ప్రాంతాలలోకి మేం వెళ్ళినప్పుడు, నికొలాయ్ పోలిష్ భాషలోనే మాట్లాడడం ఆరంభించాడు. ఇన్ని భాషలూ అనర్గళంగా మాట్లాడ

దమే కాకుండా, నాలుగు ముక్కలు రష్యనూ, ఉక్రైనియనూ, పోలిషూ తెలిసిన జర్మన్ దేశస్థుడు ఆ భాషలు ఎలాగైతే తడుముకుంటూ తన మాతృభాషతో కలగా పులగం చేస్తూ మాట్లాడుతాడో, లేక నాలుగు పోలిష్ ముక్కలు తెలిసిన రష్యన్ దేశస్థుడు పోలిష్ భాష ఎలా మాట్లాడతాడో అచ్చంగా అలా మాట్లాడడం కూడా అతడికి తెలుసు. ఈ విషయంలో అతడు నిజంగా గొప్ప నటుడు.

మేం మాస్కోలో కలుసుకున్నప్పుడే, తను జర్మనుదేశస్థునిగా చెలామణీ అవుతూ స్కౌటు కార్యాలు సాగించాలని తనకి వున్నట్టు అతడు మాతో చెప్పాడు. ఇందుకు మేం ఒప్పుకున్నాం. అయితే, అతడు ఈ కపటనాటకం ఆరంభించే ముందు, అతడు నాజీ సైనిక నిబంధనలను బాగా తెలుసుకోవలసి వుంటుందనీ, ఏదో ఒక జర్మన్ రాష్ట్రం గురించి, తాను ఆ రాష్ట్రంలో పుట్టి పెరిగినట్టు నటించేం దుకు వీలుగా, క్షుణ్ణంగా అధ్యయనం చేయవలసి వుంటుందనీ మేమొక షరతు పెట్టాం.

ప్రష్యన్‌గా చెలామణీ అయ్యేందుకు అతడు నిశ్చయించుకున్నాడు. తూర్పు ప్రష్యా గురించీ, ఆ రాష్ట్రపు ఆర్థికవ్యవస్థ, నైసర్గికమూ, ప్రజలను గురించీ అనేక గ్రంథాలను అతడు పఠించాడు. క్యోనిగ్స్‌బెర్గ్ పట్టణాన్ని అతడు ఎంత యథాతథంగా వర్ణించాడంటే, అతడు నిజంగా ఆ పట్టణంలో పుట్టి పెరిగాడని అను కోవాల్సిందే యుద్ధ సమాచారం గురించి కూపీలను బయటికి లాగేందుకు కాకుండా, జర్మన్-ఫాసిస్టు సైనిక నిబంధనలను గురించి అతడు తెలుసుకొనగల్గేందుకుకూడా యుద్ధఖైదీలను ప్రశ్నించే పనిని మేం అతనికి ఒప్పజెప్పాం.

మేం తీసుకు వచ్చిన ఖైదీలతో అతను ఏమీ తృప్తిపొందలేదు.

"వీళ్ళు వుత్త దద్దమ్మలు, కీ ఇస్తే పనిచేసే బొమ్మలు వీళ్ళు. వీళ్ళకి చేతనైనదంతా అడుగు తీసి అడుగు వెయ్యడమే. 'హైల్ హిట్లర్!' తప్ప మరొక మాట వీళ్ళకి అర్థంకానప్పుడు వీళ్ళతో ఏమీ మాట్లాడలేం!" అనేవాడు కుజ్నెత్సోవ్.

"మీతో మాట్లాడ్డానికి మీకు ఓ ప్రొఫెసర్ని ఎక్కడ తీసుకురాగలం!" అన్నాన్నేను నవ్వుతూనూ.

"అవసరంలేదు, నాకు అవసరమైన మనిషిని నేనే స్వయంగా తీసు కొస్తాను. అందుకు మీరు అనుమతించితే చాలు" అన్నాడు కుజ్నెత్సోవ్.

"సరే!" అన్నాను.

నేను పైన వర్ణించిన గెరిల్లా చర్యను యికప్పుడు నికొలాయ్ ప్రయోగిం

చాడు. ఇది నిజంగా అసాధారణమైన చర్యే. శత్రువును పట్టుకుందుకు పొంచివుండడం గురించి మిలిటరీ పెక్స్టుబుక్కులు ప్రస్తావించుతూ. సైనికబలాలు ఒక ప్రత్యేక స్థలంలో దాగునివుండాలనీ, శత్రువుకోసం కాచుకునివుండాలనీ, ఇకప్పుడు శత్రువుపై బడి దాడిచేయాలనీ చెబుతాయి. నిజమే, కాని బాయగా వున్నరోడ్డూ, చుట్టు పక్కల పొలాలూ తప్ప ఆ దరిదాపులో మాటు స్థలం ఏదీ లేనప్పుడు ఏమిచేయడం? ఈ పరిస్థితులలో మీరు ఎక్కడ దాగుంటారు? అందుకని కదులుతూన్న మాటు బాగా" అని తాను స్వయంగా పేరుపెట్టిన నాటుబండ్లలో మాటు ఏర్పరచుకుందుకు నికొలాయ్ నిశ్చయించుకున్నాడు.

అనుమానానికి ఏ ఆస్కారమూ లేకుండా వుండేందుకని అతడు జర్మన్ ఆఫీసరు యూనిఫారం తొడుక్కున్నాడు, తన మనుషులను పోలీసుల వేషం వేసుకో మన్నాడు.

ఆ అందమైన "ఓపెల్–ఎడ్మిరల్" కారును కుజ్నెత్సోవ్ ఊరకనే ఎంచుకోలేదు. ఆ కారులో దొరికిన సరుకు అమిత ఆసక్తిదాయకమైనదిగా పరిణమించింది. ఖైదీలు "మాట్లాడడమే" కాకుండా ఎన్నో రహస్యాలు బయటపెట్టారుకూడా.

క్యాంపులో ఖైదీల ఎదుట కుజ్నెత్సోవ్ జర్మన్ లెఫ్టినెంటు యూనిఫారంలోనే ప్రత్యక్షమయ్యాడు. జర్మన్ సైనిక మర్యాదను పాటించుతూ అతడు తన బూట్ల మడమలను టక్కున టాకించాడు.

"కూర్చోండి" అని మేజర్ హాన్, మర్యాదస్థుడైన లెఫ్టినెంటును ఉద్దేశించి ముఖంచిట్లించుతూ, అక్కడ వున్న ఒక చెట్టు మొదలును చూపించాడు. అది తప్ప కూచుందుకు ఆ గుడారంలో మరేదీ లేకపోయింది.

"వంట్లో యిప్పుడు కాస్త స్తిమితంగా వుందాండి?" అని నికొలాయ్ ఎంతో మర్యాదిగా అడిగాడు.

కాని ఆ యిద్దరూ వేళాకోళాలను సహించే స్థితిలో ఏ మాత్రమూ లేరు.

"మేమెక్కడున్నామో, దీని అర్థం అంతా ఏమిటో చెప్పండి!"

"మీరు ఒక రష్యన్ గెరిల్లా క్యాంపులో వున్నారు."

"జర్మన్ ఆఫీసరైన మీరు మన శత్రువుల శిబిరంలో వున్నారేమిటి?"

"జర్మనీని హిట్లరు పతనావస్థకు లాక్కుపోతున్నాడనీ, యుద్ధంలో ఓడిపోతాడనీ నాకు నమ్మకం కలిగిపోయింది. అందుకని నేను యిష్టపూర్వకంగానే

రష్యన్ల పక్షం చేరిపోయాను. మీరు కూడా మనసు విప్పి మాట్లాడ్డమే మంచిదని నా సలహా."

ఆ జర్మన్లు యిద్దరూ మరే ఆలస్యంచేయకుండా కుజ్నెత్సోవ్ చెప్పినట్టూ విన్నారు. కుజ్నెత్సోవ్ వారితో పలుసార్లు సుదీర్ఘమైన సంభాషణలు జరిపాడు వారు జర్మన్లు అయిన కారణంగా సమర్థులైన "పరీక్షాధికారులు" అవడంచేత, వారిచేత కుజ్నెత్సోవ్ తన జర్మన్ భాషా పరిజ్ఞానాన్ని పూర్తిగా పరీక్షచేయించుకోగల్గాడు. అదృష్టవశాత్తూ కౌంట్ హాన్ స్వస్థలమూ, కుజ్నెత్సోవ్ "స్వస్థలమూ" క్యోనిగ్స్ బెర్గే అయింది.

రైన్‌ని సోదాచేసినప్పుడు, మ్యాపు ఒకటి దొరికింది. ఆ మ్యాపులో ఉక్రైన్‌లో జర్మన్ ఆక్రమణకింద వున్న యావత్తు ప్రాంతపు కచ్చా రోడ్లూ, మోటారు రోడ్లూ, రైల్వేలైన్లూ గుర్తుపెట్టి వున్నాయి. వీటి గురించి అనుబంధంగా వివరణలు మ్యాపుతోపాటు కూడా వున్నాయి. మ్యాపునూ, వివరణలనూ కుజ్నెత్సోవ్ అధ్యయనం చేస్తూండగా, జర్మన్ల అతిముఖ్యమైన రహస్యం ఒకటి అతనికి తెలిసింది. వీన్నిత్స నగరానికి సమీపాన హిట్లర్ స్థాపించుకున్న తూర్పు ప్రాంతపు హెడ్ క్వార్టర్సుకి బెర్లిన్‌తో టెలిఫోను సంబంధం నెలకొల్పుతూన్నట్టి భూగర్భపు ఆర్మర్డ్ కేబిలు ఏ బాటగుండా వేయబడిందో ఆ బాటను ఆ మ్యాపులో వున్న వివరాలు సూచించాయి.

వివరాలన్నిటినీ తెలుసుకుందుకు కుజ్నెత్సోవ్ నిశ్చయించుకుని, హాన్‌ని ప్రశ్నించాడు :

"ఈ కేబిలు ఎప్పుడు వేశారు ?"

"సుమారు నెల రోజుల కిందట."

"కేబిల్ లైను ఎవరు నిర్మించారు?"

"రష్యన్ యుద్ధ ఖైదీలు"

"ఈ పని రష్యన్ ఖైదీలచేత చేయించితే, హిట్లర్ హెడ్‌క్వార్టర్స్ ఎక్కడ వున్నదీ ఆ రహస్యం వారికి తెలిసిపోయే ప్రమాదం లేదా ?"

"ఆ ప్రమాదం సంభవించకుండా మేం అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాం."

"అనగా, వాళ్ళందరినీ మీరు చంపేశారన్నమాట ?"

హానూ, రైనూ జవాబు చెప్పకుండా మౌనం వహించారు.

"కేబుల్‌లైను నిర్మించేందుకు ఎంతమందిని పెట్టారు ?"

"పన్నెండు వేలమందిని."

"పన్నెండు వేలమందినీ..."

"ఆ పని గెస్టాపోది" అంటూ హాన్ సమర్థించుకోజూశాడు.

తనకు కావలసిన భోగట్టా అంతా కుజ్నెత్సోవ్ ఆ ఇద్దరు ఖైదీలనుండీ సంపాదించాడు. తను జర్మన్ దేశస్తుడనని చెప్పగా, ఆ విషయాన్ని వారు ఏమాత్రం సందేహించలేదని కూడా అతడు తెలుసుకున్నాడు.

హాన్‌న్నీ, రైన్‌నీ ఉరితీసేశాం. వారు చేసిన కార్యాలకు ఆ శిక్ష ఏ విధంగానూ సరిపోదు.

కుజ్నెత్సోవ్‌ను రోవ్నో నగరానికి సరాసరి ఇక పంపించవచ్చుననుకున్నాం, కాని ఒక సంగతి గురించి మాత్రం నేను చాలా గాభారాపడ్డాను : కుజ్నెత్సోవ్ ఒక్కొక్కప్పుడు నిద్రలో రష్యన్ మాట్లాడేవాడు. దీనివల్ల అతను బయట పడిపోతాడే అని భయపడ్డాను.

ఈ సంగతి అతనితో చెప్పడమే మంచిదని నిశ్చయించి, రష్యన్‌భాషలో మాట్లాడడం సాధ్యమైనంత వరకూ తను తగ్గించుకోవలసిందని అతనికి సలహా చెప్పాను.

"మీకు మాట్లాడాలని బుద్ధిపుట్టినప్పుడు, త్సెస్సార్‌స్కియ్ దగ్గరకు వెళ్ళి అతనితో...జర్మన్‌లో మాట్లాడండి. ఆలోచించడం కూడా జర్మన్‌లోనే ఆలోచించండి."

అసలు పని అని తను పేరుపెట్టిన కార్యాన్ని అతడు ఆరంభించే వరకు కుజ్నెత్సోవ్ అతి ఆత్రపడ్డాడు. నాజీల పట్ల అతడికి అపార ద్వేషం వుండేది, కాని ఆ విషయం గురించి అట్టే ప్రస్తావించేవాడుకాదు. అతడు స్వాభావికంగా మొంగ మాటస్తుడూ, మితభాషీ అయినప్పటికీ అతడిది మహా మెత్తని మనస్సు, ఇట్టే చలించిపోయే హృదయం.

ఒకసారి నికొలాయీ, నేను క్యాంపు పరిసరాల్లో తిరుగుతున్నాం. అది శరత్కాలం, చలిగా వుంది, తొలి మంచు అప్పుడే పడింది. తటాలున పొదల్లో అలికిడి అయింది. అక్కడకు మేం వెళ్ళి చూసేసరికి, ఏడేళ్ళ కుర్రవాడొకడు ఆ పొదల్లో

మాకు అగపడ్డాడు. ఆ కుర్రవాడి రూపు-ఇక చెప్పలేం! వాణ్ణి చూసేసరికే మాకు హడలేసిపోయింది

కుర్రవాడి షర్టూ, ప్యాంటూ ఎక్కడికక్కడ చిరిగిపోయున్నాయి. చిరుగుల్లోనుంచి కనబడుతూంది చిక్కి శల్యమైపోయిన శరీరం: పక్కఎముకలు పొడుచుకొస్తున్నాయి, వాటిపైన నీలిరంగు చర్మం బిగుతుగా వుంది, కాళ్ళు చీపురు పుల్లలే. జుట్టునిండా పేళ్ళు ఎంత వొత్తుగా వున్నాయంటే, జుట్టు కదులుతూన్నట్టే వుంది. ఒక కాలికి గాయం, గాయం పుండు అయి చీముపోసిపోయుంది.

కుర్రవాడు మాకేసి చూశాడు-కళ్ళలో కాంతిలేదు సరికదా, అసలు జీవ కళ కూడా లేదేమో అనిపించింది. మాకేసి చూసి, కుర్రవాడు భయంతో కొద్దిగా వెనక్కితగ్గాడు.

నేను నికొలాయ్‌వైపు చూశాను. నికొలాయ్ ముఖాన రక్తంలేదు. మాకు మాటకుండా అతడు తన బొంతకోటు విప్పేసుకుని, దానిని ఆ కుర్రవాడిపైన కప్పి, అమిత వాత్సల్యంతో వాణ్ణి ఎత్తుకుని, గబగబా నడిచి క్యాంపుకి వెళ్ళిపోయాడు.

మాకు తరువాత తెలిసింది, ఆ కుర్రవాడి పేరు పీన్య అని. ఏ అద్భుతం జరిగిందో మరి, నాజీలు యూదులపై జరిపిన ఒక హత్యాకాండలో ఈ కుర్రవాడు ఎలాగో బతికి బయటపడ్డాడు.

పీన్యను మా ఆస్పత్రిలో వేశాం. నికొలాయ్ తన గెరిల్లా కార్యాలయం నుండి తిరిగివచ్చినప్పుడు ప్రతి పర్యాయమూ పీన్యకోసం ఏదో ఒక మిఠాయివస్తువు తీసుకొచ్చేవాడు.

"ఏం ఫర్వాలేదు, అబ్బాయ్! మరి నాల్గురోజుల్లో నువ్వు కోలుకుంటావు. ఇకప్పుడు నిన్ను మాస్కోకి పంపించుతాం" అన్నాడు నికొలాయ్ ఆ కుర్రవాడితో.

## వెండి పట్టా కత్తి

వొరోనొవ్క గ్రామానికి చేరువగానూ, మా క్యాంపుకి దగ్గరగానూ పచ్చిక బయలు ఒకటి వుంది. ఇది విమానాల రాకపోకలకు సదుపాయంగా వుంది. పచ్చిక బయలు పెద్దది, కాని విమానావతరణకు, అనగా విమానం నేలపై వాలి కొంతదూరం వెళ్ళి, ఆ తరువాత ఆగేందుకు తగినట్టి చదును బాగా కొద్దిగా చిన్నది. అందుచేత అక్కడ విమానాన్ని సరిగా దింపేందుకు వైమానికుడు తనకున్న నైపుణ్యతా సూక్ష్మతనంతనూ ప్రదర్శించవలసివుంటుంది.

మాస్కోనుండి మందుగుండు సామగ్రి పంపుతామని ఖరారుచేశారు. మా శైదీలనుండి మేం సంపాదించినట్టి ముఖ్యమైన డాక్యుమెంట్లనూ, మా క్షతగాత్రులనూ మాస్కోకు పంపాలని మేము అనుకున్నాం. మా అవతరణ క్షేత్రం ఎక్కడవున్నదీ సరైన వివరాలను మాస్కోకి తెలియజేశాం. విమానం పంపుతామని మాస్కోనుండి వర్తమానం కూడా మాకు అందింది.

మా విమానమైదానపు నిపుణుడు కొచెత్కోవ్. రూల్సు ప్రకారం ఎక్కడైతే సిగ్నల్ దీపాలు వుండాలో అక్కడ తుచ. తప్పకుండా గుర్తులుపెట్టి అక్కడ నెగళ్ళు ఏర్పాటుచేశాడు. అవతరణ క్షేత్రపు పరిమితులు తెలియజేస్తూ కొన్ని నెగళ్ళున్నాయి. కడమ నెగళ్ళు "T" ఆకృతిలో వుండి, అవతరణ పథం దిశ, స్థానము తెలియజేశాయి. విమానమైదానానికి దారితీస్తూన్న రోడ్లు అన్నిటిపైన ప్రతి మూడు, లేక ఐదు కిలోమీటర్లకూ ఒక్కొక్క గస్తీచౌకిని ఏర్పాటుచేశాం.

విమానం కోసం రెండు రాత్రిళ్ళు చూశాం. ఫలితం లేకపోయింది మూడో రాత్రి విమానం అవుపడింది. కాని మాకు అదృష్టం కలిసిరాలేదు. అక్కడ దగ్గరలో వున్న ఏటిపైన పొగమంచు నొత్తుగా లేచి, విమానం అగపడవలసిన వేళకి ఒక గంట ముందుగా విమాన మైదానం దిశగా పొగమంచు కదలసాగింది, పచ్చికబయ లంతా కమ్మేసి, విమానమైదానంపైన వ్యాపించింది. ఇక ఏమి చేసేందుకూ మాకు తోచిందికాదు. ఇటువంటిది ఘటిల్లవచ్చునన్న సంగతి మాకు ముందుగా తట్టక పోవడంచేత, ఇప్పుడు ఈ ప్రమాదం గురించి పైలట్‌కి ఎలా సిగ్నల్ చేయడమో మాకు తెలిసిందికాదు.

"విక్తోర్! నెగళ్ళలో మరి కొన్ని కర్రలు పడేయండి, మంటలకి పొగ మంచు తేలిపోతుందేమో" అన్నాను కొచెత్కోవ్‌తో.

నెగళ్ళు భగభగ మండాయి, కాని ముద్దముద్దల్లా నొత్తుగావున్న పొగ మంచు మాత్రం నేలమీదనుంచి లేవలేదు.

సరిగా ఈ సమయానికి మాకు విమానం చప్పుడు స్పష్టంగా వినబడింది.

"విమానం వస్తూంది! కర్రలు పడేయండి నెగళ్ళలో" అని కొచెత్కోవ్ ఆజ్ఞాపించాడు.

బొంయ్‌మంటూ గర్జించుతూన్న అతని గొంతుక మాకిప్పుడు సరిగా ఉపయోగపడింది.

పొగమంచులోనుంచి లీలగా అగపడుతూన్న విమానం అవతరణపథానికి

ఎగువన ప్రత్యక్షమై, అక్కడే కాస్సేపు ఎగిరి, మరి ఎటుపక్కకో అదృశ్యమై పోయింది.

"వెళ్ళిపోయింది. దిగేందుకు వీల్లేదనుకుని, వెనక్కి వెళ్ళిపోయింది" అన్నానేను.

కాని తటాలన కేకలు వినబడ్డాయి :

"మళ్ళీ వస్తూంది!"

నా వెనుక వున్న మనిషి అన్నాడు :

"దిగేందుకే నిశ్చయించుకుందన్నమాట."

ఇంజన్ల గర్జన మరింత స్పష్టమైంది. విమానం మాకు అగపడలేదు కాని, చప్పుడుబట్టి అది అప్పుడే అవతరణ పథానికి ఎగువన వుందని అర్థమైంది. మరు నిమిషాన మెరుపులా మెరసి, పిడుగులా చప్పుడైంది.

పైలట్ "T" అక్షరాన్ని చూసుకోకుండా, తప్పు జాగాలో దిగాడు. మేమందరం విమానం దగ్గరకు పరుగెత్తాం.

పచ్చికబయలు అంచున, ఏటికి కొద్దిమీటర్ల దూరంలో విమానం పడి పోయి, ముక్కు నేలలో దిగబడిపోయింది. పైలట్లూ, నావిగేటరూ, రేడియో ఆప రేటరూ పిస్టల్సు సిద్ధంగా పట్టుకునే విమానంలోనుంచి బయటికి దూకారు. మేం ఎవరమో చూసిన తరువాత, వారు పిస్టల్సును ఒరల్లో పెట్టేసుకుని, ముఖాలు వేలేసు కుని, కూలిపోయిన విమానం పక్కను కూర్చున్నారు. కమాండరు నుదుట నెత్తురు కారుతూంది.

"గాయపడ్డారా ఏమిటి?" అని అడిగాను.

"అబ్బే, కొద్దిగా గీసుకుపోయింది, అంతే. కాని ఇది మాత్రం సఫా అయిపోయింది" అంటూ విమానంకేసి చూపించాడు.

రివసూ, విమాన సిబ్బందీ విమానాన్ని తనిఖీచేసి, చక్రము దెబ్బతిందనీ, వింగులూ, పెట్రోలు టాంకులూ కన్నాలు పడిపోయాయనీ దృఢపరచి, ఇహ ఏం చేయడానికీ వీల్లేదనీ, విడిభాగాలు కొత్తవి అవసరమనీ అనేశారు.

దానిని శత్రువుకి విజయచిహ్నంగా అర్పించేస్తూ దానినక్కడ ఎంత మాత్రము వదలిపెట్టేయకూడదు గనుక, మా మనస్సు ఎంత నొచ్చినా, మరి

గత్యంతరంలేక, ఆ కూలిపోయిన విమానాన్ని తగలబెట్టేయడానికే నిశ్చయించు కున్నాం.

విమానంలో వున్న సామాన్లను గెరిల్లాలు త్వరగా బయటకు దింపేశారు, మెషీన్‌గన్లనూ, స్క్రూలు విప్పదీసి గాని, లేదా విరగ్గొట్టి గాని విడదీయగల్గిన భాగాలన్నిటినీ తీసివేశారు. తరువాత వింగుల కిందనూ, పెట్రోలు టాంకుల కిందనూ గడ్డి పెట్టి కిరసనాయిలు పోసి వెలిగించారు.

మంటలు విమానాన్ని చుట్టుకున్నాయి, టాంకులు ఢామ్మని పేలాయి, పొగమబ్బులు ఆకాశాన్ని అందుకున్నాయి. ఆ విమానం మాతృభూమి పంపిన సజీవదూత అయినట్టుగా, మేము దాని ప్రక్కన నుంచుని దానికి వీడ్కోలుచెప్పాం. ఈ అపరాధానికి కొంతవరకు మేమే బాధ్యులమైనట్టుగా పైలెట్లకూ, మాకూ అనిపిం చింది. ఇంతకీ మేము చేసిన అపరాధం ఏమిటి ? ఆ వెధవ పొగమంచే చేసింది ఇదంతానూ !

ఇది జరిగింది స్టాలిన్‌గ్రాడ్ మహాయుద్ధం రోజుల్లో. నాజీలపై సమరంలో యావత్తు దేశమూ తన సర్వశక్తినీ ధారపోస్తూన్న దినాల్లో మప్పుల్ని, ఎక్కడో దూరాతిదూరంలోనో వున్న సార్ని అరణ్యాలలో పోరాడుతున్న ఒక సోవియట్ గెరిల్లా డిటాచ్‌మెంటుని, మాతృదేశం మరచిపోలేదు...

మరునాడు ఉదయం మా డిటాచ్‌మెంటు గెరిల్లాలం కలిసి మీటింగుచేశాం మా విమానాన్ని చేజేతులా మేమే అగ్నికి అహుతిచేయవలసివచ్చినందుకు శత్రువుపై పగసాధించుకోడానికి పది శత్రువిమానాలను నేల కూల్చివేస్తామనీ, కొత్తవిమానాలను తయారుచేసేందుకని శత్రువునుండి స్వాధీనంచేసుకునేటట్టి విలువైనసామాన్లన్నిటినీ మాస్కోకు పంపించుతామనీ ఆ మీటింగులో మేం శపథం తీసుకున్నాం. తామ మిగుల్చుకున్న డబ్బును తమ సైన్యానికి అవసరమైన ఆయుధాలను నిర్మించేందుకు కావలసిన నిధులకై అర్పించుతూ దేశభక్తి ప్రపూరితులైన కార్మికులూ, సమిష్టి వ్యవసాయదార్లూ, సోవియట్ మేధావులూ తమ సొంత చొరవపై సాగించుతూన్న కార్యానికి. శత్రుశ్రేణుల వెనుకప్రాంతంలో వున్న మేము కూడా మా తోడ్పాటు నిచ్చేందుకు నిశ్చయించుకున్నాము.

ఇంతకంటె ఇంకా ఉత్తమమైన విమానావతరణ క్షేత్రం కోసం మళ్ళీ వెతకడం ప్రారంభించాం. ఇలా వెతుకుతూండగా మాకు స్థానిక ప్రజలు కొందరు అగపడి, విమానావతరణకు అనువైన స్థలాన్ని చూపెట్టారు, మా డిటాచ్‌మెంటు పీరు అనేక విధాల సహాయంచేశారు.

విమానాన్ని మేం ధ్వంసంచేసిన కొద్దిరోజులకుముందు ఒక సంగతి జరిగింది. పాలూ, పెరుగూ, వెన్న, మొదలైన వస్తువులను ఎక్కించుకుని వస్తూన్న ఒక జర్మన్ బండ్ల వరుసను ఎవరోగాని, మా క్యాంపుకి సుమారు ఇరవైకిలోమీటర్ల దూరంలో అడ్డంకొట్టి, బండ్ల వరుసను కాపలాకాస్తూన్న జర్మన్ సైనికులందరినీ హత్యచేసి, ఆ పాల సరకుల్ని స్వాధీనంచేసుకుని, వాటిని ఆ చుట్టుపక్కల రైతులకు పంచిపెట్టేశారు. ఈ సంగతి నేను విన్నప్పుడు : "ఈ పని మరెవరు చేస్తారుగనుక? ఎవరో మన స్కౌట్లే చేసి వుంటారు !" అనుకున్నాను. అలా అనుకుని, కామ్రేడ్లని ప్రశ్నించాను, కాని వారు ఆ సంగతి గురించి తమ కేమీ తెలియదనేశారు. మరి కొన్ని రోజుల తరువాత మళ్ళీ మరొక వార్త : జర్మన్ సాయుధ పోలీసుల జిల్లా సూపరింటెండెంటునీ, ఇద్దరు జర్మన్ సైనికులనూ, జర్మన్లచే ఖైదీలుగా బంధించ బడిన ఐదుగురు సమిష్టి వ్యవసాయదార్లను తీసుకెళ్తూన్న ఒక జర్మన్ లారీని టంకు రోడ్డుపైన ఎవరో అడ్డగించారనీ, జర్మన్లను అక్కడికక్కడే తుపాకికాల్పులకు ఆహుతిచేసి, వ్యవసాయదార్లని విడిపించేసి వారిని ఇళ్ళకు దిగబెట్టేశారనీ. ఈసంగతులను ఖైదునుండి విముక్తిచేయబడిన వ్యవసాయదార్లే స్వయంగా మా గెరిల్లాలతో చెప్పారు.

"ఈ మనుషులెవరో మీరు సరిగా గుర్తుచెప్పగలరా ?" అని గెరిల్లాలు వ్యవసాయదార్లను అడిగారు.

"వాళ్ళు మీలాగే అగపడ్డారు మరి. కాని మేం హడలిపోయున్నామేమో, మాకు ఏదీ జ్ఞాపకంలేదు" అని వారు చెప్పారు.

చుట్టుపక్కల ప్రజలను ప్రశ్నించి భోగట్టా సంపాదించవలసిందనిఅందరి స్కౌట్లనూ ఆజ్ఞాపించాను. పక్షం దినాలు గడచినప్పటికీ మాకు ఏ సంగతీ తెలియ లేదు.

ఆర్మీనియనూ, మంచి సరదామనిషీ, యువకుడూ అయిన నెపోలెయోన్ సర్గొస్యాన్ నాయకత్వాన మా స్కౌట్ల గ్రూపు ఒకటి కొత్త అవతరణ క్షేత్రంకోసం వెతకుతూ తానిదివరకు ఎరగని ఒక గ్రామాన్ని సమీపించింది.

గ్రామానికి సుమారు మూడువందల మీటర్ల దూరంలో వున్న ఒకఅడవి అంచున సర్గొస్యాన్ తన మనుషులను ఆపి, వారితో ఇలా అన్నాడు :

"మీరిక్కడే వుండండి. నేను ఒక్కడనే వెళ్ళివస్తాను."

తన గుడ్డటోపిమీద వున్న ఎర్రనక్షత్రం కనబడకుండా వుండేందుకని

టోపీని వెనక్కి తిప్పేసుకుని, ఆ విధంగా అతడు చప్పున మారువేషం వేసుకుని, తన సబ్ మెషీన్ గన్నుని తన పక్కనున్న కామ్రేడుకి ఇచ్చివేసి, తను ఒక్కడే ఆ గ్రామంలోకి వెళ్ళాడు

గ్రామం పొలిమేరను తనకు అగపడిన మొట్టమొదటి గుడిసె దగ్గరకు అతడు వెళ్ళగా: అతడికి ఓ మనిషి అగపడ్డాడు. ఆ మనిషి గుడిసెలో కిటికీదగ్గర వున్న మరెవరికో సంజ్ఞ చేయటం సర్గొస్యాన్ కనిపెట్టాడు. ఇంతట్లో గుడిసెలో నుంచి రెండో మనిషి బయటకు వచ్చాడు. ఇదేదో కపటోపాయంలా వున్నదే అను కుని సర్గొస్యాన్ వెనక్కి పరుగెడుతుండగా అతడి వెంటే పరుగెత్తారు ఆ ఇద్దరు మనుషులూనూ. అడవి అంచున వున్న సోల్జర్లు ఇదంతా చూసి, అడవిలో దాగు న్నారు. నిరాయుధుడై వున్న సర్గొస్యాన్ని కాపాడేందుకని అతని కామ్రేడ్లు తుపా కులు పేల్చడానికి సిద్ధంగా వున్నారు. కాని సర్గొస్యాన్ని వెంబడించినవారిలో ఒకడు తమను బిగ్గరగా పిలవడం వారికి వినబడింది. ఆ పిలుపులో కేవలం స్నేహభావమే వుంది.

"ఏయ్, అబ్బాయ్! ఆగు, నీతో మాట్లాడాలి మేం!"

సర్గొస్యాన్ తన మనుషులను చేరుకుని, తన సబ్ మెషీన్‌గన్నుని తీసుకుని శత్రువువైపు తిరిగి :

"ఆగండి! లేకుంటే తుపాకి పేల్చుతా!" అని కేకవేశాడు.

కాని ఆ పరాయివాళ్ళు ఆ మాటలు వినిపించుకోలేదు. వాళ్ళిద్దరిలోనూ కాస్త పొట్టిగా కుదుంరా వుండి నీలిరంగు కళ్ళున్న మనిషి సర్గొస్యాన్ దగ్గరకు వచ్చి :

"టోపీ వెనక్కితిప్పి పెట్టుకునే కంటె, మామూలుగా పెట్టుకుంటేనే మంచిదయ్యా! టోపీపైన నక్షత్రం చూసి నేను స్తిమితపడ్డాను. నక్షత్రం వుంది కాబట్టి ఇహ ఫర్వాలేదు!" అన్నాడు.

"అంటే?"

"అంటే. ఇహ ఫర్వాలేదు, మీరూ మేమూ స్నేహితులం అన్నమాట. నా పేరు నికొలాయ్ క్రుస్తితిన్‌స్కియ్. మీ కమాండరుతో మాకు మాట్లాడాలనుందని చెప్పండి. ఇక్కడ ఒక చిన్న గ్రూపు వుంది, మేమూ గెరిల్లాలమే" అన్నాడా మనిషి.

సంభాషణ స్నేహభావంతో జరిగింది. వారూ మేమూ ఎక్కడ కలుసుకో వడమో ఏర్పాటు చేసుకున్నాం. జర్మన్ల మీద జరిపిన గెరిల్లా దాడిలో తనకి దొరికిన వెండి పట్టాకత్తిని—జర్మన్ జిల్లా కమాండెంట్లు సాధారణంగా ధరించేటటువంటిదానిని—స్త్రుతిన్స్కీయ్ సర్గొస్యాన్‌కి స్నేహచిహ్నంగా బహూమానం చేశాడు.

సర్గొస్యాన్ క్యాంపుకి తిరిగివచ్చి, ఈసమావేశం గురించి నాతో చెప్పాడు. కాని తన సబ్‌మెషీన్‌గన్నుని తన కామ్రేడ్‌కి తను యివ్వడం గురించి కానీ, తాను తన మనుషుల దగ్గరకు పసగెత్తడం గురించి కానీ అతడు నాతో చెప్పలేదు. ఈ బహూమానం గురించీ చెప్పలేదు.

సర్గొస్యాన్‌తో నేను మాట్లాడిన మరుచటి రోజున "మనం జయించి తీరుతాం" అనే మా వార్తాపత్రిక తాజా సంచిక వెలువడింది. అందులో ఒక వ్యంగ్య చిత్రం వుంది. వ్యంగ్యచిత్రంలో సర్గొస్యాన్ తన గుడ్డటోపీని యిటించటు తిప్పి పెట్టుకుని, చేతులు జేబుల్లో పెట్టుకుని డాబుగా నడుస్తూన్నట్టూ, అతని సబ్‌మెషీన్ గన్ను పట్టుకుని ఏమీ అర్థంకాక ఆశ్చర్యపడుతూన్న గెరిల్లా అతడి వెనకవున్నట్టూ వుంది.

పత్రిక వెలువడిన సమయానికి అతడు క్యాంపులో లేకపోయాడు. అందు చేత ఈ విషయం గురించి అతని దగ్గరనుండి సంజాయిషీ అడగలేకపోయాను. నా ఆజ్ఞపైన అతడు స్త్రుతిన్స్కీయ్ దగ్గరకు వెళ్ళాడు.

మరికొద్ది సేపటికల్లా అతడు తిరిగి వచ్చేశాడు.

"అతణ్ణి తీసుకువచ్చావా?" అని సర్గొస్యాన్ని అడిగాను.

"తీసుకొచ్చాను, కామ్రేడ్! కమాండర్!"

"ఈ బొమ్మ చూశావా!" అంటూ ఆ వ్యంగ్యచిత్రాన్ని అతనికి చూపెట్టాను.

కుర్రాడు తెల్లబోయాడు.

"ఇది నిజమే!"

"నిజమే"

"ఈ పని ఎలా చేయగల్గావు? నీ తుపాకి మరొకడికి ఎలా యివ్వగల్గా వంటా!"

"నా తప్పు క్షమించండి, కామ్రేడ్ కమాండర్!"

"మరొకసారి యిలా జరక్కూడదు! ఇహ వెళ్దాం మనం" అన్నాను.

సర్గొస్యాన్ తనతోకూడా తీసుకొచ్చిన మనుషుల దగ్గరకు వెళ్ళాం.

వాళ్ళు తొమ్మండుగురూ మా కోసం క్యాంపు చివరి గుడారం దగ్గర కాచుకునున్నారు. వారిలో కొందరి దగ్గర "CB" సెల్ఫ్‌లోడింగ్ రైఫిళ్ళూ, జర్మన్ కార్బైన్లూ, పిస్తలూ వున్నాయి. వాళ్ళ జేబుల్లోనుండి జర్మన్ చేతిబాంబుల పిడులు, ఉడికించిన ఉర్లగడ్డలను ముద్దచేసేందుకు ఉపయోగించే గరిటెల్లా పైకి అగపడుతున్నాయి. ఇవే కాకుండా వాళ్ళు తీసుకొచ్చిన ఒక మెషీన్‌గన్ను కూడా వుంది. వయసుమళ్ళి, మీసాలున్న వ్యక్తి వారిలో వుండడం చూసి :

"ఈ దళానికి నాయకుడు ఎవరు?" అని అడిగాను. అతడే దళనాయకుడని అనుకున్నాను, కాని నేను పొరపడ్డాను. ఒక యువకుడు ముందుకు వచ్చాడు.

"నికొలాయ్ స్త్రితీన్‌స్కీయ్!" అని అతడు తనకుతానే పరిచయంచేసుకున్నాడు.

"మీరు చెప్పదలచుకున్నదేదో చెప్పండి" అన్నాను.

"మీ డిటాచ్‌మెంటులో చేరాలని వుంది మాకు."

"'మాకు' అంటే?"

"మేమందరం యించుమించు ఒక కుటుంబంలో వారమే. ఈయన మా తండ్రి" అని, మీసాలున్న ముసలాయనకేసి చూపించాడు. "వీరు ముగ్గురూ నా తమ్ముళ్లు—జోర్జ్, రొస్తిస్లావ్, వ్లదీమిర్. వీరిద్దరూ మా గ్రామంలోని సమిష్టి క్షేత్రపు వ్యవసాయదార్లు. ఇకపోతే—వీరు రోవ్నొ కాన్సెంట్రేషన్ క్యాంపులోనుంచి తప్పించుకుని వచ్చిన మనుషులు. మొత్తం తొమ్మండుగురం."

నేను వింటూన్నంతసేపూ స్త్రితీన్‌స్కీయ్‌లను—తండ్రినీ, కొడుకుల్నీ—పరిశీలనగా చూస్తూనే వున్నాను. వయస్సులో నిచ్చెన మెట్లలా వున్నారు — తండ్రి, నలుగురు కొడుకులూ. కొడుకుల వయస్సుల్లో అట్టే తేడా లేదు—ఏడాదో, ఏణ్ణర్ధమో. కుర్రాళ్లు బలంగా ఆరోగ్యంగా వున్నారు, అన్నదమ్ములందరిదీ యించుమించు ఒకటే పోలిక. తండ్రిది కుదురైన విగ్రహం, నీలిరంగు కళ్ళు, మనిషి కాస్త పొట్టిగా లావుగా వుంటాడు. తండ్రి రూపు రేఖలే కొడుకులవి కూడానూ.



నికొలాయ్ కుజ్నెత్సోవ్ - జర్మన్ ఆర్మీ ఆఫీ
సరు యూనిఫారంలో.



జర్మన్ల మధ్య జర్మన్ ఆర్మీ ఆఫీసరు యూని
ఫారంలో నికొలాయ్ కుజ్నెత్సోవ్ (ఎడమనుండి
రెండవ వ్యక్తి).



క్యాంపులో గెరిల్లాలు కట్టుకున్న ఒక గుడిసె.
సోవియట్ సమాచార శాఖ ప్రసారం చేస్తున్న
రేడియో వార్తలను గెరిల్లాలు వింటున్నారు.
*1941 సం. ఫొటో*

యుద్ధశ్రేణి దిశగా ఎర్రసైన్యంలో చేరే ఉద్దేశంతో వాళ్ళ గ్రూపులోనుండి పదకొండుగురు ఇటీవల వెళ్ళిపోయారని నికొలాయ్ స్త్రుత్రీటీన్స్కియ్ చెప్పాడు.

అతడు మెల్లగా, నెమ్మదిగా, మాటలు ఆచి తూచి మాట్లాడుతాడు. అతను మాట్లాడుతూన్నంతసేపూ, తండ్రి పెదవులు కదుపుతూ, తాను కూడా అతడి మాట లనే నిశ్శబ్దంగా పలుకుతూ అతడికేసే చూస్తూ వుంటాడు.

"అనగా, మీరు ఒక పెద్ద గెరిల్లా యూనిట్టుగానూ, అందుకు మీరు కమాండరుగానూ వుండేవారన్నమాట."

"మేం గెరిల్లాలం ఏమిటండీ? జర్మన్లు మమ్మల్ని అలా అనేవారు, అంతే."

"దానికేం గాని, మీరు ఏమేమి విధ్వంసక చర్యలు సాగించారు?"

"మేం ఏం చర్యలు సాగించగలమండీ? మేం కొద్దిమందిమాయె."

"మా గురించి మీ కెలా తెలిసింది?"

"ఎలాగేమిటి? ఇక్కడి వాళ్ళందరూ మీ గురించే చెప్పుకుంటూంటే? మీ కోసం మేం చాలాకాలంనుండే వెతుకుతున్నాం, మీ విమానం తగలబడిన చోటును మేం అప్పుడే చూశాం కూడాను" అన్నాడు.

లెవ్‌చిన్ గ్రామానికి సమీపంలో బ్రహ్మాండమైన పచ్చికబయలు ఒకటి వున్నదనీ, అది చదునుగా వుండి విమానాలు స్వేచ్ఛగా దిగేందుకు మంచి అనువుగా వుంటుందనీ అతడు వెంటనే చెప్పాడు.

వీరిని గురించి నా పొలిటికల్ డెప్యూటీ స్తెహొవ్‌తోనూ, మా రికాన్నిసెన్స్ నాయకుడు లుకిన్‌తోనూ సంప్రతించాను. స్త్రుత్రీటీన్స్కియ్ గ్రూపు అంతటినీ మా డిటాచ్‌మెంటులో చేర్చుకుందుకే మేం నిశ్చయించుకున్నాం.

ఇది జరిగిన కొన్నాళ్ళకు సర్గొస్యాన్ దగ్గర వెండి పట్టాకత్తి వుండడం చూసి, అతణ్ణి అడిగాను :

"ఎక్కడ దొరికింది నీ కిది?"

"కామ్రేడ్ కమాండర్, దీన్ని నాకొకరు బహూమతిచేశారు."

"ఎవరు?"

"స్త్రుత్రీటీన్స్కియ్."

ఆ సంగతి వినడంతో, స్త్రుత్రీటీన్స్కియ్‌ని పిలిపించాను.

"కామ్రేడ్ స్త్రితిన్‌స్కీయ్! ఈ వెండి పట్టాకత్తి మీ కెక్కడ దొరికిం దండీ?"

"ఇదా? జర్మన్లకి పట్టుబడిన కొందరు సమష్టి క్షేత్రపు వ్యవసాయదార్లను మేం విడిపించేందుకు వెళ్ళాం. వాళ్ళను తీసుకుపోతూన్న లారీలోనే జిల్లా సాయుధ పోలీసుల సూపరింటెండెంటు కూడా వున్నాడు. ఈ పట్టాకత్తిని అతడి దగ్గరనుండి లాక్కున్నాం."

"అయితే-ఆ పని చేసినది మీరేనా? ఆ రహస్యం ఇప్పుడు తేలింది! ఆ పొలం సామాను తీసుకెళ్తూండిన బండ్లను పట్టుకున్నది కూడా మీరే, ఏం?"

"అవును, మేమే."

అప్పుడు తెలిసింది మాకు - స్త్రితిన్‌స్కీయ్ కుటుంబం గురించి - ఆ సోవియట్ గెరిల్లా కుటుంబం గురించి అద్భుత వృత్తాంతం యావత్తూనూ.

## గెరిల్లా కుటుంబం

వ్లదీమిర్ స్త్రితిన్‌స్కీయ్ రాతిపనివానిగా ఇంచుమించు తన జీవితమంతా లాద్విపోల్ జిల్లాలోనే గడిపాడు. అతడి భార్య మార్ఫ. వారికి తొమ్మండుగురు సంతానం. పశ్చిమ ఉక్రెయినియా సోవియట్ యూనియన్‌లో తిరిగి ఐక్యంకాబడిన తరువాత ఈ కుటుంబానికి రోజులు మంచి హాయిగా గడిచాయి. వ్లదీమిర్‌కి అసిస్టెంటు ఫారెస్టరుగా ఉద్యోగం దొరికింది.

యుద్ధం ప్రజ్వరిల్లుతుందనగా అందుకు ముందురోజుల్లో అతని పెద్ద కొడుకులు పనుల్లో వున్నారు: నికొలాయ్ రోవ్నోలో డ్రైవరు; జోర్జ్ కేర్చ్ నౌకా నిర్మాణశాఖలో టర్నరు అప్రెంటిసుగా వున్నాడు; రొస్తిస్లావ్, వ్లదీమిరూ తండ్రికి సాయం చేస్తూండేవారు. కడమవాళ్ళు ఇంకా చిన్నపిల్లలు.

యుద్ధం ప్రజ్వరిల్లింది. జర్మన్లు పశ్చిమ ఉక్రెయినియాను పట్టుకున్నారు. ఆక్రమణ తొలిరోజుల్లోనే స్త్రితిన్‌స్కీయ్ పెద్ద కొడుకుల్ని- నికొలాయ్, రొస్తిస్లావ్ లను-జర్మన్లు అరెస్టుచేసి, జర్మనీకి రవాణాచేయబోయారు. కాని వారిద్దరూ క్యాంపు జైలునుండి తప్పించుకుని పారిపోయి, ఒక అడవిలో దాగున్నారు. మరి కొద్దిరోజులకే జోర్జ్ తను ఉన్నచోటనుండి తప్పించుకుని సొంతజిల్లాకి వచ్చేసి, అన్నలిద్దరి తోనూ చేరాడు.

తెల్పుతివి చిత్తు చిత్తు అయి పడివున్న జర్మన్‌టాంకు ఒకటి వారికి కన

బడింది. దానిలో వున్న మెషీన్‌గన్నుని జోర్గ్ విప్పదీసి, దానిని చేతితో పేల్చేందుకు వీలుగా మరమ్మత్తు చేశాడు. ఆ ముగ్గురు అన్నదమ్ములకి వున్న ఆయుధం అదొక్కటే. జర్మన్ సాయుధ పోలీసుని నేలగూల్చి అతగాడి ఆయుధాన్ని సంగ్రహించడంతో యుద్ధంలో తమ స్కోరు మొదలుపెట్టాడు నికొలాయ్.

దీనితో ఆ ముగ్గురు అన్నదమ్ముల గెరిల్లా జీవితం ప్రారంభమైంది. తండ్రికూడా వచ్చి, తన కొడుకు నాయకత్వంకిందే చేరాడు.

ఆ గెరిల్లా గ్రూపు పెద్దదైంది. స్థానికవాసులు – జర్మన్ ఖైదులనుంచి తప్పించుకుని వచ్చేసి అడవులలో తిరుగుతూన్న సమష్టి క్షేత్రపు వ్యవసాయదార్లూ, ఎర్రసైనికులూ–ఒకరూ ఒకరూ వచ్చి ఆ గ్రూపులో చేరారు.

ఈ గెరిల్లా సోదరులను గురించి చుట్టుపక్కల గ్రామాల్లో ప్రజలు చెప్పుకో సాగారు. ఒక దేశద్రోహి ఇచ్చిన ఆచూకీని ఉపయోగించుకుని నాజీలు వీరి ఇంట్లో చొరబడ్డారు. తల్లీ, నలుగురు పిల్లలూ ఇంట్లో వున్నారు. ఆమెను జర్మన్లు బూటుకాళ్ళతోనూ, రైఫిల్ కుండలతోనూ నానా తాపులూ తన్ని, ఆమె ఎదుటే ఆమె పిల్లలను బాది, ఆమె పెనిమిటీ, కొడుకులూ ఎక్కడ వున్నారో చెప్పమన్నారు. వాళ్ళు ఎంత హింసపెట్టినప్పటికీ ఆమె ఏమీ చెప్పలేదు. ఆపైన, వాళ్ళు ఆమె పెడరెక్కలు విరిచికట్టి, భోగట్టా చెప్పని పక్షమందు ఉరికంబానికి వేలాడదీస్తామని బెదిరించారు.

కాని వాళ్ళు ఆమెను ఉరితీయలేదు. ఆమెను వదిలిపెట్టేయడమే మంచిదనీ, ఆమెకు చూడ్డానికని కొడుకులు తప్పక వస్తూవుంటారనీ, అప్పుడు అందరినీ పట్టుకోవచ్చుననీ వారొక మోసపుటెత్తు వేశారు.

రాత్రిపూట వ్లదీమిర్ ఇంటికి వచ్చి, నెమ్మదిగా కిటికీ తట్టాడు. మార్ఫ తలుపు తీసింది: ఆ సంకేతం కోసం ఆమె ఎదురుచూస్తూంది, ఏమంటే తన చిన్న కొడుకు వొలోద్య ఎలాగో ఒకలాగున తండ్రి దగ్గరకు వెళ్ళి, జరిగిన సంగతంతా తండ్రితో చెప్పాడు.

వ్లదీమిర్ భార్యతో ఇలా అన్నాడు:

"ఇదిగో అమ్మీ! నువ్వు చప్పున మూటా ముల్లే సర్దుకుని, కుర్రాళ్ళనీ, ఆడపిల్లనీ తీసుకుని నాతో వచ్చేయ్. నమ్మకస్థుడైన ఓ మనిషి నాకు తెలుసును. అతడు గూడెంలో వున్నాడు. అక్కడకు నిన్ను తీసుకెళ్తాను. వొలోద్య నా దగ్గర అడవిలో వుంటాడు."

వాలోద్యకి పదహారేళ్లు.

మరో నిమిషానికల్లా మార్ఫ బట్టలు కొన్ని మూటకట్టి, పిల్లల్ని లేపింది. అందరూ కలిసి ఆ యింటినుంచి వెళ్ళిపోయారు. వేసవికాలపు రాత్రి కొద్ది గంటలే వుంటుంది. ఆ కొద్ది గంటల చీకటిలోనూ త్రుతీన్‌స్కియ్‌లు పరాయివాళ్ళ కంట బడకుండా స్వగ్రామంనుంచి లేచిపోయారు. మరి నాల్గు రోజులు పోయిన తరువాత జర్మన్లు ఆ యింట్లో చొరబడి ఇంట్లో వున్న సామాన్లను పట్టుకుపోయి, ఇల్లు తగలబెట్టేశారు.

త్రుతీన్‌స్కియ్ కుటుంబం మా కొక పెన్నిధిలా దొరికింది. వాళ్ళందరికీ సార్ని అడవులు క్షుణ్ణంగా తెలుసు. ఆ చుట్టుపక్కల గ్రామాలలోనూ బస్తీలలోనూ వాళ్ళకి బంధుమిత్రాదులెంతమందో వున్నారు. ఇహ అన్నిటికంటే ముఖ్యమైన విషయం: మాకు అత్యంత ఆసక్తిదాయకమైన రోవ్నొ నగరాన్ని వాళ్ళందరూ స్వగ్రామంలా ఎరుగుదురు.

నికొలాయ్ త్రుతీన్‌స్కియ్ తన చిన్న డిటాచ్‌మెంటుకి నాయకుడవటం యాదృచ్ఛికమేమీ కాదు. ధైర్యసాహసాలు, చొరవ, నిదానమైన ఆలోచన అతనిలో చక్కగా మేళవించాయి. తొలిరోజునే గెరిల్లాలు అతనికి "శాంతుడు" అని పేరు పెట్టారు.

మేం మొట్టమొదట జోర్జ్ గురించి ప్రత్యేకమూ ఏమంతగా పట్టించు కోలేదు నికొలాయ్‌కంటె చిన్నవాడు జోర్జ్. తండ్రిలాగానూ, అన్నలాగానూ ఇతనూ పొట్టిగా లావుగా వుంటాడు, ఇతనివి కూడా నీలిరంగు కళ్లూ, తెలుపురంగు జుట్టూను. కాని వాళ్ళకంటె కొంచెము పొట్టి. వాళ్ళకంటె మరింత ప్రశాంతుడూ, మరింత మితభాషి. అతడి నడక మెల్లగా ఊగుతూ వుంటుంది.

"ఈ కుర్రాడు వుత్త బండబ్బాయి!" అన్నాడు ఒకసారి లుకీన్ నాతో.

నేనూ అలాగే అనుకున్నాను. కాని జోర్జ్ గురించి మా అభిప్రాయాన్ని త్వరలోనే మార్చుకున్నాం. యుద్ధచర్యల్లో కొద్దిసార్లు పాల్గొన్న తరువాత ఇతడు భయమంటే ఏమిటో ఎరుగని మనిషి అని అందరికీ తెలిసిపోయింది.

"గనికార్మికుడు తన న్యూమాటిక్ పిక్కాసును ఉపయోగించినట్టే, జోర్జ్ తన మెషీన్‌గన్నుని ఉపయోగిస్తాడు" అన్నాడు నాతో అతడి యూనిట్‌కమాండరు కోల్య ఫదేయెవ్.

జోర్గ్ గొప్ప గురికాడు. అతడి మెషీన్‌గన్నుకి సైలెన్సర్ లేదు, అందు చేత ఘోరంగా శబ్దంచేస్తుంది. అతడి మెషీన్‌గన్ను పేలడం ఆరంభించేసరికి శత్రువుకి హడలుపుట్టిపోయేది. అన్ని రకాల ఆయుధాలను ఉపయోగించడంలోనూ జోర్గ్ అందెవేసిన చేయి అని మాకు తరువాత తెలిసింది. మరి అది ఎలా మొదలైందో కాని, మెషీన్‌గన్నులతోనూ, సబ్ మెషీన్ గన్నులతోనూ, రైఫిళ్ళతోనూ పేల్చడమూ, వాటిని విప్పదీసి శుభ్రంచేసి వాటిని మళ్ళీ అమర్చడమూ —ఈ విషయాలలో జోర్గ్ కదమువారికి శిక్షణ ఇవ్వటం ప్రారంభమైంది. మరి కొద్ది రోజులు పోయిన తరువాత, క్లిష్టమైన యుద్ధచర్యలన్నిటిలోనూ జోర్గ్ పాల్గొనడం మొదలు పెట్టాడు. అతడు పోరాటంలో ఎంత ప్రశాంతంగా వెళ్ళేవాడో అంత ప్రశాంతంగానూ పోరాటంనుండి తిరిగి వచ్చేవాడు, పోరాటం గురించి ఇతరులు చెప్పేది తాను మౌనంగా వినేవాడు.

జోర్గ్‌లో తప్పులెంచి అతణ్ణి మందలించేందుకు ఏకారణమూ వుండేది కాదు, ఇక అతణ్ణి పొగడాలంటే మితంగా మాత్రమే పొగడాల్సి వుండేది. కామ్రేడ్లందరూ అతణ్ణి ఎంతో మెచ్చుకునేవారు, కాని ఎవరైనా అతడి ఎదటే అతణ్ణి మెచ్చుకుంటే మాత్రం అతడు ఎంతో తబ్బిబ్బుపడిపోవడమే కాకుండా, బాధపడిపోయేవాడు: ముఖం ఎర్రబడిపోయి, ఏ చలనమూ వుండేదికాదు, ఇక ముఖం మరీ జేవురించి, క్రమేణ రంగు తగ్గి వెలవెలబారి, శుభ్రంగా తెల్లబడి పోయేది.

రొస్తిస్లావ్ స్త్రుతిన్‌స్కియ్ పందొమ్మిదేళ్ళవాడు, ఉత్సాహవంతుడూ, క్రమశిక్షణాసహితుడైన సైనికుడు. తన అన్నలను అన్నివిధాల అనుకరించేవాడు ఆ కుర్రవాడు.

వొలోద్య స్త్రుతిన్‌స్కియ్‌కి పదహారేళ్ళు వెళ్ళి ఇక పదిహేడో యేడు వస్తుంది. అతడికి చెవుడు వుండటంచేత అతణ్ణి మొదట్లో సప్లై ప్లటూన్‌లో చేర్చుదా మనుకున్నాం, కాని తనకు యుద్ధం చేయాలని వుందని ఆ కుర్రాడు ఒకటే గోల పెట్టాడు. ఎంత చెప్పినా లాభంలేకపోయింది. ఇక ఆ కుర్రవాడి చేతికి తుపాకి ఇవ్వక గత్యంతరం లేకపోయింది. ఏ పోరాటపు యూనిట్టులోనైతే వొలోద్యని చేర్చామో ఆ యూనిట్టు మనుషులు, పోరాట సమయంలో ఇవ్వబడే ఆజ్ఞలు వొలోద్యకి వినబడవని చెప్పి వొలోద్యని క్యాంపులో వుంచేసేందుకు ప్రయత్నించేవారు. యుద్ధం చేయాలని ఆ కుర్రవాడు ఎంతగా ఉబలాటపడ్డాడంటే, చిట్టచివరికి అతడు ఇంచు మించు అన్నిపోరాటాల్లోనూ పాల్గొన్నాడన్నమాటే.

వొలోద్యకి ఆయుధాలమీద ఇంతా అంతా మోజుకాదు. తన తీరిక సమయాన్నంతటినీ తన కార్బైన్ని విడిభాగాలకింద విప్పదీసి, వాటిని శుభ్రంగా తుడిచి, తిరిగి అమర్చడానికే వినియోగించేవాడు. యుద్ధ కథలు వినడమంటే కూడా వొలోద్యకి ఎంతో ప్రీతి, ఎంత ఏకాగ్రతతో కథలు వినేవాడంటే ఆ ఏకాగ్రతకి మెడిగుడ్లు ఉబ్బిపోయి కళ్ళల్లోనుంచి పైకి వచ్చేస్తాయేమో అని భయం వేసేది.

స్త్రిలీన్‌స్కియ్ కుటుంబ పెద్ద వ్లదీమిర్ ఏభై ఐదేళ్ళవాడు. అయినప్పటికీ అతడు మంచి బలమైన మనిషీ, ఆరోగ్యవంతుడూనూ, తల అక్కడా అక్కడా కొద్దిగా నెరుస్తూన్నప్పటికీ, అసలు తెలుపు జుట్టు అవడంచేత నెరిసిన వెంట్రుకలు పైకి అగపడేవికావు మా సప్లై ప్లటూనికి అతణ్ణి డెప్యూటీ కమాండరుగా నియమించాం. ఆహారపదార్థాలనూ, ఇతర అవసరాలనూ సంపాదించడంలో అతడికి అతడే సాటి. అతడికి ఉక్రైనియన్, పోలిష్ భాషలు తెలుసు. రైతులతో మాట్లాడవలసిన తీరుకూడా అతడికి తెలుసు. వృద్ధుడు స్త్రిలీన్‌స్కియ్ ఏ గ్రామంలో అగపడినా సరే, ఆ గ్రామస్థులు ఉర్లగడ్డలూ, కూరగాయలూ, గోధుమపిండి, గోధుమనూక, ఇంకా ఇతర పదార్థాలనూ ఏ నిర్బంధమూ లేకుండా వారంతట వారే ఇష్టపూర్వకంగా ఇచ్చేవారు.

మా "ఆయుధ" సేకరణలో కూడా– అనగా మేం జర్మన్ డిపోలపైనా, సామాను బండ్ల వరుసలపైనా దాడి చేసేటప్పుడు కూడా–మాకతడు గొప్పగా ఉపయోగపడేవాడు. అతడు మంచి లక్ష్యవేధి, పోరాటంలో నిదానస్థుడు.

అతడితో వున్న గొప్ప చిక్కు ఏమిటంటే, అతడిది మరీ మెత్తని మనస్సు. ఇతడు మా సప్లై మేనేజరు కాబట్టి. ఒకానొక జర్మన్ సారా డిస్టిలరీనుండి మేం "తెచ్చుకున్న" ఆల్కహాలు ఇతని అజమాయిషీలో వుంచాం. ప్రధానంగా ఆస్పత్రి అవసరాలకోసమూ, కేవలం కొన్ని ప్రత్యేక సందర్భాల్లోనూ ఆల్కహాలు బట్వాడా చేయబడేది. కాని ఎవరికైనా తాగాలని బుద్ధిపుట్టినప్పుడు, ఆ మనిషి స్త్రిలీన్‌స్కియ్ దగ్గరకు వెళ్ళి:

"జ్వరం కాస్తూందయ్యా, నాకు. ఓ ఏభై గ్రాములు ఆల్కహాలు ఇప్పించుదూ! అది పుచ్చుకుంటే జ్వరం తగ్గిపోతుంది!" అనేవాడు.

లేదా :

"పడిసెం చంపేస్తూందోయ్, బాబూ! ఇన్‌ఫ్లుయెంజా తగిలినట్టుంది!" అనేవాడు. అతగాడు అలా ప్రాధేయపడేసరికి, ముసలాయన ఆ "మందు" కాస్తా ఇచ్చేవాడు.

ఆ విధంగా ఆల్కహాలు సంపాదించిన కామ్రేడ్లను మేం చివాట్లుపెట్టడమే కాకుండా శిక్షించేవారం కూడా. దీన్ని గురించి స్త్రిలిన్స్కియ్‌తో కూడా మేం గట్టిగా చెప్పేవారం. అతడు తబ్బిబ్బుపడుతూ :

"నన్ను క్షమించండి, కామ్రేడ్ కమాండర్! తను జబ్బుగా వున్నానని ఎవరైనా నాతో అంటే, నా మనసు కరిగిపోతుంది" అని సమర్థించుకుంటూ అతడు ప్రత్యుత్తరమిచ్చేవాడు. అందుకు మేం అనేవారం :

"ఎవరైనా జబ్బుగా వుంటే మనకి వైద్యుడంటూ ఒకడున్నాడుగా!"

"అవును, నిజమే" అని అతడు క్షమాపణపూర్వకంగా ఒప్పుకునేవాడు.

మరొకనాడు మళ్ళీ అలాగే జరిగేది. ఆల్కహాలుపై అజమాయిషీని అతడి చేతిలోనుంచి తప్పించివేయడం తప్ప మాకు వేరొక మార్గం లేకపోయింది.

తన భార్య, పిల్లలూ జర్మన్లనుండి తప్పించుకొని దాగున్న పల్లెకు వెళ్ళి, వారు ఎలా వున్నారో చూసిరమ్మని ఒకనాడు వ్లదీమిర్ స్త్రిలిన్స్కియ్ మా స్కౌట్లతో చెప్పాడు.

స్కౌట్లు ఆ పల్లెకు వెళ్ళి, తిరిగివచ్చారు. స్కౌట్లలో ఒకడు నా దగ్గరకు వచ్చి:

"కామ్రేడ్ కమాండర్, ఇదిగో మీ కో వుత్తరం! దాన్ని నా చేతితో నేనే మీకే స్వయంగా ఇవ్వాల్సిందన్నాడండీ ఉత్తరం ఇచ్చిన అబ్బాయి" అన్నాడు.

అతడు ఒక బూడిదరంగు కాగితపు ముక్కను నా చేతికిచ్చాడు. దాని పైన పెన్సిలుతో ఇలా రాసివుంది:

"గెరిల్లా డిటాచ్‌మెంటు కమాండరుకి వసీలియ్ స్త్రిలిన్స్కియ్ పెట్టుకున్న దరఖాస్తు. నాకు గెరిల్లా డిటాచ్‌మెంటులో చేరాలని వుంది. నేను అక్కడకు వచ్చేటప్పుడు కమాండరుకి ఎన్నైనా ధన్యవాదాలు చెప్పుకుంటాను. సెలవు వసీలియ్ స్త్రిలిన్స్కియ్ అక్టోబరు 26, 1942. నా అన్నలు గెరిల్లాలు మరి నాకు కూడా గెరిల్లా అవాలనే వుంది."

ఈ చీటిలో తప్పులువున్నందుకు వాస్య*ను మనం క్షమించవచ్చు. వాస్యకి

---

*వాస్య—వసీలియ్‌కి ముద్దుపేరు.—అను.

పదేళ్లే యుద్ధం ప్రారంభమయ్యేసరికి ఆ కుర్రాడు బడిలో ప్రవేశించి ఏడాదేఅయింది. ఆ కుర్రవాడి చీటికి ఏమి జవాబు రాయడమా అని ఆలోచించుతూండగా, ఇంతట్లోకి నికొలాయ్ స్త్రిలిన్‌స్కియ్ అక్కడకు వచ్చాడు.

"ఇదిగో, మీ చిట్టితమ్ముడు దరఖాస్తు పెట్టుకున్నాడయ్యా!" అన్నా నతడితో.

నికొలాయ్ చిరునవ్వు నవ్వి :

"వాడు ఎన్నాళ్ళనుంచో మమ్మల్ని ఇలా వుండనివ్వకుండా వున్నాడు– గెరిల్లాలలో చేరిపోతానో అని ఒక్కలా ప్రాధేయపడుతున్నాడు. కాని నాది ఓ మనవి వుంది కామ్రేడ్ కమాండర్ ! మా కుటుంబం ఇప్పుడున్న చోటు ప్రమాదకర మైనదని మన కామ్రేడ్లు నాతో చెబుతున్నారు. మా కుటుంబం ఎక్కడ వున్నదీ జర్మన్లు పసికట్టేశారట. మా కుటుంబాన్ని మన క్యాంపుకి తీసుకువచ్చేసేందుకు అనుమతించాల్సిందని మిమ్మల్ని కోరుతున్నాను" అన్నాడు.

నేను సరే అన్నాను. మరి నాలుగురోజులకల్లా మార్ఫ స్త్రిలిన్‌స్కయ తన ముగ్గురు పిల్లల్నీ, స్త్రిలిన్‌స్కియ్ చెల్లెలు కూతురు యాద్వ్యని తీసుకుని క్యాంపుకి వచ్చేసింది. గెరిల్లాలలో చేరుతానని దరఖాస్తు పెట్టుకున్న వాస్య కూడా వచ్చాడు.

మా డిటాచ్‌మెంటులో స్త్రిలిన్‌స్కియ్‌లందరికీ–పెద్దవాళ్ళకీ, చిన్నవాళ్ళకి కూడా – ఎవరికి తగిన స్థానం వారికి లభించింది.

మార్ఫ ఏభైయేళ్ళు దాటిన మనిషే అయినప్పటికీ, పనిలేకుండా ఒక్క క్షణమైనా ఊరకే కూర్చోవడం ఆమెకి చేతకాదు. తను స్వయంగా వచ్చి తనకి ఏదైనా పని ఒప్పజెప్ప వలసిందని అడిగేందుకు ఆమె మొగమాటపడి, తన భర్తని నా దగ్గరకు పంపించింది. పిల్లలను చూసుకోవడంతోనే ఆమెకు సరిపోతుందే అని నేను అనుకుని, ఆమెకు ఏ పని ఒప్పగించేందుకూ మొదట్లో వెనుకతీశాను. నేను అలా వెనుకతీయటంతో, మార్ఫ తన కుటుంబానికి ఇతరులకూ బట్టలు కుట్టడమే కాకుండా గెరిల్లాలకు బట్టలు ఉతకడం పని కూడా మీదవేసుకుని చేయడం మొదలుపెట్టింది. ఒక్కొక్కప్పుడు పగలనక రాత్రనక ఒక్క క్షణమైనా విశ్రాంతిలేకుండా కొన్ని రోజులతరబడి అలా పనిచేసేది ఆమె. ఇది ఎంతో ప్రయాసకరమైన పని అనీ, ఒక ప్లటూనికి వంటచేయడం ఇంతకంటె తేలికైన పని అనీ నాకు అనిపించి, ఆ పని ఆమెకు ఒప్పగించాను. ఆ పనికి ఆమె సంతోషంతో ఒప్పుకుంది. కాని గెరిల్లాలకు బట్టలు కుట్టడం, బట్టలు ఉతకడం మాత్రం ఆమె విడిచిపెట్టలేదు.

వాస్య ఎంత తీవ్రమైన సమరోత్సాహం చూపినప్పటికీ, అతణ్ణి పోరాటవు యూనిట్టులో చేర్చుకోకుండా, సప్లై ప్లటూనులో చేర్చి, గుర్రాలకు సంరక్షణ పని అతనికి ఒప్పగించాం. వాస్యకి చిన్నతనమనిపించి చిరచిరలాడాడు. కాని కొద్ది రోజు లయ్యాక, నా గుర్రం పైనా, ఇతర గుర్రాలపైనా ఆ కుర్రవాడికి ఎంతమోజు కుదిరి పోయిందంటే, ఇక ఆ పనికి పూర్తిగా సమాధానపడిపోయాడు. తనకు ఒప్పజెప్పిన ఈ పనిని చేస్తూ తన తండ్రికి – ఒక విధంగా చెప్పాలంటే, అనధికార అడ్జూ టాంటుగా – సహాయపడుతూ, క్యాంపులో ఇక్కడా అక్కడా పరుగెత్తుతూ, రక రకాల పనులు చేస్తూ వుండేవాడు.

పదకొండేళ్ళ పిల్లడు స్లావ కూడా తండ్రికి సాయంగా వుండేవాడు. యాద్వ ఒక యూనిట్టులో వంటకత్తెగా పనిచేస్తూండేది.

స్త్రితిన్స్కియ్ కూతురు, పదిహేనేళ్ళ కాత్యకి మెడికల్ కోర్‌లో పని చెప్పాం. మెడికల్ కోర్‌లో చేరిన రెండు రోజులకే క్షతగాత్రులకి ఆమె ఎంతో ఇష్టురాలైపోయింది. తన అన్నలా కాకుండా, ఆమె అతి చురుకుగా వుండేది, చక చక పనిచేసేది, ఒక్క క్షణమైనా విశ్రాంతి తీసుకునేదికాదు. ప్రతి క్షతగాత్రుని దగ్గరకు వెళ్ళి :

"నీకు ఏమైనా కావాలా ? నీకు ఏదైనా పనిచేసిపెట్టమన్నావా ?" అని అడిగి, అస్తమానమూ కనుక్కుంటూండేది.

ఏదైనా పనిచెప్పినట్టయితే, జుట్టు నాలుగు పక్కలా ఎగురుతూ ఒక్క పరుగున వెళ్ళి ఆ పని వెంటనే చేసుకుని వచ్చేసేది.

ఒక రోజున ఆమె నా దగ్గరకు వచ్చింది—రావడం కాదు, నాగుడారంలోకి తుర్రున ఎగిరివచ్చిందనే చెప్పాలి. రోజుతుంటూ, రొప్పుతుంటూ మనిషి ఉద్రేకపడి పోతూంది, నీలిరంగు కళ్ళు తళుకు తళుకుమని ప్రకాశిస్తున్నాయి :

"కామ్రేడ్ కమాండర్ ! భోజనం ఏమీ బాగులేదని రోగులు గొణుగు తున్నారు. హెడ్‌క్వార్టర్స్ మెస్‌నుంచి భోజనం వస్తూంది గాని, హితవుగా వుండడం లేదు. ఆ మెస్‌వాళ్ళకి వంట చేతకాదు, వంట ఎప్పుడూ ఒొక్కలాగే వుంటుంది, కొత్తదనమే వుండడంలేదు. రకరకాల జబ్బులవాళ్లున్నారు, ప్రత్యేకం రుచి అయినది ఏదైనా కావాలంటున్నారు. మరి... వాళ్ళకోసం వేరే వంట మొదలుపెట్టితేనే నయం" అని గడగడ గుక్కతిప్పుకోకుండా అనేసింది.

"వాళ్ళకి ప్రత్యేకమూ ఒక కందా కావాలా ?" అన్నానేను నవ్వు

తూనూ. "ప్రత్యేకమూ వంటవాళ్ళను ఎక్కడనుంచి తీసుకురావడం! వాళ్ళకు ప్రత్యేకమూ ఎవరు వండిపెడతారు!"

"నేను వంటచేసి పెడతాను. ఏమి! నేను చేయకూడదా!"

"అయితే సరే!"

మెడికల్ కోర్ కోసం ప్రత్యేకం వంటపెట్టించాం. ఆ వంటసాలకు కాత్యని పెద్ద వంటకత్తెగా నియమించాం. వయసు మళ్ళి గడ్డాలూ మీసాలూ పెరిగిన ఇద్దరు గెరిల్లాలను ఆమెకు అసిస్టెంట్లుగా పెట్టాం. వయసుమళ్ళిన అటువంటి మనుషులు ఆమెను లక్ష్యపెట్టకపోవడంచేత, అన్ని పనులూ తనే చేసుకునేది. పెద్ద మాంసపు ముక్కను తనంతటతానే వంటసాల దగ్గరకు మోసుకువచ్చి, తనంతట తానే దానిని గొడ్డలితో ముక్కలకింద కొట్టి, ఇహప్పుడు వండేది. ఇన్ని పనులూ చేస్తూనే, మధ్య మధ్య తీరికచేసుకుని రోగుల దగ్గరకువెళ్ళి వాళ్ళగురించి కనుక్కుంటూండేది. ఇక మా రోగులూ, క్షతగాత్రులూ ఆ ఉక్రైనియన్ బోర్ష్‌లనూ, పందిమాంసపు వేపుడులనూ, పాలవిరుగుడు బజ్జీలనూ సంతోషంతో ఆరగించి, అవి ఎంతో రుచిగా వున్నాయని కాత్యని మెచ్చుకునేవారు.

## చిట్టి కోల్యా

ఒకనాడు మేము క్లెసొవొ స్టేషనుకి పంపిన ఒక స్కౌట్ల గ్రూపులో నుండి కజకోవ్ దారితప్పిపోయాడు. అనుభవం చాలకపోవడంచేతనూ, తను ఎక్కడున్నదీ స్థాననిర్ణయం చేసుకోలేకపోవడంచేతనూ క్యాంపుకు తిరిగి వచ్చేందుకు దారి తెలుసుకోలేక ఆ రోజంతా అడవిలోనే తిరుగాడాడు. తను ఏ దిశగా వెళ్ళినా, ఒకటి రెండు గంటలు నడిచిన తరువాత, తను బయలుదేరిన చోటికే మళ్ళీ తిరిగివచ్చేవాడు.

ఆ రాత్రి అంతా ఒంటరిగానే అడవిలో వుండిపోయాడు, నెగడి వేసుకుందుకైనా వీలులేకపోయింది. మరునాడు కూడా దారి వెతుకుతూనే అడవిలో తిరిగాడు. ఇక చీకటి పడుతూండదనగా, అంబా అని ఆవుల అరపు వినబడింది. మెల్లగా చటీచప్పుడూ చేయకుండా జాగ్రత్తగా ఆ అరపుల దిశగా వెళ్ళాడు.

మరి కాస్సేపటికి అతడు ఒక ఖాళీజాగా చేరుకున్నాడు. అక్కడ ఆవులూ, ఎడ్లూ మేస్తున్నాయి. గొడ్లకాపరి కుర్రాడొకడు ఓ చెట్టుమీద కూచుని, కర్రవొకదానిని చాకుతో చెక్కుతున్నాడు. కుర్రవాడిది తెల్లని జుట్టు, పీలగా వున్నాడు.

చుట్టుపక్కల మర్వెవరూ లేరుకదా అని చూసి, కజకోవ్ ఆ కుర్రాణ్ణి సమీపించి :

"అబ్బాయ్!" అని పలకరించాడు.

ఆ పిలుపు వినబడేసరికి కుర్రవాడుబెంబేలెత్తిపోయి, చెంగున లేచినుంచుని మిడిగుడ్లు తిప్పుతూ కజకోవ్‌కేసి తేరిచూశాడు.

"అలా బెంబేలెత్తిపోతున్నావెందుకు? నువ్వు ఇక్కడివాడవేనా?"

"ఇక్కడివాణ్ణే" అని కుర్రవాడు జవాబు చెప్పాడు. జవాబుచెబుతూ, కజకోవ్ బుజాన రైఫిలూ, పటకాకి తగిలించివున్న పిస్తలూ, చేతిబాంబులూ చూశాడేమో, కుర్రవాడి ముఖానికి కళవచ్చి : "మరైతే, మామయ్యా, నువ్వు గెరిల్లావా?" అని హుషారుగా ప్రశ్నించాడు.

"అబ్బో, చురుకైన కుర్రాడివేనోయ్, నువు!" అన్నాడు కజకోవ్.

"గెరిల్లాని చూడగానే నేను పోల్చేసుకుంటానే!" అన్నాడా కుర్రాడు తడుముకోకుండా.

"గెరిల్లాలను నువ్వు చూశావా ఏమిటి?"

"చూడలేదు కాని, అందరూ చెప్పుకుంటున్నారు మరి. రూద్న్యి-బొబ్రోవ్ స్కాయ వూరు దగ్గర బోలెడుమంది వున్నారని."

"అక్కడికి చేరుకోవాలంటే ఎటువైపు వెళ్లాలి? అక్కడికి వెళ్ళాలి నేను."

"అక్కడకు వెళ్ళే దారి నాకు తెలుసునే. చూపించమంటావా?"

"చూపించు. నీ పేరేమిటోయ్!"

"కోల్య."

కోల్య తన గురించి యావత్తు వృత్తాంతమూ పూసగుచ్చినట్టు చెప్పేశాడు కజకోవ్‌తో. ఆ కుర్రవాడిది క్లైనోవా. అతడి తండ్రిని నాజీలు చిత్రవధచేసేశారు, తల్లినీ అన్ననూ జర్మనీకి రవాణాచేసేశారు. కోల్య బడికి వెళ్తూండేవాడు. కాని బడి ఇప్పుడు మూసివేయడంచేత తను ఏదో ఒక విధంగా యింత తిని బతుకు వెళ్ళబుచ్చుకుందుకని గొడ్లకాపరిగా పనిచేస్తున్నాడు.

"ఇదిగో, కోల్యా" అంటూ కజకోవ్ కోల్య మాటలకు అడ్డువచ్చి "నేను తిండి తిని రెండ్రోజులు కావస్తోంది. నువ్వు అవుల్ని వూళ్లోకి తోలుకుపోయి, నాకు తినడానికేమైనా తెచ్చిపెడుదూ!" అన్నాడు.

కోల్యా తన కొరకా టప్పుని పేలించి, ఈలవేసి, తన "సరుకుల్ని"—తన మందని కోల్యా అలా అన్నాడు—కూడగొట్టుకుని వూళ్ళోకి వెళ్ళిపోయాడు. బాగా పొద్దుపోయిన తరువాత కోల్యా ఓ జాడీతో పాలూ, కొన్ని అట్లూ, కొంత కావ్యూ పట్టుకుని వచ్చాడు.

"ఇదిగో, మామయ్యా, తిను! యజమానురాలు యిచ్చింది నాకు, నా రాత్రిబువ్వకని."

కజకోవ్ ఆకలితో దహించుకు పోతున్నాడేమో, ఆబతో తిన్నాడు. కోల్యా వెంటనే అడిగాడు.

"మామయ్యా! నన్ను నీతో రానిస్తావా గెరిల్లాల దగ్గరికి?"

"కమాండరు కోప్పడతాడోయ్, కోల్యా! నువ్వింకా చిన్నపిల్లాడివి కదా మరి!"

"నేను చిన్నపిల్లాడినా? నా కప్పుడే పన్నెండేళ్ళు నిండాయి!"

"ఇంకా బొత్తిగా చిన్నపిల్లాడివి!"

"మీ కమాండరు ఒప్పుకోడంటున్నావు కదా, అలాగైతే మనం సొంతంగా ఒక గెరిల్లా డిటాచ్‌మెంటు ఏర్పాటుచేద్దాం. జర్మన్లకి దొరక్కుండా దాగుంటూన్న ప్రజలు ఈ అడవిలో బోలెడుమంది వున్నారు."

కజకోవ్ చిరునవ్వు నవ్వాడు.

"అవును గాని, ఒకవేళ జర్మన్లు మనని పట్టుకుని చంపేస్తే? అప్పుడెలా మరి?"

"మనం దాక్కుంటాం!"

బాగా చీకటి పడిపోయిన తర్వాత, కజకోవ్‌ని కోల్యా ఒక ఇంటి పెరట్లోకి తీసుకెళ్ళాడు. అక్కడ ఒక గడ్డి అటక వుంది. కజకోవ్ ఆ అటకమీద పడు కున్నాడు. ఆ గెరిల్లా సైనికుడు రెండు రాత్రిళ్ళుగా జాగరం చేస్తున్నాడేమో. పడుకుని హాయిగా నిద్రపోయాడు. అటకకి కాస్తదూరంగా కోల్యా ఆ రాత్రిఅంతా అలా పహరా కాస్తూనే వున్నాడు. తెల్లవారేముందు కోల్యా ఆ గెరిల్లానిలేపి, అతనితో కలిసి వెళ్ళిపోయాడు.

ఉదయం అయింది. ఆ గ్రామం రైతులు గొడ్లను మందకని తోలుకు

వచ్చారు, కాని వాళ్ళకి గొడ్ల కాపరి కుర్రాడు అక్కడ ప్రత్యక్షం కాలేదు. కుర్రాడి కోసం గ్రామం అంతా వెతికారు, కాని కుర్రాడు ఎక్కడా అగపడలేదు.

"ఈ వెధవ ఎక్కడికి పోయుంటాడు చెప్మా?" అని వాళ్ళు ఆశ్చర్య పడ్డారు.

ఈలోపున కోల్యా, కజకోవులిద్దరూ ఆ గ్రామం వదలిపెట్టేసి, రూద్న్యీ-బొబ్రోవ్ స్కయ పూరుదిశగా ఎంతోదూరం వెళ్ళిపోయారు.

"అయితే మరి, నన్ను నీతో రానీయనంటావు కదూ, మావయ్యా! పోన్లే నువ్వు రానీయకపోయినా, నేను నిన్ను వదిలిపెట్టనే వదిలిపెట్టను...నీతోనే వస్తాను. అంతేమరి."

దారిలో కర్పీలొవ్క అనే గ్రామం దగ్గర ఆగారు. అక్కడ వున్న పొదల్లో కజకోవ్ దాగున్నాడు. ఏమైనా తినడానికి సంపాదించేందుకని కోల్యా ఆ గ్రామంలోకి వెళ్ళాడు.

ఓ గంట అయాక, ఇంత బ్రెడ్డూ, కొవ్వూ పట్టుకుని కోల్యా అక్కడకు తిరిగివచ్చాడు.

"కర్పీలొవ్క ఫారెస్టు స్టేషను నిండా పోలీసులున్నారని గ్రామంలో చెప్పుకుంటూంటే విన్నాను" అని చెప్పాడు కోల్యా. "ఆ పోలీసులేమో రాత్రంతా మొద్దునిద్దర తీస్తారట. కావలి భటులు అసలు లేనేలేరట. వాళ్ళమీద మనం దాడి చేద్దామా, మావయ్యా?" అన్నాడు కోల్యా.

మరి, వాళ్ళిద్దరూ ఆ పనికి ఎలా దిగారో ఊహించడం నిజంగా కష్టమే. కాని కోల్యా మాటలకి కజకోవ్ లొంగిపోయాడన్నది మాత్రం యదార్థం. "ఏవైనా విజయచిహ్నాలనూ, కొందరు ఖైదీలనూ నేను తీసుకువెళ్ళగల్గితే మంచి గొప్పగా వుంటుంది!" అని కజకోవ్ నిశ్చయించుకున్నాడు.

కజకోవ్ ఆ కుర్రాడికి ఒక చేతిబాంబూ, ఒక పిస్తలూ ఇచ్చాడు. వాళ్ళిద్దరూ రాత్రిపూట సన్నసన్నగా ఫారెస్టు స్టేషను దగ్గరకు వెళ్ళారు. స్టేషను ముందు ఓ బండి వుంది, బండికి కట్టిన గుర్రం నెమ్మదిగా కసవు మేస్తూంది. కజకోవూ, కోల్యా స్టేషనులోపలికి వెళ్ళారు. పోలీసులందరూ, కొందరు టేబిలుమీదనూ, కొందరు నేలపైనా కాళ్ళు పారజాపుకుని గుర్రుపెట్టి నిద్రపోతున్నారు.

"చేతులెత్తండి!" అని కేకవేశాడు కోల్యా, తన చేతిబాంబును పైకెత్తి.

కజకోవ్ తన రైఫిల్‌ని సిద్ధంగా పట్టుకున్నాడు.

పోలీసులు చెంగున లేచి, ఇంకా నిద్దర మత్తులోనే వినయవిధేయతలతో చేతులెత్తారు.

"బయటికి నడవండి! మీ రైఫిళ్ళను బండిలో పడేయండి!" అని కజకోవ్ ఆర్డరుచేశాడు.

పోలీసులు మారుమాటాడకుండా బూట్లు తొడుక్కుని, కిక్కురుమనకుండా తమ రైఫిళ్ళను పట్టుకుని గుడిసెలోనుంచి బయటకి వచ్చేశారు.

కజకోవ్ గుడిసె గుమ్మంలో నుంచున్నాడు, కోల్యా చేతిబాంబూ పిస్తలూ పట్టుకుని బండి దగ్గరకు వెళ్ళాడు.

తల్చుకుంటే నిజంగా నవ్వొవస్తుంది, చిత్రమే అనిపిస్తుంది—ఐతే ఏం, ఒక గెరిల్లా సైనికుడూ, ఒక చిన్న కుర్రాడూ ఇద్దరూ కలిసి ఒక పెద్ద గ్రూపు పోలీసులను నిరాయుధులను చేశారు, ఇంతకీ ఈ కథ మాత్రం హాస్యరసంతోనే అంతమైంది.

ఆయుధాలన్నీ బండిలో పడిన తరవాత, కజకోవూ కోల్యా పోలీసులను వరుసలో నిలబడమని ఆర్డరుచేసి, వారిని ఆ గ్రామంలోనుంచి అథమం నలభై కిలో మీటర్ల దూరంగా వున్న మా క్యాంపు దిశగా నడిపించారు. సాయంకాలమైంది. ఇక విశ్రాంతికని ఒక గూడెంలో ఆ రాత్రికి ఆగారు. రాత్రి నిద్రపోతున్నప్పుడు, పోలీసులు మెల్లగా లేచి, చడీచప్పుడూ లేకుండా తమ ఆయుధాలను పట్టుకుని పారి పోయారు. మన "వీరుల" నిద్దరిసీ వాళ్ళు ఏమి చేయకుండా వదిలిపెట్టి వెళ్ళిపోవడం నిజంగా ఆశ్చర్యమే!

కోల్యా కజకోవ్‌ను వదలిపెట్టకుండా అతనితో కూడా క్యాంపుకి వచ్చాడు. కామ్రేడ్లందరూ ఆ కుర్రవాణ్ణి ఎంత ఆపేక్షతో ఆదరించారంటే, ఇహ వాణ్ణి డిటాచ్ మెంటులోకి తీసుకోకుండా వుండడం కేవలం అసాధ్యమైపోయింది.

కోల్యా క్యాంపుకి వచ్చిన మరునాడు నేను ఆ అబ్బాయిని చూశాను. కొందరు గెరిల్లాలతో కూచుని కబుర్లు చెబుతున్నాడు—చిన్నపిల్లాడు, తెల్లని జుట్టు, అర్భకుడు.

"నీ పేరేమిటి, అబ్బాయ్?" అని అడిగాను.

"కోల్యా" అని జవాబుచెప్పాడు, అక్కడున్న అందరి గెరిల్లా సైనికుల లాగానే తనుకూడా అటెన్షన్‌మీద నిలబడి.

"మాతో వుండాలనుందా నీకు ?"
"వుండాలనుందండి।"
"అయితే, నువ్వు ఏ పనిచేస్తావు!"
"ఏ పని చేయమని ఆర్డరిస్తే ఆ పని చేస్తానండి।"
"సరే। నువ్వు గొర్రెల కాపరిగా వుండు।" అన్నాన్నేను గంభీరంగా.

"వుండను... ఇదివరకు గొర్రెల కాపరిగా వున్నాను... జర్మన్ల మీద యుద్ధం చేయాలనుంది నాకు."

"సరేలే, నువ్వు మాతోనే వుండు... కాని గొప్ప చిక్కొచ్చి పడింది : మా దగ్గర తొమ్మిదుమంది నికొలాయ్‌లు వున్నారు. నికొలాయ్ ప్రిహోద్కొ, నికొలాయ్ స్త్రిలిన్‌స్కీయ్, నికొలాయ్ గ్నిద్యూక్, నికొలాయ్ కుజ్నెత్సోవ్. చూడగా, ప్రపంచంలో వున్న నికొలాయ్‌లందరూ మన దగ్గరే వున్నట్టున్నారు. అందుకని నిన్ను చిట్టి కోల్య అని పిలుస్తాం. ఏం, నీకు అభ్యంతరం లేదుకదా?"

మొదట్లో కోల్యను గుర్రాలకు సంరక్షణ చేయడంలోనూ, వంటగదిలో ఉర్లగడ్డలు శుభ్రంచేయడంలోనూ, వంటచెరకు మోసుకుని వచ్చి వంటగది దగ్గర పడవేయడంలో సాయం చేసేందుకనీ సప్లై ప్లటూనులో చేర్చాం. తనకి చెప్పిన పను లన్నిటినీ కోల్య మంచి చురుగ్గానూ, సరదాగానూ చేసేవాడు, కాని తనచేతికి రైఫిల్ యెప్పుడు వస్తుందా అని పదేపదే అడిగేవాడు.

అతడు కొత్త రిక్రూట్లందరితోనూ కలిసి శిక్షణపొందేవాడు. అన్ని పరీక్షలూ మొదటితరగతిలో ప్యాసు అయ్యేవాడు. ఎల్లప్పుడూ శుభ్రంగానూనీటుగానూ వుండేవాడు (కోల్యకి* కొత్తబట్టలిచ్చామని వేరే చెప్పనవసరంలేదనుకోండి), సైనిక నిబంధనలు విధించిన ప్రకారం అతని జవాబులు స్పష్టంగానూ, ఖచ్చితంగానూ వుండేవి. ఆ కుర్రవాడిపై నాకుండిన వాత్సల్యాన్ని చూపించేందుకని అప్పుడప్పుడు అతడితో పూరకనే బాతాఖానీ వేయాలని నాకు అనిపించేది, కాని అందుకు ఆ కుర్ర వాడు ఏ అవకాశమూ యిచ్చేవాడుకాడు : సైనికుడికిమల్లే నే సంగ్రహంగా జవాబు చెప్పేవాడు, ఇహ బాతాఖానీకి ఏ అవకాశమూ వుండేదికాదు.

## పండుగ

1942 నవంబరు 6 సాయంకాలం, ఆనాటి కోసమని మేము ప్రత్యేకంగా తెప్పించుకున్న లౌడ్‌స్పీకరును గెరిల్లాలు ఒక బండిపైన పెట్టి, దానిని క్యాంపు నట్టి నడుమను వుంచి, దానిచుట్టూ చేరారు.

---

* కోల్య — నికొలాయ్‌కి ముద్దుపేరు — అను.

ఏరియల్ తీగె మరీ పొట్టిగా వుందేమో అని లీద షెర్‌స్తిన్యోవ ఆందోళన పడుతూ రేడియో రిసీవరు చుట్టూ తచ్చాడుతూ హడావుడిపడుతూంది.

ఈ రేడియో ప్రసారం గురించి బాధ్యతతీసుకున్న వాన్య స్త్రోగోవ్ కూడా లీదతో సమంగానే ఆందోళన పడుతూన్నప్పటికీ, ఆమెను సముదాయించుతూ :

"అంతా సరిగానే వుంది, మరేం ఫర్వాలేదు, లీదః ఏరియల్ ఓ కిలో మీటరుందిలేః" అన్నాడు.

ఆ ఏరియల్ గురించే గత నాలుగైదు రోజులనుంచీ అందరూ మాట్లాడుకుంటున్నారు.

లౌడ్‌స్పీకరు తటాలున గరగర చప్పుడు చేయడం మొదలెట్టింది అస్పష్ట ధ్వనులు వినబడ్డాయి మాకందరికీ. వాన్య ఏవో గుబ్బ లిప్పాడు, అందరం "హమ్మయ్యాః" అంటూ నిట్టూర్చాం. మాస్కోనుంచి కాన్సర్టు ప్రసారమవుతూంది. మాస్కోనుండి ప్రసారం వినడం ఈ ఐదునెలలోనూ మాకిదే మొదటి పర్యాయం. మాకు ఇంతవరకూ మాస్కోనుండి అధికారాదేశాలు మాత్రమే అందుతూండేవి.

రేడియో ఆపరేటర్లు లీద షెర్‌స్తిన్యోవ, వాన్య స్త్రోగోవ్‌ల ముఖాలు సంతోషంతో వెలిగాయి.

కాన్సర్టు వినాలని మేమంతగా ఆత్రపడలేదు. అక్టోబరు విప్లవదినోత్సవ సందర్భంలో జరిగే సమావేశపు ప్రసారాన్ని వినేందుకే మేం ఎంతో ఆత్రపడి, అందుకు నిరీక్షిస్తూ అక్కడ కూర్చున్నాం.

మేము స్వయంగా చేసుకున్న ఒక చెక్క టేబిలు దగ్గర నలుగురు గెరిల్లాలు కాగితాలు ముందు పెట్టుకుని, సూదిమొనలా సన్నంగా చెక్కిన పెన్సిళ్ళు పట్టుకుని, ఆ రాబోయే ప్రసారాన్ని రాసుకుందుకు సిద్ధంగా కూచున్నారు.నలుగురూ కూడా రాసుకుంటారు : ఒక మాటను రాసుకోవడం ఒకడు ఒకవేళ తప్పినా, మరొకడు ఆ మాటను తప్పకుండా రాసుకుంటాడు.

అక్టోబరు మహావిప్లవం ఇరవై ఐదవ వార్షికోత్సవ సందర్భంగా జరగబోయే సమావేశపు కార్యకలాపం మాస్కోనుండి ప్రసారంచేయబడనున్నదనే వార్తను మాస్కో రేడియో ఎనౌన్సరు సుమారు ఆరుగంటలకు ప్రకటించాడు ఆ వార్తకోసమే యావత్తు దేశమూ నిరీక్షించుతూంది. సార్విమహారణ్యాలలో తుంపరగా

పడుతూన్న వానలో ఒక రేడియో రిసీవరు చుట్టూ చేరిన గెరిల్లాలము ఆ వార్త వినేందుకే అతి ఆత్రంతో నిరీక్షించుతున్నాం.

అరణ్యమందంతా నిశ్శబ్దం నెలకొంది. మనుషులు ఊపిరి బిగబట్టేందుకు సహితం ప్రయత్నించారు.

మేము రాజధానికి వెయ్యికిలోమీటర్ల దూరాన వున్నప్పటికి, దేశంలో జరుగుతూన్న యావత్తు సంగతులను గురించీ, దేశరక్షణ మహాయుద్ధంలో వివిధ యుద్ధశ్రేణుల పరిస్థితులను గురించి మేం తెలుసుకోగల్గాం.

మాస్కోవద్ద తిప్పికొట్టబడిన నాజీలు వేసవికాలంలో తమ రిజర్వ్ సేనలను మోహరించి నైరుతిదిశగా యుద్ధశ్రేణిని ఛేదించుకుని, ఇప్పుడు వొరోనెజ్, స్టాలిన్ గ్రాడ్, నొవొరొసీయిస్క్, ప్యతిగోర్స్క్, మొజ్దోక్ ప్రాంతాలలోకి వచ్చారు.

అయినప్పటికీ బహిరంగ యుద్ధంలో మన సైన్యం శత్రువుని చీల్చి చెండాడి వెనక్కి తరిమికొట్టి తీరుతుందని, కడమందరి ప్రజలలాగానే మేము కూడా ఒక్క నిమిషమైనా సందేహించలేదు

శ్రమ శ్రేణిలోనూ యుద్ధశ్రేణిలోనూ, సాధించిన విజయాలతో వార్షికోత్స వాలను జరుపుకోవడం సోవియట్ ప్రజలకు ఒక సత్సాంప్రదాయమైంది.

ఆ నవంబరు 7 ను నాజీలు జ్ఞాపకం వుంచుకునేందుకని ఆ దినాన్ని మా సొంత గెరిల్లా రీతిని మేం జరుపుకొందుకు నిశ్చయించుకున్నాం.

ఈ వార్షికోత్సవానికి ఎంతో ముందుగానే, రెండు శత్రు రైళ్ళను పట్టాల నుండి తప్పించివేసేందుకు మేమొక పథకం వేసుకున్నాం. ఈ కార్యాన్ని సాధించేం దుకని నవంబరు 7వ నాటి ముందరి సాయంకాలం, వార్షికోత్సవం గురించి నివేదిక విన్నతరువాత, రెండు గ్రూపులు— ఒకటి షష్కోవ్ నాయకత్వంకింద, రెండోది మాలికొవ్ నాయకత్వంకింద— బయల్దేరాయి. నవంబరు 7 మధ్యాహ్నానికి షష్కోవ్ తిరిగి వచ్చేసి:

"కామ్రేడ్ కమాండర్ ! అక్టోబరు మహావిప్లవం ఇరవైఐదవ వార్షికోత్స వం జ్ఞాపకార్థం నిర్ణయించబడిన కార్యాన్ని నెరవేర్చడమైంది. శత్రుసైనికబలాలనూ, సాంకేతిక సామగ్రినీ తూర్పుదిశగా రవాణాచేస్తూన్న రైలు ఒకటి పేల్చివేయబడింది" అని రిపోర్టు ఇచ్చాడు.

ఆ రోజు సాయంకాలానికల్లా మాలికొవ్ కూడా తిరిగివచ్చేశాడు. అక్టోబరు

మహావిప్లవ వార్షికోత్సవానికి కానుకగా, యుద్ధశ్రేణికి శత్రు సాంకేతిక సామగ్రిని తీసుకువెళ్తున్న ఒక రైలు పట్టాలనుండి తప్పించివేయబడిందని అతడు కూడా రిపోర్టు ఇచ్చాడు.

వార్షికోత్సవదినాన మేము అడవిలో క్రీడా సమావేశం జరుపుతున్నాం. క్యాంపుకు సుమారు ఒక కిలోమీటరు దూరంలో వున్న ఒక బయలు జాగాలో మా ఐదు ప్లటూన్లూ తమ సైనిక పటిమను ప్రదర్శించాయి. చేతిబాంబును దూరంగా విసరడమూ, టార్గెట్ మీద విసరడమూ, చెట్టు ఎక్కడమూ, అడ్డంకులను దాటడమూ-వీటిలో పోటీలు ఏర్పాటు చేశాం.

హాస్యాలకి, తమాషాలకి ఏ లోటూ లేకపోయింది - పోటీదార్లలోకంటె "ఫాన్స్"లోనే ఉద్రేకం మరింత తీవ్రంగా పెల్లుబికింది. వీరు గెలుస్తారా, వారు గెలుస్తారా అని అంతకుముందు కొన్ని రోజులనుండే వాగ్యుద్ధం చెలరేగుతూండెను. ఫాన్సు అందరిలోనూ వృద్ధుడు స్తుప్రితిన్స్కియ్, లుకిన్, కొచెత్కోవ్‌లలోనే ఉత్సాహం మరింతగా పెచ్చుపెరిగింది.

వ్లదిమిర్ స్తుప్రితిన్స్కియ్: "ఏడ్చినట్టే వుంది!" అనో, లేక: "తగలేశాడోయ్, బాబూ, తగలేశాడు!" అనో అరుస్తూ చిందులు తొక్కేవాడు, ఓడిపోతూన్న పక్షాన్ని ప్రోత్సాహపరుస్తూ ఇటూ అటూ తిరుగుతూండేవాడు లుకిన్. ఇక కొచెత్కోవ్ నవ్వు ఎంత బిగ్గరగా వుండేదంటే, దగ్గర నుంచున్నవారి చెవులు చిల్లులుపడి తీరాయన్నమాటే.

టగ్-ఆఫ్-వార్ జరుగుతూన్నప్పుడు ఉద్రేకం మరీ జోరైపోయింది.

"కాస్త బలంగా లాగండి!" అని ఓ జట్టు ప్రోత్సాహకులు అరిచారు.

"ఏం లాగుతారు? బలం కాస్తా నీళ్ళు కారిపోయిందిగా!" అని ఇందుకు జవాబు వచ్చింది.

ఒక జట్టు మనుషులు బలహీనపడిపోయి, పట్టు జార్చేశారు. దాంతో గెల్చిన జట్టు మనుషులు ఒకరిమీద ఒకరు వెల్లకిలా పడ్డారు. అందుపైన అందరూ పకాలున నవ్వారు—ఆ నవ్వుతో అడవి అంతా దడదడ దద్దరిల్లింది.

పండుగ వేడుక కడపటి భాగం మా ఔత్సాహిక నటబృందం ఇచ్చిన కాన్సర్టు. "ప్రియతమ నగరమా, మీద్కోలు!" అనే అందరకూ తెలిసిన బృంద గీతంతో కాన్సర్టు ప్రారంభమయింది. గీతం మొదటి పాదాలను కొందరు పాడగా, ఇక ఆ తరువాత బృందం అంతా కలిసి పల్లవి ఎత్తుకుంది. ఈ గీతం అయిన తరు

పాత, "కత్యూష" పాట. అది అయినతరువాత, వ్లదీమిర్ స్త్రితీన్‌స్కియ్ తటాలున లేచి, సంగీతాన్ని రెండు చేతులతోనూ కండక్టుచేస్తూ, "ద్నీప్ర్ నది గర్జిస్తూంది, శోదిస్తూంది" అనే పాటను మొదలుపెట్టించాడు. మందహాసంతో తమ అంగీకారాన్ని వ్యక్తంచేస్తూ ప్రేక్షకులందరూ కలిసి ఆ పాట పాడారు.

దీని తరువాత ఇక నర్తకుల వంతు వచ్చింది. ఉక్రైనియన్, రష్యన్, జార్జియన్, చెచెన్‌క నృత్యాలను అమితోత్సాహంతో ప్రదర్శించారు నర్తకులు. ఆటు తరువాతి "సుద్దులు" ఏమంత విరామం లేకుండానే చప్పచప్పున అయిపోయాయి. వీటిలో ఒకటి, యుద్ధంముందు వాఙ్మయ విభాగంలో విద్యాధ్యయనం చేస్తూండిన మచెరేత్‌చే పద్యపఠన. మచెరేత్ నెగడి ఎదుటకు వచ్చి:

"నికొలాయ్ తిహానొవ్ రచించిన 'ఇరవై ఎనమండుగురు గార్డ్ తెజీ మెంటు సైనికులు' అనే పద్యం చదువుతాను" అన్నాడు.

ఇక కాన్సర్టు ఇంచుమించు ముగింపుకి వస్తూందనగా, నికొలాయ్ కుజ్నె త్సోవ్ ముందుకు వచ్చాడు. అతడు మంచి ఉత్సాహంగావున్నాడు. ఏ ఉపోద్ఘాతమూ లేకుండానే అతడు గద్యపఠనం ప్రారంభించాడు;

"ఉన్నత పర్వతంపైకి పాకింది గద్దిపాము. చెమ్మగా వున్న గుహలోకి వెళ్ళి, శరీరం మెలికలు చుట్టుకుని, సముద్రంకేసి చూస్తూ పడుకుంది...

"తటాలున...గద్దిపాము పడుకున్న గుహలోకి ఒక డేగ ఆకాశంనుంచి పడిపోయింది. దాని వక్షస్థలం చీలిపోయింది, ఈకలన్నీ రక్తమయమై వున్నాయి..."

కుజ్నెత్సోవ్ నిరాడంబరంగానూ నెమ్మదిగానూ చదివాడు. కాని అతడు ఉచ్చరించిన ప్రతి పదమూ శ్రోతల హృదయకుహరంలోకి చొచ్చుకుపోయింది. తనకు అత్యంత ప్రియతమమైన రచనను అతడు చదువుతున్నాడన్న సంగతి శ్రోత లకు వెంటనే స్ఫురించింది.

నేను గెరిల్లా సైనికులకేసి చూశాను. వారి ముఖాలు గంభీరంగానూ, గురు తరంగానూ వున్నాయి, అదేదో ఒక వింత వెలుగుతో నిండిన కళ్ళతో వారు కుజ్నె త్సోవ్ కేసి చూస్తున్నారు.

తన కంఠస్వరాన్ని ఎత్తకుండానే కుజ్నెత్సోవ్ ప్రతి పదాన్నీ తుంచి ఉచ్చరించుతూ కడపటి పంక్తులను చదివాడు :

"నువ్వు చనిపోవు, నిజమే ; కాని జడుపు ఎరగని దిటవు గుండెలనుండి వెడలే పాటలో నువ్వు ఎల్లప్పుడూ సజీవమైన ఉదాహరణగా, స్వాతంత్ర్యానికి వెలుగుకూ సగర్వమైన పిలుపుగా వుంటావు ;

"ధైర్యవంతుల ఉన్మత్త సాహసాన్ని మా గానంలో కీర్తిస్తున్నాం ;"

మక్సిమ్ గోర్కి రచించిన "డేగ పాట"ను కుచ్నెత్సోవ్ చదవడం విని మేం ముగ్ధులమైపోయాం.

వార్షికోత్సవం జరుపుకొన్న మరి నాల్గురోజులకి, నవంబరు 11నమాస్కో నుండి ఒక విమానం వచ్చి మా క్యాంపు దగ్గర దిగింది. లెన్‌చిన్ గ్రామానికి చేరువను నికొలాయ్‌స్త్రుతిన్‌స్కియే చూపిన అవతరణ క్షేత్రం మంచి అనువైనదిగా తేలింది. ఆ క్షేత్రంలో ప్రతి సెంటీమీటరునూ పరిశీలించి మిట్టపల్లాలను అన్నిటినీ చదునుచేసేశాం. దానితోపాటు అక్కడకు నాలుగు కిలోమీటర్ల దూరంలో వున్న ఒక గస్తీ బురుజును రంపంతో కోసివేశాం. ఈ పనిచేసినందుకు అక్కడి రైతులు ఎంతో సంతోషించారు, ఏమంటే ఆ బురుజు శిథిలావస్థలో వుండి ఎప్పుడు కూలి పోయి, ఏ ప్రమాదమే జరుగునో అని వారు భయపడుతూండేవారు.

అక్కడకు విమానం వస్తుందనగా ఆ ముందురోజు, అవతరణ క్షేత్రానికి సుమారు తొమ్మిది కిలోమీటర్ల దూరంలో వున్న మిహాలినో గ్రామానికి పెద్ద నాజీ దళం ఒకటి మోటారు లారీలలో వచ్చి అక్కడ మకాం చేసింది. ఆ రోడ్డువెంట మాటువేసుకుని వుండవలసిందనీ, ఏమైనా సరే జర్మన్లను మాత్రం ఆ రోడ్డుమీదుగా వెళ్ళనివ్వకూడదనీ మేము ఖచ్చితమైన ఆదేశాలనిచ్చి మా మనుషులను పంపించాం.

అవతరణ క్షేత్రం ఎక్కడవున్నదీ సరిగా తెలిసేందుకని నలభై, ఏభై కిలోమీటర్ల దూరంవరకూ అగపడేటట్లుగా ప్రతి అరగంటకూ ఎరుపురంగూ ఆకు పచ్చరంగూ సిగ్నల్ తారాచువ్వలను వదులుతూండవలసిందని మాస్కో నుండి మాకు ఆదేశాలు అందేయి. ఈ తారాచువ్వల కారణంగా జర్మన్లు దాడిచేసే ప్రమాదా వకాశం మరింత అధికమయింది. అయినప్పటికీ చివరకు అంతా సవ్యంగానే జరిగి పోయింది.

తెల్లవారుగట్ల ఒంటిగంటకు మాకు ఇంజన్ల రొద వినబడింది. నేలమీద మండుతూన్న నెగళ్ళపై టర్పెంటైను పోసేసరికి అవి మరింత వెలుగ్గా మండాయి.

విమానం సురక్షితంగా దిగింది. అందుకు గెరిల్లాలు మాత్రమే సంతో షించలేదు. తమ ఇళ్ళ కప్పులపై నుండి ఎగిరివెళ్ళి, కళ్ళకు మిరుమిట్లు కొలుపుతూ

ప్రకాశించుతూన్న హెడ్‌లైట్లతో అవతరణక్షేత్రం పైన దిగిన విమానాన్ని చూసి రైతులుకూడా ఆనంద భరితులయ్యారు.

విమానం నలభై నిమిషాలే ఆగింది. ఆ వ్యవధిలోనే టపా దించి, మాకు పంపిన కానుకలను మాకు అందించింది. గాయపడినవారినీ, డాక్యుమెంట్లనూ, మా బంధువులకు మేం రాసిన వుత్తరాలనూ, కూలిపోయిన విమానపు సిబ్బందినీవిమానం ఎక్కించుకుంది. కజ్నెత్సోవ్‌కి, నాకూ కనబడిన కుర్రవాడు పీన్య కూడా ఆ విమానంలోనే మాస్కో వెళ్ళిపోయాడు. ఆరోగ్యం కోలుకుందుకు ఇంకా ఎంతో కాలం చికిత్స పొందవలసిన ఫ్లోరెజాక్స్, పస్తనోగొవ్‌లను ఆ విమానంలోనేమాస్కో పంపించేశాము. శత్రువునుండి మేము సంగ్రహించిన విలువైన వస్తువులను కూడా ఆ విమానంలోనే మాస్కో పంపించేశాము. ఈ వస్తువులను, మేం విధిలేక తగల బెట్టేయవలసివచ్చిన విమానానికి ప్రత్యామ్నాయంగా మరొక విమానాన్ని నిర్మించేం దుకు మా వంతు విరాళంగా మేం పరిగణించాం.

విమానం ఎగిరి, ఖాళీజాగాపై రెండు చక్కర్లుకొట్టి, స్నేహసూచకంగా వింగులను డిప్‌చేసి, వెళ్ళిపోయింది.

## మాతృకతంతే బాగుంది

పశ్చిమ ఉక్రైనియా నడిబొడ్డున, పచ్చని చెట్టుచేమల నట్టనడుమ రోవ్నా నగరం విశాలంగా నలుదిశలా విస్తరించివుంది. ఆ నగరం గురించి ప్రత్యేకంగా చెప్పుకోదగినదేమీ లేదు: చిన్న ఒంటి అంతస్తుమేడలూ, హైరోడ్డుమీద మాత్రం అక్కడక్కడా రెండంతస్తుల మేడలూ, ఒకటో, రెండో మూడంతస్తుల భవనాలూ వున్నాయి. అయినప్పటికీ, జర్మన్లు ఉక్రైనియాలో తాము ఆక్రమించుకున్న భూభాగానికి ఈ నగరాన్నే ముఖ్య పట్టణంగా చేసుకున్నారు.

మాకు రోవ్నా ప్రత్యేకమూ ఆసక్తిదాయకమైన నగరమైంది: ఏమంటే, హిట్లర్ ప్రతినిధీ తూర్పు ప్రష్యా గావ్‌లైటరూ* అయిన ఏరిక్ కోక్ నాయకత్వం కింద వున్న ఉక్రైనియా రాష్ట్రపు రైక్స్‌కమిస్సారియాట్ అప్పట్లో ఈ నగరంలోనే వుంటూండేది. గెస్టాపో హెడ్‌క్వార్టర్సూ, మిలిటరీ పోలీసు హెడ్‌క్వార్టర్సూ, ఉక్రైనియాలో వుంచబడిన స్పెషల్ (దండనా) సైనికబలాల కమాండరైన జనరల్ వన్ ఇల్‌గెన్ హెడ్‌క్వార్టర్సూ ఈ నగరంలోనే వున్నాయి. కియెవ్ పట్టణం నాజీల ఆక్రమణలోనే వున్నప్పటికీ, వారు రోవ్నా నగరాన్నే తమ కేంద్రంగా చేసు

---

*గావ్‌లైటర్ – జర్మన్ కేంద్రప్రభుత్వాధికార ప్రతినిధి, – సం.

కున్నారు. యుద్ధ శ్రేణికి ఎంత దూరంగా వుంటే తమకు అంత క్షేమకరమని భావించుకున్నట్టున్నారు జర్మన్లు, చూడగా।

జర్మన్ మిలిటరీ ఆఫీసర్లతోనూ, ఉద్యోగులతోనూ, రెండు చేతులా చులాగ్గా ఐశ్వర్యం సంపాదించుకోవచ్చును కదా అనే ఉద్దేశ్యంతో అక్కడకు వచ్చిన వీరి బంధువులతోనూ ఆ వూరంతా అక్షరాలా కిటకిటలాడిపోతూంది.

ఇటువంటి పరిస్థితులలో, యుద్ధ శ్రేణిలో సైనికబలాల చలనాలూ, పున స్సమీకరణల గురించీ, నూతన రక్షణ శ్రేణుల నిర్మాణం గురించీ, ఆర్థిక చర్యలను గురించీ అసలు జర్మనీలోనే యదార్థంగా జరుగుతూన్న సంగతులను గురించి సోవియట్ హైకమాండుకు అత్యంత ఉపయోగకరమైనట్టి భోగట్టాను రోవ్నాలో సంపాదించవచ్చుననే విషయం స్పష్టంగా అర్థమవుతూనే వుంది. ఈ వూరిలో స్థిర మైన ఆస్కారం సంపాదించుకుందుకే మేం నిశ్చయించుకుని, అందుకు ఏయే చర్యలు తీసుకోవలసి వుంటుందో, ఏ యే పనులు చేయవలసి వుంటుందో అన్ని వివరాలూ ఒక్కొక్కటీ తరచి తరచి అతి జాగ్రత్తగా ఆచి తూచి పథకం ఒకటి తయారుచేసుకున్నాం.

ఈ చర్యలలో తొలి చర్యగా, మా మనుషులలో రోవ్నా నగరాన్ని కుణ్ణంగా ఎరిగి, అక్కడ బంధువులూ, మిత్రులూ వున్నవారినే ఆ వూరిలోకి పంప డానికి నిశ్చయించుకున్నాం. ఇందుకు నికొలాయ్ ప్రిహోద్కోను అందరిలోనూ ప్రథమునిగా ఎన్నికచేశాం. అతడు రోవ్నా ప్రాంతంలోని జ్దొల్‌బునోవాలో పుట్టి పెరిగాడు, యుద్ధంముందు అతడు రోవ్నా స్టేషనులో స్టోర్సు మేనేజరుగా వుంటూండే వాడు. స్టోర్సులో వున్న సామాన్లన్నిటిలోనూ విలవైన వాటిని లారీలో వేసి పంపించివేయడం అయిపోయి, అప్పటికప్పుడే నగరవీథుల్లో యుద్ధం జరుగు తూండగా, ఆ వూరిలోనుండి తరలించివేయబడినవారిలో ఇతడు ఇంచుమించు కడపటి జట్టువాడు.

నికొలాయ్ ప్రిహోద్కోకి ఇరవైవొక్కటో ఏడు వెళ్ళి ఇరవైరెండో ఏడు వస్తూంది.మనిషి ఆజానుబాహుడు, కండలుతిరిగిన శరీరం, అందమైన ముఖం, కనికరపు చూపులు నిండిన గోధుమవన్నె కళ్లు. అతన్ని చూసినప్పుడల్లా నాకు రష్యన్ గాథల్లోని వీరులు జ్ఞాపకం వస్తూంటారు బలంలో అతడు మళ్ళీ భీముడే. ఇహ ఎంత శ్రమ అయినా వోర్చి, ఎంత బాధ అయినా భరించగల్గిన మనిషి, నిర్భయుడు, ఎక్కడైతే ప్రమాదం అధికంగా వుంటుందో అక్కడ తప్పకుండా అగపడే మనిషి.

మా డిటాచ్‌మెంటు సార్ని అరణ్యాలకు వెళ్తూ ఇంకా దారిలోవున్నప్పుడు ఓ సంగతి జరిగింది. తన స్క్వాటు గ్రూపుకంటే ముందుగా అతడు ఒక్కడూ ఓ గ్రామంలోకి వెళ్లాడు. గ్రామంలో వీథి నట్టనడుమ పెద్ద మూక వుంది. ఆడవాళ్ళు మొర్రోమని ఏడుస్తున్నారు, లబోదిబోమని గోలపెడుతున్నారు. అతడు వాళ్ళ దగ్గరకెళ్ళి:

"ఏమిటి జరిగింది?" అని ప్రిహోద్కో అడిగాడు.

"మా మొగపిల్లల్ని, ఆడపిల్లల్ని జర్మనీకి లాక్కుపోతున్నారు" అని వాళ్ళు చెప్పారు.

బుజాన మూటలు ఎత్తుకుని మొగపిల్లలూ, ఆడపిల్లలూ ఆ మూక మధ్య నుంచున్నారు. వారిచుట్టూ ఆరుగురు పోలీసులు కాపలా కాస్తున్నారు.

మూకలోనుంచి తోసుకుంటూ వెళ్ళి ప్రిహోద్కో పోలీసుల ఎదుట నుంచుని :

"ఎవరయ్యా మీరు?" అని అడిగాడు.

"పోలీసులం" అని వాళ్ళలో ఒకడు, ప్రిహోద్కో సగం యూనిఫారంలో వుండడం చూసి, తనను ప్రశ్నించుతూన్న మనిషి ఎవడై వుంటాడో అని ఏ మాత్రమూ అనుమానించకుండా జవాబుచెప్పాడు.

"ఈ పిల్లల్ని ఎందుకు తీసుకెళ్తున్నారయ్యా?" అని ప్రిహోద్కో దబాయించాడు.

"మాకు ఆర్డరుంది, మేం తీసుకెళ్తున్నాం. ఇంతకీ నువ్వెవడివి అడగడానికి?" అని కోపంతో మండిపోతూ అడిగాడు హెడ్‌పోలీసు.

"ఇప్పుడే చెబుతానుగా!" అన్నాడు ప్రిహోద్కో.

అలా అని, ప్రిహోద్కో ఈ చేతితో ఒక పోలీసువాడిపీక, ఆ చేతితో ఒక పోలీసు వాడిపీక పట్టుకుని, తన బలం అంతటితోనూ ఇద్దరి బుర్రలనూ టకా టకీ మని టాకించాడు. దానితో వాళ్ళిద్దరూ ఒక్క తుళ్లు తుళ్ళి ఇటు పక్కకు ఒకడూ అటు పక్కకు ఒకడూ నేలమీద వెల్లకిలా పడ్డారు.

"తుపాకులు అక్కడ పడేయండి!" అంటూ ప్రిహోద్కో తన సబ్ మెషిన్‌గన్నును వాళ్ళకేసి నిగిడించి, కడమ పోలీసులను అర్దరువేశాడు.

ముందుజాగ్రత్తలన్నిటినీ పాటించుతూ కడమ స్కౌట్లు ఆ గ్రామంలోకి వచ్చేసరికి—ప్రిహోద్కో అక్కడున్న రైతులతో అతిస్నేహంగా మాట్లాడుతూండడమూ, అతడి కాళ్ళదగ్గర ఆరు రైఫిళ్ళు కుప్పవేసి వుండడమూ, నిరాయుధులై చేతులు కట్టివేసి వున్న పోలీసులు అక్కడ కాస్త దూరంగా చతికిలబడి వుండడమూ స్కౌట్లు చూశారు.

మేమందరమూ నడచే దూరంకంటె మా స్కౌట్లు మరి మూడింతలు దూరం నడవవలసి వచ్చేది. ఇహ ప్రిహోద్కో అందరు స్కౌట్ల కంటెనూ ఇంకా హెచ్చు దూరమే నడిచేవాడు. ఇందుకు కారణం, అపమేఘాలమీద జరగవలసిన పని ఏది వున్నా, ఆ పనిని ప్రిహోద్కో తనమీద వేసుకుని చేసేవాడు.

మేం సార్ని అరణ్యాల్లోకి మార్చి చేస్తూండిన రోజుల్లో ఒకసారి తుపాకి కాల్పులచప్పుడు మాకు దూరంనుండి వినబడింది. అదేమిటో కనుక్కొని రమ్మనమని ప్రిహోద్కోని పంపించాను.

అతడు వెళ్ళిన మరొక నిమిషానికి, త్సెస్సార్స్కియ్ అప్పుడి :

"కామ్రేడ్ కమాండర్! ప్రిహోద్కోని ఎక్కడకూ పంపించకండి. అతడి కాళ్ళు బొబ్బలతో పొక్కిపోయున్నాయి. బూట్లు తొడుక్కోలేడు" అన్నాడు.

"నాకా సంగతి తెలీదే. ఇందాకట్లా నేను పిలిచినప్పుడు బూట్లు తొడుక్కునే వున్నాడు. అందుచేత నా కేమీ కనబడలేదు" అన్నాను.

ప్రిహోద్కో తిరిగి వచ్చిన తరువాత :

"కాళ్ళకి ఏమైంది?" అని అడిగాను.

"ఏమీ కాలేదూ, రెండు పొక్కులు లేచాయి, అంతే!"

నా దగ్గర అతడు నిజం దాచిపెట్టాడు. నేను అతణ్ణి పిలిచినప్పుడు, నేను యివ్వబోయే ఆర్డరు తీసుకుందుకని, ఎంతో బాధతో బూట్లు తొడుక్కొని, నా ఎదుట హాజరయ్యాడు. నా ఆర్డరు ప్రకారం రికాన్ని సెన్సుమీద వెళ్ళేముందు బూట్లు విప్పేసుకుని, వుత్త కాళ్ళతోనే వెళ్ళాడు.

ఇంతకుముందు నేను చెప్పినట్టుగా, రోవ్నా నగరానికి ప్రిహోద్కోను మొట్టమొదట పంపించడానికి నిశ్చయించాం. నువ్వు వెళ్తావా?—అని మేం అడిగిన ప్రశ్నకు, కుండబద్దలుకొట్టినట్టు అతడు జవాబు చెప్పాడు :

"అడుగుతారెందుకు? తప్పకుండా వెళ్తాను. వెళ్ళి ఆ పనేదో చేసుకొస్తాను కూడా." ఆ సంగతి మేము రవంతైనా సందేహించలేదు.

కాని మా కొక గట్టి చిక్కు వచ్చిపడింది: ప్రిహోద్కొ చేత ఎటువంటి దుస్తులు వేయించి అతణ్ణి ఆ వూరికి పంపించాలి? అతడు మామూలుగా తొడుక్కొని రాత్రిపూట నెగడి దగ్గర పడుకునే బట్టలు చింకిపాతలకింద జీర్ణమైపోయాయి. రొవ్నొలో నలుగురి కంటబడకుండా వుండాలంటే అతడికి పట్నవాసపు దుస్తులుండాలాయె.

జర్మన్లనుండి మేం కొల్లగొట్టి సంపాదించిన వస్తువుల్లో దుస్తులు లేవు. ఇహ, మా గెరిల్లాల దగ్గరే ప్రిహోద్కొకి తగిన దుస్తులు ఏవైనా వుంటాయేమో అని వెతికాం. పట్నవాసానికి ఏదో ఒక మోస్తరుగా తగిన దుస్తులు నలుగురి దగ్గర దొరికాయి.

తాము తొడుక్కున్న బట్టలు ఎందుకు విప్పివేయవలసి వచ్చినదీ అర్థం చేసుకోలేక తబ్బిబ్బుపడుతూ కేవలం డ్రాయర్లలోనూ, బనియన్లలోనూ నెగడి దగ్గర కూర్చున్న నలుగురు మనుషులను మీరు ఊహించుకోండి (ఏమంటే, ప్రిహోద్కొని రొవ్నొ నగరానికి పంపించడం గురించి ఎవ్వరికీ తెలియకుండా అతి రహస్యంగా వుంచాం.) ఈలోపుగా ప్రిహోద్కొ ఒక గుడారంలో వీరి బట్టలు తొడుక్కుని చూశాడు, ఈ నలుగురి దుస్తులలోనూ ఏవి తనకు సరిపోతాయో చూసుకున్నాడు. ఒక్కటైనా అతడికి సరిపోలేదు.

"వీరు మనుషులుకారు, మరుగుజ్జులు!" అంటూ అతడు గునిశాడు.

కోటు చేతులు అతడి మోచేతులవరకే వచ్చి, ముంచేతులు నగ్నంగా వుండిపోయాయి. పంట్లాములు తొడుక్కుంటే, అవి మోకాళ్ళ కిందకి మాత్రమే వచ్చి తన చిట్టితమ్ముడు పంట్లాం తను ఎరువుతెచ్చుకుని తొడుక్కున్నట్టుంది. మరొక సూటు తొడుక్కుంటూండగానే దాని కుట్లు పెట్లిపోయాయి.

నెగడిదగ్గర కూచున్న మనుషులకి ఎవరి సూట్లు వారికి ధన్యవాదాలతో యిచ్చివేశాం.

చివరికి ఎంతో కష్టంమీద ఎలాగో ఒక లాగున తనకి ఓ మాదిరిగా సరిపోయిన దుస్తులు ప్రిహోద్కొకి యివ్వగల్గాం. ఎంచి ఏరితెచ్చి అతడికిచ్చిన మట్టి కోటూ పంట్లామూ ఒక సైజు చిన్నవే అయినా ఎలాగో ఓలాగు సరిపోయాయి. కాని అతడి కాళ్ళకు సరిపడిన జోళ్ళు సంపాదించడం మాత్రం మా తరమైందికాదు.

(అతడి జోళ్ళ సైజు 11) తన పెద్ద బూట్లే వేసుకుని, పంట్లాం కాళ్ళను వాటిమీద నుండి దించేసుకుందుకే నిశ్చయించుకున్నాడు.

"ఈ పత్రందారుడైన గ్రిగ్త్సేంకొ, లెన్‌చిన్ కాపురస్తుడని యిందు మూలంగా ధ్రువపరచడమైనది" అని వున్న ఒక డాక్యుమెంటుని పట్టుకుని ప్రిహోద్కొ రోవ్నానగరం వెళ్ళాడు.

మా క్యాంపుకి రోవ్నాకి సుమారు నూటఇరవై కిలోమీటర్లుంటుంది. రానూ పోనూ రెండువందల నలభై కిలోమీటర్లన్నమాట. ప్రిహోద్కొ కాలినడకనే బయల్దేరాడు. ఆరు, ఏడు రోజుల్లో క్యాంపుకి తిరిగి వచ్చేస్తాడని మేం అంచనా వేసుకున్నాం.

అతడు ఎక్కడా వుండిపోకుండా అనుకున్న ప్రకారం సరిగా వచ్చేశాడు.

అతణ్ణిచూసి నా మనస్సు ఎంతైనా కుదుటపడింది : రోవ్నాలోకి మా మొదటి చొరబాటు చర్య విజయవంతంగా ముగిసింది. అది నిజంగా ఒక గొప్ప ఘటనే.

రోవ్నాకి దగ్గరగా వున్న ఒక గ్రామంలో ప్రిహోద్కొ మేనత్తకాపురం వుంటూంది. ప్రిహోద్కొ మొట్టమొదట ఆమెదగ్గరకు వెళ్ళాడు. అతడి అన్నదమ్ము లలో ఒకడు రోవ్నాలో వుంటున్నాడని ఆమె చెప్పింది. అతణ్ణి తీసుకురావలసిందని ప్రిహోద్కొ ఆమెతో చెప్పాడు. ఆమె వెళ్ళి, కొద్దిగంటల్లో అతణ్ణి తీసుకునివచ్చింది. అతడు వచ్చిన తరువాత, అతనితో కలిసి ప్రిహోద్కొ రోవ్నా వెళ్ళాడు.

రోవ్నాలో అనేక విషయాలను చూసి ప్రిహోద్కొ ఆశ్చర్యపోయాడు. జర్మన్లు వీథులపేర్లు మార్చేసి, వాటికి "జర్మన్‌వీథి", "ఫ్రీడ్రిక్‌ష్ట్రాసె" వగైరా పేర్లుపెట్టారు. వెనుకటి రోజుల్లో క్లబ్బులూ, సినిమాలూ, రెస్టారెంట్లూ వుండిన భవనాలపైన ఇప్పుడు, "జర్మన్లకు మాత్రమే ప్రవేశం" అనేబోర్డులున్నాయి. మంచి భవనాలన్నింటినీ జర్మన్లు స్వాధీనంచేసుకుని, వాటిలో ఆఫీసులు పెట్టారు. మంచి ఇళ్ళన్నిటినీ జర్మన్ కుటుంబాలు ఆక్రమించుకున్నాయి. వీథుల్లో జర్మన్ భాష మాట్లాడుతున్నారు.

ప్రిహోద్కొ ఒక స్నేహితుణ్ణి చూడ్డానికి వెళ్ళాడు. ఆ కుటుంబంవారు మంచి నమ్మకస్థులు. అందుకని వారితో మాట్లాడి, వారి యింటిని గెరిల్లాలు ఉపయోగించుకుందుకు అతడు వారితో ఏర్పాటుచేశాడు. రోవ్నాలో అదే మా మొదటిరహస్య సాంకేతిక స్థలం.

తరువాత ప్రిహోద్కో రోవ్నోకి సుమారు ముప్పై కిలోమీటర్ల దూరాన వున్న జ్డొల్‌బునోవొ రైల్వేస్టేషనుకి వెళ్ళాడు. అక్కడ కొందరు స్నేహితులు అగపడగా, వారిని మళ్ళీ మరొకసారి కల్సుకుందుకు అతడు ఏర్పాటు చేశాడు.

ప్రిహోద్కో తన రిపోర్టు ముగించిన తరువాత, నేను అడిగాను :

"నీ డాక్యుమెంటుని ఎప్పుడైనా చూపించవలసి వచ్చిందా ?"

"మూడుమాట్లు చూపించవలసి వచ్చింది. అంతా సవ్యంగానే జరిగి పోయింది"

అది కూడా మా కొక విజయమే. కాని ఈ విజయం ఏమిటో ప్రిహోద్కోతో నేనెప్పట్లో చెప్పలేదు.

మా కామ్రేడ్లలో ఇతరులను కూడా రోవ్నోకి పంపడం మొదలెట్టాం. రహస్య సాంకేతికస్థలాలను ఏర్పాటుచేయడమూ, ఆ వూళ్ళో ఏయే జర్మన్ ఆఫీసులు వున్నదీ, అవి ఏయే భవనాలలో ఎక్కడెక్కడ వున్నదీ నికరంగా తెలుసుకోవడమూ ఈ సులువైన కార్యమే వారికి ఒప్పగించాం.

ఈ కామ్రేడ్లలో ఒకడు పొలికార్ప వొజ్న్యాక్. ఇతడు సార్నిఅరణ్యాలలో మాతో చేరాడు. అప్పటికి ఇతడు ఒక చిన్న గ్రూపు సమిష్టి క్షేత్ర వ్యవసాయదార్లతో కలిసి శత్రువును పీడించుతూ గెరిల్లా చర్యలు జరుపుతూ వుండేవాడు. వొజ్న్యాక్‌నీ, అతని తరువాత బొన్‌దర్చుక్‌నీ రోవ్నోకు పంపించాం బొన్‌దర్చుక్ స్త్రుతిన్‌స్కియ్ డిటాచ్‌మెంటు మనిషి, ఇతడు కూడా స్థానిక వాసే.

వీరు రోవ్నోనుండి తిరిగి వచ్చేవరకు ఆగకుండానే, నికొలాయ్ స్త్రుతిన్‌స్కియ్‌ని రోవ్నోకి పంపించాం. మేం అతనికిచ్చిన పత్రాలు కాస్తొపొల్ మ్యునిసిపల్ కౌన్సిల్ మొహరుతో వుండి, అతడు ఒక ఉపాధ్యాయుడనీ, పాఠ్యగ్రంథాలను సేకరించడం కోసమని రోవ్నోకి పంపించబడినాడనీ ధ్రువపరిచాయి. నికొలాయ్‌కి ఖరీదైన సూటు ఇచ్చాం. ఆ సూటు తొడుక్కునేసరికి అతడు ఎంత ఆకర్షణీయంగా అగపడ్డాడంటే, మేమందరమూ కూడా అతణ్ణి మెచ్చుకోకుండా వుండలేకపోయాం.

నికొలాయ్ బయల్దేరినప్పుడు అతణ్ణి స్తెహొవ్, లుకిన్, నేను క్యాంపులో నుంచి సాగనంపాం. అడవి అంచువరకూ అతనితో కూడా వెళ్ళి, అక్కడ ఒక చెట్టును ఎంచాం. ఒకవేళ ఏ కారణం చేతనైనా మేం క్యాంపు మార్చవలసివస్తే, ఆ చెట్టు తొర్రలో ఒక చీటి వుంచుతామని అతనితో చెప్పాం. అందరం అతనికి వీడ్కోలు చెబుతూ అతణ్ణి కౌగలించుకున్నాక అతడు వెళ్ళిపోయాడు.

గోర్కీ "నా బాల్యం" ఫిల్మ్‌లో, కుర్రవాడు నూతనజీవితానికి బయల్దేరే దృశ్యాన్ని తల్చుకోకుండా వుండలేకపోయాం. నికొలాయ్ స్త్రుతీన్‌స్కీయ్ పచ్చిక బయలుగుండా నడచి వెళ్ళిపోయాడు, ఎత్తుగా మొలచినగడ్డి సముద్రంగా వాలి వుంది. అతడు వెళ్ళిపోతూ వుంటే, అతడు మా కనుచూపు మేరనుండి అదృశ్యమైపోయే వరకూ అతనికేసి అలా చూస్తూనుంచున్నాం.

స్త్రుతీన్‌స్కీయ్ రోవ్నోకి బయల్దేరిన మరి రెండ్రోజులకి వొజ్న్యాక్ అక్కడ్నుంచి తిరిగివచ్చాడు. ఇతడికి రోవ్నోలో ఒక మిత్రుడు తారసిల్లాడు ఆ మిత్రుడు ఆ వూళ్ళో వున్న ఒక జర్మన్ సెకండ్ హాండ్ వస్తువులషాపులో పనిచేస్తున్నాడు. ఆ షాపుకి ప్రతిరోజూ ఒక గెస్టాపో ఏజెంటు వస్తూంటాడని అతడు వొజ్న్యాక్‌తో చెప్పాడు. ఆ ఏజెంటు రాకకోసం వొజ్న్యాక్ పొంచి వుండి, అతగాడు షాపుదగ్గరకు రాగానే వొజ్న్యాక్ తన పిస్తలుతో రెండు బుల్లెట్లు పేల్చి అతగాణ్ణి హత్యచేసి, అక్కడ్నుంచి పారిపోయాడు పారిపోతూ అతడొక వీథి దాటుతూండగా, కారు ఒకటి అతనికి సరాసరి ఎదురైంది దానితో అతడు ఢీకొనవలసిందే నిజంగా. ఆ కారులో ఇద్దరు జర్మన్ ఆఫీసర్లున్నారు. ఆ కారులోకి వొజ్న్యాక్ ఒక చేతిబాంబు విసిరేసి, పక్కనున్న ఇంటి ముంగిట్లోకి చప్పున వెళ్ళిపోయి, గోడ గంతేసి, మరొక వీథిలోకి వెళ్ళిపోయి అక్కడ దాగున్నాడు.

తన కథనాన్ని పూర్తిచేసి, తన సాహసకార్యాలకు మెప్పుకోసం నిరీక్షించుతూ వొజ్న్యాక్ చిరునవ్వు నవ్వాడు. కాని అతనికేసి లుకిన్ మందలింపుచూపుతో చూసి, ప్రతి మాటనూ విడివిడిగా వొత్తిపలుకుతూ గంభీరంగా అన్నాడు:

"ఈలాటి పనిని మిమ్మల్ని ఎవరు చేయమన్నారు? నెమ్మదిగానూ జాగ్రత్తగానూ వీథులవెంట తిరిగి, గెస్టాపో, రైక్స్‌కమిస్సారియాట్ భవనాలు ఎక్కడ వున్నాయో తెలుసుకుని రమ్మనమని కదా మిమ్మల్ని పంపించాం. మీరేమో గొప్ప గడబడచేసుకొచ్చారు!" అలా అని, గొంతుక పెద్దదిచేసి, "ఇహ దీనితో మూకుమ్మడి అరెస్టులు ప్రారంభమవుతాయి, ప్రతి మనిషిమీద నిగా వుంచడమూ, ప్రతి మనిషి తాలూకు పెర్మిట్లు పత్రాలూ, డాక్యుమెంట్లూ చెక్ చేయడమూ మొదలవుతుంది. ఈ పని ఎందుకు చేసినట్టు? ఎవడో ఒక కుక్క వెధవ ఏజెంటు చచ్చినప్పటికీ, మన వాళ్ళందరూ ప్రాణాపాయంలో పడ్డారే!" అన్నాడు.

వొజ్న్యాక్‌ని స్కౌటింగు డ్యూటీనుండి బర్తరఫ్ చేసివేశాం. అతడి "వీరోచిత కార్యాలను" విన్న కామ్రేడ్లు: "ఏమోయ్ గడబడదాసూ!" అని అతణ్ణి ఎగతాళి చేయడం ఆరంభించారు. ఆనాటినుంచి అతడికి "గడబడదాసు" అని పేరు వచ్చేసింది.

మరి కొద్దిరోజులు తరువాత బొన్‌దర్యాక్ వచ్చాడు. అతడు ఒక రహస్య సాంకేతిక స్థలాన్ని ఏర్పాటు చేశాడు. కాని అతడు కొన్ని చికాకులు ఎదుర్కోవలసి వచ్చింది. అతడు యుద్ధం ముందు రోవ్నోలో పనిచేశాడు, అందుచేత అతనికి ఎందరెందరో పరిచయస్థులు అవుపడి, తను ఇప్పుడు ఎక్కడున్నదీ, ఏమి చేస్తూన్నదీ వివరాలు అడిగారు:

ఇక చిట్టచివరకి, నికొలాయ్ స్త్రుతిన్‌స్కియ్ కూడా తిరిగి వచ్చేశాడు. తను తెలుసుకొనగలిగిన యావత్తు భోగట్టా గురించీ- ఆ వూరిలో ఏమేమి జర్మన్ ఆఫీసులు, ఏ యే వీధుల్లో ఎక్కడెక్కడ వున్నాయో, తన స్నేహితులు ఏ యే వీధుల్లో నివసిస్తున్నారో, రహస్య సాంకేతికస్థలాలు ఏ యే చోట్ల ఏర్పాటు చేసుకుందుకు వీలుంటుందో—అతడు సవివరమైన రిపోర్టు ఇచ్చాడు. నాజీలు జారీచేస్తూన్న పెర్మిట్లూ, సర్టిఫికెట్లూ వగైరా డాక్యుమెంట్ల నమూనాలు కొన్నింటిని కూడా అతడు పట్టుకొచ్చాడు.

"నీ పెర్మిట్టు మాటేమిటి? అది సరిగా వున్నట్టేనా?" అని నేనడిగాను.

"అంతా సరిగానే వుంది. నా పెర్మిట్టును చూసి, సరే అన్నారు జర్మన్లు. వాళ్ళు తేడా కనిపెట్టలేకపోయారు. మాతృకకంటే నా నకిలీ పెర్మిట్టే బాగుంది!" అన్నాడతడు.

ఆ పెర్మిట్లూ, డాక్యుమెంట్ల కథ ఇప్పుడు చెబుతాను.

ఒకనాడు నికొలాయ్ స్త్రుతిన్‌స్కియ్ నాతో చెప్పాడు, చిన్నప్పుడు తను చాకుతో కర్రపైన బొలుగులు చెక్కుతూండేవాడట. అప్పుడు నేను అతనికి సూచించాను, జర్మన్లు ఉపయోగించుతూన్న రబ్బరు స్టాంపులలో ఒకదానికి నకలు చెక్కేందుకు ప్రయత్నించమని. అతడు ఓ కంపస్ పట్టుకొచ్చాడు, చాకు సానపట్టాడు, తన బూటుకున్న రబ్బరు మడమను ఊడపీకేశాడు ఇహ కూచుని, రబ్బరు స్టాంపు చెక్కడం మొదలుపెట్టి, కొన్ని గంటల్లో నకలు స్టాంపు తయారుచేశాడు. అతడు తయారుచేసిన నకలు ఎంత బాగుందంటే, ఏది నకలో ఏది మాతృకో పోల్చుకోవడం ఎవ్వరి తరమూ కాదన్నమాట. అంత దివ్యంగా వుంది. ఆ పోర్జరీ! దీని తరువాత, అతనిచేత ఇతర జర్మన్ స్టాంపులకు కూడా నకళ్ళు తయారు చేయించాం.

అతడు మొదట్లో తాపీగా పనిచేశాడు, ఒక స్టాంపు చెక్కేందుకు అతడికి రెండు రోజులూ, మూడు రోజులూ కూడా పట్టేది. అది శరత్కాలం, పగటిపూట మబ్బు కమ్మేసి వుండేది. అతడు చేస్తూన్నది సున్నితపు పని, అందుకు మంచి

వెలుగు అవసరం. కాని రాను రాను అతడా పనిలో ఎంత ప్రవీణుడయ్యాడంటే, కంపసూ చాకూ తప్ప మరే పనిముట్లు లేకుండానే, ఎంతటి సంక్లిష్టమైన స్టాంపుకైనా సరే గంట, రెండు గంటల్లో భేషైన ఫోర్జరీ నకలు తయారుచేసేవాడు. ఈ పని కోసమని అతడు తన బూట్లకున్న రబ్బరు మడమలనే కాకుండా జోర్గ్, రొస్తిస్లావ్లం బూట్లకున్నవాటిని కూడా ఉపయోగించేసి, ఇక మా హెడ్క్వార్టర్స్ సిబ్బందితాలూకు బూట్సులమీద కూడా కన్నువేయడం మొదలెట్టాడు. ఇది ప్రమాదకరంగా వుందని చెప్పి, అతనికి మేమే రబ్బరు సరఫరా చేయడం ఆరంభించాం.

మేము దాడిచేసిన ఒకజర్మన్‌ఫారములో ఉక్రైనియన్ అక్షరాలూ, జర్మన్ అక్షరాలూ వున్న టైపు మెషీన్లు మాకు దొరికాయి. వాటిని మేము త్సెస్సార్‌స్కియ్‌కి ఇచ్చాం. వాటితో అతడు మాకు కావలసిన డాక్యుమెంట్లను టైపు చేసేవాడు. ఆ డాక్యుమెంట్లపైన ఏ జర్మన్ అధికారి సంతకాన్నయినా సరే లుకిన్ ఫోర్జరీ చేసేవాడు.

త్సెస్సార్‌స్కియ్ టైపుచేసిన డాక్యుమెంట్లపైన లుకిన్ ఫోర్జరీ సంతకాలు చేస్తే, వాటిపైన స్త్రుత్రిన్‌స్కియ్ దొంగ రబ్బరు స్టాంపులు గుద్దేవాడు. ఆ డాక్యుమెంట్లు జర్మన్లు జారీచేసినవి కావనీ, అవి ఫోర్జరీవని ఎవ్వరూ పోల్చుకోలేకపోయారు.

ఈ విధంగా ప్రిహోద్కోకి, స్త్రుత్రిన్‌స్కియ్‌కి, ఇంకా మా వాళ్ళు అనేక మందికి వారి వారికి అవసరమైన పత్రాలన్నిటినీ సృష్టించి ఇవ్వగల్గాం. తాలూకా ఆఫీసులనుండీ, జిల్లా ఆఫీసులనుండీ, ప్రైవేట్ ఫర్మ్‌లనుండీ, గెస్టాపోనుండి సహితమూ వచ్చినట్టుగా అగపడిన ఫోర్జరీ పత్రాలను సృష్టించి జారీచేశాం.

మేం మావాళ్ళ కిచ్చిన ఫోర్జరీ పత్రాలు మాతృకలకంటె ఉత్తమంగావున్న విషయం మాత్రం అక్షరాలా నిజం.

ఒకమాటు ఓ చిత్రమైన సంగతి జరిగింది. తన స్కౌటు ఒకడు లూత్స్క్ నగరం వెళ్ళేందుకు ఉపయోగపడే పెర్మిట్టు ఒకటి యివ్వవలసిందని ఆ చుట్టుపక్కల గెరిల్లా కార్యాలు సాగించుతూండిన మరొక గెరిల్లా డిటాచ్‌మెంటు మమ్మల్ని కోరింది. మేం "ఐడెంటిటీ కార్డు" ఒకటి యిచ్చాం. కాని దానిని మేం ఎలా సంపాదించినదీ ఆ డిటాచ్‌మెంటు మనుషులతో చెప్పలేదు. ఈ కార్డుతో వారి మనిషి లూత్స్క్ వెళ్ళి సురక్షితంగా తిరిగివచ్చేశాడు. ఈ కార్డుతోనే వారి స్కౌటు మరొకడు కూడా లూత్స్క్ వెళ్ళి, అతడు కూడా సురక్షితంగా తిరిగివచ్చేశాడు. మూడో స్కౌటును కూడా వారు లూత్స్క్ పంపవలసి వచ్చింది. కాని ఆ కార్డు

మీద సూచించిన కాలపరిమితి దాటిపోవడంచేత, అది మరి చెల్లదు. అందుకని వాళ్ళు ఆ కార్డుమీద వున్న కాలపరిమితిని వారంతట వారే పొడిగించి, కార్డుపైన వున్న సంతకాన్ని కూడా ఫోర్జరీ చేసేశారు. ఈ సంగతిని ఆ డిటాచ్‌మెంటు కమాండరు మా క్యాంపుకి వచ్చినప్పుడు లుకిన్‌తోనూ, నాతోనూ చెప్పాడు.

"ఆ సంతకాన్ని మావాడొకడు ఎంత బాగా ఫోర్జరీ చేశాడంటే, అది ఫోర్జరీ అని ఎవ్వరూ పోల్చుకోలేదు!" అన్నాడతడు.

లుకిన్ కోపం నటించి, చెంగునలేచి, కేకవేశాడు:

"ఇది క్రిమినల్ నేరం. డాక్యుమెంట్లను ఫోర్జరీ చేసే సాహసం ఎక్కడ్నుంచి వచ్చిందండీ మీకు? నేను కోర్టు ఎదుట ఫిర్యాదు చేసితీరుతాను, ఏమనుకున్నారో! నా సంతకాన్ని మీరు ఫోర్జరీ చేస్తారా?..."

ఆ కమాండరు మొదట తుళ్ళిపడ్డాడు, నిజంగా తబ్బిబ్బుపడిపోయాడు. ఆ తరువాత అర్థంచేసుకుని, పొట్ట చెక్కలయ్యేటట్టు ఎంతోసేపు నవ్వాడు.

మేం యిలా ఎన్నో పత్రాలను సృష్టించుతూండేసరికి, జర్మన్లకి అనుమానంతోచి పత్రాలూ వగైరా డాక్యుమెంట్ల నమూనాలను తరచుగా మార్చి వేయడం మొదలెట్టారు. కాని మా స్కౌటింగ్ శాఖ మంచి సాఫీగా పనిచేయడంచేత, జర్మన్లు కొత్త నమూనాల ప్రకారం డాక్యుమెంట్లను జారీచేస్తారనగా, కనీసం రెండు వారాలు ముందుగానే ఆ కొత్త నమూనా కాగితాలు మా క్యాంపులో ప్రత్యక్షమయ్యేవి. ఈ కొత్త నమూనా కాగితాలను మా అజ్ఞాతవాస కార్యకర్తలు సరాసరి అచ్చు ఆఫీసులనుండే తెచ్చి మాకు యిచ్చేవారు. ఇక ఏ రోజునుండైతే జర్మన్లు కొత్త నమూనాల ప్రకారం డాక్యుమెంట్లను జారీచేసేవారో, సరిగా ఆ రోజునుండే మేము కూడా మా ఫోర్జరీ డాక్యుమెంట్లను జారీ చేసేవారం.

## మావాళ్ళు మమ్మల్ని పోల్చుకోలేదు

రోవ్నొనుండి తిరిగివచ్చిన మనుషులందరితోనూ నికొలాయ్ కుజ్నెత్సోవ్ చాలాసేపు మాట్లాడి, అన్ని వివరాలూ తెలుసుకున్నాడు. ప్రిహోద్కొ, స్త్రుతిన్‌స్కీయ్, బొన్‌దర్చుక్, షొజ్న్యూక్‌లను వందలకొద్దీ ప్రశ్నలు అడిగాడు.

కాని కుజ్నెత్సోవ్‌ను రోవ్నొ పంపించడానికి నేనింకా భయపడ్డాను.

"నేను వెళ్ళి అక్కడ ఏగొడవా చెయ్యను. నేను 'గడబడదాసు'ను కాను!" అని అతడు నన్ను సమాధానపరచాడు. "నేను పూళ్ళో ఓ చక్కరు కొట్టి,

నాలుగు సంగతులూ చూసి వచ్చేస్తాను. నేను వచ్చిన తరువాత మీదటికి ఏం చేయ తమో అప్పుడు మనం ఆలోచించుదాం" అన్నాడు.

అతణ్ణి పంపించేందుకు నేను చిట్టచివరికి ఒప్పుకున్నాను. కాని, అతడు ఒక్కడూ వెళ్ళకూడదనీ, వృద్ధుడు స్త్రుత్సిన్‌స్కీయ్ అతనితో వెళ్ళాలనీ ఒక షరతు పెట్టాను. కుజ్నెత్సోవ్‌ని రోవ్నొలో స్త్రుత్సిన్‌స్కీయ్ తన బంధువులతో పరిచయం చేస్తాడని చెప్పాను.

నికొలాయ్ కుజ్నెత్సోవ్‌ను అతి జాగ్రత్తగా తయారుచేశాం. అతని దుస్తులు గురించి అన్ని వివరాలనూ స్త్రెహోవ్, లుకిన్, నేనూ చర్చించాం. అతనికి ఒక భేషైనబూట్లజత యిచ్చాం. మేము ఒకసారి దాడిలో సంపాదించిన జర్మన్ ఆఫీసరు యూనిఫారాన్ని అతనికి చక్కగా అమరేటట్టు మార్పించాం ఆ యూనిఫారానికి వుండాల్సిన బేడ్జిలనూ, పతకాలనూ, అవి సరిగా వున్నాయని నమ్మకం తోచేవరకూ వాటిని పదే పదే తగిలించుతూ, మళ్ళీ తీసివేస్తూ, మళ్ళీ తగిలించుతూనే వున్నాం. ఇదంతా కూడా అతి రహస్యంగా వుంచాల్సి వచ్చింది. ఏమంటే క్యాంపులో జర్మన్ ఏజెంటు ఎవరైనా వుంటే వుండవచ్చునేమో అని మాకు భయంవేసింది. అందుకని, క్యాంపులో రహస్యాలు దాచడం కష్టమవడంచేత, ఏ గెరిల్లా అయినా సరే వ్యక్తిగతంగా తనకు సంబంధించని విషయాలను గురించి ఎంత మాత్రమూ తెలుసుకో కూడదనే ఒక కఠిన నిబంధనను విధించాం.

క్యాంపులో వున్నప్పుడు కుజ్నెత్సోవ్ మామూలు దుస్తులు వేసుకునేవాడు. జర్మన్ యూనిఫారంలో వుండగా అతణ్ణి, అతడితో కలిసి ఏదైనా గెరిల్లా చర్యపైన వెళ్ళినవారు మాత్రమే చూడడం తటస్థించేది.

ఈ సన్నాహాలన్నీ మూడు రోజులు పట్టాయి. కుజ్నెత్సోవ్, స్త్రుత్సిన్‌స్కీయ్‌లు ఎప్పుడు పడుకుని నిద్రపోయేవారో మరి నాకు తెలీదు. పగలంతా తమ సన్నాహాల్లోనే మునిగి వుండేవారు. రాత్రిపూట ఎంతో పొద్దుపోయే వరకు, తోటి కామ్రేడ్లనుండి వేరైపోయి ఎక్కడో ఏ యేకాంత స్థలంలో అటూ ఇటూ పచారు చేస్తూనో, ఏ చెట్టు మొదళ్ళపైన కూర్చునో ఏకాగ్రచిత్తులై సంప్రదించుకునేవారు.

వారిద్దరూ రోవ్నొకి ఓ నాటుబండిపైన వెళ్ళారు-స్త్రుత్సిన్‌స్కీయ్ బండి మనిషిగా వేషం వేసుకున్నాడు, కుజ్నెత్సోవ్ శత్రు ఆక్రమిత ప్రదేశంలో పని చేస్తూన్న ఒక ఆహారపదార్థ సేకరణ యూనిట్టుకు చెందిన జర్మన్ మిలిటరీ ఆఫీసరుగా వేషం వేసుకున్నాడు. వారి పత్రాల్లో వారి గురించి అలా రాసివుంది మరి.

రోవ్నొకి సుమారు పద్దెనిమిది కిలోమీటర్ల దూరంలో వున్న ఒక గూడెంలో స్త్రుతిన్‌స్కియ్ బంధువు వాల్స్లావ్‌జిగాద్లొ ఇంట్లో వారిద్దరూ ఆగారు. తాము వచ్చిన పనిగురించి వారు అతనితో చెప్పారు.

"నా యిల్లు మీరు వాడుకోండి, అవసరమైనప్పుడల్లా ఇక్కడబసచేయండి నాకేమీ అభ్యంతరం లేదు. కాని మీరు మాత్రం మహాజాగ్రత్తగా వుండాలిసుమండీ, లేకపోయే మాటుంటే మీరు నాశనమైపోతారు, నా కుటుంబంతోసహా నేనూ నాశనమై పోతాను" అన్నాడు జిగాద్లొ.

అతడికి పదిమందిపిల్లలు. అంత పెద్ద కుటుంబాన్ని పోషించేందుకు అతడికి అంతవరకూ సోవియట్ ప్రభుత్వంనుండి ముట్టుతూండిన ఎలవెన్సులు జర్మన్లు రావడంతో ఆగిపోయాయి.

రోవ్నొకు అతి సమీపంగా నివసించుతూన్న తన బంధువు మరొకరి దగ్గర స్త్రుతిన్‌స్కియ్ మరొకసారి ఆగాడు. బండిని అక్కడ వుంచేసి, వారిద్దరూ కాలినడకను బయల్దేరారు.

రోవ్నొలో నడుస్తూన్నప్పుడు వీథికి ఇటువైపు స్త్రుతిన్‌స్కియ్, అటువైపు కుజ్నెత్సోవ్ నడిచేవారు.

"నేను నడుస్తూన్నానన్నమాటేగాని, ఏ నిమిషాన ఎవడు నన్ను పట్టుకుంటాడో అని నాకు ఒకటే బెంగ" అంటూ తరువాత చెప్పాడు స్త్రుతిన్‌స్కియ్. "ఎవడైనా జర్మను అగపడినా, ముఖ్యంగా జర్మన్ పోలీసు దళంలో పనిచేస్తూన్న దేశద్రోహులు ఎవరైనా అగపడినా, ముఖం వెంటనే తిప్పేసుకునేవాణ్ణి. రోవ్నొలో నన్ను ఎరిగినవాళ్ళు చాలామంది వుండటంచేత, నాకేసే అందరూ అనుమానంగా చూస్తున్నారనే అనుకునేవాణ్ణి. నికొలాయ్‌మాత్రం వీథి రెండవ వైపున,అవూరునంతా తను కొనేసిట్టే దర్జగా నడిచేవాడు. సైన్‌బోర్డులన్నిటినీ చదివేవాడు, షాపు కిటికీల్లో వున్న వస్తువులన్నిటినీ, వాటిని చూడడానికే అక్కడకు వచ్చినట్టు, సావధానంగా చూసేవాడు. ఎవడైనా జర్మను తనకు ఎదురుపడినట్టాయెనా, అతడు చప్పునచెయ్యి ఎత్తి 'హైల్‌హిట్లర్!' అని బిగ్గరగా అనేవాడు. ఇంచుమించు నాలుగు గంటలు నన్నిలా వూరంతా తిప్పాడు. చాలు, ఇహ వెళ్ళిపోదాం అంటూ, మేం ముందుగా ఏర్పరచుకున్న ప్రకారం నేను చేతిరుమాలుతో ముక్కు తుడుచుకుంటూసంజ్ఞచేస్తూనే వున్నాను. కాని అతడు లెక్కచేయడే, అతడు అలా నడుస్తూనే వున్నాడు, నడుస్తూనే వున్నాడు! గొప్పతెగువండీ మనిషిదీ!"

అలా జరిగింది నికొలాయ్ కుజ్నెత్సోవ్ తొలిసారి రోవ్నొ వెళ్ళడం. ఆ

"జర్మన్ ఆఫీసరు" నిజంగా ఒక రష్యన్ గెరిల్లా అనీ, మరి కొద్దిరోజుల్లో గెస్టాపొ ఏజెంట్లు ఇతణ్ణి వేటాడుతారనీ అప్పుడతణ్ణి చూసిన మనిషి ఎవ్వడూ కూడా కలలో నైనా అనుకుని వుండడు.

రోవ్నాలోనే కుజ్నెత్సోవ్‌ను స్త్రుత్సిన్‌స్కియ్ తన బంధువు, కజిమీర్ దొంబ్రోవ్‌స్కియ్‌కి పరిచయంచేశాడు. దొంబ్రొవ్‌స్కియ్‌కి ఆ వూరిలో గుర్రపు జీనులకొట్టు వుంది. అతడు గుర్రపు జీనులుకుట్టి తయారుచేస్తాడు మరమ్మతూ చేస్తాడు. గెరిల్లాలకు సాయంచేసేందుకు దొంబ్రోవ్‌స్కియ్ ఒప్పుకుని చేతిలో చేయివేసి మాటయిచ్చాడు. అతడు తన మాట మీదే నడిచాడు, మాకు ఎనలేని సాయం చేశాడు.

రోవ్నా నగరంలో సాయంకాలం ఆరుగంటలకు కర్ఫ్యూ. కుజ్నెత్సోవ్, స్త్రుత్సిన్‌స్కియ్‌లు కర్ఫ్యూకు బాగా ముందుగానే, రోవ్నా విడిచిపెట్టేసి, బండిఎక్కి క్యాంపుకి వచ్చేశారు.

ఈ తొలి చొరబాటు చర్యతో కుజ్నెత్సోవ్ గొప్పగా తృప్తిపొందాడు. రోవ్నాలో అతడు అగపడిన కారణంగా ఎవ్వరికీ ఏ విధమైన అనుమానమూ పుట్ట లేదు–దాని అర్థం అతడు భేషుగ్గా తర్ఫీదయ్యాడన్నమాట.

అయినప్పటికీ, తన యూనిఫారంలో మాత్రం లోపం వుందన్నాడు కుజ్నెత్సోవ్. అతడు వేసుకున్న యూనిఫారం వేసవికాలపు యూనిఫారం. కాని జర్మన్ ఆఫీసర్లు అప్పటికప్పుడే శరత్కాలపు ఓవర్‌కోట్లూ, శరత్కాలపు వర్షపు కోట్లూ వేసుకుంటున్నారు. తను గుడ్డటోపీ పెట్టుకున్నాడు. ఈ టోపీలను యుద్ధ శ్రేణిలో పనిచేస్తూన్న రెజిమెంట్ల వారు మాత్రమే పెట్టుకుంటారు. రోవ్నాలో వున్న ఆఫీసర్లల్లో చాలామంది మూరువున్న గుండ్రని సెర్వీసు టోపీలు పెట్టు కున్నారు.

కుజ్నెత్సోవ్ రెండవసారి రోవ్నా వెళ్ళినప్పుడు సరికొత్త యూనిఫారంలో వెళ్ళాడు. కుజ్నెత్సోవ్ కోసమని వార్సాపట్నపు ప్రఖ్యాతదర్జీ, ష్నయ్‌డర్ ప్రత్యే కమూ కుట్టి తయారుచేసిన యూనిఫారం అది.

గొడారివాళ్ళూ (నారజోళ్ళమాట నాడే మరచిపోయాం;), రొట్టెల వాళ్ళూ, సాసేజ్ చేసేవాళ్ళూ, ఈ వార్సాపట్నపు దర్జీ–వీరేమిటి వారేమిటి–రక రకాలవృత్తులవారు వచ్చి మా క్యాంపులో చేరారు. ఈ దర్జీ, ష్నయ్‌డర్, యుద్ధానికి పూర్వం వార్సాపట్నంలో దర్జీగా వుండేవాడు. వార్సాని జర్మన్లు పట్టుకున్నతరువాత

ఆ పట్నంలోవున్న యూదులందరినీ ప్రత్యేకపు పేటల్లో నివసించవలసిందని జర్మన్లు నిర్బంధించారు. అయితే ష్నయ్‌డర్‌ని ఒకజర్మన్ జనరలు తన సొంత దర్జీగా నియమించి, తన యింట్లో చిన్న మిద్దె గదిలో అతణ్ణి వుండమని, అతనిచేత తనకే కాకుండా ఇతర ఆఫీసర్లకు కూడా యూనిఫారాలు కుట్టించేవాడు. ఇతర ఆఫీసర్లు ఇచ్చిన కుట్టుకూలి డబ్బులు ష్నయ్‌డర్‌కి ఇవ్వకుండా ఆ జనరలు తన జేబులోనే వేసుకునేవాడు. ఇది అంతమయ్యే రోజు వచ్చింది. తనను — దర్జీని— యూదుపేటకు పంపించేస్తూన్నట్టు జనరలు ఒకనాడు దర్జీతో చెప్పాడు. యూదు పేటకు ఒకసారి వెళ్ళిన తరువాత, అక్కడనుండి తప్పించుకోవడమంటే, దాని అర్థం తుపాకికాల్పులకి బలి అవడమన్నమాటే. ఆ దర్జీ ఆ రాత్రే జనరలు ఇంటినుండి తప్పించుకుని పారిపోయి, ఎన్నో కష్టాలు అనుభవించి, చిట్టచివరకు మా డిటాచ్‌మెంటు చేరుకున్నాడు. ఎన్నెన్నో యూనిఫారాలు కుట్టాడు ఆ దర్జీ, కాని తను ప్రేమతో కుట్టిన తొలి యూనిఫారం కుజ్నెత్సోవ్ కోసం తను కుట్టిన యూనిఫారమే — ఆ యూనిఫారాన్ని కుజ్నెత్సోవ్ ఎందుకు ఉపయోగించుతాడో అతడు గ్రహించుకున్నాడు మరి.

నికొలాయ్ కుజ్నెత్సోవ్ ఇక తరుచుగానే రోవ్నొ వెళ్ళడం మొదలు పెట్టాడు. ఆతడు మామూలుగా నికొలాయ్ స్త్రుత్తిన్‌స్కియ్‌తోనో, నికొలాయ్ ప్రిహోద్కొతోనో కలిసివెళ్ళేవాడు. వారు సాధారణంగా కజిమీర్ దొంబ్రోవ్‌స్కియ్ ఇంట్లోనో, ప్రిహోద్కొ అన్న ఇంట్లోనో బసచేసేవారు.

కుజ్నెత్సోవ్ రెస్టారెంట్లలోనూ, షాపుల్లోనూ జర్మన్ ఆఫీసర్లతో పరిచయం చేసుకునేవాడు. కొందరు ఆఫీసర్లతో ముక్తసరిగా ఏవో రెండు మాటలు మాట్లాడేవాడు, కొందరితో చాలాసేపు సంభాషించేవాడు. ఆ రోజుల్లో అందరూ స్టాలిన్‌గ్రాడ్ గురించే మాట్లాడుకునేవారు స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం గురించి వస్తూన్న వార్తలు జర్మన్లను అమితంగా కలవరపెట్టాయి. తాము ఇదిగో పట్టుకున్నాము, అదిగో పట్టుకున్నాము అని జర్మన్లు పదేపదే చెప్పుకున్న ఆ గాథామయ నగరం ఇంకా వీరోచితంగా పోరాడుతూనే వుంది. అంతేకాదు, ఆ నగరం ఎదుట వున్న తమ సైన్యం చక్రబంధంలో ఇరుక్కుపోతూన్నదనే ఘోర వదంతులు అప్పటికప్పుడే వ్యాపించసాగాయి.

కుజ్నెత్సోవ్ రోవ్నొలో వున్న వేళకే యితర కామ్రేడ్లను కూడా రోవ్నొకి పంపించుతూండేవారం. కాని రోవ్నొకి ఎవరెవరు పంపబడినదీ,వారు ఎప్పుడు పంపబడినదీ, మా నిబంధనల ప్రకారం, కామ్రేడ్లెవ్వరికీ తెలిసేదికాదు. తమ కామ్రేడ్లలో ఎవరైనా సరే తమకు ఆ వూరిలో ఎదురైన పక్షమందు, తమ ఆశ్చ

ర్యాన్ని ఏ విధంగానూ పైకి తెలియనివ్వకూడదనీ, వారిని తాము పోల్చుకున్నట్టు ఏ సంజ్ఞలూ చేయకూడదనీ, వారందరినీ కఠినంగా హెచ్చరించాం.

నికొలాయ్ కుజ్నెత్సోవ్‌ను ఒకసారి రోవ్నొకి మంచి సౌఖ్యమైన బండిలో పంపించాం—జోడుగుర్రాల విక్టోరియా బండి, మచ్చమచ్చల ధూసరవర్ణపు జాతి గుర్రాలు. ఈగుర్రాలను కుజ్నెత్సోవ్‌కు ఇవ్వవలసిందని వ్లదీమిర్ స్త్రుతీన్‌స్కియ్‌ని ఆజ్ఞాపించాను. గుర్రాలూ, జీనుసామానూ, బండీ ఎంత గొప్పగానూ ఎంత ముస్తాబు గానూ వుంటే, అతణ్ణి దారిలో ఆపే ప్రమాదం అంత తక్కువగా వుంటుందనీ, అతణ్ణి ఆపేందుకు ఎవ్వరూ సాహసించరనీ నేను నిశ్చయించుకున్నాను. కాని ఈ సారి కుజ్నెత్సోవ్ రోవ్నొలో కొన్ని రోజులపాటు గడపవలసి వుండడంచేత, వూర్లోకి వెళ్ళిన తరువాత, ఆ గుర్రాలను వదిలించుకోవలసిందని నేనతణ్ణి ఆజ్ఞాపించాను.

"అయ్యో, అయ్యో! బంగారంలాంటి ఆ గుర్రాలను వదులుకోవడమే? ఎర్రగుర్రాలను కట్టనీయండి!" అని వ్లదీమిర్ స్త్రుతీన్‌స్కియ్ లబోలబో మన్నాడు.

వ్లదీమిర్ స్త్రుతీన్‌స్కియ్ బతిమాలుకున్నాడు, ఎన్నెన్నో చెప్పి ప్రాధేయ పడ్డాడు, ఇంచుమించు భోరున ఏడ్చేశాడన్నమాటే. కాని ఏమీ లాభంలేకపోయింది. కుజ్నెత్సోవ్ ఆ తేజీలను కట్టించుకుని విక్టోరియాలో బయల్దేరాడు. గ్నెద్యూక్ కోచ్ మేనుగా వెళ్ళాడు. అతణ్ణి రోవ్నొలో వుండాల్సిందని ఆజ్ఞాపించి, అతనికి కూడా ప్రత్యేక స్కౌట్ చర్య ఒప్పగించాం.

అచ్చంగా ఆ జోడుగుర్రాలు కట్టిన ఆ విక్టోరియా గుర్రబ్బండిలోనే ఎక్కి, తటాలున ఇద్దరు స్కౌట్లు—మజూర, బుష్నిన్—మూడు రోజుల తరువాత, క్యాంపులో ప్రత్యక్షమయ్యారు; వీరు ఇంచుమించు అంతకాలమూ రోవ్నొలోనేవుంటూ,క్యాంపులో హాజరుకావలసిందని ఆర్డరు అందినప్పుడూ, లేదా ఏదైనా అత్యవసర పరిస్థితి ఉదయించినప్పుడూ మాత్రమే క్యాంపుకి వస్తూండేవారు.

వీరు రావడంచూసి, నేను మహా ఆందోళనపడ్డాను. మజూర, బుష్నిన్‌లు కుజ్నెత్సోవ్‌ను ఎన్నడూ చూడలేదు. మనవాళ్ళల్లోనే ఒకడు జర్మన్‌యూనిఫారంలో రోవ్నొ వెళ్తున్నట్టు వారు లీలగానైనా ఎరుగరు. అలాంటప్పుడు వీరు అతణ్ణి కలుసుకోవడం ఎలా తటస్థించింది? ఈ గుర్రాల్నీ బండినీ వీరికి ఎవరిచ్చారు? మేం వేసిన పథకంలో ఏదైనా పొరపాటు జరిగిందేమో? కొంపతీసి, కుజ్నెత్సోవ్ అరెస్టు అయ్యాడా ఏమిటి?

వారిదగ్గరకి నేను పరుగున వెళ్ళాను. వ్లదీమిర్ స్త్రిలిన్స్కియ్ అప్పటి కప్పుడే ఆ గుర్రాలను ముద్దుగా తట్టుతున్నాడు

"ఏమిటి జరిగింది?" అని నేను గాభరాపడుతూ మజూరని అడిగాను: "ఈ గుర్రాలు మీకు ఎక్కడ దొరికాయి?"

"అబ్బో, అదో పెద్దకథే!" అంటూ మజూర నవ్వి, "జర్మన్ల దగ్గర నుండి కాజేశాం వీటిని!" అన్నాడు

"ఎలా కాజేశారు?"

మంజూర నన్ను చాటుకు తీసుకెళ్ళి, ఇందాకట్లా నన్ను ఆందోళనపరచిన ఆ నవ్వు నవ్వుతూనే, సావధానంగా తన కథనం చెప్పాడు:

"మా అజ్ఞాతవాస బసలో మేం వుంటూ, క్యాంపుకి వద్దామని తయారవుతూండి, కిటికీలోనుండి చూసేసరికి, ఈ జోడుగుర్రాల విక్టోరియాలోనుంచి జర్మన్ ఆఫీసరు ఒకడు బండి దిగి, ఎక్కడికో వెళ్ళడం మాకు కనబడింది. కోచ్‌మేను గుర్రాల నోట్లోనుండి కళ్ళెం తీసివేసి, దాణా సంచులను వాటి మూతులకు కట్టి, నలు దిక్కులా పరికించి, తనుకూడా ఎక్కడికో ఉడాయించాడు. మేం ఎలాగూ క్యాంపుకు వెళ్ళాల్సివుందికదా, ఇంత చక్కని అవకాశం ఎదురవగా కాలినడకను వెళ్ళడం ఎందుకు—రండి, ఈ గుర్రబ్బండిమీదే పోదాం అని మేమూ, కదమ గుర్రాళ్ళమూ నిశ్చయించుకుని, బండి ఎక్కి వచ్చేశాం. రోవ్నాకి చేరువగా వున్న గూడెంలో, మేం మామూలుగా ఎక్కడైతే రాత్రిపూట మజిలీచేస్తామో అక్కడ, గుర్రాలకు విశ్రాంతి ఇచ్చేందుకు ఆ రాత్రి ఆగి, ఉదయానికల్లా క్యాంపుకి వచ్చేశాం. ఇవి నిజంగా భేషైన గుర్రాలు కావండీ, కామ్రేడ్ కమాండర్!"

"అహా! ఇవి నిజంగా భేషైన గుర్రాలు, దివ్యమైన గుర్రాలు, అందుకేమీ సందేహంలేదు!" అన్నాన్నేను, మనసు కుదుటపడి, నిట్టూర్చుతూనూ.

## అక్కడికక్కడే ప్రాయశ్చిత్తం

స్త్రిలిన్స్కియ్ బంధువు వుంటూన్న పల్లెలో ఒక చౌకిని ఏర్పాటుచేశాం. మా క్యాంపుకీ రోవ్నాకీ మధ్యస్థంగా వుండడంచేత మాకది చాలా సదుపాయమైన స్థావరమైంది. రోవ్నానుండి క్యాంపుకి సుమారు నూటఇరవై కిలోమీటర్లు, హర్కారాకి అంత దూరం వెళ్ళేందుకు నలభైఎనిమిది గంటలు పడుతుంది. ఈ స్థావరం ఏర్పరచిన తరువాత, రోవ్నానుండి వెళ్ళిన హర్కారా ఈ పల్లెవరకూ వెళ్ళి, సమా

చారాన్ని తాను అక్కడ అందించుతే, అక్కడ సిద్ధంగా వున్న మరొక హర్కారా ఆ సమాచారాన్ని తీసుకుని, తాజా గుర్రాలను బండికి కట్టుకుని క్యాంపుకి వచ్చి ఆ సమాచారాన్ని మాకు అందించుతాడు.

1942 డిసెంబరు చివరి రోజుల్లో రోవ్నోలోనూ, జిగాద్లో ఇంట్లో ఏర్పాటుచేసిన చౌకీలోనూ వున్న మా స్కౌట్లనందరినీ వెనక్కి పిలిపించివేయవలసి వచ్చింది. కుజ్నెత్సోవ్, నికొలాయ్ స్త్రుతిన్స్కియ్, జోర్జ్ స్త్రుతిన్స్కియ్, ప్రిహొద్కొ, గ్నెద్యూక్, షెవ్చూక్, చిట్టికోల్యతో సహా వారందరూ సుమారు ఇరవైమంది వుంటారు. చిట్టి కోల్య మధ్యస్థపు చౌకీలో వుండేవాడు. అప్పటికప్పుడే గెరిల్లాలతో కలసి స్కౌటుగా పనిచేస్తూండేవాడు.

వీరందరూ తెల్లవారేసరికల్లా క్యాంపు చేరుకుంటారని నేను అంచనా వేసుకున్నాను. కాని తెల్లవారి ఝాంపొద్దెక్కినా రాలేదు, ఆ రోజంతా కూడా రాలేదు, వారి దగ్గరనుంచి ఏ కబురూ లేదు. ఏమిటి జరిగిందో, వారు ఏ ప్రమాదంలో చిక్కుకున్నారో, ఒకవేళ మాటువేసుకుని కాచుకుని వున్న శత్రుబారినే పడ్డారో అని హెడ్క్వార్టర్స్లో వున్న మేం పరిపరివిధాల ఆలోచనలలో పడ్డాం.

వ్యసనకరమైన ఆలోచనలు మనస్సులో మెదిలాయి.

"తెల్లవారేవరకూ చూదాం. ఇహ అప్పటికి రాకపోతే, వారు ఏ దారిని రావలసివుండెనో ఆ దారివెంట పెద్ద గెరిల్లా గ్రూపును పంపించుదాం" అన్నాను.

తెల్లవారుగట్ల మూడు గంటలకి, డ్యూటీమీద వున్న కామ్రేడు తటాలున నా దగ్గరకు వచ్చి:

"కామ్రేడ్ కమాండర్! కుజ్నెత్సోవ్ క్యాంపుకి వచ్చేశాడు" అని రిపోర్టు చేశాడు.

"మరి, కడమవాళ్ళు ఎక్కడున్నారు?" అని నేను అప్రయత్నంగా అడిగాను.

అది అర్థంలేని ప్రశ్న. మేము క్యాంపుకి ఎవరిని రప్పించుతూన్నదీ, ఎక్కడనుండి రప్పించుతూన్నదీ కడమ గెరిల్లాలకులాగానే ఈ డ్యూటీ కామేడుకి కూడా ఏమీ తెలియదు. అందుచేత నా ప్రశ్న అతగాడికి అర్థంగాక, నెగడిచుట్టూ కూచునున్న గెరిల్లాలందరూ ఒక్కపళంగా చెంగున లేచేసరికి అతడు తబ్బిబ్బు పడ్డాడు. డ్యూటీ కామ్రేడు ఏ జవాబూచెప్పలేకుండా గాభరాపడుతూండగా, ఆ సమయానికి కుజ్నెత్సోవ్ అక్కడ ప్రత్యక్షమై:

"క్రామేడ్ కమాండర్! స్కౌట్లు క్యాంపుకి చేరుకున్నారండి!" అన్నాడు.

"వాళ్ళేరి! ఎక్కడున్నారు?"

"ఖైదీలను కాపలాకాస్తూ బహిర్‌చౌకి దగ్గర వున్నారండి."

"ఎవరా ఖైదీలు?"

"ఓ స్పెషల్ పోలీసు డిటాచ్‌మెంటును మేం ధ్వంసంచేసి, వీరిని పట్టుకున్నామండి."

ఆ ఖైదీలను ఒప్పగించుకోవలసిందని డ్యూటీ క్రామేడుకి ఆర్డరిచ్చి, నేను శాంతమాయించుకుని, కుజ్నెత్సోవ్‌తో అన్నాను:

"ఏమిటి జరిగిందో ఇహ చెప్పండి!"

"కథ ఎక్కడ ఆరంభించడమో నాకు తెలియడంలేదు... చిత్రమైన కథ లెండి!" అంటూ కుజ్నెత్సోవ్ చెప్పడం మొదలెట్టాడు. "మీ ఆర్డరు ప్రకారంస్కౌట్లు అందరూ జిగాద్లో ఇంట్లో చేరారు. ఇక క్యాంపుకి బయల్దేరేందుకు తయారవుతున్నారు రోవ్నోనుండి నేను సరిగా బయల్దేరే క్షణానికి, నాకు కబురందింది: లూద్విపోల్ గెబీట్స్కమిస్సారు* సెలవుమీద జర్మనీ వెళ్తున్నాడనీ, లూటీ సామాను ఎక్కించుకున్న బండ్లు అన్నీ మిలిటరీ ఎస్కార్టుతో లూద్విపోల్‌నుండి బయల్దేర బోతున్నాయనీ, అవి బయల్దేరిన రెండు గంటల తరువాత గెబీట్స్కమిస్సారు బయల్దేరుతాడనీ, తన "జయచిహ్నాలు" అన్నిటితోనూ అతగాడు కాస్తోపాల్ స్టేషనులో రైలెక్కుతాడనీ.

"గెబీట్స్కమిస్సారు పేరు మన జాబితాల్లో వున్న సంగతి మీకు తెలియనే తెలుసును. ఇటువంటి అవకాశాన్ని చేజేతులా పోగొట్టుకుందుకు నాకు మనసొప్పిందికాదు మీకు కబురు పంపించి, మీ అనుమతి తీసుకుందుకు వేళమించిపోయింది: హర్కారాను పంపినప్పటికి నిష్ప్రయోజనమే అవుతుంది. సంగతిఅంతా కుర్రాళ్ళతో చర్చించాను. ప్రిహోద్కో, స్త్రితీవ్స్కీయ్‌లు ఏమన్నదీ మీరే ఊహించుకోగలరు! చిట్టి కోల్యా సహితం ఏ ఆలస్యమూ చెయ్యకుండా పనిలోకి దిగాలన్నాడు.

"లూద్విపోల్—కాస్తోపాల్ మోటార్ రోడ్డుమీద మేం మాటువేశాం, మేం పొంచి వుండేందుకు ఎంచుకున్న చోటు ఏమంత అనుకూలమైనది కాకపోయింది.

---

* గెబీట్స్కమిస్సార్—ప్రాంతీయ ప్రభుత్వాధికారి. —సం.

ఏమంటే మోడుపోయిన తుప్పలుతప్ప మరే చాటుమాటూ మాకు అక్కడ దొరకలేదు, అవొదలవెనకాతలే మేంస్థానాలు ఏర్పరచుకుని వాళ్ళకోసం కాచుకునున్నాం.మనవాడు గ్రోస్ ఆ రోడ్డుమీద మందుపాతర పాతి జానకితాడు మీద మన్నుపోసి, జానకి తాడును ప్రిహోద్కొ కూచున్న పొద దగ్గరకు తీసుకొచ్చాడు.

"అలా గంటసేపు, రెండు గంటలసేపు, మూడు గంటల సేపు దాగున్నాం. కాని బండ్లూ రాలేదు, గెబిట్స్‌కమిస్సారూ రాలేదు. చలి వణికిం చేస్తూంది ఇహప్పుడు క్యాంపుకి వెళ్ళిపోవడానికే నిశ్చయించుకున్నాం.

"మేం మాటుదాగి వున్న చోటుకి ఓ మూడు కిలోమీటర్ల దూరాన తటా లున నల్లని దుమ్ము మబ్బులు కనబడ్డాయి. తరువాత అక్కడా అక్కడా మంటలు లేవడం కనబడింది, మెషీన్‌గన్నూ, సబ్‌మెషీన్‌గన్ను కాల్పుల టపటప శబ్దం విన బడింది. మరొక గంట తరువాత, తగలబడిపోతూన్న ఆ గ్రామంనుండి వరుసగా ఓ యిరవై బండ్లు మా దిశగా వస్తూండడం కనబడింది.

ఆ దృశ్యాన్ని ఊహించుకోండి. ఓ జత గుర్రాలు కట్టివున్న ముందు బండిలో నలుగురు గెస్టాపో మనుషులు కూచున్నారు. మాకు దూరంనుండే స్పష్టంగా కనబడుతున్నాయి—వాళ్ళు వేసుకున్న నల్లని ఓవర్‌కోట్లూ, వాళ్ళ యూనిఫారం టోపీలమీదనూ, ఓవర్‌కోటు చేతులమీదనూ వున్న నాజీ చిహ్న లూనూ. కడమ బండ్లలో—పోలీసులు. ఇహ చివరి బండ్లలో హైడమాక్ మూకలు. దాని అర్థం—వీళ్ళే ఆ పల్లె తగలబెట్టేశారన్నమాట.

"ఇహ వీళ్ళమీద దాడిచేసితీరాలనే నిశ్చయించాం. మరో నిశ్చయానికే అవకాశం లేకపోయింది. అంతేకాకుండా, వాళ్ళకి మేం అగపడలేదని నమ్మేందుకు వీల్లేకపోయింది. ఇక మేం ఏ మాత్రం జాప్యంచేసినా వాళ్ళదే పైచేయి అయిపో తుంది.

"నేను ప్రిహోద్కొకి అర్డరు జారీచేశాను. మొదటి బండి మందుపాతర వున్న స్థలం చేరుకోగానే అతడు జానకితాడును ఒక్క గుంజు గుంజాడు. మందు పాతర పేలుడుకి నలుగురు గెస్టాపోలూ ఆ బండితో సహా కిందపడిపోయారు. సబ్ మెషీన్‌గన్లూ, మెషీన్‌గన్లు కాల్పులతోను కడమవాళ్ళమీద దాడిచేశాం.

"వాళ్ళలో కొందరు తప్పించుకు పారిపోయారు. స్పెషల్ పోలీసులు వదలిపెట్టిన రైఫిళ్ళను నికొలాయ్ ప్రిహోద్కొ, షెవ్‌చూక్‌లు పట్టుకుని, వాళ్ళ అంతు పట్టించారు. అందరిలోనూ మిన్న అనిపించుకున్నాడు జోర్జ్. తన మెషీన్

గన్నుతో అతడు వాళ్ళను ఒక్కొక్కరినీ యిక చకచకా చెక్కిపారేశాడు—అంతే వాళ్ళు చాలమందిని నష్టపోయారు. మేం పన్నెండుగురిని పట్టుకున్నాం, హతులైన వారిని సోదాచేసి, వాళ్ళ పత్రాలను తీసుకున్నాం. చేతికందిన యుద్ధసామాగ్రినంతా—రైఫిళ్ళు, సబ్‌మెషీన్‌గన్నులు, చేతిబాంబులూ—కుర్రాళ్ళు పోగుచేశారు. ఇహ బయల్దేరి వచ్చేశాం

"కాని వుండండి, ఇంతటితో కథ అయిపోలేదు.

"ఖైదీలను దారిలో ప్రశ్నించగా, వాళ్ళు చెప్పారు: తనపై దాడిజరగబో తుందని గెబీట్స్‌కమిస్సారుకు ఎలాగో తెలిసిందట. అందుమీదట అతడు తన ప్రయాణం వాయిదా వేసుకుని, ఈ స్పెషల్ పోలీసులను పంపాడు. వీరు ఒజెర్కీ గ్రామం దగ్గర మాటుదాగి వున్నారు—మేమేమో మూడు కిలోమీటర్ల దూరంలో మాటుదాగి వున్నాం. వాళ్ళు మా కోసం కాచుకూర్చున్నారు, మేం గెబీట్స్ కమిస్సారుకోసం కాచుకూర్చున్నాం. వాళ్ళు చలికి తట్టుకోలేక నెగళ్ళు వేసుకున్నారు.

"ఒజెర్కీ గ్రామ రైతులకి యిదంతా ఏమిటో అనుమానం తోచి, ఏదో కీడు మూడబోతుంది కాబోలు అని భయపడి, మెల్ల మెల్లగా అడవిలోకి పారిపోవడం మొదలెట్టారు.

"అడవిలో వున్న గెరిల్లాలకు కబురు చెప్పడానికే గ్రామస్థులు అడవి లోకి వెళ్తున్నారని గెస్టాపో హెడ్డు నిశ్చయించుకుని, తన మనుషులకి ఆర్డరు యిచ్చే సరికి, వాళ్ళు భీకావహులై వున్న గ్రామస్థులను పట్టుకుని, ఇళ్ళు తగలబెట్టేయడం మొదలెట్టారు. ముసలాళ్ళు బతిమాలుకున్నా ప్రయోజనం లేకపోయింది, పిల్లలు ఏడ్చినా ప్రయోజనం లేకపోయింది. ఓ గంటసేపట్లో తమ కంటబడిన గ్రామస్థు లందరినీ పట్టుకుని, ఆ మండుతూన్న యిళ్ళల్లో పారేశారు...ఖైదీలు యిదంతా ఒప్పుకున్నారు కూడానూ. మీరు కూడా వాళ్ళని ప్రశ్నించండి.

"ఇదంతా అయ్యాక, ఇక భయంలేదు కదా అని పోలీసులుగుండె కుదుట బరచుకుని, గెబీట్స్‌కమిస్సారు ఎదుట రిపోర్టుచేసేందుకని లూద్విపొల్‌కి బయల్దేరారు. బయల్దేరి మా చేతిలో చిక్కారు"

కుజ్నెత్సోవ్ తన కథనం పూర్తిచేశాడు. అంతా నిశ్శబ్దమైపోయింది. ఎవ్వరూ మాట్లాడలేదు. నేనూ మాట్లాడలేదు. తమంతట తామే సంప్రతించి చర్యలు సాగించినందుకు కుజ్నెత్సోవ్, ప్రిహోద్కొ, స్ట్రుతిన్‌స్కియ్‌లను చీవాట్లు పెడదా మని మొదట అనుకున్నాను గాని, ఇదంతా విన్నతరువాత నాకు మాత్రం మరి నోరు రాలేదు.

"అక్కడికక్కడే ప్రాయశ్చిత్తం చేయించేశారు మీరు!" అన్నారు ఎవరో.

ఆ మాట కుజ్నెత్సోవ్ విని, స్పెషల్ పోలీసులపై తాము సాగించిన చర్య ఆమోదించబడిందని గ్రహించుకున్నాడు.

ఏదో బిళ్ళలా అగపడుతూన్న వస్తువు ఒకదానిని కుజ్నెత్సోవ్ నాకు అందించి :

"కామ్రేడ్ కమాండర్! దీన్ని చూడండి. ఇది నేను వ్యక్తిగతంగా సంపాదించిన విజయచిహ్నం" అన్నాడు.

నేను దానిని అందుకుని చూశాను – అది జర్మన్ సిల్వరుతో చేసిన నాణెం మాదిరి బిళ్ళ, దానికి ఇటూ అటూ సన్నని బలమైన గొలుసు వుంది. ఆ బిళ్ళమీద ఒక వైపున: "కేంద్ర ప్రభుత్వ రాజకీయ పోలీసు" అని జర్మన్ భాషలో వుంది. దానికింద "నెం. 4886" అని వుంది. రెండోవైపున నాజీ రాబందూ స్వస్తికా నమూనా గుద్దివుంది.

"ఇప్పుడు ఆ రోడ్డుమీద పడివున్న గెస్టాపో హెడ్డుది ఈ గొలుసుబిళ్ళ. ఉత్తరోత్తరా మనకిది ఉపయోగపడుతుందేమోలెండి. ఇటువంటి గెస్టాపో మొహరును చూపించగల్గిన వ్యక్తి అధికారానికి ఇక తిరుగు వుండదు" అన్నాడు కుజ్నెత్సోవ్.

ఒబెర్త్సీ గ్రామంలో వుండిన మూడువందల ముప్పై ఇళ్ళలోనూ మూడు వందల పన్నెండు ఇళ్ళను పోలీసులు తగలబెట్టేసినట్టు ఇది జరిగిన కొన్ని రోజులకి మాకు తెలిసింది. నాలుగువందలమంది తుపాకీకాల్పులకు చనిపోయారు. ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే: వాళ్ళు పెద్దవాళ్ళని మాత్రమే తుపాకులతో కాల్చివేశారు, చిన్న పిల్లల్ని తుపాకి కుందలతో చావబాది మంటల్లో పారేశారు.

ఈ గ్రామంలోకి గెరిల్లాలు ఎన్నడూ వెళ్ళలేదు, గెరిల్లాలతో ఆ గ్రామస్థులకు ఎట్టి సంబంధమూ లేదు.

శాంతియుతులైన ఒబెర్త్సీ గ్రామస్థులపై జర్మన్లు ఈ విధంగా కసి తీర్చుకున్నారు.

## దీపాల దండ

ఒకసారి దొవ్గేర్, ఫివారొవ్‌లు వీక్తోర్ కొచెత్కొవ్‌ని కలుసుకున్నప్పుడు, జర్మన్లు సార్నిలో ఒక పెద్ద ఇంటిని ఖాళీచేయించేశారనీ, దానిని తొందరతొందరగా మరమ్మతుచేసి, కొత్తగా ఫర్నిష్ చేస్తున్నారనీ వాడతనితో చెప్పారు.

ఆ వూరి కమాండాంటూ, నగర పరిపాలనాశాఖవారూ, పోలీసులూ షక్నీ చయ కోసమని– నిలువుటద్దాల బీరువాలూ, నికెల్ మలాము చేసిన మంచాలూ, మెత్తని పడక కుర్చీలూ, వగైరాల కోసమని–వూరంతా గాలించుతున్నారు. తమకు ఏవస్తువు నచ్చినాసరే, దానిని స్వాధీనం చేసుకుని, దానిని ఆ యింట్లో చేరవేసేవారు. ఎందుకి సన్నాహాలన్నీ? అని ఎవరైనా అడిగినట్టాయెనా, "మా వీరులు ఇక్కడ విశ్రాంతి తీసుకుంటారు" అని వాళ్ళు బదులు చెప్పేవారు.

మరికొంత సమాచారం సేకరించాలనే ఉద్దేశంతో ఫిదారొవ్ ఇంకా భోగట్టా చేయగా, యుద్ధశ్రేణినుండి వస్తూన్న ఆఫీసర్ల కోసం విశ్రాంతి భవనాన్ని జర్మన్లు నిజంగానే సిద్ధంచేస్తున్నారనీ, కెప్టెనూ, కెప్టెన్ పైహోదాగల ఆఫీసర్లు మాత్రమే అక్కడ విశ్రాంతి తీసుకుంటారనీ, మొదటి జట్టు ఆఫీసర్లను తీసుకువచ్చే స్పెషల్ రైలు మరికొద్దిరోజుల్లోనే సార్నీ వస్తుందని అనుకుంటున్నారనీ తెలిసింది.

ఈ "వీరులకు" ఉచితరీతిని స్వాగతమివ్వడం ఎంతైనా అవసరమని మాకుతోచింది.

నలభైఇద్దరు మనుషులున్న ఒక పెద్ద గెరిల్లా గ్రూపు, నా పొలిటికల్ డెప్యూటీ అయిన స్తెహొవ్ నాయకత్వం కింద బయల్దేరి సాయంకాలంనుండీ రైల్వే లైను వెంట స్థానాలను ఏర్పరచుకొని సిద్ధంగా వుంది.

మంచు కురవడం మొదలైంది కాని మంచుతొరకలు నేలను తాకీ తాక దంతో కరగిపోయేవి. అర్ధరాత్రి అయ్యేటప్పటికి గాలి రివ్వున వీచుతూంది. చెమ్మ లోనూ చలిలోనూ అలాగే వణుకుతూ గెరిల్లాలు నేలమీద సాగిలబడి ఆ రాత్రి అంతా రైలుకోసం కాచుకునున్నారు. రైల్వేలైను కాపలాకాచే జర్మన్ సైనికులు లాంతర్లు పట్టుకుని రైలు పట్టాల మధ్యను నడుస్తూ గెరిల్లాల ఎదుటనుండే వెళ్ళారు, కాని మన గెరిల్లాలు వుంచిన మందుపాతరలను వాళ్ళు చూడనేలేదు.

రాత్రి గడచిపోతూంది, కాని రైలు అలికిడే లేదు.

తమకు ఒప్పజెప్పిన కార్యాన్ని నిర్వర్తించకుండానే వెనక్కి వచ్చేయవల సుండే వాళ్ళకి ఎంతో బాధ అనిపించిపోయింది. కాని తెల్లవారే లోపునే అక్కడ నుండి వెనక్కి వచ్చేయక ఇక గత్యంతరం కనబడలేదు. రైల్వేలైనుకి ఇటూ అటూ మూడువందల మీటర్ల దూరంవరకూ వుండిన చెట్లనూ, తుప్పలనూ నాజీలు కొట్టివేసి భూమిని చదునుచేసేశారు. గెరిల్లాలు గనుక తమ కర్తవ్యాన్ని పట్టపగలు సాగిం చాల్సి వుండిన పక్షంలో వారిలో ఎందరో ప్రాణాలు కోల్పోయి వుండేవారే.

మాటుజాగాకి ఇటూ అటూ మేం కాపలా వుంచిన సిగ్నలర్లు రైలుతూర్పు దిశనుండి వస్తూందని సంజ్ఞచేశారు రైలుచక్రాల చప్పుడుబట్టి, అది ఖాళీరైలు అని మాకు తెలిసిపోయింది. మరో అరగంటకి మరో ఖాళీరైలు వెళ్ళింది. ఈ రైలుకిఇంజను ముందర కొన్ని ప్లాట్‌ఫారమ్ వాగన్లు తగిలించి వున్నాయి. వాటినిండా కంకర వుంది. రెండు ఖాళీరైళ్ళూ వెళ్ళిన తరువాత, మేము కనిపెట్టుకుని వున్న రైలు ఇహ త్వరలోనే వస్తుందన్న సంగతి స్త్రైహొవ్ గ్రహించేశాడు.

మఃకొద్ది సేపట్లో వారికి ఆ రైలు రావడం వినబడింది. రైలు వస్తూందని స్కౌట్లు సిగ్నలుచేశారు. ఇంజను వెనకాతల వున్న ప్యాసింజరుబోగీలు మాకు అప్పుడే కనబడ్డాయి, తెరల వెనకాతలనుండి వెలవెలబోతున్న నీలిరంగు వెల్తురు బోగీల కిటికీలలోనుండి మిణుకు మిణుకు మంటూంది.

మనుషులను సిద్ధంగా వుండమని స్త్రైహొవ్ ఆర్డరిచ్చాడు. విధ్వంసుడు మాలికొవ్ మందుపాతరల జానకితాళ్ళను లాగి పట్టుకున్నాడు. ఇంజను మేము మాటు దాగివున్న జాగా అంతటినీ దాటి మాలికొవ్ వున్న చోటకు వచ్చేసరికి అతడు జానకి తాళ్ళలో ఒకదానిని గుంజాడు. ఓ మందుపాతర పేలింది. ఇంజను వెనకాల బోగీలు, గెరిల్లాల కళ్ళఎదటే, దొంతర్లు పెట్టినట్టుగా ఒక దాని వెనుక ఒకటి ఎక్కి పోయాయి. ఆ తరువాత సర్వమూ నిశ్శబ్దమైపోయింది మరిరెండు, మూడు నిమిషాల తరువాత, నాజీలు బోగీలలో నుంచి గంతేసి బయటకురాసాగారు. పేలుడు జరిగిపోయింది, ఇహ ఇప్పుడు మరే ప్రమాదమూ వుండదులే అనుకుని వుంటారు వాళ్ళు బహూశా. మరొకక్షణం తరువాత, రైలు చిట్టచివర బోగీలకింద మరో మందు పాతర పేలింది. ఈ పేలుడు తరువాత, రైలు మధ్యభాగం కింద మరో రెండు మందు పాతరలు పేలాయి. ఇహ, అప్పుడు ప్రారంభమయ్యాయి కాల్పులు.

కూలిపోయిన విమానంనుండి మేం విప్పదీసి, ప్రత్యేకమూ తయారుచేసిన రెండు చక్రాల బండిపై అమర్చిన భారీ మెషీన్‌గన్ను మొట్టమొదట కాల్పులు ప్రారంభించింది. దాని బుల్లెట్ల దెబ్బలకి ఇంజను బోయిలరు తూట్లుపడిన తర్వాత, ఆ మెషీన్‌గన్ను ఒక్క చక్కరు తిరిగి, వరుసగా ఈ కొసనుండి ఆ కొసకు అన్ని బోగీలమీదనూ బుల్లెట్ల వర్షం కురిపించింది. ఈ కాల్పులకు అదనంగా సబ్‌మెషీన్ గన్నులు కూడా కాల్పులు సాగించాయి.

ఆ మిలిటరీ రైలుమీద కాల్పులు సుమారు నలభై నిమిషాలపాటుసాగాయి. భీతావహుడై, ముఖం అష్టవంకర్లు తిరిగిపోయిన ఒక ఆఫీసరు బోగీలోనుంచి గంతేసి, అపస్మారకంగా నవ్వడం మొదలెట్టాడు. భయంతో అతగాడికి మతిచెడిపోయింది.

మనవాళ్ళు తిరిగి అడవిలోకి వెళ్ళిపోయే వేళకు బాగా వెలుగొచ్చేసింది. ఈ చర్య ఫలితాలపై కొచెత్కోవ్ రెండు రోజుల తరువాత రిపోర్టు ఇచ్చాడు :

"అది మనవాళ్ళు కాచుకున్న మిలిటరీ రైలే. స్టాలిన్‌గ్రాడ్ నుండి విశ్రాంతికోసం వస్తూన్న వైమానిక దళానికి, టాంకుదళాలకూ చెందిన ఆఫీసర్లను ఆ రైలు సార్నీ నగరానికి తీసుకువస్తూంది. గెరిల్లాలు అడవిలోకి వైదొలగిన మరొక గంటకి, మాటుస్థలం దగ్గరకు జర్మన్లు వచ్చి, ఆ యావత్తూ జిల్లా చుట్టూ పహరావేసేశారు. హతులైనవారినీ, గాయపడినవారినీ కార్ల మీదనూ, మోటారు ట్రాలీల మీదనూ వేసుకుని సార్నీ, క్లెసొవా, రకిత్నోయ్ నగరాలకు తీసుకువెళ్ళిపోయారు. హతులసంఖ్య మేం ఖచ్చితంగా స్థిరపరచలేకపోయాం కాని కేవలమూ ఒక్క సార్నీ నగరానికే నలభైఏడు శవాలను తీసుకువచ్చారు. కొన్ని శవాలను క్లెసొవా, రకిత్నొయెలనుండి జర్మనీకి పంపించివేశారు. ఇవి ముఖ్యమైన వ్యక్తులవే అయివుండాలి."

ఇది 1942 నవంబరు 26న జరిగింది.

సోవ్ఇన్ ఫారమ్ బ్యూరో* వెలువరించిన ప్రకటనలనుండి, నవంబరు 28న సోవియట్ సైనికబలాలు స్టాలిన్‌గ్రాడ్ సమీపంలో వున్న జర్మన్ రక్షణ స్థానాలను ఛేదించుకుని ఆరవ, ఏడవ జర్మన్ సేనలను చుట్టుముట్టాయన్న సంగతి మాకు తెలిసింది. ఆ మహాయుద్ధంలో విజయం సాధించేందుకు మేం కూడా ఎంత స్వల్పంగానైనా సహాయం చేయగల్గామే అని మేము ఎంతో ఆనందించాం. స్టాలిన్‌గ్రాడ్ మారణహోమం నుండి తప్పించుకుని బయటపడిన జర్మన్ ఆఫీసర్లు గెరిల్లాలు పన్నిన వలలో చిక్కుకున్నారు.

ఈ చర్యలో మాకు ఏ నష్టమూ కల్గలేదు. యెర్మోలిన్ అనే గెరిల్లా సైనికుని బూటుకి మాత్రం యాదృచ్ఛికంగా బుల్లెట్టు తగిలి బూటుమడమ వూడొచ్చేసింది. అయితే అతడి సందర్భంలో ఇటువంటిది అనివార్యమే. ఆ మనిషికి ఎన్ని గండాలు తప్పాయో తల్చుకుంటే ఆశ్చర్యంవేస్తుంది, ప్రతిఘర్షణలోనూ, కేవలం ఒక్క బుల్లెట్టు ఎగిరినా సరే, అది అతడికే తగుల్తుంది—కాని అతడి శరీరానికి కాదు, అతడి వొంటిమీద వున్న ఏ వస్తువుకో : ఓవర్‌కోటుకో, టోపీకో, ఇప్పుడు జరిగినట్టుగా బూటు మడమకో తగులుతుంది. ఘర్షణ అయిపోయాక అతడుసూదీదారమూ తీసుకొనితన యూనిఫారాన్ని మరమ్మతు చేసుకుంటాడు. అతడు ఒక్కసారే గాయపడ్డాడు—అతడికి తగిలిన బుల్లెట్టు అతడి వేలికి తగిలింది.

---

* సోవియట్ సమాచార కార్యాలయం—సం.

ఈ చర్య జయప్రదం కావడం యాదృచ్ఛికమేమీ కాదు. దానిని పకడ్బందీగా ఏర్పాటు చేసి కట్టుదిట్టంగా నడపినది నా పొలిటికల్ డెప్యూటీ స్తేహావ్. యుద్ధచర్యలకు పథకంవేసి వాటిని జరిపించడమంటే అతనికి ప్రాణమే. ప్రతి వివరాన్ని సహితమూ, అది ఎంత స్వల్పమైనదైనా సరే, ముందుగానే ఆలోచించి, దాని గురించి జాగ్రత్త తీసుకునేవాడు. అతడితో కలిసి యుద్ధచర్యలలో పాల్గొనడమంటే అదొక అదృష్టమనే భావించుకునేవారు మా గెరిల్లాలు.

గెరిల్లాల మెప్పు పొందడం ఏమంత సులువైన విషయం కాదు. కాని స్తేహావ్‌ని మాత్రం అందరూ మెచ్చుకునేవారు, అందరూ గౌరవించేవారు. నిర్భయుడైన బోల్‌షెవిక్ కమాండరుకి మంచి కామ్రేడ్‌కి ఉండవలసిన సద్గుణాలు అతనిలో మేళవించాయి. స్తేహావ్ పొట్టిగా చురుకుగా ఉంటాడు ఎప్పుడూ కూడా నీటుగా దుస్తులు వేసుకుని, బుజం స్ట్రాపులు బిగించుకుని, బిగువుగా పెట్టుకున్న పటకాకు ఆటోమేటిక్ మౌసర్‌నూ, మ్యాప్‌కేసూ తగిలి చుకుని వుంటాడు. తానిదివరకు సివిల్ జీవితమే గడపినప్పటికీ, ఈనాడితడు పెరేడ్‌మీద వున్నట్టే ఎల్లప్పుడూ అగపడతాడు. ఆనాటి మా జీవిత పరిస్థితులలో ఈ నీటు, పొంకములు గెరిల్లాలకు అత్యవసరమైన దృష్టాంతంగా వుంటూండేవి.

స్తేహావ్ ఎల్లప్పుడూ తన సైనికులతోనే వుంటూ ఏదో ఒక యూనిట్టుకి వెళ్ళి, తాను పొగతాగనివాడే అయినప్పటికీ, దోమల బాధనుండి తప్పించుకునే ఆయుధంగా తన పైపును ముట్టించి, అక్కడి కుర్రాళ్ళతో కూచుని వారు చెబుతూన్న కబుర్లు వింటూనో, వారికి సలహా యిస్తూనో వాళ్ళతోనే మెలగేవాడు.

* * *

క్రిస్టమస్ పండుగ దగ్గిరపడుతూంది. నాజీలు తమ పండుగ సన్నాహాలను, వారి అలవాటు ప్రకారం, ప్రజలపై లూటీ చర్యలతో ప్రారంభించారు. శత్రువులు 'పీరీ' అనే గ్రామంపైన పడ్డారనీ, రైతులదగ్గర యింకా మిగిలివున్న ఆహారపదార్థాలనూ, పిండిమిల్లులో వున్న గోధుమపిండినీ దోచుకుపోయారనే వార్తను వాల్యేడ్వేర్ మాకు తెలియజేసింది.

రైతులకు రక్షణ కల్పించాలని మేం నిశ్చయించుకున్నాం. పీరీ గ్రామానికి చేరువగా వున్న రోడ్డుమీద ఒక "క్రిస్టమస్ సాయంకాలపు" ఊరేగింపును మేం చూడడం తటస్థించింది.

ఎస్ఎస్* యూనిఫారం తొడుగుకుని తెల్లని గ్లౌవ్ వేసుకున్న జర్మన్ ఆఫీసరు ఒకడు ఒక గ్రూపు జర్మన్ సైనికుల ఎదుట డాబుగా నడుస్తున్నాడు—నడ

*ఎస్ఎస్—ప్రత్యేక కార్యాలను ఒప్పగించేందుకు సైనికబలాల రీతిలో ఆర్గనైజు చేయబడినట్టి ఫాసిస్టు మిలిటరైజ్‌డ్ దళాలు. —సం.

పదమే కాదు, గంభీరంగా మార్చి చేస్తున్నారు. సైనికులు రైఫిళ్ళను తయారుగా పట్టుకున్నారు. (ఏది యేమైనప్పటికీ, వారు గెరిల్లాలను గురించి మాత్రం మరచి పోలేదు!) వీరి వెనుక, నాలుగు జతలు ఎడ్లు పూనిన నాటుబండి వుంది. గుర్రుగుర్రు మని ఘుర్ఘురిస్తూన్న పందులూ, కుర్రుకుర్రుమంటూన్న కోళ్ళూ, గ్లక్ గ్లక్‌మం టూన్న బాతులూ ఆ బండినిండా వున్నాయి. పండుగపూట విందుకు తమకు కావల సిన వస్తువులను వారు ఈ విధంగా "జాగ్రత్త పెట్టుకున్నారు."

మేం ఉన్న చోటకు నాజీలు రావడంతో, స్తేహావ్ తన సబ్‌మెషీన్ గన్నుతో కాల్పులు ప్రారంభించాడు. నాజీ ఆఫీసరు చేతులు పైకెత్తేసి కుప్పకూలి పోయాడు. తక్షణమే కడమ గెరిల్లాలు కూడా కాల్పులు మొదలుపెట్టి, మరికొద్ది నిమి షాలకు శత్రువులందరినీ నేలకూల్చేశారు. ఇద్దరు జర్మన్లు మాత్రం అక్కడున్న నాళాలోకి పారిపోయి, అక్కడనుండి తుపాకులు కాల్చారు.

వీరితో మనవాళ్ళు తలపడుతూండగా, ఈలోపున నాజీలకు క్లేసొవా నుండి లారీలమీద అదనపు బలాల సహాయం అందింది. ఆర్డరు ఒకటి వినబడింది. జర్మన్లు లారీల్లోనుండి గంతేసి, వెంటనే గెరిల్లాలపై విజృంభించ సాగారు. కాని శత్రువు ఈ విధంగా దాడిచేస్తాడని స్తేహావ్ ముందుగానే పోల్చుకుని, మేము దాగి వుండిన స్థలంనుండి క్లేసొవా దిశగా మూడువందల మీటర్ల దూరానే గెరిల్లాలను కొందరిని కాపలావుంచి, ఒకవేళ శత్రువుకి అదనపు సహాయం అందిన పక్షంలో, ఈ అదనపు బలాలపై కాల్పులు ప్రయోగించవలసినదిగా వారికి ముందుగానే ఆర్డరు యిచ్చాడు. ఇక జర్మన్లు తమ దాడి మొదలుపెట్టిలోపునే, ఈ గ్రూపు గెరిల్లాలు జర్మన్లపై కాల్పులు ప్రారంభించారు. ఈ చర్య అంతా యిరవై నిమిషాలలోనే పూర్తి అయిపోయింది. రైతుల దగ్గరనుండి జర్మన్లు దోచుకున్న వస్తువులన్నిటినీ గెరిల్లాలు రైతులకి తిరిగి యిచ్చివేశారు.

మాతో పోరాడేందుకు స్థానిక జర్మన్ అధికారులు కేవలం నిస్సహాయులై పోయారు. మోక్రిన్ అనే ఒక చిన్న వూరిలో ఆ వూరికి స్థానిక కమాండాంట్‌గా ఉన్న జర్మన్ ఆఫీసరు బెర్లిన్‌కు పంపిన ఉత్తరంలో యిలా రాశాడు :

"ప్రియమైన భార్య గెర్‌ట్రూడకు,

"ఇక్కడ పరిస్థితి అతి ప్రమాదకరంగా వుంది. ఎటువైపు చూసినా గెరి ల్లాలే. మేం యిళ్ళనుండి బయటికి కదల్లేకుండా వున్నాం. ఇటువంటి క్రిస్టమస్ పండుగను యింతవరకు నేనెన్నడూ అనుభవించలేదు. ప్రాణాలు అరచేతిలో పెట్టు కుని తిరుగుతున్నానంటే నమ్ము. గెరిల్లాలు వచ్చి ఎక్కడ ప్రాణం తీస్తారో అని

హడలిపోతూ ఏ రాత్రికి ఆరాత్రే మంచంపైన వాల్తున్నాను. నాకు మిలిటరీ పోలీసు బాడీగార్డు వుందనుకో. వుండే మాత్రం, యావత్తు జనాభా సహాయమూ వున్న గెరిల్లాల ఎదుట ఈ పట్టెడుమంది పోలీసులు ఏమూల.

"నీ పేర ఒక పార్శిలు పంపించాను. నీ కది అందిందో లేదో మరి? నీకు రెండువందల మార్కులు రొక్కం పంపిస్తున్నాను. ఇదైనా నీకు అందుతుందనే నమ్మకం నాకు లేదు. నీకు అందిన వెంటనే నాకు వుత్తరం రాయి."

కమాండాంట్ అనుమానపడ్డాడూ అంటే ఊరకే అనుమానపడలేదు,మరి.

ఆ పార్శిలూ, ఆ రెండువందల మార్కులు రొక్కమూ, సంతకంలేకుండా ఇంకా అసంపూర్తిగానే వున్న ఆ వుత్తరమూ గెరిల్లాల చేతిలో పడ్డాయి. గెర్ట్రూడ పెనిమిటి కూడా ఆ సంవత్సరాదినాడే మా చేతిలో పడ్డాడు.

మేము మా గెరిల్లా పద్ధతిలోనే సంవత్సరాది పండుగ చేసుకున్నాం. ప్రతి సోవియట్ కుటుంబంలోనూ సంవత్సరాది పండుగలు ఇకముందు ఎల్లప్పుడూ శోభాయమానంగానూ, ఆనందభరితంగానూ వుండేందుకోసం, శత్రువుకు ఎట్టి దయాదాక్షిణ్యమూ చూపని సమరోత్సవ రూపంలో మా పండుగ వుండాలని మేం నిశ్చయించుకున్నాం. మా వార్తాపత్రిక సంవత్సరాది సంచిక ఈ కింది ప్రకటనను ప్రచురించింది:

"సంవత్సరాది పండుగకు రాదల్చుకున్న వారందరూ సంవత్సరాది వృక్షానికి అలంకరణలను ఎవరిమట్టుకు వారు సొంతంగా తీసుకురావాలి. ఈ కింద పేర్కొనబడిన అలంకరణలను మేము స్వీకరించుతాం: 1. అగ్నికి ఆహుతవుతూన్న నాజీ రైళ్ళ రూపంలో ప్రకాశమానములైన దీపాలదండలు. 2. ధ్వని అనుకరణలకోసం, శత్రువునుండి వశపరచుకున్న సబ్‌మెషీన్‌గన్నులు. 3. అన్ని సైజుల నాజీలు. 4. సొంత చొరవ ఉపయోగించి సంపాదించిన అన్ని వస్తువులు. అన్ని కానుకలూ డిసెంబరు 31కి ముందుగానే అందించబడాలి."

మాలికొవ్ నాయకత్వాన వున్న విధ్వంసకుల గ్రూపు "సంవత్సరాది వృక్షానికి" "అలంకరణ"గా అగ్నికి ఆహుతవుతూన్న నాజీ రైళ్ళరూపంలో దీపాల దండను కానుకగా సమర్పించింది.

మేం స్థిరంగా నిలదొక్కుకుని వున్న నార్ని అరణ్యాలపై శత్రువు నానాటికి మరింతగా శ్రద్ధ చూపడం మొదలుపెట్టాడు కాబట్టి అతడి దృష్టిని మళ్ళించేందుకని, రోవ్నాకి పడమటనున్న కోవెల్–రోవ్నా రైల్వేలైనుపై వెళ్తూన్న ఒక రైలును పేల్చివేసేందుకు మేం నిశ్చయించాం.

వృత్తిరీత్యా ఇంజనీరు అయిన మాలికొవ్‌తో సహా మరి పన్నెండుగురు గెరిల్లాలు పెద్ద సైజు మందుపాతరలను కొన్నింటిని తీసుకుని, అంతకు ముందుగానే మేం ఎంచిన స్థలానికి వెళ్ళారు. వీరు రైల్వేలైను చేరుకుని, పొద్దుపోయేవరకు అక్కడ దాగి, చీకటిమాటున సన్నసన్నగా పాకుకునివెళ్ళి పాయింట్స్‌మేను గుడిసె చేరుకున్నారు.

ఆ ముసలి పాయింట్స్‌మేనుని వారు ప్రశ్నించేసరికి, అతడు యథేచ్ఛగానే చెప్పేశాడు : ఆ లైనుపై రైళ్ళు తరచుగానే వెళ్తుంటాయనీ, యుద్ధశ్రేణికి వెళ్ళే రైళ్ళు సైనికబలాలనూ, ఆయుధసామగ్రినీ తీసుకువెళ్తుంటాయనీ, పడమటిదిక్కుగా వెళ్ళేవి క్షతగాత్రులతోనూ, చలిదెబ్బకి జబ్బుపడినవారితోనూ, లూటీ సామాన్లతోనూ నిండి వుంటాయనీ, మనవాళ్ళు అక్కడకు ఏ పనిమీద వచ్చారో ఆ ముసలాడు గ్రహించేసి ;

"వాళ్లు నన్ను ఏమి చేసిపోతారో అని నాకు ఏ బెంగా లేదు. కాని మా కడమవాళ్ళ గతి ఏమిటని మాత్రం నాకు భయంగా వుంది, వాళ్ళందరినీ తుపాకులతో కాల్చిపారేస్తారు" అన్నాడు.

రైల్వేలైను కాపలాకాసేందుకు ఆ చుట్టుపక్కల గ్రామాల రైతులను జర్మన్లు తరలించారనీ, ఎట్టి విధ్వంసం జరిగినా సరే, వారిని కాల్చిపారేస్తామని వారిని జర్మన్లు హెచ్చరించారనీ మాకు తెలిసింది. లైను పొడుగునా ఏభై మీటర్లకు ఒక్కొక్క చొక్కి చొప్పున చౌకీలు ఏర్పరచుకుని రైతులు లైనుపై కాపలాకాస్తున్నారు.

"రైతులతో మేం మాట్లాడతాంలే!" అన్నాడు మాలికొవ్.

రైతులతో సంభాషణ మొదలైనదగ్గరి నుండీ స్నేహభావంతోనే జరిగింది. మేం తల్పుతున్న పనినుండి మమ్మల్ని మళ్ళింపజేసేందుకు వారు ఏ విధంగానూ ప్రయత్నించలేదు సరికదా, పేల్చివేత జయప్రదంగా జరిగేందుకు మాకు సహాయం కూడా చేశారు, అందుకు ఎట్టి శిక్ష సహితమూ తమపై పడకుండా వుండే మార్గం గురించి ఆలోచించుకున్నారు. వారిలో ఒక ముసలామె ఇలా అంది :

"మమ్మల్ని కాళ్ళూ చేతులు కలియగట్టేసి, మీపని మీరు కానివ్వండి. మా నోట్లో గుడ్డలు కుక్కేసి, మమ్మల్ని నాలుగు బాదులు బాదండి, దెబ్బలు బాగా అగపడేటట్టు."

"ఆ పని మాత్రం మా వల్లకాదు!" అన్నారు మనవాళ్లు.

"అయితే సరే, మీరు ఆ పని చెయ్యలేకపోతే, మాతో మేమే ఆ పని చేసుకుంటాంలెండి!" అంది ముసలామె.

ఆ దృశ్యం చూసి నిజంగా నవ్వే వచ్చింది మాకు! మన మనుషులు మందుపాతరలను పాతుతూండగా, ఆ రైల్వేలైను "రక్షకులు" ఒకరితో ఒకరు ముష్టి యుద్ధం సాగించి దెబ్బలు తగిలించుకున్నారు. తరువాత వాళ్ళను మనవాళ్ళు కాళ్ళూ చేతులూ కట్టేసి, ఓ నెగడి దగ్గరకు తీసుకెళ్ళి వాళ్ళను అక్కడ పడేశారు. ఇంతట్లో అల్లంత దూరాన రైలు అగపడింది. ఇకనేముంది మందుపాతరలు పేలాయి: ఆయుధాలూ, మందుగుండు సామగ్రి, ఇతర యుద్ధ సప్లైలతో నిండివున్న ఆ రైలు దేదీప్యమానంగా దగ్ధమైంది. ఇంజను వెల్లకిలా బోల్తా కొట్టింది. అరవై వాగన్లు గుండపిండై మండిపోయాయి.

అది మా మాతృదేశానికి మేము సమర్పించిన సంవత్సరాది కానుక!

## మా "ముఖ్యపట్టణం"

జనవరిలో చలి ఉధృతమై ఉష్ణోగ్రత మైనస్ ఇరవై డిగ్రీలకు పడిపోయింది. మా "హూమ్"లను– మేం వేసుకున్న గుడిసెలను అలా అనేవారం– చలికాలానికి తట్టుకునేటట్టుగా వేసుకోలేము. మేము తరుచు కొత్త స్థలాలకు మారుతూండేవారం. ఆ కారణంచేత, వెచ్చగా వుండేందుకని గోతులుతీసి వాటిపై గుడిసె కట్టుకుందుకు అవకాశంలేక, సన్నటి బాజులపై ఫర్‌చెట్టు కొమ్మలు వుంచి, వాటికి అడుసుమెత్తి కట్టుకున్న చూములతోనే తృప్తిపడకతప్పిందికాదు. తలుపులకు బదులు వాటర్‌ప్రూఫ్‌కేప్‌లను వాడవలసి వచ్చింది. పొగపోయేందుకని చూమ్ నడికొప్పున కన్నం ఉంచాం. చూమ్ నడిమధ్య పొయ్యి మండుతూండేది. తలలు గోడవైపూ, కాళ్ళు పొయ్యివైపు పెట్టుకుని పొయ్యిచుట్టూ పడుకునేవారం. పొయ్యి సెగకి కాళ్ళు వెచ్చగా వుండినా, తలదగ్గర మాత్రం మహా చలిగా వుండేది. ఒక్కొక్కప్పుడు మనుషులు నిద్రలోనుంచి లేవబోయి, తలవెంట్రుకలు గడ్డకట్టుకుని నేలకి అంటుకుపోవడంచేత లేవలేకపోయేవారు కూడానూ. చలినుంచి మాకు సరిగా నిద్రపట్టేదికాదు. మెలకువ వచ్చినప్పుడులేచి నుంచుని, ఒళ్ళు వేడెక్కేందుకు కాళ్ళు నేలను ఢపఢపకొట్టి, తరువాత మళ్ళీ పడుకుని, చలికి గజగజ వణికిపోయేవారం. మరొక ఇబ్బంది కూడా వుండేది. భౌతికశాస్త్ర నియమాల ప్రకారం, చూమ్ నడికొప్పునున్న కన్నంలో నుంచి పొగ బయటకు పోవలసి వుండగా, మా చూమ్‌లలో అలా కాకుండా పొగ పైకి లేవడం బదులు, నేలపైన వ్యాపించేది. దానితో కళ్లు మంటలెత్తిపోయేవి. దీని అర్థం–చూమ్‌లను మేము సరిగా కట్టలేదన్నమాట.

ఒక్క మాటలో చెప్పాలంటే, మేం ఎన్ని ఇబ్బందులు పడ్డామంటే ఇక ప్రాణం విసిగిపోయి, చలికాలం వెళ్ళిపోయేవరకూ డిటాచ్‌మెంటుని ఖూద్న్యి-బొబ్రోవ్‌స్కయ గ్రామానికి తరలించి ఆ గ్రామంలో మకాం పెట్టేందుకే చిట్టచివరికి నిర్ణయించాం. ఆ గ్రామంలో మాకు పూర్తిభద్రత వుంటుందని మేం ఎరుగుదుం. మా గస్తీచౌకీ ఒకటి ఆ గ్రామంలోనే వుంది, మా గస్తీచౌకీ మనుషులు ఆగ్రామంలో వున్న యువకులను కూడగట్టి, వాళ్ళలో నుంచే ఒక రక్షణదళాన్ని ఏర్పాటుచేశారు కూడానూ.

జనవరి 19న డిటాచ్‌మెంటు ఖూద్న్యి-బొబ్రోవ్‌స్కయకి తరలివెళ్ళింది.

మేమెంతో సమ్మాన పాత్రులమైన అతిథులని ఎంచి, ఆ గ్రామస్తులు మాకు ఘనస్వాగతమిచ్చారు. వారు ఒక పెద్ద సమూహంగా గ్రామం పొలిమేరవద్దకు ఎదురు సన్నాహం వచ్చి, మా డిటాచ్‌మెంటును కలుసుకొని, మాతో కలిసి మార్చి చేసుకుంటూ గ్రామంలోకి వచ్చారు. పిల్లలు కర్రలను రైఫిళ్ళలా భుజాలకి ఆనించుకుని డిటాచ్‌మెంటు ముందువరుసలో స్తెహావ్‌తోనూ, నాతోనూ కలిసి నడిచారు.

గ్రామంలో వున్న యావన్మంది గ్రామ చౌకు దగ్గర మాకోసం కాచుకున్నారు. పార్టీ, ప్రభుత్వ నాయకుల చిత్రాలు గ్రామ సోవియట్ గోడలకు తగిలించి వున్నాయి. సోవియట్ సైన్యం తప్పకుండా విజయధ్వానాలతో తిరిగివస్తుందనే ఆకాంక్షతోనూ, దృఢ నమ్మకంతోనూ ప్రజలు అందుకు నిరీక్షించుతూ, నాయకుల చిత్రాలను భద్రంగా దాచుకున్నారు.

ఎర్రగుడ్డ పరచిన ఒక టేబులు పక్కను ముసలి రైతు ఒకడు బ్రెడ్డూ, ఉప్పూ వున్న ఒక పళ్ళెన్ని చేతులతో పట్టుకుని నుంచున్నాడు.*

వరుసలుతీర్చి వస్తూన్న మా డిటాచ్‌మెంటు అక్కడకు చేరుకుని అక్కడ ఆగిన తరువాత, ఆ వృద్ధుడు మాకు ఎదురుగా వచ్చి :

"బ్రెడ్డుతోనూ, ఉప్పుతోనూ మీకు స్వాగతం చెబుతున్నాం" అన్నాడు. "మా యిళ్ళ తలుపులు తెరచేవున్నాయి, మీ సొంత యిళ్ళల్లో వున్నట్టే మీరు భావించుకోవలసిందని మా కోరిక. మీకు తగిన భోజన వసతులు కల్పించుతాం. మీ డిటాచ్‌మెంటును మేం ఎరుగుదుం. మీరంటే మాకెంతో గౌరవం. మీవల్ల మాకు ఏ హానీ సంభవించదు. మాకు జర్మన్లనుండీ, దోపిడీదొంగలనుండీ హాని సంభవించ

*గౌరవనీయులైన అతిథులకు మైత్రి చిహ్నంగానూ స్వాగతపూర్వకంగానూ బ్రెడ్డూ ఉప్పూ అర్పించడం రష్యన్ ఆచారం. —సం.

కుండా మమ్మల్ని మీరు కాపాడుతారు. ఇక యిప్పుడు మనం మన బద్ధశత్రువుతో పోరాడాల్సివచ్చినట్టాయెనా, మీరు మేమూ కలిసే పోరాడుదాం" అన్నాడు.

వృద్ధుడు తన ఉపన్యాసం ముగించి, బ్రెడ్డూ ఉప్పూ స్తేహావ్‌కి అందించాడు. స్తేహావ్ పళ్ళేన్ని అందుకుని, ఉచితరీతిని సంక్షిప్తంగా ప్రత్యుత్తరమిచ్చాడు.

డిటాచ్‌మెంటుకి సెలవిచ్చేసి పంపించేశాను. గెరిల్లాలు వెంటనే ఆ గ్రామస్థులతో కలసి మెలసి తిరిగారు. వారూ గ్రామస్థులూ ఎంతో అన్యోన్యంగా మనసు విప్పి మాట్లాడుకోసాగారు. ఆ దృశ్యాన్ని చూచినవారు వీరందరూ చిరకాల మిత్రులు కాబోలు అనుకునే వుంటారు తప్పకుండానూ.

రూద్న్య – బ్రొబోవ్‌స్కయను మేం హాస్యానికి మా "ముఖ్యపట్నం" అనేవారం. మా డిటాచ్‌మెంట్ హెడ్‌క్వార్టర్సుని ఆ గ్రామంలో పెట్టుకున్నాం. మా చుట్టూ సార్ని, రకిత్నోయె, బెరెజ్నో, లూద్విపొల్ జిల్లాలలోని పెద్ద గ్రామాలలో గస్తీచౌకీలను ఏర్పాటు చేసుకున్నాం. అసలు యావత్తు ప్రాంతంలోనూ మేము సోవియట్ ప్రభుత్వ ప్రతినిధులం.

నాజీలకోసం పనిచేస్తూన్న డెయిరీలన్నిటినీ మేం వశపరచుకున్నాం. వాటినుండి రవంత సరుకైన నాజీలకు సరఫరా అయ్యేదికాదు. మిహాలిన్ రంపపుకోత మిల్లులో మేం "బైఠాయించాం," మా కమాండాంటు ఆ మిల్లులోనే తన మకాం పెట్టుకోవడంచేత అక్కడ కోసిన యావత్తు కలపనూ అవసరం ఉన్న రైతులకు మాత్రమే సరఫరా చేసేవారం. స్లూచ్, గొరీన్ నదుల పశ్చిమతీరాన ఉన్న జర్మన్ ఎస్టేట్లపై మేము దాడిచేసి వాటిని ధ్వంసంచేసివేశాం. మా తీరాన వున్న ఎస్టేట్లను యింతకుముందే ధ్వంసంచేసేశామనుకోండి. అనేక జిల్లాలు మా చేతికిందకి వచ్చేశాయి.

రోవ్నొనుండి, జిల్లా కేంద్రాలనుండి, రైల్వేస్టేషన్లనుండి, యింకా చుట్టుపక్కల స్థలాలనుండి ముఖ్యమైన సమాచారం మా "ముఖ్యపట్నం"లోకి వచ్చిపడుతూండేది. ఆ సమాచారాన్ని మేము వెంటనే మాస్కోకు రేడియో ద్వారా అందించేవారం.

రూద్న్య–బ్రొబోవ్‌స్కయకు దక్షిణంగా ఏభైకిలోమీటర్ల దూరాన ఒక సంగ్రామిక చౌకిని మేము ఆర్గనైజుచేసి, దానికి ఫ్రొలోవ్‌ను నాయకునిగా నియమించాం. ఈ చౌకిలో స్థానికవాసుల సాయుధ దళాలను ఏర్పాటుచేసి, వీటిని మా గ్రూపులతో కలిపి, పోరాట చర్యలను జరిపేందుకు పంపేవారం.

గ్రామం చుట్టూ బలమైన గస్తీచౌకీలను స్థాపించడంవల్ల మా "ముఖ్య పట్టణానికి" మంచి రక్షణ ఏర్పడింది. ఈ గస్తీచౌకీలలో స్థానిక యువకుల అదనపు బలాలు ఎల్లప్పుడూ వుంటూండేవి. ఈ యువకులు వీధులలో కూడా గస్తీ తిరుగుతూండేవారు. ఇది ఎంతో ముఖ్యమైన విషయం, ఎందుచేతంటే, కొత్త మనుషులు అక్కడ అగపడేసరికల్లా, వారు పరాయివాళ్ళని వీరు వెంటనే పోల్చేసుకునేవారు.

గ్రామానికి సరాసరి అంటీవున్న ఒక బయలును విమాన అవతరణ క్షేత్రంగా మేం ఉపయోగించుకోగల్గాం.

మమ్మల్ని మాస్కో కన్నతల్లిలా చూసుకుంటూ, యించుమించు ప్రతి రాత్రీ మాకు కానుకలు పంపుతూండేది. బ్రహ్మాండమైన పారషూట్లు ఆకాశాన తెరచుకునేవి, యూనిఫారాలతోనూ, వెచ్చని బట్టలతోనూ, ఆహారపదార్థాలతోనూ సిగరెట్లతోనూ నిండిన పెద్ద పెద్ద ప్యాకేజీలు మేం వెలిగించి వుంచిన నెగళ్ళ దగ్గిర దిగేవి.

మేము ఆ గ్రామంలోకి రావడంతో స్థానిక ప్రజలకు మంచి గుండె నిబ్బరం కల్గింది. యుద్ధశ్రేణి పరిస్థితి గురించి వారికి మా ద్వారా ఎప్పటికప్పుడు తాజా వార్తలు తెలుస్తూవుండేవి.

స్టాలిన్‌గ్రాడ్‌లో జర్మన్లు మన సైనికబలాల చక్రబంధంలో ఇరుక్కున్నారు. మూడు లక్షల సైన్యంయొక్క అంతిమనాశనం ఇక గడియలమీదవుంది. లెనిన్‌గ్రాడ్ యుద్ధ శ్రేణిలోని మన సైనికబలాలు ఆ పట్టణం చుట్టూ శత్రువు స్థాపించిన చక్రబంధాన్ని జనవరిలో ఛేదించివేశాయి. ఉత్తర కాకస్‌లో సోవియట్ సేన ప్రారంభించిన విజృంభణ కూడా త్వరత్వరగా అభివృద్ధి చెందుతూంది.

గెరిల్లాలకూ, స్థానిక ప్రజలకూ మధ్య చక్కని సంబంధాలు ఏర్పడ్డాయి. ప్రతి గెరిల్లా కూడా తాను ఏ ఇంట్లో బసచేస్తున్నాడో ఆ యింట్లోవారికి అన్ని పనుల్లోనూ సాయం చేయడంలోనే తన తీరికవేళనంతా వినియోగించేవాడు.

మా డిటాచ్‌మెంటులో ఒక కఠినమైన నిబంధన వుంది: డిటాచ్‌మెంటులోని వారెవ్వరూ మద్యం సంపాదించకూడదు, అంతేకాకుండా ఒకవేళ పైవాళ్ళెవరైనా ఇచ్చినప్పటికీ కూడా స్వీకరించకూడదు. గెరిల్లా ఒకడు తన కర్తవ్యాన్ని నిర్వర్తించి బస చేరుకునే సరికి ఆ యింటి యజమానురాలు అతడికి భోజనమూ, ఇంట్లో కాచిన వోద్కా ఇవ్వడం అప్పుడప్పుడు సంభవించేది.

"ఇది మీ కోసమే, పుచ్చుకోండి ; చలిలో గడ్డకట్టుకుపోయుంటారు" అనేది ఆమె.

"భోజనం చేస్తాను గాని, వోద్కా వద్దండి. వోద్కా తాగను."

"ఇదేమిటది ? వోద్కా ఐదలికకు మంచిదండీ !"

"వొద్దండి, మా రూల్సుకి వ్యతిరేకమండి."

ఈ రూలు అతిక్రమణ ఒక్కసారే జరిగింది. ఆ అతిక్రమణ ఫలితం మాత్రం అతి ప్రమాదకరంగా పరిణమించింది.

కొసూల్‌నికొవ్ అనే గెరిల్లా తరచుగా జిగాద్లొ ఇంట్లో వున్న చౌకిలో రోజుల తరబడి డ్యూటీమీద వుండేవాడు. జర్మన్ ఖైదులో నుండి తప్పించుకొని వచ్చి మా డిటాచ్‌మెంటులో చేరిన గ్రూపులో మనిషి ఇతడు. ఇతగాడు నిబంధనలను ఒక పథకం ప్రకారం అతిక్రమించుతూ, ప్రతిరోజూ నాటుసారాయి తప్ప తాగుతూ వుండేవాడనీ ఆ చౌకి నాయకుడు షూలికొవ్ రిపోర్టు చేశాడు. ఇదిచాలనట్టు అతడు ఇతర గెరిల్లాల దగ్గరనుండి తిండి వస్తువులూ, బట్టలూ దొంగిలించి వాటిని చాటుగా అమ్మి సారాయి సంపాదించేవాడు. అనుమానాస్పదమైన ఒకానొక కుటుంబంతో కొసూల్‌నికొవ్ దగ్గర సంబంధాలు పెంచుకున్నాడనీ, తాను గెరిల్లాననే విషయం ఈ కుటుంబంతో చెప్పాడని కూడా మరి కొద్ది రోజులకి మాకు తెలిసింది.

ఆ పల్లెటూరికి వస్తూ వెళ్తూండే గెరిల్లాలకే కాకుండా, జిగాద్లొ కుటుంబానికి కూడా ఈ నీచుడు ప్రాణాంతకమైన ప్రమాదాన్ని తెచ్చిపెట్టుతున్నాడనే సంగతి స్పష్టంగా కనబడుతూనే వుండెను. అందుకని, ఆ చౌకినుండీ, రోవ్నొనుండీ మన మనుషులని వెనక్కి రప్పించేసేందుకూ, కొసూల్‌నికొవ్‌ని అరెస్టు చేసేందుకూ హెడ్ క్వార్టర్సు నిర్ణయించింది.

ఆ గ్రామస్థులు వెనుక మమ్మల్ని ఏ చౌకులోనైతే పురాతన రష్యన్ సంప్రదాయాన్ననుసరించి బ్రెడ్డుతోనూ, ఉప్పుతోనూ ఆహ్వానించారో, ఆ చౌకులోనే ఇప్పుడు యావత్తు డిటాచ్‌మెంటూ బారులుతీర్చి నిలబడింది. రూద్న్య-బొబ్రోవ్‌స్కయలో వున్న ప్రజలు— మగవాళ్ళు, ఆడవాళ్ళు, పిల్లలూ—యావన్మందీఅక్కడ కూడారు. అరెస్టులో వున్న కొసూల్‌నికొవ్‌ని ఆ చౌకులోకి తీసుకువచ్చిన తరువాత, నేను నాలుగు మాటలు మాట్లాడాను:

"ఈ మనిషి ఇదివరకు తన మాతృదేశానికి ద్రోహం చేశాడు. తను తీసుకున్న ప్రమాణాన్ని భంగపరచి శత్రువుకి లొంగిపోయాడు. మరి ఇప్పుడు తన

వాగ్దానాన్ని చెల్లించుకునే అవకాశం తనకు తిరిగి ఇవ్వబడినప్పుడు ఇతడు మా నిజం ధనలను ఉల్లంఘించాడు, గెరిల్లాలకు అవమానం తీసుకువచ్చాడు, ద్రోహానికి దిగజారాడు. ఇతని చర్య మన పోరాటానికి ముప్పుతెచ్చిపెట్టింది, నాజీలకు సహాయం చేసింది. డిటాచ్‌మెంటు అధిష్ఠానవర్గం కొసూల్‌నికొవ్‌కు తుపాకి కాల్పులవల్ల మరణశిక్షను విధించింది "

కొసూల్‌నికొవ్ తుపాకికాల్పులవల్ల మరణశిక్ష అనుభవించాడు.

* * *

1943 ప్రారంభంలో గెరిల్లాలు చాలామంది మా జిల్లాలలో కేంద్రీకృతమయ్యారు. "సోవియట్ వీరుడు" బిరుదంపొందిన జనరల్ సబూరొవ్ నాయకత్వాన వున్న డిటాచ్‌మెంటు నుండి రెండు బెటాలియన్లు మా ప్రాంతానికి వచ్చాయి. లెఫ్టినెంట్-కర్నల్ ప్రొకొప్యూక్ కమాండ్‌కింద వున్న ఒక డిటాచ్‌మెంటు మాకు చేరువనున్న వారొనొవ్‌క వూరిలో వుంచబడింది. ఇంకా మరికొన్ని రికాన్నిసెన్స్ గ్రూపులూ, విధ్వంసన గ్రూపులూ కూడా ఈ ప్రాంతంలోనే పనిచేస్తూండేవి.

ఇంతమంది గెరిల్లాలు అక్కడ పోగవడం జర్మన్లకు గాభరా పుట్టించింది. గెరిల్లాలు సార్ని అరణ్యాలనుండి తరిమివేయబడాలని ఉక్రైనియాలో హిట్లర్ ప్రతినిధిగా వున్న ఏరిక్ కోక్ తాఖీదు జారీచేసినట్టు రోవ్నొనుండి కుజ్నెత్సొవ్ రిపోర్టు చేశాడు. రోవ్నొలో వున్న ప్రధాన జర్మన్ పోలీసు అధికారి పీట్జ్ రెండువేలమంది ఎస్.ఎస్. మనుషులను రోవ్నొలో ఎంతో కష్టంతో పోగుచేసి, వీరికి ఉక్రైనియన్ జాతీయవాదుల చెప్పుచేతల్లోవున్న బందిపోటుదొంగల ముఠాలను తోడుయిచ్చి, మా చుట్టూ వున్న జిల్లా కేంద్రాలను వీరిచేత గారిజన్ చేయించాడు.

మేము ప్రతిచర్యలు తీసుకున్నాం. మేమే జిల్లా కేంద్రాలపై దాడిచేయబోతున్నామనే పుకార్లను లేవదీసి, వాటిని స్థానికవాసులచేత వ్యాపింపజేశాం. ఈ పుకార్లు నాజీల చెవిన బడడంతో, వారు దాడి సన్నాహాలను వదలుకుని, రక్షణ సన్నాహాలు ప్రారంభించారు. వారు బసచేసిన ఇళ్ళ తలుపులు మరింత దృఢంగా వుండేందుకని వాటికి దళసరైన ఇనుపరేకులు బిగించారు. కిటికీలలోనుండి మెషీన్‌గన్నులను ప్రయోగించేందుకు వీలుగా, మెషీన్‌గన్నుల మూతులకు సరిపడిన రంధ్రాలున్న ఇనుప ప్లేట్లను కిటికీలకు అమర్చారు. ఇళ్ళచట్టూ ముళ్ళతీగె కంచెలుపెట్టి, రాకపోకల మార్గాలున్న కందకాలను ఇళ్ళచుట్టూ తవ్వారు. మేం పన్నిన తంత్రం ఫలితంగా వాళ్ళు ఈ పనులలో మునిగివుండగా మా పని మేం కానిచ్చాం.

పెద్ద దండన చర్యకై నాజీలు సన్నాహాలు జరుపుతున్నారని ఉక్రైన్ నొవ్ రోవ్నొనుండి జనవరి చివరి రోజుల్లో మళ్ళీ మరొక రిపోర్టు పంపించాడు. జర్మన్ సైనిక బలాలు జితోమీర్‌నుండి, కియెవ్‌నుండి రప్పించబడ్డాయి. అనేక దిశలనుండి ఎదురుదాడి జరిపేందుకు పథకం తయారైంది.

మేం ఏ గ్రామాలలోనైతే చౌకీలు స్థాపించామో ఆ గ్రామాల చుట్టూ వున్నట్టీ, రూద్న్యా-బొబ్రోవ్స్కయ గ్రామంచుట్టూ వున్నట్టీ రోడ్లు అన్నిటిపైనా స్థానిక ప్రజల సహాయంతో కలపదూలాలంతో అడ్డంకులను నిర్మించాం.

జర్మన్లు రూద్న్యా- బొబ్రోవ్స్కయపై నాలుగువైపులనుండి విజృంభించారు. కాని వారు దాడిచేసేసరికి మేము ఆ గ్రామంలో వుండలేదు. మేము ఆ గ్రామంలోనే వుండి పోరాడి వారికి భారీ నష్టాలను కలుగజేసి వుండేవారమే. కాని అందువల్ల మా మనుషులకు ప్రమాదావకాశం కూడా అధికమే. అంతేకాకుండా దీనికితోడు ఆ చర్యలవల్ల గ్రామస్థులకు గొప్ప ముప్పు వాటిల్లుతుంది కూడా.

రూద్న్యా-బొబ్రోవ్స్కయ గ్రామంనుండి మేంసన్నసన్నగా వైదొలగాం' మాతోకూడా గ్రామస్థులలో చాలామంది గ్రామం వదలిపెట్టేశారు. గ్రామస్థులుమూట ముల్లె కట్టుకుని గొడ్డుగోదాల్ని తోలుకుని అడవిలోకి వచ్చేసి, అడవిలో నేతమసొంత "పౌర" శిబిరాన్ని నిర్మించుకున్నారు.

రూద్న్యా-బొబ్రోవ్స్కయ చుట్టూ శత్రువలయం మరింత బిగిసి, కొద్ది రోజుల్లో మూసుకుపోయింది. కాని మేం అక్కడ లేనేలేం. మమ్మల్ని ఇతర పల్లెల్లోనూ, గూడేల్లోనూ చుట్టుముట్టే ఉద్దేశంతో మా జాడలవెంట పడ్డారు. కాని వారు పన్నిన అన్ని వలలలోనుండి మేము తప్పించుకుని బయటకు వచ్చేశాం. ఇక దానితో దాగుడు మూతలాట మొదలైంది. రోడ్లపై మేము నిర్మించిన అడ్డంకులను జర్మన్లుచూసేవారు. చూసి, వాటివెనుక మేం దాగున్నామనుకుని వాటిపై అగ్ని వర్షం కురిపించి, వాటిమీదకి లంఘించేసరికి, మేం పాతిన మందుపాతరలు పేలేవి. ఆ పేలుడులో వారు చిక్కుకునేవారు. జర్మన్ల తుపాకి కాల్పుల చప్పుడులను బట్టీ, మా మందుపాతరల శబ్దాన్నిబట్టీ జర్మన్లు సరిగా ఎక్కడవున్నదీ మాకు తెలిసిపోయేది, వాళ్ళుమాత్రం కళ్ళు కట్టేసుకున్న వాళ్ళలా తిరిగేవారు.

సబూరొవ్ డిటాచ్‌మెంటులోని రెండు బెటాలియన్లూ, ఫ్రొకొప్యూక్ డిటాచ్‌మెంటూ ఉత్తరాన వున్న మహారణ్యాలలోకి వెళ్ళిపోయాయి. మేం మాత్రంగ్రామాల చుట్టూ తిరుగుతూ, ఆ "దాగుడుమూతలాట" సాగించాం. అయితే ఆ "ఆటను" మేం

తమాషాకోసమని సాగించలేదు, సహజంగానే. ఈ ఆట ఆడుతూనే మా పని మేం కానిచ్చాం. ఈ ప్రాంతమంతటా మా మనుషులున్నారు, గ్రామాలలో మా చౌకీలున్నాయి. రోవ్నొనుండి కుజ్నెత్సోవ్ పంపించుతూండిన హర్కారాలు మా వద్దకు వస్తూనే వుండేవారు. ఇంత సాఫీగా నడుస్తూన్న కార్యకలాపాన్ని మేము సహజంగానే వదలిపెట్టేయలేకపోయాం.

మా హర్కారాలూ, స్కౌట్లూ అప్పుడప్పుడు జర్మన్లను ఎదుర్కొంటుండేవారు. ఎదుర్కొని, స్వల్పయుద్ధంచేసి వెనక్కిమళ్ళిపోయేవారు. అయినప్పటికి పెద్ద పోరాటం ఒకటి జరిగింది.

ఫ్రొలోవ్ నాయకత్వాన వున్న సంగ్రామిక చౌకీనుండి ఒకసారి మూడు రోజులవరకూ ఏ హర్కారా కూడా రాలేదు. ఒకవేళ ఫ్రొలోవ్ ఏదైనా ప్రమాదంలో చిక్కుకున్నాడేమో అనుకుని, అరవైమంది గెరిల్లా సైనికుల దళం ఒకదానిని అతని సాయానికని పంపించాం. ఈ దళం మార్గమధ్యంలో జర్మన్లను హఠాత్తుగా ఎదుర్కొని, వారిపై కాల్పులు మొదలుపెట్టింది. కాని యుద్ధారంభంలోనే నాజీలు తటాలున కాల్పులు ఆపివేసి, అవరాబావరా తిరోగమించారు. మా మనుషులు ఆశ్చర్యపడ్డారు, కాని శత్రువును వెంటతరమలేదు. జర్మన్లు ఇలా ప్రవర్తించినందుకు కారణం మరుసటి దినం మాత్రమే మాకు తెలిసింది. మనవాళ్ళు ఎదుర్కొన్నది జర్మన్లు పంపిన స్పెషల్ పటాలంకాదు, జర్మన్ స్పెషల్ పటాలం కమాండరైన జనరలు నూరుమంది సైనికులున్న తన అంగరక్షక దళాన్ని వెంటతీసుకొని వొరోనొవ్‌కనుండి రూద్న్యా-బొబ్రోవ్‌స్కాయకి తరలివెళ్తూండెను. పోరాటం ఆరంభమైన ఉత్తరక్షణంలోనే ఆ జనరలూ, అతడి అడ్జూటాంటూ ఆ కాల్పులకి హతులయ్యారు. దానితో జర్మన్లు బేజారెత్తిపోయి, కాల్పులు విరమించుకుని తమ కమాండరు శవాన్ని మోసుకుని పలాయనం చిత్తగించారు.

మేం అడవిలో నిర్మించిన అడ్డంకులను అధిగమించడం వృథాప్రయాస అని ఆ స్పెషల్ పటాలం తెలుసుకుని, జితోమీర్ దిశగా వెళ్ళిపోయింది. ఫిబ్రవరి మొదట్లో మేం మళ్ళీ అడవిలో, వెనుక రూద్న్యా-బొబ్రోవ్‌స్కాయకి చేరువగా నిర్మించుకున్న క్యాంపులు ఒకదానిలో స్థిరపడిపోయాం. జర్మన్ సేనలలోకెల్లా అత్యున్నత శ్రేణి సేనలు స్టాలిన్‌గ్రాడ్‌వద్ద సంపూర్ణంగా నాశనమైపోయాయనే శుభవార్త ఆ రోజుల్లోనే మాకు రేడియో ద్వారా అందింది.

జర్మన్లు మూడు దినాలు సంతాపదినాలుగా ప్రకటించారనీ, ఆ మూడు దినాలలోనూ అన్నిరకాల వినోదాలూ నిషేధించబడినాయనీ, జర్మన్‌పురుషులందరూ

కోటు ఎడమచేతిపై నల్లని పట్టీ, జర్మన్ స్త్రీలందరూ నల్లని దుస్తులూ నిర్బంధంగా ధరించవలసిందనీ, కదమ జనాభా అందరూ నల్లని దుస్తులు ధరించవలసిందని ఆర్డరు జారీ అయినట్లు మేం విన్నాం. కాని ఈ సంతాపానికి కారణం ఇదమిద్ధమని జర్మన్లు తెలియజేయనందున, హిట్లరే చచ్చిపోయుంటాడనే పుకారు ఆ ప్రాంతమంతా అల్లుకుంది.

"దేవుడికి వెయ్యిదండాలు, ఆ కంటకుడు రాలిపోయాడు!" అన్నారు రైతులు.

స్టాలిన్‌గ్రాడ్ వద్ద మూడు లక్షల నాజీసేన పరాజయమే ఈ సంతాపానికి కారణమని కుజ్నెత్సోవ్ రోవ్నోనుండి వచ్చి చెప్పిన తరువాతనే మాకా సంగతి తెలిసింది, అంతవరకూ మాకు తెలియనే తెలియదు.

కుజ్నెత్సోవ్‌వల్ల ఆసక్తిదాయకములైన మరికొన్ని వార్తలు కూడా తెలిశాయి. రోవ్నో, జ్దోల్‌బునోవా స్టేషన్ల మీదుగా రవాణా ఇటీవల అత్యధికంగా పెరిగింది. రైల్వేలూ, రోడ్లూ జర్మన్ సైనికబలాలతో కిటకిటలాడుతున్నాయి. నగదు రూపంలో కాని, లేదా వస్తురూపంలో కాని పన్నులు చెల్లించనిజిల్లాలలో "అసాధారణ చర్యలు" అనుసరించబడవలసిందిగా ఉక్రెయిన్ రైక్స్‌కమిస్సార్ ఎరిక్ కోక్ తాఖీదులు జారీచేశాడు. గెరిల్లాలపై "నిర్దయాత్మక" చర్యలు తీసుకొనబడవలసిందని కూడా తాఖీదులు జారీ అయాయి.

## సాహసకార్యం

జిగాద్లో ఇంటిలో మేము వెనుకఏర్పాటుచేసి వుండిన చౌకీ దరిదాపులకు మా స్కౌట్లు వెళ్ళడమే మానివేశారు. కొసూల్‌నికొవ్ వాదాలత కారణంగా జర్మన్లు మా జాడలు పసికట్టి వుండవచ్చునని మేం భయపడ్డాం. కొంతకాలం వరకు మా మనుషులెవ్వరూ అతని ఇంటిని ఉపయోగించరని జిగాద్లోకి తెలియచేశాం.

కాని రోవ్నోకి మా క్యాంపుకి మధ్యస్థంగా చౌకీ ఒకటి వుండడం మాకు అత్యవసరమైంది.ఇందుకని, మహారణ్యానికి చేరువనున్న మరొకగూడెంలోరహస్యపు చౌకీ ఒకదానిని ఆర్గనైజు చేసేందుకు నిశ్చయించుకున్నాం. ఒకవేళ ఏదైనా ప్రమాదకరమైన పరిస్థితి సంభవించినట్టయితే ఆ మహారణ్యం మాకు శరణు యిస్తుంది.

ఈ కొత్త చౌకీ రోవ్నోకి ముప్పై కిలోమీటర్ల దూరంలో ఉంది. మెరికల్లాంటి పాతికమంది గెరిల్లా సైనికులను ఆ చౌకీలో ఉంచాం. కొన్ని జతలు మంచి

గుర్రాలనూ, బండ్లనూ కూడా వారికిచ్చాం. ఉశ్నెత్సోవ్ రోవ్నోకు వెళ్తూండేందు కని తివాచీ పరచిన స్లెడ్జి ఒకటి అతనికోసం ప్రత్యేకంగా కేటాయించబడింది.

ఉశ్నెత్సోవ్ రోవ్నోలో మకాం చేస్తూన్నప్పుడు, అతడు నికొలాయ్ ప్రిహోద్కో ద్వారా ఈ చౌకితో సంబంధాలను నిలుపుకునేవాడు. ఉశ్నెత్సోవ్ యిచ్చిన టపా ప్యాకెట్టును తీసుకుని ప్రిహోద్కో నాటుబండిమీదనో, సైకిలుమీదనో, లేక కాలినడకనో ఈ చౌకి చేరుకునేవాడు. అతడు అందించిన ప్యాకెట్టును మరొక హర్కారా తీసుకుని క్యాంపుకి వచ్చేవాడు ఈ లోపున ప్రిహోద్కో చౌకిలో విశ్రాంతి తీసుకునేవాడు. ఈ మనిషి నా దగ్గరనుండి టపా ప్యాకెట్టును తీసుకుని ప్రిహోద్కోకి అందించితే, ప్రిహోద్కో దానిని తీసుకుని రోవ్నోలో ఉన్న ఉశ్నెత్సోవ్‌కి అందజేసేవాడు. ఒక్కొక్కప్పుడు ప్రిహోద్కో రోజుకి రెండుసార్లు ఈ ప్రయాణం చేయవలసివచ్చేది, కాని ఎప్పుడూ కూడా క్యాంపుకి సురక్షితంగా చేరుకునేవాడు. రోవ్నోలో అతణ్ణి చూసి ఎవ్వరూ అనుమానించేవారుకాదు. శత్రు గస్తీ చౌకీలు అతని పత్రాలను అనేక పర్యాయాలు తనిఖీచేశాయి. వాటిలో ఏ లోపమూ ఉండేదికాదు.

కాని నికొలాయ్ ప్రిహోద్కో ఎటువంటివాడో మాకు తెలుసు, ఎవడైనా నాజీ కాని, పోలీసువాడు కాని అతడికి అగపడినట్టాయెనా, ఏమీ పట్టించుకోకుండా వారిపక్కనుండి వెళ్ళిపోయే రకంకాదు ప్రిహోద్కో. తన సాహసకృత్యాలను గురించి అతడు మామూలుగా నోరు మెదపకపోయినప్పటికి, వాటిలో కొన్నిటిగురించి మాకు ఎలాగో ఒకలాగు తెలుస్తూనే వుండేది.

ఒక రోజున ప్రిహోద్కో రోవ్నోనుండి బండి తీసుకుని వెళ్తూండగా, అతడు యిద్దరు పోలీసులను గమనించి, వాళ్ళు తనను పసికట్టి తనవెంట వస్తున్నారేమో అని అనుమానించాడు. తన గుర్రాలను పరుగెత్తించి వాళ్ళకు కనబడకుండా ఉడాయించేబదులు, అతడు పనికట్టుకుని గుర్రాలను మెల్లగా నడిపించసాగాడు. పోలీసులు అతడివెంట వస్తూనే వున్నారు.

గొరీన్ వంతెన కనబడింది. వంతెన యింకా ఒక అరకిలోమీటరు వుండగా, ప్రిహోద్కో గుర్రాలను ఆపి, బండి దిగి, జీనులో ఏ లోపమూ లేకపోయినప్పటికీ, ఏదో లోపం వున్నట్టుగా, గుర్రాల పొట్టకింద వున్న జీనుపట్టీలను బిగించడం మొదలుపెట్టాడు.

పోలీసువాళ్ళు బండి దగ్గరకు వచ్చేసరికల్లా, ప్రిహోద్కో వారిని చూసి

"బండి ఎక్కండయ్యా!" అని వారిని పలుకరించాడు.

వారిద్దరూ బండి ఎక్కి, రైఫిళ్ళను పక్కను పెట్టుకుని కూచున్నారు.

"ఏం, అబ్బాయిలూ, మీరు పోలీసులా?" అని అడిగాడు ప్రిహోద్కో.

"అవును."

"ఎక్కడికెళ్తున్నారు!"

"జర్మనీకి రవాణా చేసేందుకని మనుషుల్ని జమచేయడానికి వెళ్తున్నాం. ఈ పక్క గూడెంలో మనుషులికి కాస్త బుద్ధి చెప్పాల్సి వుంది. నయాన చెబితే విన కుండా వున్నారు" అన్నారు పోలీసులు.

"మతీ సుతీ లేని మనుషులు!" అన్నాడు ప్రిహోద్కో పోలీసులతో సానుభూతి నటించుతూ.

ఈ పాటికప్పుడే బండి వంతెనమీదకి వచ్చేసింది.

"బాగా చెప్పావ్! మతీసుతీ లేని జనం కాకపోతే మరేమిటి! నువ్వున్నావు మంచి బలంగా పైల్మాన్‌లా" అన్నాడు ఒక పోలీసువాడు ప్రిహోద్కోను ఉద్దేశించి, "నీలాంటి కుర్రాడికి ఎందుకొచ్చిన బతుకిది? నువ్వు కూడా స్వచ్ఛందంగా జర్మనీకి వెళ్ళు. అక్కడికి వెళ్ళి రెండుచేతులోనూ డబ్బుసంపాదించి, ఒక వెలుగు వెలిగి, భాగ్యవంతుడవై మళ్ళీ యింటికి వచ్చేస్తావు! నీకు పెళ్ళి అయిందా!" అని అడిగాడు.

బండి వంతెన మధ్యకి వచ్చింది.

పోలీసువాడు అడిగిన ప్రశ్నకి జవాబు రాలేదు.

"చేతులెత్తండ్రా, వెధవల్లారా!" అని అరిచాడు ప్రిహోద్కో, బండిలో ఉన్న యిద్దరు ప్యాసింజర్లకేసి తన పిస్టల్ని గురిపెట్టి.

వారిద్దరూ భయంతో బిక్కచచ్చిపోయి, మారుమాటాడకుండా చేతు లెత్తారు.

"బండి దిగండ్రా, అణా కాణీ వెధవల్లారా!" అని ఆర్డరు చేశాడు ప్రిహోద్కో.

చేతులు పైకెత్తిపెట్టుకునే పోలీసువాళ్ళిద్దరూ బండిలోనుంచి ఎంతో కష్టం పైన కిందకి దిగేసరికి, మళ్ళీ మరొక ఆర్డరిస్తూ అరిచాడు ప్రిహోద్కో:

"ఉరకండి నీట్లోకి, వెధవల్లారా!"

ఇది శరత్తు కడపటి రోజుల్లో జరిగింది. నది మంచి ఉరవడిలో వుండి, నదిలో నీరు యించుమించు వారధిని అంటుతూంది.

"ఏట్లోకి ఉరకండ్రా, లంజకొడుకుల్లారా! ఉరక్కపోతే పిస్టల్తో కాల్చి పారేస్తా!"

తమకేసి పిస్టలు గురిపెట్టివుండడం చూసి, పోలీసువాళ్ళిద్దరూ యిహ గత్యంతరంలేక నదిలోకి ఉరికారు.

నదిలోకి ఉరికారేమో, ప్రాణాలు రక్షించుకుందుకని ఇద్దరూ ఒకరినొకరు పెనవేసుకునిపోయేసరికి, ఇద్దరూ బుడుంగున నదిలో మునిగిపోయి చచ్చిపోయారు.

వాళ్ళ రైఫిళ్ళు బండిలో వుండిపోయాయి. ఎవరు ఏ ఆయుధాలను పట్టుకున్నా సరే, వాటిని దాచకుండా డిటాచ్మెంటుకి ఒప్పజెప్పాలన్నది మా నిబంధన కాబట్టి, ప్రిహోద్కొకి తనంతట తానే ఆ కథ చెప్పకోక తప్పిందికాదు.

ఇటువంటి పనులు తాను చేయకూడదని అతనితో మేం ఎంతో సేపు హెడ్క్వార్టర్సులో బోధపరచి చెప్పాం. ప్రమాదానికి అవకాశమిచ్చే పనులలోకి దిగేందుకు అతడికి హక్కులేదనీ, రోవ్నొనుండి తను తీసుకువస్తున్నట్టీ, మాసోర్కి మేం అందజేస్తూన్నట్టీ సమాచారాలు పోలీసుల ప్రాణాలకంటె ఎంతో విలువైనవనీ అతనికి మేం ఎన్నో విధాల నచ్చజెప్పాం.

"అదంతా నేను ఎరుగుదును, క్రామేడ్ కమాండర్! కాని,అవకాశం చిక్కినప్పుడు మాత్రం, దాన్ని వదలుకుందుకు నాకు మనసొప్పిందికాదు, ఏం జేసేది, మరి?" అంటూ అతడు ఎంతో పశ్చాత్తాపపడి, ఇక ఎన్నడూ అలాటి పనులు చేయనని మాటయిచ్చి: "చచ్చినాసరే, యిహ మీ ఆజ్ఞ తప్పను!" అన్నాడు.

"చావడమెందుకులే! నువ్వు కాస్త జాగ్రత్తగా వుంటే చాలు!" అన్నాన్నేను.

ప్రిహోద్కొ తన మాట నిలుపుకొన్నాడనే చెప్పాలి. ఇది జరిగిన తరువాత అతడు రోవ్నొనుండి చొకీకి, చొకీనుండి రోవ్నొకి అనేక పర్యాయాలు సమాచారం తీసుకు 'ళ్ళాడు. అదంతా కూడా ఏగొడవా లేకుండా సాఫీగా సవ్యంగా జరిగిపోతూ వచ్చింది. ఫిబ్రవరి 21న చొకీనుండి వచ్చిన హర్కొరాకి నేను ఒక ప్యాకెట్టు యిచ్చి, అది కుజ్నెత్సోవ్ కోసమని చెప్పి, యిలా అన్నాను:

"ఇది అతిముఖ్యమైన ప్యాకెట్టు సుమా! యిది గనుక శత్రువు చేతిలో

పడిందంటే, మనలో మెరికల్లాంటివారు అనేకమంది యిక మనకి దక్కరు. ఈ సంగతి ప్రిహోద్కోతో కూడా చెప్పు!"

ఫిబ్రవరి 22 ఉదయాన ఆ ప్యాకెట్టు ప్రిహోద్కోకి అందింది. దాన్ని తీసుకుని అతడు రోవ్నోకి బయల్దేరాడు.

ప్రిహోద్కో రాకకోసం కుజ్నెత్సోవ్ ఆరోజంతా చూశాడు. ప్రిహోద్కో ఆ రోజూ రాలేదు, ఆ మర్నాడు పొద్దున్నా రాలేదు. మధ్యాహ్నానికి అప్పుడే వూళ్ళో పుకార్లు బయల్దేరాయి. వెలికియ్ జీతెన్ గ్రామం దగ్గర ఎవడో ఉక్రెయినియన్ ఒకడు చాలామంది జర్మన్లతో యుద్ధంచేసి వాళ్ళందరినీ చంపేసి తను కూడా చచ్చిపోయాడని కొందరన్నారు. ఎవడో ఒక గెరిల్లా సైనికుడు అడవిలోనుంచి వచ్చి, ఆరాత్రంతా జర్మన్లతో పోరాడి, యిహ లెక్కలేనంతమంది జర్మన్లని నేలకూల్చాడని మరికొందరన్నారు ఎవరు ఎన్ని రకాలుగా చెప్పినప్పటికీ, అంతమంది జర్మన్లనూ ఒక్కగానొక్క గెరిల్లాయే నేలకూల్చాడని మాత్రం అందరూ నొక్కి వక్కాణించారు.

ఈ పుకార్లన్నీ ప్రిహోద్కో గురించే అని కుజ్నెత్సోవ్ వెంటనే పోల్చుకున్నాడు. ఇది ఏ వేళప్పుడు ఏ స్థలం దగ్గర జరిగినట్టు అందరూ చెప్పుకున్నారో సరిగా ఆ వేళకి ప్రిహోద్కో ఆ స్థలం దగ్గరకే చేరుకునివుండాల్సింది కూడానూ, అంతేకాకుండా, ఒంటరిగా అంతమంది జర్మన్లను పీటీమన్ను చేయగల్గిన భీమబలుడు మా ప్రిహోద్కోయే!

ప్రిహోద్కోని కుజ్నెత్సోవ్ బాగా ఎరుగును. వారిద్దరూ మాస్కోలోనే స్నేహితులయ్యారు ఇద్దరూ కలసి ఒకసారే మా డిటాచ్‌మెంటులో చేరారు, గెరిల్లా చర్యలలో యిద్దరూ కలిసి పాల్గొన్నారు. ఒకవేళ ప్రిహోద్కో శత్రువుచేతిలో చిక్కి ఎంతటి చిత్రహింసలను అనుభవించవలసి వచ్చినప్పటికీ కూడా అతడు తన కామ్రేడ్ల గుట్టు బయటపెట్టడనడంలో కుజ్నెత్సోవ్ ఒక్క క్షణమాత్రమైనా సందేహించలేదు. కాని ప్రశ్న అంతా ఏమిటంటే: నిజంగా అతడు హతుడయ్యే వుంటే, కుజ్నెత్సోవ్ కోసమని పంపిన ప్యాకెట్టుని అతడు తను మరణించేముందు నాశనం చేయగల్గాడా, లేదా?

కుజ్నెత్సోవ్ ముందుజాగ్రత్తలన్నింటినీ తీసుకుని, కజిమీర్ దొంబ్రోవ్‌స్కియ్‌ని వెలికియ్ జీతెన్ గ్రామానికి పంపించాడు. ఆ గ్రామంలో దొంబ్రోవ్‌స్కియ్‌కి బంధువులున్నారు.

దొంబ్రోవ్‌స్కియ్ ఆ గ్రామం వెళ్ళి, ప్రత్యక్షసాక్షులను ప్రశ్నించి, నికా

లాయ్ ప్రిహోద్కా మరణం గురించి అన్ని వివరాలనూ అడిగి తెలిసుకుని, ఆ కథ మాకు చెప్పాడు.

మామూలు చొప్పున ప్రిహోద్కా బండితోలుకుని బయల్దేరాడు. వెలీకియ్ జీతెన్ గ్రామం దగ్గర జర్మన్ మిలిటరీపోలీసులూ,దేశద్రోహులైన స్థానిక పోలీసులూ కలిసి సుమారు యిరవైమంది వున్న ఒక గస్తీదళం అతణ్ణి అక్కడ ఆపింది.

అతడు బండి ఆపి, తను స్థానికవాసుడని ధ్రువపరచుతూ ఋజువు పత్రాలను వాళ్ళకి చూపెట్టాడు. ఈ పత్రాలు యిదివరకెన్నో సార్లు తనిఖీ చేయబడ్డాయి, ఈ సారి కూడా వాటిపైన ఏ అనుమానమూ కలగలేదు. అయినప్పటికి బండిని తనిఖీచేయడానికి నిశ్చయించుకున్నారు నాజీలు.

ఏమైనా సరే అతని బండిని నాజీలు తనిఖీచేయ కూడదు. తన మామూలు చొప్పున అతడు బండిలో వున్న గడ్డికింద ఒక సబ్‌మెషీన్‌గన్నునీ, కొన్ని టాంక్ విధ్వంసక గ్రెనేడ్లనూ దాచివుంచాడు.

"తనిఖీకి ఏముంది యిక్కడ?" అంటూ ప్రిహోద్కా వాళ్ళ మనసు మళ్ళించేందుకు ప్రయత్నించాడు.

"అదంతా నీ కెందుకు? తనిఖీచేసి తీరాలి మేం!" అన్నారు వాళ్ళు.

ప్రిహోద్కా గబ్బున గడ్డిలోనుంచి సబ్‌మెషీన్‌గన్నుని తీసి, మిలటరీ పోలీసులమీద గురిచేసి, టపటపమని కొన్ని రౌండ్లు కాల్చాడు. చాలామంది అక్కడి కక్కడే నేలకూలారు. కడంవాళ్ళు పారిపోయి, ఇళ్ళ వెనకాతల మాటుదాగి, అక్కడి నుండి అతడిపైన తుపాకులు కాల్చారు.

వాళ్ళ కాల్పులకు తాను బదులుకాల్పులు కాల్చుతూనే అతడు చెంగున బండిలోకి ఉరికి, గుర్రాలను నాలుగు బాదులు బాది, వాటిని నాలుగుకాళ్ళా ఎగరేయించి పరుగెత్తించాడు. సరిగా ఆ సమయానికే అతడికి బుల్లెట్ తగిలింది గుండెల్లో ప్రమాదకరంగా గాయపడినప్పటికీ అతడు రొప్పా దిశగా బండిని తోల్తూనేవున్నాడు.

గ్రామం పొలిమేరను, అర్ధాంతరంగా ఒక లారీ రోడ్డుకు అడ్డుగా నిలబడి వుంది. లారీనిండా జర్మన్ సైనికులున్నారు. ప్రిహోద్కా బండి పరుగున రావడం ఆ సైనికులు చూసి, వాళ్ళకి అనుమానం తోచి, సబ్‌మెషీన్‌గన్లతోనూ, మెషీన్‌గన్లతోనూ ప్రిహోద్కా మీద కాల్పులు ప్రారంభించారు. ప్రిహోద్కా మళ్ళీ గాయపడ్డాడు, కాని శత్రువుకి లొంగిపోవడమనే ఆలోచనే తట్టలేదతడికి. బండిలోనుంచి మెల్లగా

వెనక్కి జారి, రోడ్డు పక్కనున్న నాళాలో మాటు చూసుకుని, అక్కడనుంచి కాల్పులు అలా సాగించుతూనే వున్నాడు.

ఈ అసమాన యుద్ధం చాలా సేపే సాగింది.

ప్రిహోద్కో మళ్ళీ మరొకసారి గాయపడ్డాడు. వొంటినిండా రక్తం కారుతూందేమో, ఇక తన శక్తి తగ్గిపోతూందన్న సంగతి గ్రహించి, ప్రిహోద్కో ఆ రహస్యపు ప్యాకెట్టును ఓ చేతిబాంబుకు కట్టి, బలం తగ్గిపోతున్న చేతితో ఆ చేతి బాంబును శత్రువుమీద విసిరాడు.

హతులు కాగా మిగిలిన నాజీలు ప్రిహోద్కోను చుట్టుముట్టేసరికి అతడు అప్పటికప్పుడే మరణించాడు. కాని అతడు జర్మన్ బుల్లెట్టుకి మరణించలేదు. తన కణతలోకి దూసుకుపోయిన బుల్లెట్టే అభినవ భీముడు మన గెరిల్లా కడపటిసారి కాల్చిన బుల్లెట్టు

* * *

నికొలాయ్ ప్రిహోద్కో మరణవార్తను విని మేము ఎంత దుఃఖించామో వేరే చెప్పనక్కరలేదు. అతడు అందరికీ ఎంతో ఇష్టుడయ్యాడు, అతణ్ణి అందరూ సోదరునిలా ప్రేమించేవారు, అతని ధైర్యసాహసాలను గురించి గెరిల్లాలు కథలు చెప్పుకునేవారు.

గెరిల్లా సైనికునిగా మా కామ్రేడ్ నిర్వర్తించిన సాహసకార్యాన్ని ఎంతో ఘనమైనదిగా సోవియట్ ప్రభుత్వం పరిగణించింది, "సోవియట్ యూనియన్ వీరుడు" అనే ఉన్నత బిరుదును అతనికి మరణానంతరం బహూకరించింది. అతడు పాల్గొన్న స్కౌట్ యూనిట్టుకు "సోవియట్ యూనియన్ వీరుడు నికొలాయ్ తరాసొవిచ్ ప్రిహోద్కో యూనిట్టు" అని నామకరణం చేశారు.

## జ్దొల్‌బునోవొ స్టేషనులో

నికొలాయ్ ప్రిహోద్కో మరణవార్త విని విస్మయం చెందినది ఒక్క మా డిటాచ్‌మెంటు గెరిల్లాలే కాదు. జ్దొల్‌బునోవొ స్టేషనులో వున్న విధ్వంసక దళంలో నికొలాయ్ బాల్యస్నేహితులున్నారు. ఆ స్టేషన్‌లోనే అతడు పుట్టాడు, అక్కడే పెరిగాడు, యుద్ధంముందు అక్కడే నివసించేవాడు. అతడి మరణంవల్ల జ్దొల్‌బునోవొ గ్రామస్థులందరికీ తీరని నష్టం వాటిల్లింది.

నికొలాయ్ మొదటిసారి రోవ్నొ వెళ్ళినప్పుడు జ్దొల్‌బునోవొ స్టేషనులో

మజిలీ చేశాడు. అప్పుడు పాత స్నేహితులను కొందరిని—ద్మిత్రియ్ క్రస్నొగోతొవెల్స్కీ, ష్మెరేగ్ అన్నదమ్ములిద్దరినీ—అతడు కలుసుకున్నాడు. వీరితో నికొలాయ్ మాట్లాడాడు. మాట్లాడిన తక్షణమే వారు మాకు సాయం చేయడానికి ఒప్పుకున్నారు. ప్రిహోద్కొ క్రస్నొగోతొవెల్స్ని కుజ్నెత్సోవ్, స్త్రిలిన్స్కియ్‌లతో పరిచయం చేశాడు. ఇది జరిగిన తరువాత, మన స్కౌట్లు షెవ్‌చూక్, గ్నిద్యూక్‌లు ఆ స్టేషనుకి తరచుగా వెళ్తూండేవారు.

ప్రిహోద్కొ మరణం ముందుగానే, 1942 డిసెంబరు చివరిరోజుల్లోనే ద్మిత్రియ్ క్రస్నొగోతొవెల్స్ నాయకత్వాన విధ్వంసకదళం ఒకటి ఆ స్టేషన్‌లో ఆర్గనైజయింది.

జర్మనీనుండి తూర్పుయుద్ధశ్రేణికి వెళ్తూన్న రైల్వేమార్గంలో జ్దొల్‌బునోవొ ఒక పెద్ద జంక్షను. జెకొస్లొవేకియా, జర్మనీ, పోలెండులనుండి యుద్ధశ్రేణికి, యుద్ధశ్రేణినుండి ఈ దేశాలకి వెళ్ళే మిలటరీ రైళ్ళన్నీ ఈ స్టేషను మీదుగానే వెళ్ళేవి. ఈ దబుల్‌లైనుమీద రాకపోకలు అతి భారీగా సాగుతూండేవి, ఆ లైనుమీదనూ ఈ లైను మీదనూ రోజుకి ఎన్నెన్నో మిలిటరీ రైళ్లు నడిచేవి.

ఈ స్టేషన్‌లో జరిగే రికాన్నైసెన్స్, విధ్వంసక కార్యకలాపాలకు ఎంత ప్రాముఖ్యత వుండేదో సులభంగానే ఊహించుకోవచ్చు. అందుకని క్రస్నొగోతొవెల్స్ నాయకత్వాన వున్న దళం రహస్యంగా పనిచేసేందుకు ఎటువంటి జాగ్రత్తలు తీసుకొనవలసి వుంటుందో అటువంటి జాగ్రత్తలన్నింటినీ మేం తీసుకున్నాం. 1943 మార్చి, ఏప్రిల్‌నాటికి ఈ దళంలో ఇంచుమించు ఇరవైమంది సభ్యులు వుండేవారు. వీరు ఆ రైల్వే జంక్షను కీలకస్థానాలలో పనిచేస్తూండేవారు.

స్టేషన్‌లోనూ ఇంజన్‌డిపోలోనూ పనిచేస్తూన్నవారూ, పాయింట్స్‌మెన్లూ, రైల్వేగార్డులూ, ఇంజన్ డ్రైవర్లూ, ట్రాఫిక్ కంట్రోలర్లూ జ్దొల్‌బునోవొ గ్రూపులో వుండేవారు.

ఈ గ్రూపుకి ప్రత్యేకపు హర్కారాలు వుండేవారు. వీరిద్వారా ఈ గ్రూపు మా డిటాచ్‌మెంటుతో సంబంధాలు సాగించుతూండేది. ఈ హర్కారాలలో ఒకడు, వెనుకటి రోజుల్లో స్కూలు మాస్టరుగా వుండిన ఇవనోవ్ అనే వ్యక్తి. జర్మన్లు ఆ ప్రాంతాన్ని ఆక్రమించుకున్న తరువాత ఇతను మామూలు కూలి కార్మికునిగా ఆ స్టేషనులో పనిచేస్తున్నాడు. ఇవనోవ్ తన ఐడెంటిటీ కార్డునూ, టిక్కెట్టు లేకుండానే ఎప్పుడుపడితే అప్పుడు రైలుమీద ప్రయాణం చేసేందుకు తనకు హక్కును కల్గించు

తూన్న తన "రైల్వేప్యాసు"నూ ఉపయోగించుతూ, మా క్యాంపుకి క్రమశః వస్తూండేవాడు.

నిరాడంబరమే అయినప్పటికీ మాకు ఎంతో ముఖ్యమైనట్టి తన కార్య కలాపాన్ని స్కూలుమేష్టరు ఇవనోవ్ అసాధారణమైన పట్టుదలతో నిర్వర్తించేవాడు. ఒకసారి ఏం జరిగిందో చెబుతాను వినండి. శీతాకాలంలో ఒకనాడు బాగా చలివణికిం చేస్తున్న రోజున, ఇవనోవ్ చలిలో గజగజ వణికిపోతూ క్యాంపుకి అప్పటికే వచ్చి, నెగడి దగ్గర చలికాచుకుంటూ వుండడం నా కంటపడింది. అతనిదగ్గరకు వెళ్ళిచూసే సరికి, అతని వంటిపైన బనియనూ, షర్టూ లేకుండా కోటు ఒక్కటే వుంది. అతి మొగమాటస్థుడూ, నిరాడంబరుడూ అయిన ఈ మనిషి తనకార్యం నిర్వర్తించడంలో తన ఆరోగ్యం గురించి పిసరంతైనా ఆలోచించలేదు. ఇది జరిగిన పిదప, ఈ జ్లోల్ బునోవా హర్కారాకి అవసరమైన దుస్తులను ఇవ్వడం గురించి మేం సహజంగానే జాగ్రత్త తీసుకున్నాం.

జ్లోల్‌బునోవా గ్రూపు మాకు అతిముఖ్యమైన భోగట్టా పంపించుతూండేది ఆ రైల్వే జంక్షను పని గురించి–ఏ యే రైళ్ళు ఏ యే స్టేషన్లనుంచి బయల్దేరి ఏ యే గమ్యస్థానాలకు వెళ్తూన్నదీ, ఆ రైళ్ళు వేటివేటిని రవాణా చేస్తున్నదీ – యావత్తూ వివరాలూ మాకు అందేవి. ఆ రైళ్ళు తీసుకువెళ్తూన్నది సైనిక బలాలేగనుక అయితే సైనికబలాల సంఖ్య, అవి ఏ మిలిటరీ విభాగానికి చెందినదీ, అప్పుడప్పుడూ ఆ యూనిట్ల పేర్లూ మాకు తెలిసేవి. సాంకేతిక సామగ్రి అయితే, దాని రకమూ పరి మాణమూ వివరాలు మాకు అందేవి.

యుద్ధశ్రేణిలోని పరిస్థితిని గురించి జర్మన్లు ఆందోళనచెంది, బేలయ త్సేర్‌కొవ్ పట్టణ ప్రాంతంలోనూ, హిట్లర్ తన హెడ్‌క్వార్టర్స్‌ను స్థాపించుతున్న వీన్నిత్స నగర ప్రాంతంలోను దుర్గనిర్మాణ కార్యాలను సాగించుతున్నారనే సమా చారం జ్లోల్‌బునోవా గ్రూపు పంపిన రిపోర్టులవల్ల మాకు సకాలంలో తెలిసింది. ఈ ప్రాంతాలకు లెనిన్‌గ్రాడ్ చుట్టుప్రక్కల నుండి జర్మన్ సైనికబలాలు రాసాగాయి.

సిమెంటూ, మెషీన్‌గన్ను స్థావరాల నిర్మాణానికిగాను ప్రీఫాబ్రికేటెడ్ హౌడ్‌స్లాబులూ, ఆయుధాలతో సుమారు పదిహేనువాగన్లు బేలయ త్సేర్‌కొవ్‌కు రోజూ జ్లోల్‌బునోవా మీదుగా వెళ్తూండేవి.

ఈ యావత్తు సమాచారాన్ని మేం ప్రతి ఐదవరోజూ మాస్కోకి రేడియో చేసేవారం.

జ్డొల్‌బునోవొ ఆర్గనైజేషను ఒక్క స్కౌటింగు కార్యకలాపమేకాకుండా విధ్వంస క్రియలు కూడా సాగించుతూండేది. మొదట్లో ఈ క్రియలు స్వల్ప కార్యాలతో ప్రారంభమయ్యాయి : అజ్ఞాతవాస కార్యకర్తలు రైలుపట్టాల బోల్టులను విప్పదీసేవారు, ఇంజన్లకి, వాగన్లకి వుండే వాక్యూమ్‌బ్రేక్ హోస్‌పైపులను కోసిపారేసేవారు. అటు తర్వాత మేము వారికి పంపిన టి.ఎన్.టి.తో మందుపాతర్లను తయారు చేయడం నేర్చుకొన్నారు. టి.ఎన్.టి. ముక్కలలో విదారణ పదార్థం పెట్టి,వాటిపైన జిగురు, లేక తారు పూసి, వాటిని రాక్షసిబొగ్గు గుండలో పొర్లించేసరికి అవి అచ్చంగా రాక్షసిబొగ్గు ముక్కలానే అవుపడేవి. ఈ "రాక్షసబొగ్గు ముక్కలను" ఇంజను టెండర్లలోకి విసరేవారు. అవి రాక్షసి బొగ్గుతో కలిసిపోయేవి. మండుతున్న ఇంజను ఫర్నేసులోకి బొగ్గుతోసహా అవి వెళ్ళేసరికి అవి దారిలో పేలి, ఇంజను బోయిలర్లను తునాతునకలుగా ధ్వంసంచేసివేసేవి.

ఏభై డిలేడ్ ఏక్షన్ అయస్కాంతిక మందుపాతరలను మేం ఇవనోవ్ ద్వారా జ్డొల్‌బునోవొకి పంపించాం. సులువుగా తీసుకువెళ్ళగల్గిన ఈ అయస్కాంతిక మందు పాతరలు ఏ ఇనుపవస్తువుకైనా అంటుకుపోయేవి. ఈ మందుపాతరలు మూడుగంటలూ, ఆరుగంటలూ, పన్నెండుగంటలూ, ఇంతకంటెనూ హెచ్చు కాల వ్యవధిలో సహితం పేలేందుకుగాను, విదారణ పదార్థంతో కూడా గడియారపు యంత్ర రచన వాటిలో అమర్చబడేది.

ఈ అయస్కాంతిక మందుపాతరలు గొప్ప ఫలితంతో పేలేవి. ఇంజను బోయిలరుకింద ఏ ఇనుప భాగానికో అంటుకొనివున్న మందుపాతరతో సహా రైలు జ్డొల్‌బునోవొ నుండి తూర్పుదిశగా బయల్దేరి, ఏ మూడు నాల్గువందల కిలోమీటర్లో వెళ్ళిన తరువాత, దారిలో పేలుడు సంభవించేది. ఆ మందుపాతర గురించి ఇక ఆరా తీయడం బ్రహ్మతరంకాదు।

అటు తర్వాత, ఈ అయస్కాంతిక మందు పాతరలను పెట్రోలూ, కిరసనాయిలూ తీసుకువెళ్తున్న నూనె వ్యాగన్ల క్రిందవుంచితే బాగుంటుందని ఆలోచించి ఆ ప్రకారం వాటిని ప్రయోగించడం ప్రారంభించారు. దీనితో రైళ్ళకి రైళ్ళే పూర్తిగా నాశనమైపోయాయి.

జ్డొల్‌బునోవొ గ్రూపు సాగించిన విధ్వంస క్రియల ఫలితంగా జర్మన్లకు విపరీతమైన నష్టం సంభవించింది. అసలు ఎంత నష్టం సంభవించిందో తేల్చిచెప్పేందుకే వీల్లేకపోయింది. ఈ రైల్వే జంక్షనువద్ద ధైర్యశాలురైన మా అజ్ఞాతవాస దేశా

విమానులు కావించినట్టి చిన్నవీ, పెద్దవీ నష్టాలనుగురించి లెక్కా టొక్కా వుంచాల్సిం దని జర్మన్లని మేం అడగలేం కదా !

మూడు మాసాల కాలంలో ఈ దేశాభిమానులు ఏదో ఒక సాకు చెప్పి, తెబ్బై రైల్వే ఇంజన్లను జ్డొల్‌బునోవా రైల్వే డిపోనుండి కదలకుండా చేసివేశారు. కొన్నింటిని మరమ్మత్తు చేస్తూన్నప్పుడు కడమవాటిని పాడుచేసేవారు. దీని మట్టుకు ఇదే ఒక గొప్ప విధ్వంస కార్యం. అయినప్పటికి జ్డొల్‌బునోవా అజ్ఞాతవాసుల గ్రూపు సాగించిన ధ్వంసక్రియలన్నిటిలోనూ అత్యంత ముఖ్యమైనది జ్డొల్‌బునోవా – కియెవ్ రైల్వేలైనుపై డబుల్‌లైన్‌తోవున్న బ్రహ్మాండమైన గొరీన్ నది వంతెన కూల్చివేయడం. యుద్ధశ్రేణికి రానూ పోనూ సైనికులను తీసుకొనివెళ్ళే మిలిటరీ రైళ్లు ప్రతి పది, పదిహేను నిమిషాలకూ ఒకటి చొప్పున ఈ వంతెనమీద వెళ్తూం టాయి. నాలుగు దిశలనుండీ వేర్వేరు లైన్లు జ్డొల్‌బునోవా స్టేషనులోకి వస్తూన్న ప్పటికీ స్టేషనులోనుంచి తూర్పుదిశగా వెళ్ళే ఒక్క డబుల్‌లైనూ ఈ వంతెనమీద నుంచే వెళ్తూండేది. ఈ వంతెనను అతిబలమైన రక్షణదళం పరిరక్షించుతూండేది. వంతెన ఈ కొనదగ్గరనూ, ఆ కొనదగ్గరనూ సెంట్రీలు వుండేవారు. ప్రతిమూలనూ మెషీన్‌గన్ను గూడువుండేది. వంతెనచుట్టూవున్న యావత్తు ప్రదేశమూ అవేక్షణలో వుండేది.

ఈ వంతెనను పేల్చివేసేందుకు యిదివరకు కొన్ని గెరిల్లా గ్రూపులు ప్రయత్నించాయనీ, ఆ యత్నాలు విఫలమవడమే కాకుండా, ఎన్నో బాధలు తెచ్చి పెట్టాయనీ మేం ఎరుగుదుం. అయినప్పటికీ ఈధ్వంసక్రియను ప్రయత్నించేందుకే మా హెడ్‌క్వార్టర్స్ నిర్ణయం తీసుకుంది.

కొద్దిరోజుల క్రితం మా స్కౌట్ నికొలాయ్ గ్నెద్యూక్ జ్డొల్ బునోవాలో స్థిరనివాసం ఏర్పరచుకున్నాడు. గొరీన్ నది వంతెన పేల్చివేతకు పథకాన్ని అతడే తయారుచేశాడు.

సుదీర్ఘాన్వేషణ జరిగిన తరువాత, ట్రూవ్‌ట్రెయినులో బ్రేక్స్‌మేనుగా పని చేస్తూన్న ఒక మనిషి మాకు దొరికాడు. ఇతడు పోలిష్ జాతీయుడు. ఇతడు బ్రేక్స్ మేను కాబట్టి, రైలు స్లోపు దిగుతూన్నప్పుడు బ్రేకు వేయడం, రైలు స్లోపు ఎక్కు తూన్నప్పుడు బ్రేకు వదులుచేయడం ఇతని పని. ఏదైనా ప్రమాదకరమైన సంద ర్భంలో ఆ విషయమై ఇతడు డ్రైవరుకు సిగ్నలుచేయాలి. ఇతడు నూటికి నూరు పాళ్లూ నమ్మకస్థుడని జర్మన్లు అనుకున్నారు. ఇతడు "ఫోల్క్స్‌దోయిచ్"* అనగా

---

* ఫోల్క్స్‌దోయిచ్–జర్మన్ వంశస్థులే అయినప్పటికి,పరాయి ప్రభుత్వ ప్రజలైన జర్మన్లు. – సం.

జర్మన్ సంతతివాడు—అని ఇతని పత్రాల్లో రాసివుంది. ఈ వంతెన పేల్చివేతకు "V-I" గ్రెనేడ్ పేలుడు మందుతో పెద్ద మందుపాతర ఒకటి సూట్‌కేసులో అమర్చబడింది.

రైలు బయల్దేరేందుకు సిద్ధంగావున్న వేళకు బ్రేక్స్‌మేను మేమిచ్చిన సూట్‌కేసు పట్టుకుని తనబండిలోకి ఎక్కాడు. రైలు వంతెనమీదకు రాగానే అతడు మందుపాతరకివున్న కాటర్‌పిన్ను తీసివేసి, రైలు సరిగ్గా వంతెన మధ్యకి వచ్చేసరికి, సూటుకేసును యుద్ధశ్రేణికి వెళ్ళే లైనుమీదకి తోసేశాడు. కొద్ది క్షణాలలో పేలుడు శబ్దం ప్రతిధ్వనించింది: వంతెన తాలూకు మధ్య గర్డరు కూలిపోయింది. ఝామని వెళ్తూన్న వాగన్లు—అచ్చంగా ఆ అగాధంలోకి, నదిలోకి, తిరగబడ్డాయి.

అక్కడకు ఓ కిలోమీటరు దూరాన దాగునున్న మనస్కొట్లు ఆ వంతెన పేల్చివేతను అవేక్షించారు.

ఇది జరిగిన తరువాత, ఓ మూడు వారాలపాటు జర్మన్లు తంటాలు పడగా పడగా అప్పటికి బాగుచేయగల్గారు ఆ వంతెనను.

ఈ చర్య జయప్రదంగా సమర్థవంతంగానూ జరిగింది: జ్డొల్‌బునోవా అజ్ఞాతవాసులలో ఒక్కరినైనా జర్మన్లకు ఎవ్వరూ పట్టియివ్వలేదు.

* * *

మా పనులు పెరుగుతూన్నకొద్దీ మా రేడియో ఆపరేటర్ల పనులు కూడా పెరుగుతూ వచ్చాయన్న విషయం వేరే చెప్పనవసరంలేదు. వెనుకటి రోజుల్లో రోజుకి ఒకసారే మాస్కోతో రేడియో సంబంధం పెట్టుకునేవారం. ఒక రేడియో ఆపరేటరుతోనే పని అంతా జరిగిపోయేది. ఇప్పుడు రొవ్నొ, సార్నీ, జ్డొల్‌బునోవా ఇంకా ఇతర స్థలాలనుండి ఎన్నో రిపోర్టులు వస్తూండడంచేత మాస్కోతో రేడియో సంబంధాలు పెట్టుకోవాలంటే, ఏకసమయంలో ఇద్దరు, ముగ్గురు ఆపరేటర్లు పని చేయాల్సివచ్చింది.

మాక్యాంపునుండి ఒక్క ట్రాన్స్‌మిటర్ స్టేషను పనిచేసేందుకే వీలుండెను. ఇంటర్ ఫియరెన్సు లేకుండా వుండేందుకని, ఒక స్టేషనుకి వేరొక స్టేషనుకి మధ్య కనీసం అయిదు కిలోమీటర్ల దూరమైనా వుండేటట్టుగా వాటిని ఏర్పాటుచేయాల్సి వచ్చింది.

మా రేడియో ఆపరేటర్ల గ్రూపు చిన్నదే అయినప్పటికీ, వారు అన్యోన్యమూ,దృఢమూ అయిన సత్సంబంధాలు కల్గి సమిష్టిగా ఏర్పడ్డారు. వారికి

వారి సొంత నిబంధనలు వుండేవి : తమ ట్రాన్స్మిటర్లు ఎల్లప్పుడూ సరైన స్థితిలో వుండేట్టు జాగ్రత్త తీసుకోవడం; ఏ క్షణాన అవసరమైనాసరే ట్రాన్స్మిటరును ప్యాక్‌చేసి,భుజాన వేసుకొని, అక్కడనుంచి వైదొలగేందుకు ఎల్లవేళలా తయారుగా వుండడం; రహస్యపు కోడ్లను పరిరక్షించడం; "కి"తో రోజూ సాధకం చేయడం; వినికిడివల్లనే రేడియో సందేశాల గ్రహింపును అలవరచుకోవడం.

మేము మంచి పనితొందర్లలోవున్న ఒకరోజున, జ్లొల్బునోవొ గ్రూపు పంపిన భోగట్టాను మా రేడియో ఆపరేటర్లు ప్రసారం చేస్తూండగా, రోవ్నొనుండి కుజ్నెత్సోవ్ పంపిన హెచ్చరిక ఉత్తరం అందింది. జర్మన్లు రేడియో ఫైండర్లు అమర్చబడిన మూడు కార్లను సార్నె అడవుల ప్రాంతానికి పంపించారనీ, కెరెజ్నో, సార్నె, రకీత్నొయె గ్రామాలకు స్పెషల్ పటాలాలు పంపబడినాయనీ ఆ ఉత్తరంలో అతడు తెలియజేశాడు.

మా రేడియో స్టేషన్లు ఏ స్థలాలలో కచ్చితంగా వున్నదీ ఈ డైరెక్షన్ ఫైండర్ ఉపకరణాలతో జర్మన్లు తెలుసుకోగలుగుతారు, తత్ఫలితంగా మా డిటాచ్‌మెంటు ఎక్కడ వున్నదో కూడా వాటికి తెలిసిపోతుంది. ఈ డైరెక్షన్ ఫైండర్ల ఉపయోగమూ, స్పెషల్ పటాలాలను పంపడమూ ఉద్దేశం మా రేడియో స్టేషన్లు ఎక్కడ వున్నాయో తెలుసుకొని, మా డిటాచ్‌మెంటుని నాశనం చేయడమే అని స్పష్టంగా అవుపడుతూనే వుంది.

కుజ్నెత్సోవ్ పంపిన సమాచారం అతి త్వరలోనే ధ్రువపడింది. కుజ్నెత్సోవ్‌నుండి సమాచారం అందిన మరుసటిరోజున అదేదో చిత్రంగా అవుపడుతూన్న కారు వొకటి మిహాలిన్ గ్రామానికి వచ్చిందనీ, ఆ కారుచూట్టూ బలమైన రక్షణదళం వుందనీ, మా స్కౌట్లు రిపోర్టు చేశారు. ఆ కారు రోజూ పొద్దున్నే ఆ గ్రామంనుండి బయల్దేరేది. జర్మన్లు పైవాళ్ళనెవ్వరినీ ఆ కారును రెండు కిలోమీటర్ల కంటె దగ్గరగా సమీపించనిచ్చేవారుకారట. అంతేకాకుండా, రేడియో ఉపకరణాలను పట్టుకుని, హెడ్‌ఫోన్లు పెట్టుకున్న జర్మన్లు కొన్ని గ్రూపులుగా ఏర్పడి అడవిలో తిరుగుతూండడం కూడా మన స్కౌట్లకు అగపడింది.

ఏమిటి చేయడం? ఏమైనా సరే, మాస్కోతో రేడియో సంబంధం నిలిపి వేయకూడదుకదా. కాని ట్రాన్స్మిటర్ పనిచేయడమంటే, దాని అర్థం—మా క్యాంపు ఎక్కడ వున్నదీ మేమే బయటపెట్టుకోవడన్నమాట. ఈ గడ్డు పరిస్థితిలోనుంచి బయటపడే మార్గాన్ని రేడియో ఆపరేటర్లు వారంతట వారే కనిపెట్టారు.

"కామ్రేడ్ కమాండర్!" అంది లీద షెర్‌స్త్‌న్యోవ, "మేమందరం కలిసి

ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చాం: ఈ రాత్రికి రాత్రే మేం క్యాంపునుండి బయల్దేరి తలొక దిశగా యిరవై, యిరవైఐదు కిలోమీటర్ల దూరం వెళ్ళిపోయి, ఆ చోట్లనుండి ప్రసారంచేసి, మళ్ళీ క్యాంపుకి వచ్చేస్తాం. రేపు కొత్త చోట్లకి వెళ్తాం. ఇహ నాజీలు మనని ఏమైనాసరే పట్టుకోలేరు!"

వారు వేసిన పథకాన్ని వారు అమలుజరిపారు కూడానూ.

ఒక్కొక్క రేడియో ఆపరేటరూ ఒక్కొక్క గెరిల్లా గ్రూపును తీసుకుని ఈవేళ ఒకచోట, రేపు మరొకచోట, ఆ మరునాడు మరొకచోట—యిలా రోజుకు ఒక్కొక్క కొత్త చోటు చొప్పున స్థలాలు మార్చుతూ, కొన్ని రోజుల తరబడి అలా తిరుగుతూ పనిచేసి, యిదివరకు మాస్కో ఏర్పాటుచేసిన టైమ్‌టేబిలు ప్రకారం ఖచ్చితంగా సందేశాలు పంపడం, అందుకోవడమే కాకుండా, సందేశాలు ప్రసారం చేయడానికి, అందుకోవడానికి అదనపు దినాలనూ అదనపు వేళలనూ మాస్కోతో నిర్ణయించుకున్నారు కూడానూ.

ఈ "దేశద్రిమ్మరి" ట్రాన్స్మిటర్లు మమ్మల్ని రక్షించాయి. జర్మన్ డైరెక్షన్ ఫైండర్లు ఒకసారి ఈ దిశగానూ, ఒకసారి ఆ దిశగానూ, మరొకసారి పూర్తిగా వ్యతిరేక దిశగానూ, యిలా నానాదిక్కులూ చూపించేసరికి, జర్మన్లు తిరిగి తిరిగి, వాళ్ళ పిక్కలు సాగిపోయి కాళ్ళు తేలిపోయాయి. స్పెషల్ పటాలపు సైనికులు మేం యిదివరకే విడిచిపెట్టివేసిన ఖాళీ శిబిరాలను చుట్టుముట్టి వాటిపై తుపాకులు కాల్చేవారు ఫిరంగులూ పేల్చేవారు.

మేమే చిట్టచివరకి ఈ దొంగ నాటకాన్ని సమాప్తి చేసేశాం. మేం ఒక చోట మాటుకాచి ఈ జర్మన్ డైరెక్షన్ ఫైండర్లను అటకాయించాం. డైరెక్షన్ ఫైండర్ ఉపకరణాలను మేం వశపరచుకోలేకపోయామన్నమాట నిజమే, కాని మా గెరిల్లాల అటకాయింపుతో నాజీలు భయపడిపోయి, మా రేడియో స్టేషన్లను పట్టుకునే యత్నాలను యిక అంతటితో మానుకున్నారు.

## మార్ప స్త్రుత్రీన్స్కయ

ఒకనాడు మార్ప స్త్రుత్రీన్స్కయ మా హెడ్‌క్వార్టర్స్ గుడిసెలోకి వచ్చింది. ఆమె రావడం చూసి నేను అమితాశ్చర్యపడ్డాను. ఆమె ఎంతో అంత మొగమాటస్తురాలే, యిలా తానే స్వయంగా నా దగ్గరకు రావడానికి ఏమి జరిగింది చెప్మా!—అనుకున్నాను. ఇంతవరకూ ఆమెకు ఏది కావలసివచ్చినా తన పెనిమిటి వ్లదీమిర్ స్త్రుత్రీన్స్కియ్‌నే నా దగ్గరకు పంపుతూండేది.

గుడిసెలో నెగడి మండుతూంది. నెగడి చుట్టూ యిటూ అటూ పడేసి వున్నాయి దుంగలు—అవి మాకు కుర్చీలుగా కూడా ఉపయోగపడేవి. నేను ఓ దుంగను చూపించి :

"కూచోండి!" అన్నాను.

ఆమె నెమ్మదిగా కూర్చుంది.

"మీ కాలం వృధాచేయకుండా, అసలు సంగతి వెంటనే చెబుతాను. లూత్స్క పట్టణానికి నన్ను పంపించండని అడిగేందుకు వచ్చాను" అందామె.

లూత్స్క ప్రాంతానికి ఓ పెద్ద గెరిల్లా గ్రూపును పంపించాలని ఆ రోజుల్లో మేం ఓ పథకం వేసుకుని, అందుకోసం తగిన మనుషులను తయారు చేస్తున్నాం. ఆ పట్నంలో పరిస్థితులు ఎలా వున్నవో, అక్కడ ఏ యే జర్మన్ కార్యాలయాలు పనిచేస్తూన్నవో, ఏ యే గారిజన్ పటాలాలు ఉన్నవో, ఏ యే సైన్యాల హెడ్‌క్వార్టర్సు ఉన్నవో, మా డిటాచ్‌మెంటు ప్రస్తుతం ఉన్న క్యాంపును మేం వదలిపెట్టివేయవలసి వస్తే, అక్కడ అడవులలోని స్థితిగతులు ఎలా వున్నవో—ఈ విషయాన్ని గురించీ స్పష్టమైన భోగట్టా మాకు అవసరమైంది.

ఇది ఏమీ సులభమైన పని కాదు, ఇది అతిక్లిష్టమైన కర్తవ్యం. మా క్యాంపునుండి లూత్స్క పట్టణానికి సుమారు రెండువందల కిలోమీటర్లుంటుంది. అక్కడికి వెళ్ళేందుకే కనీసం ఐదు రోజులు పడుతుంది, ఇక తిరుగు ప్రయాణం వుండనే వుంది. ఇంత దూరం వెళ్ళడమూ ఇన్నాళ్ళ ప్రయాణమూ – ఈ శ్రమ అటుంచగా, ఇంతటితో తీరిపోలేదే : ఆ ప్రాంతంలో అడుగడుగునా జర్మన్లు ఎదురు పడవచ్చు కూడానూ.

ఈ గ్రూపుకి మనుషులను మేం ఎంతో జాగ్రత్తగా ఎంచి పోగుచేశాం. ఆ పట్నాన్ని క్షుణ్ణంగా ఎరిగినవారికి మొదటి అవకాశం ఇచ్చాం. తొలుత స్వచ్ఛందంగా ముందుకు వచ్చిన వారిలో స్త్రుత్రీన్‌స్కియ్ చెల్లెలు కూతురు యాద్వ్య, రొస్తిస్లావ్‌లు వున్నారు. ఈ సంగతంతా మార్ఫకి వీరిద్దరిద్వారా తెలిసి వుంటుంది.

"మీరు లూత్స్క వెళ్ళడం మంచిదికాదు" అన్నాను ఆమెతో. "ఆ ప్రయాణానికి తగినంత శారీరక బలం మీకు లేదు. ఇంతకీ మీ పని మీకిక్కడ వుండనే వుందాయె."

"ఏం పని పోనిద్దురూ! వంటా వార్పూ, బట్టలు ఉతుకూ ఎవరైనా

చేస్తారు. నా వొంటి గురించీ, బలం గురించీ మీరేమీ భయపడకండి. నేను బలమైన మనిషిని, యువకుల కంటె నేనే బాగా ఉపయోగపడతాను ఈ పనికి. లూత్స్క్‌లో నాకు బంధువులూ, పరిచయస్థులూ వున్నారు. మనకు కావలసిన సంగతులన్నీ నేను వారిద్వారా తెలుసుకోగలను. నేనెవరితోనైనా సరే మాట్లాడి వాళ్ళచేత పనులు చేయించుకోగలను" అందామె.

"మరైతే, మీ పిల్లలమాటేమిటి? వాస్యనీ, స్లావనీ ఎవరు చూస్తారు?"

"వాళ్ళని కాత్య చూసుకుంటుందిలెండి"

"ఇది అతిప్రమాదకరమైన పని" అన్నానేన్నను.

"భగవంతుడి దయ! ఇంతకీ, నేను గెరిల్లాను అని ఎవరికైనా అనుమానం కలుగుతుందేమో మీరే చెప్పండి!" అందామె.

మార్ఫకేసి — కరుణతోనూ మంచితనంతోనూ తొణికిసలాడుతూన్న ఆ ముఖంకేసి — అమిత గౌరవభావంతో చూశాను. అప్పుడు నా మనసులో: "ఈ సోవియట్ స్త్రీలో ఎంత శక్తి, ఎంత ఉదాత్తత ఉన్నదో కదా!" అనుకున్నాను.

"అయితే సరే, మన కామ్రేడ్లతో మాట్లాడతాను" అన్నాను.

లాకేత్వం అనే జవాబు వస్తుందేమో అని ఆమె భయపడి, తనపెనిమిటిని —వృద్ధుడు వ్లదీమిర్ స్త్రిశిన్‌స్కియ్‌ని— నా దగ్గరకు పంపించింది. నేను మాత్రం ఇంకా ఏ నిర్ణయానికి రాలేకపోయాను.

కొద్దిరోజుల తరువాత, త్సెస్పార్‌స్కియ్ నాదగ్గరకు వచ్చి, మార్ఫకి బలువుగా జలుబుచేసిందనీ, పడిసెంతో బాధపడుతూందనీ చెప్పాడు. నాకు ఇదొక సాకుకిందదొరికి, మార్ఫని లూత్స్క్ పంపడంలేదని ఆమెతో చెప్పవలసిందని, లూత్స్క్ ప్రాంతానికి పంపదల్చుకున్న గ్రూపుకి కమాండరుగా నియమించబడిన క్రొలోవ్‌తో చెప్పాను.

ఈ సంగతి క్రొలోవ్ మార్ఫతో చెప్పి తిరిగి వచ్చాడో లేనేలేదో, ఇంతలోనే మార్ఫ కంటినీరు నింపుకొని నా దగ్గరకు పరుగెత్తుకుని వచ్చింది.

"కొద్దిగా శైత్యభారం చేసింది, అంతే. రేపటికి నయమైపోతానండి" అందామె.

అలా అంటూ, తనను పంపవలసిందని ఆమె ఎంతగా ప్రాధేయపడిందంటే, చివరికి నేను సరే అని, ఆమెను పంపడానికి ఒప్పుకున్నాను.

ఫిబ్రవరి మధ్యలో మా గెరిల్లాలలో అరవై ఐదుగురు లూత్స్క బయల్దేరారు.

మార్ఫను సాగనంపేందుకని వ్లదిమిర్ స్త్రెలీన్‌స్కియ్, పిల్లలూకాక్యాంపు నుండి ఎంతో దూరం ఆమెతో వెళ్ళారు.

రెండు వారాలు గడిచాయి. ఈ రెండు వారాల్లోనూ, ఆగ్రూపు లూత్స్క ప్రాంతానికి సురక్షితంగా చేరుకున్నట్టూ, అక్కడ వారి పనులన్నీ సవ్యంగా జరుగుతూన్నట్టూ, లూత్స్క పట్నానికి ఇరవై ఐదు కిలోమీటర్ల దూరాన వున్న అడవిలో వారు మకాం ఏర్పరచుకుని, అక్కడ నుంచి స్కౌట్లను పట్నంలోకి పంపుతున్నట్టూ మాకు సమాచారం అందుతూ వచ్చింది.

ఈ రోజుల్లోనే గెస్టాపో గెరిల్లాలపై పెద్ద ఎత్తున దాడిచేయడం ప్రారంభించింది. స్పెషల్ పటాలాలు అన్ని జిల్లాలలోనూ ప్రత్యక్షమయ్యాయి. పోలీసులు కూడా భారీ ఆయుధాలతో తయారయ్యారు.

అన్ని రోడ్లూ బందై పోతాయని నేను భయపడి, ఇక ఏ జాప్యమూ చేయకుండా వెంటనే క్యాంపుకి వచ్చేయ వలసిందని ఫ్రోలోవ్‌కి ఆర్డరు పంపించాను. ఆ ప్రకారం ఫ్రోలోవ్ క్యాంపుకి తిరిగివచ్చేశాడు. కాని అతడు తీసుకువచ్చిన సమాచారంవల్ల నాకు ఏ మాత్రమూ ఉపశమనం కల్గలేదు.

స్లూచ్ నది దాటే ఒక పాటిరేవుకు దగ్గరగా వున్న ఓ అడవి అంచున మాటుకాచివున్న శత్రుబలాలు ఇతని గ్రూపుపై దాడిచేశాయి. ఆ ఘర్షణ కొద్ది నిమిషాలపాటే జరిగింది. దాడికి ప్రతిఘటన వుంటుందని నాజీలు అనుకోకపోవడం చేత, తిరుగుదెబ్బ తగలగానే వారు తమ హతులనూ, క్షతగాత్రులనూ అడవిలో వదిలిపెట్టేసి, త్వరత్వరగా తిరోగమించారు. అయినప్పటికీ, ఫ్రోలోవ్ గ్రూపులో ఆర్గురు నేలకొరిగారు.

ఫ్రోలోవ్ ఇతర వివరాలను రిపోర్టుచేస్తూ మార్ఫ, యాద్వ, రొస్తిస్లావ్‌లూ, ఇంకా మరి ఐదుగురు గెరిల్లా సైనికులు లూత్స్క ప్రాంతంలోనే వుండిపోయారని చెప్పగా విని నేను కలవరపడ్డాను.

మార్ఫ, యాద్వలు రెండు సార్లు వూళ్లోకి వెళ్లి, మాకు సహాయం చేయగల్గే మనుషులతో సంబంధాలు ఏర్పరచుకుని, వారిని ఫ్రోలోవ్‌తో పరిచయం చేశారు. వీరిలో ఒకతడు, లూత్స్క రైల్వేస్టేషనులో పనిచేస్తూన్న ఇంజనీరు. అతిముఖ్యమైన

సమాచారాన్ని, అందునా ప్రత్యేకంగా ముఖ్యమైన సమాచారాన్ని — జర్మన్లు అనేక వ్యాగన్లతో రసాయనిక గ్రెనేడ్లనూ, వైమానిక బాంబులనూరవాణాచేసి ఆ స్టేషన్‌లో దింపారనీ, అవి ఎలా పనిచేస్తాయో చూసేందుకు వాటిని గెరిల్లాలపైనా, సివిలియన్ ప్రజలపైనా ప్రయోగించేందుకై పథకాలు వేస్తున్నారనే విషయాన్ని — ఫ్రొలోవ్‌కి తెలియజేశాడు. ఆ పట్నంలో వున్న అన్ని జర్మన్ హెడ్‌క్వార్టర్సు ఆఫీసులూ, అంతేకాకుండా మందుగుండు సామగ్రి, రసాయనిక గ్రెనేడ్ల డిపోలూ వున్న స్థలాలను తెలియజేస్తూన్న ఆ పట్టణపు సవివరమైన ప్లాను సంపాదించి ఫ్రొలోవ్‌కి ఇస్తానని కూడా ఖరారు చేశాడు. ఈ ప్లాను తెచ్చుకోవడం కోసం మార్ఫ మరికొద్ది రోజులలో లూత్స్క్ వెళ్ళేందుకు ఏర్పాటైంది. కాని వీరిని వెంటనే వచ్చివేయవలసినదిగా నేను పంపిన ఆర్డరు ఈ ఇంజనీరుని కలుసుకుందుకుని ఆమె లూత్స్క్ వెళ్ళేముందు వారికి అందింది.

ఏమైనా సరే ఆ ప్లాను తీసుకుని అక్కడనుండి కదలడానికే ఆమె నిశ్చయించుకుంది.

"ఇలాటి పని ఎలా వదలిపెట్టేయను? ఆ ప్లానుని బహుశ మాస్కో పంపుతారేమో కూడా...యాద్వ్యనూ, రొస్తిస్లావ్‌ను నా దగ్గిర వుంచేసి మీరు వెళ్ళండి. నేనూ వాళ్ళు కలసి వచ్చేస్తాం" అందామె ఫ్రొలోవ్‌తో,

ఆమె తన పట్టు వదిలిందికాదు. చివరికి ఫ్రొలోవ్ ఆమె వుండిపోవడానికి ఒప్పుకొని, ఆమె దగ్గిర యాద్వ్యనూ, తిరుగు ప్రయాణంలో ఆమె రక్షణార్థం రొస్తిస్లావ్‌తో సహా ఆర్గుగు గెరిల్లా సైనికులనూ వుంచేసి తను వచ్చేశాడు.

ఫ్రొలోవ్ తన రిపోర్టును పూర్తిచేసిన వెంటనే, వృద్ధుడు వ్లదీమిర్ స్త్రుతిన్‌స్కియ్ దగ్గరకు వెళ్ళాను. అతనికప్పుడే అన్ని సంగతులు తెలిశాయేమో. అతడు ఏమీ తోచకుండా ఆందోళన పడుతూ గుడిసెలో కూచునున్నాడు.

"ఏమిటి సంగతి?" అని అడిగాను.

"ఏమీ లేదు" అన్నాడు నీరసంగా. కాస్సేపు వూరుకుని, తరువాత, "మా ఆవిడ లేకపోవడాన్ని నాకేమిటో బెంగగా వుంది" అన్నాడు.

అతణ్ణి సంబాళించేందుకు ప్రయత్నించాను

"మీరేమీ బెంగపెట్టుకోకండి, ఆమె రెండు, మూడురోజుల్లో రానేవస్తుంది. రొస్తిస్లావ్ వున్నాడు కదా, ఇక తల్లికి ఏ చిక్కూ రానీయడు."

"అవును ఏ చిక్కూ రానివ్వడు కాని, ఒకవేళ వాడికే చిక్కు వస్తేనో... ఐనా, యుద్ధం కదా, ఎవ్వరం ఏమీ చేయలేం..." అన్నాడు వృద్ధుడు.

కొద్దిరోజుల తరువాత యాద్వ, రొస్తిస్లావ్, మరి ఇద్దరు గెరిల్లాలూ క్యాంపు చేరుకున్నారు.

వారిని వృద్ధుడు స్త్రితిన్‌స్కియ్ అందరికంటేనూ ముందు కలుసుకున్నాడు. యాద్వ, రొస్తిస్లావ్‌లు చెప్పినదంతా అతడు మౌనంగా విన్నాడు, ఒక్క మాటైనా అనకుండా తన గుడిసెలోకి వెళ్ళిపోయాడు.

యాద్వ వెంటనే నా దగ్గరకు వచ్చింది. తన దుస్తుల్లో వున్న రహస్యపు జేబులోనుంచి ఓ ప్యాకెట్టు తీసి :

"అత్తయ్య దీన్ని మీకు ఇవ్వమంది" అని ఆ ప్యాకెట్టును నాకు అందిచ్చి' కన్నీరు బొటబొట కారుతూండగా, జరిగిన సంగతంతా చెప్పింది.

ఆమె, మార్ఫ—ఇద్దరూ లూత్స్క్ వెళ్ళి, అంతకు ముందుగా ఏర్పరచుకున్న ప్రకారం ఆ ఇంజనీరుని కలుసుకుని, అతని దగ్గరనుండి ఆ ప్లాను పుచ్చుకుని అడవిలోకి తిరిగివచ్చేశారు. వీరి కోసమని కడమ గెరిల్లాలందరూ అక్కడ కనిపెట్టుకున్నారు. మార్ఫ తన కోటుకాలరు కుట్టు విప్పి, ఆ ప్లానుని కోటుకాలరులో పెట్టి మళ్ళీ కుట్టేసింది ఇక గ్రూపంతా క్యాంపుకి బయల్దేరింది.

పగలంతా ఏ గూడెంలోనో, ఏ పల్లెలోనో విశ్రాంతి తీసుకుని, రాత్రిళ్ళు నడిచేవారు వీకోక్ అనే ఒక గూడెంలో ఓ గుడిసెలో వీరు విశ్రమించుతుంటగా, కనీసం ఓ నలభైమంది పోలీసులు ఆ గుడిసెను చుట్టుముట్టేశారు.

తల్లినీ, యాద్వనీ పెరట్లోనుండి అడవిలోకి పారిపొమ్మని రొస్తిస్లావూ' కడమ గెరిల్లాలూ చెప్పి తాము గుడిసెలోనుంచి పరుగున బయటికి వచ్చేశారు.

మార్ఫ తనకోటు కాలరును పర్రున చింపేసి, దానిలోనుంచి ప్యాకెట్టుతీసి:

"యాద్వ! దీన్ని తీసుకుని, నువ్వు పరుగెత్తి పారిపో... నువ్వు చిన్నదానివి. దీన్ని కమాండరుకి ఇచ్చేయ్..." అంది.

ఆ గుడిసె పక్కనే జరిగింది పోరాటం. నలభైమంది పోలీసుల ఎదుట ఆ అర్గురు గెరిల్లాలు నిలబడలేకపోయారు. మనవాళ్ళు ముగ్గురు నేలకొరిగారు. మార్ఫ, యాద్వ ఆపాటికప్పుడే తప్పకుండా పారిపోయి, అక్కడ దాగుని వుంటారని అనుకుని రొస్తిస్లావూ, కడమ ఇద్దరు గెరిల్లాలు కాల్పులు జరుపుతూ అడవిలోకితిరోగమించారు.

"పోలీసులు ఆ గుడిసెలోకి చొరబడడం రొస్తిస్లావ్ చూడలేదు" అంటూ యాద్వ ఏడుస్తూ చెప్పింది. "వాళ్ళు అత్తయ్యను గాయపరచారు, నా రెండు చేతులూ పట్టుకున్నారు... నాకు మరేమీ అవుపడలేదు... నేను వాళ్ళ చేతుల్లోనుండి ఎలాగో

విడిపించేసుకుని, అక్కడున్న పిస్తలు పట్టుకుని, వాళ్ళమీద పిస్తలు కాల్చుతూ కిటికీలోనుంచి దూకేసి పరుగెత్తాను. గ్రోస్టిస్లావ్‌నీ, కడమ మన ఇద్దరి కుర్రాళ్ళనీ మరునాడు ఉదయాన మాత్రమే అడవిలో కలుసుకోగల్గాను. తల్లిని జర్మన్లు పట్టుకున్న సంగతి రోస్టిస్లావ్‌కి తెలీదు."

"మరి, తరువాత ఏమైంది?" అని అడిగాను.

"పీరాక్ సమీపంలో వున్న ఆ అడవిలోనే అలా తిరిగాం. సాయంకాలం అయింది, ఎవరోగాని ఓ స్త్రీ వస్తూండడం చూశాం. మేము ఆమెకోసం ఆగి,ఆమెను అడగ్గా: అత్తయ్యని వాళ్ళు ఘోరంగా కొట్టారనీ, కాని ఆమె నోరు మెదపలేదనీ, తరువాత గెస్టాపోలు ఆమెను గ్రామం అవతలకి తీసుకుపోయి, అక్కడ తుపాకి కాల్పులతో ఆమెను హత్యచేశారనీ ఆమె చెప్పింది. శవాన్ని రైతులు రాత్రిపూట తీసుకెళ్ళి అడవిలో ఖననంచేసేశారట. ఆమె మమ్మల్ని తీసుకెళ్ళి, అక్కడ వున్న కొత్త సమాధి దిబ్బను మాకు చూపెట్టింది. అత్తయ్య మృతశరీరాన్ని భూస్థాపితం చేయడంలో ఆమె కూడా సహాయపడిందట. తను అడవిలోకి వెళ్ళి చూస్తే, మాలో ఎవరినైనా తను కలుసుకోగల్గుతాననే ఉద్దేశంతో ఆమె అక్కడకు వచ్చిందట.'మీరు తప్పకుండా ఇక్కడెక్కడో వుంటారనే అనుకున్నాను' అందామె."

మేం యుద్ధం నట్టనడుమనున్నాం. మేం అనేక పర్యాయాలు మృత్యువును ముఖాముఖి చూశాం. మా కామ్రేడ్లనెందరినో మా చేతులతో మేం ఖననం చేశాం. వారి మరణానికి మేం శత్రువుపై నిర్దాక్షిణ్యంగా పగతీర్చుకున్నాం. యుద్ధ క్రౌర్యాలకు అలవాటుపడ్డామనే అనుకున్నాం. కాని మార్ఫ స్త్రితిన్‌స్కాయ మరణం మమ్మల్నందరినీ ఖిన్నులను చేసివేసింది. ఆమె మరణవార్త క్షణమాత్రంలో క్యాంపు అంతటా వ్యాపించిపోయింది. నేను వ్లదీమిర్ స్త్రితిన్‌స్కీయ్ గుడిసె దగ్గరకు వెళ్ళి నప్పుడు, అదేమిటో మరి, అడవి అంతా ఇదివరకెన్నడూ లేనంతగా నిశ్శబ్దమైపోయింది.

అతనితో మాట్లాడలేకపోయాను, అతన్ని చూసేసరికి నా నోటనుండి మాటరాలేదు. మనిషి దుఃఖంతో ఉక్కిరిబిక్కిరైపోతున్నాడు. ఆమె మరణానికి ఏదో విధంగా నేనే బాధ్యుడనైనట్టు నాకనిపించి, అతని ఎదుట నుంచోలేక వచ్చేశాను.

మార్ఫ మరణం గురించి ఈ రోజు జ్ఞప్తికి తెచ్చుకుని, మా గెరిల్లా వార్తాపత్రిక వెనకటి సంచిక తీసి చూశాను. ఆ సంచికలో, ఆమెను బాగాఎరిగిన గెరిల్లాలు ఆమె మరణవార్తను తెలియజేస్తూ తమ సంతాపాన్ని ఇలా ప్రకటించారు:

"మార్ఫ స్త్రిలీన్‌స్కాయ నాజీ రాక్షసుల చేతుల్లో మరణించిందన్న దుఃఖవార్తను ఇటీవల జరిగిన పోరాట చర్యనుండి తిరిగివచ్చిన కామ్రేడ్లు తీసుకు వచ్చారు"

"మన డిటాచ్‌మెంటుతో కలిసి ఆమె గడపిన నెలలలో మాకు ఆమెతో సన్నిహిత పరిచయం కల్గింది. ఒక గెరిల్లా కుటుంబానికి తల్లిగానే కాకుండా, సప్త వీరులనుకన్న మాతగానే కాకుండా. తానే ఒక వీరవనితగా, ధైర్యశాలియైన దేశాభిమానిగా ఆమె వెలసింది."

"మన డిటాచ్‌మెంటులో అందరికీ ఆమె మాతృమూర్తి అయింది. అలసట ఎరగక, విధివిరామం లేకుండా ఆమె రాత్రింబవళ్ళు పనిచేసింది, ముఖ్యమైన సంగ్రామకార్యాన్ని నిర్వహించేందుకు మార్ఫ స్త్రిలీన్‌స్కాయ యధేచ్ఛగా ముందుకు వచ్చింది ఆ కార్యం నిర్వహించి తిరిగివస్తూండగా నాజీ బుల్లెట్టు ఆమె జీవితాన్ని అంతంచేసింది."

"ఒక మహనీయురాలి హృదయస్పందనం స్తంభించిపోయింది. కానిఆమె మరణానికి మేం పగ సాధించుకుని తీరుతాము."

"ఈ కార్యాన్ని అనేకులు సాధించుతారు. మాకు అమూల్యమైన మార్ఫ స్త్రిలీన్‌స్కాయ ప్రాణాన్ని హరించినందుకు నాజీలు తమ తుచ్ఛ రక్తంతో మూల్యం చెల్లించితీరుతారు"

"మాతృదేశం ఆమెను ఎన్నటికీ మరచిపోదు."

తమ తల్లి మరణవార్త మాకు తెలియవచ్చినప్పుడు నికొలాయ్, జోర్జిలు క్యాంపులో లేరు. ఆ సమయానికి వారిద్దరూ రోవ్నోలో వున్నారు. కొడుకులిద్దరూ దగ్గర లేకపోవడంవల్ల వ్లదీమిర్ స్త్రిలీన్‌స్కీయ్‌కి దుఃఖం భరించడం మరీ కష్టమై పోయింది. అతనికేదైనా వ్యాపకం కల్పించితే దుఃఖం భరించడం కాస్త సులువవు తుందేమో అనుకుని, అతణ్ణి ఒక పనిమీద పంపించాం. అతడు ఆ పనిమీద వెళ్ళి, తిరిగివచ్చి, తానా పనిని నిర్వర్తించినట్టు రిపోర్టుచేసేందుకని నా దగ్గరకు వచ్చాడు. అతనిలో వచ్చిన మార్పును చూసి నేను మ్రాన్పడిపోయాను: ఆ కొద్దిరోజుల్లోనూ మనిషికి ముసలితనం వచ్చేసింది, బుగ్గలు గుంటలు పడిపోయాయి.

"కూచోండి, వ్లదీమిర్!" అన్నాను.

ఓ చెట్టుమొదలుపైన అతను భారంగా చతికిలబడ్డాడు. ఓ గ్లాసునిండా ద్రాక్ష సారాయం నింపి గ్లాసును అతని ఎదుట వుంచాను.

"పుచ్చుకోలేనండి!" అని గ్లాసును పక్కకు నెట్టివేసి, మౌనంగా కూచున్నాడు.

ఆ నిశ్శబ్దం అనంతమనిపించింది. ఈ నీరవమైన ఒప్పుకోలుకు నేను అడ్డుచెప్పదల్చుకోలేదు: తనను ఓదార్చడం వృద్ధునికి ఇష్టంలేకపోయింది. చిట్ట చివరకు తనను చాలాకాలంగా పీడించుతూన్న తలంపును అతడు వ్యక్తంచేశాడు:

"ఆమెతో నికొలాయ్‌వెళ్ళివుంటే...లేకుంటే జోర్జ్, వాడు బలమైనవాడే... అయినా, జరిగినదాని గురించి విచారించి లాభంలేదు—యుద్ధం..."

ఇక అప్పటినుండి, తన కొడుకుల్ని ఏ పనిమీద పంపించినా సరే:

"జోర్జ్ దగ్గరనుండి ఏదైనా కబురు వచ్చిందా? నికొలాయ్ మళ్ళీ ఎప్పు డొస్తాడు?" అని పదేపదే అడుగుతూండేవాడు.

మార్ఫ చనిపోయినతర్వాత వాస్య, స్లావల సంరక్షణ గెరిల్లా అమ్మాయిలు చూస్తూండేవారు, కాని తల్లిలేని లోపాన్ని వారు తీర్చలేకపోయారు. అంతేకాకుండా మా జీవితమే ప్రమాదభరితమైన జీవితం. అందుకని ఏప్రిల్ నెలలో ఆ కుర్రాళ్ళి ద్దరినీ విమానంమీద మాస్కో పంపించేశాం. కాత్య వాళ్ళతో కూడా వెళ్ళింది. తమ్ముళ్ళని జాగ్రత్తగా చూస్తూండమని కాత్యతో తండ్రి వెయ్యిసార్లు అయినా చెప్పివుంటాడు.

* * *

మార్చి 8, అంతర్జాతీయ మహిళాదినంనాడు అనుభవజ్ఞుడైన కమాండర్ బజానొవ్ నాయకత్వాన సుమారు నూరుమంది గెరిల్లాలను బోగుషి గ్రామానికి పంపిం చాను. శత్రు బెటాలియన్ ఒకటి అక్కడ దండు విడిసిందని మాకు సమాచారం అందింది. ఫ్రోలోవ్‌పై దాడిచేసినది ఈ బెటాలియనుకు చెందిన మనుష్యులే.

ఈ గ్రామానికి దగ్గరగా, స్లూచ్ నది పశ్చిమతీరాన, ఒక వరుస పురాతన దుర్గ రక్షణ నిర్మాణాలున్నాయి. పోలెండును భూస్వాములు పరిపాలించిన వెనుకటి రోజుల్లో ఇవి నిర్మించబడ్డాయి. ఆనాడు నిర్మించిన కందకాలూ, పిల్‌బాక్సులూ ఇంకా దృఢంగా నిల్చివున్నాయి, కాని నదిలో నీటిమట్టం పెరగడంచేత పిల్‌బాక్సు లన్నీ జలమయమై వున్నాయి.

ఆ ప్రదేశాన్ని బజానొవ్ గడుసుగా రెకన్నాయిటర్‌చేసి తన బలాలను మంచి తెలివిగా మోహరించాడు. అతడు తెల్లవారుగట్ల ఎదురుదాడి ప్రారంభించాడు. నాజీలు యింకా నిద్రలోనే వుండడంచేత, వాళ్లు బెంబేరెత్తిపోయి ఆ గ్రామమంతా

వెదురుగొడ్డలా చిందరవందరగా తిరిగారు. ఈ లోపున వాళ్ళు మన బుల్లెట్లకి ఆహుతికాజొచ్చారు. చాలామంది కందకాల్లోకీ, పిల్‌కాలువల్లోకి పరుగెత్తారు, కాని వారికక్కడ రక్షణ దొరకలేదు. వారు మన బుల్లెట్లకి గాయపడి, జలమయమైవున్న కందకాల్లోనూ, పిల్‌కాలువల్లోనూ మునిగిపోయి చచ్చిపోయారు.

విస్తార పరిమాణంలో ఆయుధాలనూ, ఆయుధ సామగ్రినీ పట్టుకొని బజానొవ్ క్యాంపుకి తిరిగివచ్చేశాడు.

మా కామ్రేడ్లను వధించినందుకూ, మార్ఫ స్తుప్రిటీన్‌స్కయ మృతికీ మేం ఈ విధంగా శత్రువుపై పగ తీర్చుకున్నాం.

## ఒక యుద్ధక్రియ, ఒక శస్త్రక్రియ

మా క్యాంపునుండి రోవ్నోకి వెళ్ళే రోడ్డుకు అడ్డంగావున్న పాటి రేవు లన్నిటిపైనా జర్మన్లు నిఘావేసి వుంచారు. అందుకని రోవ్నోతో సంబంధం నిలబెట్టుకునేందుకు వెనుకట్లా ఒకరిద్దరు హర్కారాలను కాకుండా, ఏకంగా ఇరవై ముప్పైమంది గెరిల్లాలను ఒక గ్రూపుగా పంపవలసివచ్చింది. చిన్నచిన్న సాయుధ పోరాటాలు ఇక మామూలైపోయాయి. ఈ పోరాటాల్లో జర్మన్లకూ, వీరికి సాయం చేస్తూన్న బందిపోటు దేశద్రోహులకూ భారీ నష్టాలు కల్గజొచ్చాయి. మా పక్షాన కూడా హతాహతుల సంఖ్య పెరుగుతూవచ్చింది.

రోవ్నోలోని కార్యకలాపం ప్రశాంతంగా సాగిపోతూండేందుకని మా డిటాచ్‌మెంటులో ఒక భాగాన్ని రోవ్నో పట్నానికి పడమటనున్న త్సూమన్ స్కయె అడవుల్లోకి తరలించేందుకు నిర్ణయించాను. లూత్స్క్‌నగరానికి ఫ్రోలొవ్‌తో వెళ్ళిన స్కౌట్లు ఈ అడవులను అప్పుడే రెకన్నాయిటర్ చేశారు.

మా మనుషులలో నూటపదిహేనుమందిని ఎంచి, వారిని తీసుకుని నేను బయల్దేరాను. స్త్రెహొవ్ నాయకత్వాన కదమవారు పాతక్యాంపులోనే వుండిపోయారు.

రోవ్నోలో ఇంతకుముందేవుండి వచ్చిన స్కౌట్లనే కాకుండా, ఆ నగరాన్ని ఎరిగిన గెరిల్లాలందరినీ నాతో తీసుకువెళ్ళాను. అలెక్సాండ్ర్ లుకీన్ కూడా నాతో వచ్చాడు. అతడు మాస్కో వెళ్ళి, యుద్ధశ్రేణి వెనుక ప్రాంతాల పరిస్థితిని గురించి మాస్కోలో రిపోర్టుఇచ్చి, సరిగా అప్పుడే క్యాంపుకి తిరిగివచ్చాడు. అతడు విమానం నుండి పారషూటుతో దిగాడు. ఈ విమానమే అనేక కానుకలను—బంధుమిత్రాదులనుండి వుత్తరాలనూ, మాసపత్రికలూ, దినపత్రికలనూ, సబ్‌మెషీన్ గన్నులూ, మందుగుండు సామగ్రీ, ఆహారపదార్థాలనూ—మాకు అందించింది.

డిటాచ్‌మెంటు స్టాఫ్‌లో పనిచేస్తూన్న వారిని హెడ్‌క్వార్టర్సు గుడారంలో సమావేశపరిచాను. ఆ సమావేశంలో, మా డిటాచ్‌మెంటు కార్యకలాపం గురించిన్నీ, మాకు ఒప్పజెప్పిన కర్తవ్యాలను గురించిన్నీ హైకమాండ్ జారీచేసిన తాజా ఆదేశాలను లుకిన్ మాకు తెలియజేశాడు.

డిటాచ్‌మెంటులో చేరేందుకని నలుగురు కొత్త రిక్రూట్లు లుకిన్‌తో వచ్చారు. వీరిలో ఒకడు శ్వెస్పార్‌స్కీయ్, మచెరేత్‌ల పాత స్నేహితుడు, గ్రీష మ్యుయ్‌లోవ్‌స్కీయ్. ఇతడు సాహిత్యరచనాశిక్షణఇన్‌స్టిట్యూట్‌లో విద్యార్థిగావుంటూ, మా డిటాచ్‌మెంటులో చేరేందుకు అనుమతి కోసమని చాలాకాలంనుంచీ తంటాలు పడుతున్నాడు.

"అయితే మరి ఇన్‌స్టిట్యూట్ చదువు మాటేమిటి ?" అని అడిగానతణ్ణి

"ఇన్‌స్టిట్యూట్ చదువా ! యుద్ధంలో జయం సాధించిన తర్వాత పూర్తి చేస్తా..."

లుకిన్‌తో వచ్చినవారిలో రెండవ వ్యక్తి, మాస్కోలోని వఖ్తాన్‌గోవ్ థియేటరుకు చెందిన నాటక కళాశాల విద్యార్థి, మాక్స్ సెలెస్కీరిది. ఇతడు నాటక కళను అభ్యసించి వైహాసికుని వృత్తి చేపట్టాలనుకున్నాడు. కాని ఇప్పుడు మా డిటాచ్ మెంటులోచేరి విధ్వంసకునిగా తయారవ్వాలనుకున్నాడు. ఇతడు హాస్యగాడు ఎలా అవాలనుకున్నాడా ? —అని నేను అనేకసార్లు ఆశ్చర్యపడ్డాను : అతని ముఖాన నవ్వు అన్నది నేనెన్నడూ చూడలేదు.

లుకిన్‌తో వచ్చినవారు కడమ ఇద్దరు రిక్రూట్లూ రేడియో ఆపరేటర్లు. వారిద్దరిలోనూ మరీనకిహ్ గురించి మేము ప్రత్యేకమూ శ్రద్ధ తీసుకున్నాం. ఆమె స్వగ్రామం ల్వోవ్ ప్రాంతంలో నొవాస్యోల్కి-కర్దినాయ్‌స్కియె అనే పల్లెటూరు.

పశ్చిమ ఉక్రెయినియా కమ్యూనిస్టు యువజన సంఘం స్థాపించిన అజ్ఞాతవాస కార్యకర్తల ఆర్గనైజేషనులో ఆమె 1932లో చేరి మూడు సంవత్సరాలు పని చేసిన తరువాత, పశ్చిమ ఉక్రెయినియా కమ్యూనిస్టు పార్టీలో సభ్యురాలయింది. విప్లవ కార్యకలాపాలు సాగించినందుకు ఆమెను పోలెండ్ దేశపు రాజకీయపోలీసులు 1936లోనూ, మళ్ళీ మరొకసారి 1937 లోనూ అరెస్టుచేశారు. పశ్చిమ ఉక్రెయినియా విముక్తి కాబడిన తరువాత ఆమె పశ్చిమ ఉక్రెయినియా ప్రజాసభకు సభ్యురాలిగా ఎన్నుకోబడింది. ప్రజాసభ ప్రతినిధి వర్గంలో సభ్యురాలుగా ఆమె సోవియట్ యూనియన్ సుప్రీమ్ సోవియట్ అసాధారణ సమావేశానికి హాజరై, ఉక్రెయినియన్

సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌లో ల్వోవ్ ప్రాంతం చేరగోరుతుందనీ, ఆ ప్రాంతపు జనాభా సోవియట్ పౌరసత్వాన్ని వాంఛించుతుందనీ సోవియటు ప్రభుత్వానికి తెలియ జేసేందుకు కియెవ్ పట్టణానికి వెళ్ళింది.

యుద్ధం ఆరంభించగానే మరీన రేడియో ఆపరేటర్ కోర్సు చదివింది. కోర్సు పూర్తి అయిన పిమ్మట, ఆమెను మా డిటాచ్‌మెంటుకి పంపించారు.

కొత్త రిక్రూట్లందరితోనూ నేను సంతృప్తి చెంది, త్సూమన్‌స్కియె అడవులకు తరలివెళ్తున్న గ్రూపులో వీరిని కూడా చేర్చాను.

ఈ తరలింపు మా కొక క్లిష్టమైన యుద్ధక్రియగా పరిణమించింది. నాజీలపై మేం సాగించిన మొదటి యుద్ధం రోవ్నో–సార్ని రైల్వేలైనుపై వున్నట్టి ఒక లెవల్ క్రాసింగుకు కాస్తదూరంగా వున్న కరచూన్ గ్రామంవద్ద జరిగింది. మా గమనాగమనాలను జర్మన్లు తెలుసుకున్నారేమో మరి, వారు అక్కడ మాటుదాగి మాపై బడ్డారు. ఇరుపక్షాలూ ఒకరిపై ఒకరు కొద్దిసేపు కాల్పులు జరిపిన తరువాత, మాపై విజృంభించిన శత్రుబలం ఏపాటి సంఖ్యలో వుందో తెలుసుకుందుకని నేను అడవిలోకి వైదొలగేందుకు నిశ్చయించుకున్నాను. మేం వైదొలగడం ఆరంభించ గానే, ఒక రైలునిండా జర్మన్ సైనికబలం వచ్చి, ఆ మాటు జాగా దగ్గర దిగింది. ఈ అదనపు బలంకోసం వాళ్ళు టెలిఫోను ద్వారా కబురుచేసే వుండాలి.

ఏది యేమైనా సరే, మేం మాత్రం రైల్వేలైను దాటితీరాలి. సరే అనిచెప్పి మొదట నేనే ఎదురుదాడికి దిగేందుకు నిశ్చయించుకున్నాను.

శత్రు సైనికులు ఇంకా రైలుదిగి, రైలు వెళ్ళిపోయిందో లేదో మన గెరిల్లాలు దిక్కులు పిక్కటిల్లేటట్టు "హుర్రా!" అని కేకలువేస్తూ బ్రహ్మాండమైన ఉరవడితో శత్రువుమీదకి విజృంభించారు. ఇంత త్వరగా ఇంత జోరుతో మేం ఎదురుదాడికి దిగుతామని జర్మన్లు అనుకోలేదు. మిలిటరీ కార్యాలలో దుడుకుగానూ అర్థాంతుగానూ జరిగేదాడే ఎల్లప్పుడూ లాభదాయకంగా వుంటుంది. సుమారు ఇరవై మంది నాజీలను మేం నేలగూల్చాం, ఐదుగురిని ఖైదీలుగా పట్టుకున్నాం.

కుజ్నెత్సొవ్ ఖైదీలను ప్రశ్నించగా, పెద్ద ఎస్.ఎస్. బలగం ఒకటి రోవ్నోనుండి రూద్నికి–బొబ్రోవ్‌స్కయ జిల్లాకు పంపబడిందని వారు చెప్పారు. ఈ సమాచారాన్ని స్థానికవాసులుకూడా రూఢీపరచారు.

"ఆ దిశగా కనీసం ఓ రెండువందల లారీలనిండా వెళ్ళారు జర్మన్ సైనికులు. ట్రెయిలర్లలో ఫిరంగులుకూడా వున్నాయి!" అన్నారురైతులు.

స్తేహావ్‌ను హెచ్చరికచేస్తూ అతడికి రేడియో ద్వారా కబురు పంపేందుకు ప్రయత్నించాను. కాని ఆ రేడియో స్టేషనుతో సంబంధం దొరకలేదు. అందుకని, మాస్కో మీదుగా అతనికి రేడియోగ్రాం పంపించాను — అతనికి ఈ హెచ్చరిక ఆలస్యంగా అంది నిష్ప్రయోజనమే అవుతుందని నాకు తెలిసినప్పటికీ కూడాను,

రైల్వే లెవెల్ క్రాసింగువద్ద జరిగిన యుద్ధంలో మా గెరిల్లాలలో ఒకడు నేలకొరిగాడు, ఇద్దరు గాయపడ్డారు. గాయపడినవారిలో ఒకడు మా విధ్వంసక నిపుణుడు మాలికొవ్: పేలుడు బుల్లెట్టు ఒకటి అతని కుడిచేతికి తగిలి, రెండు వేళ్ళు తునాతునకలైపోయాయి. త్సెస్సార్‌స్కియ్ వెంటనే ఆపరేషన్ చేసి ఆ రెండు వేళ్ళూ తీసివేసి గాయానికి కట్టుకట్టాడు.

క్షతగాత్రులలో రెండవవాడు ప్రజ్ఞావంతుడైన సాప్పరూ, గెరిల్లా టక్కరి తనంలో అందెవేసిన చేయీ అయిన స్పెయిన్ దేశస్థుడు గ్రోస్. ఒకే మందు పాతరలో రైల్వే వంతెననూ, యావత్తు రైల్వే ట్రెయిన్‌నూ ధ్వంసంచేసి, తన తెలివి తేటలనూ, తీరులమారి తనాన్నీ ఇతడు నిరూపించుకున్నాడు. తన మాతృదేశంలో తాను పోరాడిన యుద్ధాలలోలాగానే ఈ డిటాచ్‌మెంటులో కూడా అతడు గొప్ప ధైర్యశాలిననిపించుకున్నాడు. ఇతడు పాల్గొననిదే మేము రైల్వేలపై యుద్ధ క్రియలను ఇంచుమించు వేటినీ సాగించలేదన్నమాటే.

గ్రోస్‌కి పెద్ద గాయమే తగిలింది. పేలుడు బుల్లెట్టు ఒకటి అతడి రెక్క ఎముకలోకి తొల్చుకుపోయి, ఎముకను కొంతవరకూ తునకలు చేసివేసింది.

"అతడు యింత వేగం మళ్ళీ డ్యూటీలోకి రాలేడు" అని త్సెస్సార్ స్కియ్ నాకు రిపోర్టు చేశాడు. "గాయం ప్రమాదకరమైనది కాదు గాని, మానేసరికి చాలాకాలం పడుతుంది"

మరుచటినాడు సాయంకాలం మరొక యుద్ధం జరిగింది. బెరెస్త్యాని గ్రామం దిశగా సరాసరి ముక్కుసూటిగా వెళ్తున్న హైరోడ్డుమీదనుండి సాగిపో తున్న మా అగ్రగామి దళం మెషీన్‌గన్ను, రైఫిల్ కాల్పులను అకస్మాత్తుగా ఎదు ర్కొనవలసివచ్చింది. రోడ్డుకి ఓ నూరు మీటర్ల దూరాన వున్న అడవిలో శత్రు సైన్యం దండువిడిసి వుంది, శత్రుదళం ఒకటి రోడ్డుపక్కనే మాటుదాగి వుంది.

ఈ సారి బందిపోటుదొంగలు మొండిగా ప్రతిఘటించారు. యుద్ధం రెండున్నర గంటలపాటు సాగింది. మేం అతికష్టంమీద దారిచేసుకోగల్గాం. చిట్ట చివరకు వాళ్ళకేత "త్రిశూలం" ఎత్తించామే అనుకోండి: చచ్చినవాళ్ళు రోడ్డుమీద పడివుండగా కతమవాళ్ళు తైతీలుగా పట్టుబడిపోయారు.

బందిపోటుదొంగలనుండి విజయచిహ్నాలుగా ఆయుధాలే కాకుండా, ఈసారి ఓ ఇరవై పందులను కూడా పట్టుకున్నాం. ఇది నిజంగా మా అదృష్టమే, ఏమంటే ఐదురోజులై కాలినడకను మార్చిచేసుకుంటూ వెళ్తున్నామేమో, ఆ ఐదు రోజుల్లోనూ మేం తిండి మొగం ఎరగం. మా విజయచిహ్నాలలో ఫీల్డ్‌కిచెన్ వంటిది ఒకటి వుండడం చూసి అందరం గొప్పగా సంబరపడ్డాం. ఇన్నాళ్ళకి మాకు రుచికరమూ, రసవంతమైన భోజనం దొరికింది.

మా యూనిట్లలో ఒక యూనిట్టుకి నాయకుడైన నికొలాయ్ ఫదేయవ్ ఈ పోరాటంలో గాయపడ్డాడు అతనికి సరాసరి మోకాలి దిగువన బుల్లెట్టు తగిలి, కాలి ఎముక పెట్లిపోయింది.

మేం గమ్యస్థానం చేరుకున్న తరువాత అతని గాయాన్ని పరీక్షచేసి చూడగా, మాంసంకుళ్ళి దుర్గంధం వెదలడం మొదలైనట్టుజయటపడింది.

"వెంటనే ఆపరేషను చెయ్యాలి, లేకుంటే చచ్చిపోతాడు" అన్నాడు డాక్టర్ త్సెస్సార్‌స్కియ్.

ఈ సారి కూడా మేం అడవిలో క్యాంపు పెట్టుకోవలసి వచ్చింది. అది మహారణ్యం. మేమింకా గుడిసెలు, గుడారాలూ ఏవీ వేసుకోలేదు, మరి ఆపరేషను చేయడానికి నాలుగు వైపులా మూసి, పైకప్పువున్నగదివంటిస్థలమూ,మంచివెలుగూ, అసలైన శస్త్రచికిత్స పరికరాలూ అవసరమాయె. ఇవన్నీ కూడా మాకు కొరవడ్డాయి. పరికరాలనూ మందులనూ, త్సెస్సార్‌స్కియ్ పాతక్యాంపులో వుంచేసి, ప్రథమ చికిత్సకిఅవసరమైన వాటినే తనతోతీసుకువచ్చాడు.

"మరి, ఏం చేయదల్చుకున్నారు?" అని అడిగాను త్సెస్సార్‌స్కియ్‌ని.

"మీరు అనుమతించితే మామూలు రంపంతో అవయవచ్ఛేదంచేసి కాలు తీసేస్తాను" అన్నాడు త్సెస్సార్‌స్కియ్

"అయ్ బాబోయ్! మామూలు రంపంతోనా! సాధ్యమే?"

"సాధ్యమే. కాని గొప్ప ప్రమాదావకాశం మాత్రం వుంటుంది మరి, సహజంగానే. కాని వీలైనంత వరకు ముందుజాగ్రత్తలన్నీ తీసుకుంటాననుకోండి. కాలు తీసేయకపోతే మనిషి చచ్చిపోతాడు."

సరే అని ఒప్పుకున్నాను.

ఈ సారి మేం ఎదుర్కోవలసినది యుద్ధక్రియ కాదు, శస్త్రక్రియ– అందునా అతి అసాధారణమైన శస్త్రక్రియ. అప్పుడనుకున్నాను: "ఓహో, కున్నె

తోన్నవూ, ఇతర స్కౌట్లూ రోవ్నోనుంచి క్యాంపుకి వచ్చినప్పుడల్లా శస్త్రపరికరాలూ, మందులూ తనకి తీసుకొచ్చి ఇమ్మనమని వాళ్ళను త్సెస్సార్‌స్కియ్ ఊరకనే వేధించలేదు."

ఆపరేషనుకి జరుగుతూన్న సన్నాహాలు చూచినప్పుడు నా మనసు రకరకాలుగా తలపోసింది, పరిపరివిధాల ఆందోళన పడింది. ఒక యువక కామ్రేడ్ ప్రాణం నిలవడం పోవడం తెలవెంద్రుక వాసిలో వుంది: కోల్యా ఫదేయెవ్ ఇంకా చిన్నవాడు, అతనికి ఇరవైవొక్కయేడు.

ఇటు నేనింత గాభరాపడుతూండగా, అటు మా సర్జను మాత్రం—అతనికి మనసులో ఎలా వుందో గాని, పైకి అతి ప్రశాంతంగా వున్నాడు. నా గుర్రపువాణ్ణి అతడు పిలిచి తన చేతిలో వున్న మామూలు రంపం చూపించి:

"ఇదిగో ప్యోత్ర్! ఈ రంపానికి వున్న పళ్లు పెద్దవైపోయాయి. వాటిని ఆకురాయితో కోసేసి, సన్నని పళ్లు పెట్టాలి" అన్నాడు.

రంపానికి వుండవలసిన పళ్లు ఏ సైజులో వుండాలో అతడు ప్యోత్ర్‌కి వివరంగా బోధపరచి చెప్పాడు.

మరో రెండు గంటల్లో సన్నని పళ్లున్న రంపం తయారైంది. ఆరంపాన్ని త్సెస్సార్‌స్కియ్ ఆల్కహాలుతో తుడిచి, అగ్నిజ్వాలపై వుంచి, మళ్ళీఆల్కహాలుతో తుడిచి, ఆ విధంగా డిస్‌ఇన్‌ఫెక్టుచేశాడు. ఈలోపుగా వైద్యసిబ్బంది, తగినంత వెల్తురు వుండేందుకని పైకప్పులేని ఒక మాదిరి గుడిసెను దేవదారు కొమ్మలతో కట్టడమూ, శస్త్ర పరికరాలను నీటిలో మరిగించడమూ, బేండేజీలు తయారు చేయడమూ మొదలైన కడమ సన్నాహాలు పూర్తిచేసింది. ఆపరేషన్‌కి ఇంకా ఇరవై నిముషాలు వుండగా, నాతో మాట్లాడేందుకని నన్ను తన దగ్గరకు రమ్మనమని కోరుతూ ఫదేయెవ్ కబురుచేశాడు. నేను వెళ్ళాను. కొద్దిరోజుల క్రితం మంచి బలంగానూ సరదాగానూ వున్న కుర్రవాడు, పచ్చగడ్డి నేలపైన పడుకుని వున్నాడేమో, మనిషి నీరసంగా ఎండియున్నాడు, ముఖం పాలిపోయి పచ్చబడిపోయింది.

"కామ్రేడ్ కమాండర్! అంతా సవ్యంగానే జరిగిపోయే పక్షంలో, పార్టీ క్యాండిడేటు సభ్యత్వంకోసం నన్ను సిఫార్సు చేయమని మిమ్మల్ని కోరుతున్నాను." అన్నాడు ఫదేయెవ్.

అతని కోరిక విని నా కళ్లు చెమ్మగిల్లాయి.

"తప్పకుండా సిఫార్సు చేస్తాను. నువ్వు నిజంగా భేషైన కుర్రాడివి

కోల్యా! ఆపరేషన్ గురించి నువ్వేమీ భయపడకు. మన డాక్టరు చేయి మంచిది. ఆయన చేతిలో అంతా సవ్యంగా జరిగిపోతుంది" అన్నాను.

అవయవచ్ఛేదానికి ఎటువంటి రంపం ఉపయోగించబడనున్నదీ, మేము ఎంత చిత్త క్షోభ అనుభవించుతూన్నదీ ఫదేయెవ్ సహజంగానే ఏమీ ఎరగడు. అతడు ఎరగకపోయినప్పటికీ, ఆ ఆపరేషను ఇటువంటి పరిస్థితులలో ప్రమాదభరిత మైనదనే సంగతి మాత్రం అతడు ఎరుగును.

త్సెస్సార్స్కీయ్, అతని అసిస్టెంటూ తప్ప కడమ అందరమూ "ఆపరేషన్ థియేటర్"లో నుంచి బయటికి వచ్చేశాం.

మరికొద్ది క్షణాలలో మాకు వినబడ్డాయి... బిగ్గరగా వస్తూన్న తిట్లు. ఎవ్వరి నోటనుండీ తిట్టుమాటలు రాకూడదనేది మా డిటాచ్‌మెంటులో కఠినమైన నిబంధన. తిట్టుమాటలు సోవియట్ గెరిల్లాకి తగవని మా గెరిల్లా సైనికులందరూ భావించారు. కాని మత్తుమందు ప్రభావం కింద వున్న కోల్యా నోటికి ఇక ఏ అడ్డమూ లేకపోయింది.

"కడుపులో వున్న తిట్లన్నీ కక్కేస్తున్నాడీ మనిషి. ఇతడికి ఏ శిక్షా వుండదు!" అన్నాడు, నా పక్కనుంచున్న లుకీన్, తన ఆందోళనను ఏదో ఒక విధంగా కప్పిపుచ్చేందుకని.

ఆపరేషను గంటకు పైగా తీసుకుంది.

త్సెస్సార్స్కీయ్ దగ్గర క్లోరోఫారం దండిగా వుండటం ఎంతైనా మంచిదైంది, ఏమంటే ఆరుబైట గాలిలో క్లోరోఫారం త్వరగా ఇగిరిపోతుంది.

ఆపరేషన్ పూర్తిచేసేసి త్సెస్సార్స్కీయ్ నా దగ్గరకు వచ్చాడు. అతడి ముఖం పాలిపోయుంది, మనిషి బెంగపడియున్నాడు, నుదుట అంతా చెమటబొట్లు.

"ఇంకా ప్రమాదావస్థలోనే వున్నాడనుకోండి, కాని బతుకుతాడని నాకు ఆశవుంది" అన్నాడతడు.

అతడి ఆశ అడియాస కాలేదు. మరుసటినాటికల్లా టెంపరేచరు తగ్గిపోయింది. ఇక తదుపరి యావత్తూ అగ్రశ్రేణి ఆస్పత్రులలో జరిగిపోయేటట్టే అంత సవ్యంగానూ జరిగిపోయింది.

కొద్దిరోజులు పోయిన తర్వాత, నన్ను తన దగ్గరకు రావలసిందని నికొలాయ్ కోరాడు.

"కామ్రేడ్ కమాండర్! ఆపరేషను జరుగుతూండినప్పుడు నా నోటివెంట

టిట్లు వచ్చిన సంగతి నిజమేనాండి? లేకపోతే, కామ్రేడ్లు నన్ను పూరకనే హాస్యాలాడుతున్నారాండి?" అని నికొలాయ్ అడిగాడు.

నేను చిరునవ్వు నవ్వాను.

"అయితే, నిజమేనన్నమాట. నన్ను క్షమించండి!"

"దానికేమిటోయ్, కోల్యా! ఈసారి నీ క్షమాపణ అంగీకరిస్తాములే!" అన్నాను.

"ధన్యవాదాలు, కామ్రేడ్ కమాండర్!... మిమ్మల్ని మరొక ప్రశ్న అడగాలని వుందండి: మొండికాలు మనిషిని, నేనిహ ఎందుకు పనికొస్తాను? యుద్ధ శ్రేణినుండి వెనుక ప్రాంతానికి వెళ్లిపోవడం నాకు సుతరామూ ఇష్టంలేదు" అన్నాడు నికొలాయ్.

"దాని గురించి ఇప్పుడు తొందరేమొచ్చిందిలే! నాల్గురోజులు పోయాక ఆలోచిద్దాం. కొందరికంటె నువ్వే బాగా పనికొస్తావు" అన్నాను.

"అలా అన్నందుకు అనేక ధన్యవాదాలు!"

ఫదేయెవ్ పూర్తి ఆరోగ్యం కోలుకున్న తరువాత, అతణ్ణి విధ్వంసకులను తర్ఫీదుచేసే గ్రూపుకి నాయకునిగా నియమించి, విధ్వంసక సామగ్రి అంతటికీ అజమాయిషీదారునిగా చేశాం. తన విధులను అతడు భేషుగ్గా నిర్వర్తించాడు. పార్టీ సభ్యత్వానికి అతణ్ణి సిఫార్సు చేశానని వేరే చెప్పనవసరం లేదనుకోండి.

నికొలాయ్ ఫదేయెవ్ దృష్టాంతం అద్వితీయమైనదేమీ కాదు. తమలోని ఉత్తమ, ఉదాత్త భావనలన్నీ బోల్షివిక్ పార్టీతో ముప్పేటముడిపడినట్టు గెరిల్లాలు భావించారు. మా డిటాచ్‌మెంటులోని కమ్యూనిస్టు ఆర్గనైజేషను యొక్క ప్రముఖ పాత్ర అమితంగా విలువకట్టడం కష్టసాధ్యమే అవుతుంది. మా డిటాచ్‌మెంటుకి మాస్కోనుండి పంపబడిన సైనికులలోనూ కమాండర్లలోనూ పదిహేనుమంది మాత్రమే పార్టీ సభ్యులు. డిటాచ్‌మెంటులో కొత్తగా చేరినవారిలో కూడా పార్టీ సభ్యులు బహు కొద్దిమందే. సభ్యత్వసంఖ్య దృష్ట్యా మా పార్టీ ఆర్గనైజేషను ఎంతో చిన్నదే అయినప్పటికీ, డిటాచ్‌మెంటులో అపారమైన అధికార గౌరవాలను అది సంపాదించుకుంది. ఇందుకు కారణం, నిత్యజీవితంలోనూ, యుద్ధంలోనూ పార్టీ సభ్యుల ప్రవర్తన నిష్కళంకంగా వుండడమే అని చెప్పాలి. డిటాచ్‌మెంటులో వున్న ప్రతి వొక్క పార్టీ సభ్యుణ్ణీ గెరిల్లాలు: "ఆదర్శపాత్రుడైన బోల్షివిక్" అనేవారు.

యుద్ధాలతోనూ, మార్చిలతోనూ, బెంగలతోనూ, నిరంతర కష్టాలతోనూ నిండిన జీవితమే మనిషిలోని బోల్షెవిక్ గుణాలకు గీటురాయి. శత్రుశ్రేణులవెనుక వున్న ప్రాంతాల్లో మా క్రియాకలాపాలు ప్రారంభించబడినప్పటినుండి చాలామంది గెరిల్లాలు పార్టీ సభ్యత్వానికి దరఖాస్తులు పెట్టుకున్నారు అంటే, అందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. పార్టీ సభ్యత్వానికి పెట్టుకున్న దరఖాస్తులు పార్టీ నిబంధనావళిలో సూచించబడిన ప్రకారం వుండడం, మేమున్న పరిస్థితులలో వీలుపడలేదు. మా దగ్గర దరఖాస్తు ఫారాలు లేవు, రాతమూలంగా మేమెవ్వరినీ సిఫార్సు చేయలేదు. మొదట పార్టీ కార్యనిర్వాహక వర్గంలోనూ, తరువాత పార్టీసభ్యుల సమావేశంలోనూ మూజువాణిగానే సర్వమూ జరిగిపోయేది. కార్యదర్శి తరువాత ఎప్పుడో మాస్కో వెళ్ళినప్పుడు, కొత్త సభ్యుల దరఖాస్తులను అక్కడ రిజిష్టరు చేసేందుకూ, వారిని సభ్యులనుగా మా పార్టీ సమావేశం ఏ తేదీనైతే అంగీకరించిందో ఆ తేదీనుండి వారి సభ్యత్వకాలం ప్రారంభమైనట్టు రూఢీ పరచేందుకూ అతడు అత్యవసరమైన నోట్సును మాత్రం రాసుకునేవాడు.

తాము అసలైన బోల్షెవిక్‌లమని నిరూపించుకున్నవారిని మాత్రమే సభ్యులనుగా మేం అంగీకరించాం. డాక్టర్ త్సెసార్‌స్కీయ్, కొమ్‌సొమోల్ ఆర్గనైజేషను కార్యదర్శి వలెన్‌తీన్ సెమ్యోనొవ్, దార్‌జేక్ అబ్రియీమొవ్, ఇంకా మరి కొందరినీ సభ్యులుగా మేం మొట్టమొదట అంగీకరించాం. మా మనుషులలో ఉత్తములైనవారు చేరుతుండడం వల్ల మా డిటాచ్‌మెంటులోని పార్టీ ఆర్గనైజేషను దినదిన ప్రవర్ధమానమైంది.

## సహాయకులు

మా స్థావరాన్ని త్సూమన్‌స్కీయె అడవులలోకి మార్చుకోవడం కారణంగా మా దృష్టి కొద్దిరోజులపాటు రోవ్నోనుండి మరలింది. కానివృధాపోయిన కాలాన్ని కూడదీసుకుందుకు ఇప్పుడు నిశ్చయించుకున్నాం. రోవ్నో నగరానికి అతి దగ్గర, అతి ప్రశాంతమూ అయిన తోవలు ఏవేవో మా స్కౌట్లు కనిపెట్టిన తర్వాత ఇదివరకు రోవ్నోలో వుండి వచ్చినవారినే కాకుండా, ఆ వూరు బాగా ఎరిగిన మరొక పదిమందిని కూడా ఏప్రిల్ మొదటి వారంలో అక్కడకు పంపించాం. నికొలాయ్ స్త్రుతిన్‌స్కీయ్ రోవ్నో వెళ్ళలేదు. లూత్స్క నగరంలో మార్ఫ స్త్రుతిన్‌స్కాయ మాకు ఏయే మనుషులతోనైతే సంబంధం నెలకొల్పిందో, వారి సహాయంతో ఆ వూరిలో ఒక స్కౌటు గ్రూపును ఆర్గనైజు చేయడమనే కర్తవ్యాన్ని నికొలాయ్‌కి, జోర్జ్‌కి, యాద్యకి ఒప్పగించి ముగ్గురినీ లూత్స్క పంపించాం.

మా కొత్త క్యాంపుకి వెనుకటిదానికంటెనూ ఇంకా అనువైన జాగా కుదిరింది. ఇప్పుడు రోవ్నోకి ఇంచుమించు సగం దూరం కలిసివచ్చింది, దారికూడా నయంగా వుంది. మునుపు మా స్కౌట్లు రోవ్నో వెళ్ళాలంటే రెండు నదులు దాట వలసి వచ్చేది, ఇప్పుడు ఒక్కటే, అదైనా సన్నని పిల్లయేరు. దీనిపైన అక్కడ ఒక చిన్న రాతికట్ట కూడా అడ్డుగా వుంది. ఆ కట్టపైన నడిచి యేరు దాటేయవచ్చు. రోవ్నోకి సగం దారిలో మేం ఒక కొత్త చౌకి ఏర్పాటుచేశాం. వెనుకటి చౌకిలవలె కాకుండా, ఈ చౌకిని గూడెంలో ఏర్పాటుచేయడం మానివేసి, రోవ్నో – లూత్స్క హైరోడ్డుకి అరకిలోమీటరు దూరాన సరాసరి అడవిలోనే ఏర్పాటుచేశాం. అందు కని ఈ చౌకికి "పర్ణశాల" అని పేరుపెట్టాం.

పశ్చిమ ఉక్రైనియాలో ఏప్రిల్ ఎంతో చక్కని మాసం. మంచుకాదు కదా, మంచు జాడ అయినా ఎక్కడా వుండదు. అక్కడక్కడ గడ్డి మొలకెత్తుతూ వుంటుంది. చెట్లు మొగ్గలు తొడిగి కొద్దికొద్దిగా చిగుర్చుతూ వుంటాయి. రాత్రిపూట ఇంకా చలిగానూ, చెమ్మగానూ ఉంటుంది–అందునా ముఖ్యంగా అడవిలో. ఈ కారణంచేత "పర్ణశాల"లో ఏప్రిల్‌నెల గడపమంటే ఇంద్రభోగం అనుభవించడం కాదు. రాత్రిపూట చలికి స్కౌట్లు గడ్డకట్టుకుపోయేవారు. చెమ్మవోడుతున్న నేల పైన పడుకునేవారేమో – చలికి కన్నుమూత పడేదిగాదు. చలికాచుకుందుకు ఏ అవకాశము వుండేదికాదు. నెగడి వేసుకుంటే, తమ ఆచూకిని తమంతట తామే బైట పెట్టుకోవడమవుతుంది.

"పర్ణశాల"తో పాటు, "ఆకుపచ్చని టపాపెట్టెల"ను కూడా ఏర్పాటు చేశాం. రోవ్నోకు వెళ్ళే ప్రతి స్కౌటుకి చౌకికి సమీపంలో వున్న ఒక్కొక్క "టపాపెట్టె"–ఫలానా చెట్టు తొర్ర, లేదా చెట్టుకొట్టివేయగా మిగిలిన మొదలులోని బోలు, లేదా గుండ్రాయి కిందవున్న బొరియ చూపెట్టేవారం. ఈరహస్యస్థలాలలో స్కౌట్లు తమ తమ రిపోర్టులను పడవేసేవారు. క్యాంపునుండి ఆయా స్కౌట్లకు పంపిన సందేశాలు కూడా అక్కడే వుండేవి.

ఈ "ఆకుపచ్చని టపాపెట్టెలు" వుండే స్థలాల సంగతి అతిరహస్యంగా వుంచేవారం. –మా వార్తా సంబంధాలకు ఇవే కేంద్రాలు. చౌకినుండి వుత్తరాలను తీసుకువెళ్ళి ఈ "పోస్టు"కు అందించి, ఈ "పోస్టు" నుండి వుత్తరాలను పోగుచేసి "పర్ణశాల"కు బట్వాడాచేసేందుకూ, "పోస్టుపెట్టెల"దగ్గర గస్తీ తిరిగేందుకూ మా స్కౌట్లలో అతి అనుభవజ్ఞులూ, అతి జాగరూకులూ అయినవారిని నియమించాం. వీరికి నాయకుడు వలెన్‌తీన్ సెమ్యోనొవ్.

ఈ రోజుల్లో చిట్టి కోల్యా పెద్దవాళ్ళతో కలిసి వారితో సమానంగా పని చేస్తూండేవాడు. మాకూ కుజ్నెత్సోవ్‌కి మధ్య హర్కారాగా అతణ్ణి నియమించాం.

మరీన కిహ్ మా డిటాచ్‌మెంటులో చేరిన కొద్దిరోజులకి, అదేమిటో మరి, చిట్టికోల్యాకి ఆమె దగ్గర బాగా చనువు కుదిరిపోయింది. ఆమె కూడా ఆ కుర్రవాడి మీద ఆపేక్షపడి, వాడి సంరక్షణ గురించి తాపత్రయపడుతూ, వాడి బట్టలు ఉతికి, వాడి దుస్తులకు రఫ్‌తీసి, మాస్కో గురించి, మాస్కో మెట్రో గురించి, స్కూలు గురించీ కబుర్లు చెప్పి, తన తీరికవేళలో చాలాసేపు వాడితోనే గడిపేది.

చిట్టి కోల్యా కుజ్నెత్సోవ్ హర్కారాగా పనిచేయడం మొదలుపెట్టినప్పుడు ఆ కుర్రవాడి కోసం మరీన రెండు సూట్లు కుట్టింది. ఒకటి: మామూలుగా పల్లెటూరి వాళ్ళు వేసుకునే చేనేత నారగుడ్డతో తయారుచేసిన లాల్చీ, పొడుగు పంట్లామూ. ఈ సూటుకి జతగా, మా నారజోళ్ళ ప్రవీణుడు కొరొత్యోవ్ ఓ జత చిన్నసైజు నార జోళ్ళు తయారుచేశాడు. రెండోసూటు: పట్నంలో వేసుకుందుకు నిక్కరూ, టెన్నిస్‌కాలరు షర్టూ, అందుకు నప్పేజోళ్ళ జత.

రోవ్నొ సమీపాన అడవిలో కోల్యా తన దుస్తులు మార్చుకునేవాడు. రోవ్నొ వెళ్ళాల్సివుంటే, తన పల్లెటూరి గుడ్డలు ఒక స్థలంలో దాచేసి, పట్నవాసపు సూటు తొడుక్కొని బయల్దేరేవాడు. "పర్ణశాల"కి వెళ్ళాల్సివచ్చినప్పుడు లాల్చీ, పొడుగు పంట్లామూ తొడుక్కునేవాడు.

కోల్యా తొలిసారి చౌకీనుండి రోవ్నొకి బయల్దేరినప్పుడు, ఆ కుర్రవాడు తిరిగి వచ్చేవరకూ వలెన్‌తీన్ సెమ్యోనొవ్ ఎంతో ఆదుర్దాపడుతూ కాచుకుని కూర్చున్నాడు. కుజ్నెత్సోవ్ ఇచ్చిన టపా ప్యాకెట్టును పట్టుకుని కుర్రవాడు సురక్షితంగా చౌకీ చేరుకున్నాడు.

"ఇప్పుడు చెప్పు ఏమిటి జరిగిందో. నిన్నెవరైనా దారిలో ఆపారా?" అని అడిగాడు సెమ్యోనొవ్.

"ఆపారు. ఆపి అడిగేసరికి, మీరు నేర్పిన పాఠమే అప్పజెప్పాను: నాన్నా అమ్మా చచ్చిపోయారనీ, ముష్టి అడుక్కుంటూ బతుకుతున్నాననీ వాళ్ళతో చెప్పాను. ఓ సౌఖ్యమైన రోజున మాత్రం..."

"అనగా ఎప్పుడు?" అని సెమ్యోనొవ్ మందహాసంచేస్తూ అడిగాడు.

"ఓ సౌఖ్యమైన రోజున" అని అనడం కోల్యాకి మహాసరదా. అతడు ఏ సంగతైనా చెప్పినప్పుడు, అది వెనుక ఏనాడో జరిగినదైనా సరే, నిన్న మొన్న

జరిగినదైనా సరే, "ఓ సౌఖ్యమైవరోజున" అని మొదలుపెట్టడం ఆ కుర్రవాడికి మామూలు.

"నిన్న పొద్దున్న, మీ దగ్గరనుంచి వెళ్ళిపోయినప్పుడు ఓ పల్లెటూరిలో నుంచి వెళ్తూండగా ముగ్గురు పోలీసులు నన్ను ఆపి: 'ఎక్కడికెళ్తున్నావురా?' అని అడిగారు. వెంటనే నేను ఏడుపు మొగంపెట్టి: 'ఎక్కడికీ లేదండి, బాబూ! మా అమ్మని చూడ్డానికి వెళ్తున్నానండి, మా అమ్మ ఆస్పత్రిలో వుందండి, బాబూ' అన్నాను. వాళ్ళు నన్ను ఏమీ అనలేదు, వెళ్ళనిచ్చారు. నేను ఏడ్చాను, కానినిజంగా నాకు ఓ పిసరైనా భయంవేయలేదు."

కుజ్నెత్సోవ్‌కి రోవ్నాలో మరొకరి సహాయం కూడా దొరికింది-వాల్యా దొవ్గేర్ సహాయం.

మార్చి మొదటి రోజుల్లో వాల్యా తండ్రి – కొన్‌స్తన్‌తీన్ దొవ్గేర్ – మరి మాకు దక్కలేదు. అతడూ, పెత్రోవ్‌స్కియ్ అనే స్థానికవాసి మరొకడూ మేం ఒప్పజెప్పిన పనిమీద సార్ని స్టేషనుకి వెళ్తూండగా, బందిపోటుదొంగలు వాళ్ళిద్దరినీ పట్టుకుని, గెరిల్లాలగురించి భోగట్టా చెప్పవలసిందని చితకబాదారు.

వారిద్దరూ నోరు మెదపకపోయేసరికి, ఆ ద్రోహులు ముళ్ళతీగెతో వారి చేతులు కలియగట్టేసి, గడ్డకట్టిపోయున్న నదిదగ్గరకు తీసుకెళ్ళారు. ఒకచోట మంచు కన్నం పడివుండడం చూసి, ఆ ద్రోహులు దొవ్గేర్‌నీ, పెత్రోవ్‌స్కియ్‌నీ అక్కడకు లాక్కుపోయి, ఆ కన్నంలోకి తోసివేయబోతూండగా, పెత్రోవ్‌స్కియ్: "నన్ను తుపాకితో కాల్చిచంపేయడం నయం!" అని అరుస్తూ పరుగెత్తసాగాడు. పరుగెత్తి పారిపోతూన్న మనిషివెంట బందిపోటుదొంగలు తుపాకులు కాల్చారు. కాని రాత్రి చీకటిగా వుండడంచేత, ఆ చీకట్లో పెత్రోవ్‌స్కియ్ తప్పించుకు పారిపోయి, క్యాంపు చేరుకోగల్గాడు. కొన్‌స్తన్‌తీన్ దొవ్గేర్ ఎలా మరణించినదీ పెత్రోవ్‌స్కియ్‌వల్ల మాకు తెలిసింది.

చిత్రహింస అనుభవించిన మా కామ్రేడ్ మృతకాయం మాకు ఎంతోసేపు వెతికిన తరవాత దొరికింది. ఆ మృతకాయాన్ని గెరిల్లా గౌరవచిహ్నాలతో సమాధి చేశాం.

తండ్రి ఉత్తరక్రియల తరవాత వాల్యా మా డిటాచ్‌మెంటుకి వచ్చేసింది. ఆమె నాతో:

"నాన్న స్థానంలో అమ్మా, నేనూ పనిచేస్తాం" అంది

ఆమెను కజ్నెత్సోవ్‌తో పరిచయంచేశాను. ఆమెతో అతడు తొలిసారి మాట్లాడిన తరువాత, ఆమె రోవ్నోలో నివసించితేనే తనకు ఆమె గొప్ప సహాయం చేయగల్గుతుందని అతడు నాతో చెప్పాడు. అతడు చెప్పినట్టే మేం ఏర్పాటుచేశాం. వాల్యా రోవ్నో వెళ్ళటానికోసం వెతకసాగింది. ఏప్రిల్ నెలలో ఆమె ఆ వూళ్లో ఉద్యోగం సంపాదించుకుని, ఆవూళ్లో నివసించేందుకు అనుమతిపత్రం కూడా సంపాదించుకో గల్గింది. ఆరోజుల్లో ఈ అనుమతిపత్రాలను మంజూరుచేసే అధికారం కేవలం గెస్టాపో చేతిలోనే వుండడంచేత, ఆపత్రం సంపాదించడం ఒకంతట సాధ్యమయ్యేదికాదు. వాల్యా స్నేహితురాలు ఒకామె వాల్యాను లియోమెత్కో అనే గెస్టాపో మనిషితో పరిచయం చేసింది. ఉక్రైనియా రాష్ట్రపు పోలీసు కమీషనర్ ప్రైవేటు దుబాసి ఇతగాడు. ఇతడితో వాల్యా తన తండ్రి జర్మన్లతో సహకరించాడనీ, అందుకని అతణ్ణి గెరిల్లాలు చంపేశారనీ చెప్పగా, వాల్యా చెప్పిన కథను అతడు నమ్మేశాడు. ఇతగాడు నమ్మడమే కాకుండా, ఆమె చెప్పినది యదార్థమని రూఢిచేస్తూన్న ఒక డాక్యుమెంటును కూడా ఆమెకు మంజూరుచేయించాడు. ఇతగాడి సాయంతో ఆమె ఆ వూళ్ళో నివసించేందుకు అనుమతి పత్రమూ, షాపు అసిస్టెంటుగా ఉద్యోగమూ సంపాదించింది.

వేరే కేటాయింపుగా వీధితలుపు వుండి, సదుపాయమైన ఒక గది అద్దెకు తీసుకుని, వాల్యా తన తల్లినీ, చెల్లెళ్ళనీ తనదగ్గరకు తీసుకువచ్చేసింది.

ఆమె అక్కడ స్థిరపడిన తరువాత, తన "ఫియాన్సి" అయిన పౌల్ సీబెర్ట్ అనే జర్మన్ ఆఫీసరుని మెత్కోకి పరిచయం చేసింది. జర్మన్ ఆఫీసరుగా ఈ మారువేషంతో నికొలాయ్ కజ్నెత్సోవ్ కొత్తకొత్తవారితో పరిచయం సంపాదించుకున్నాడు. అతడు మెత్కోద్వారా రైక్‌కమిస్సారియాట్‌లో పనిచేస్తూన్నవారినీ, గెస్టాపో మనుషులనూ కలుసుకుంటూండేవాడు.

ఓబెర్‌లోయ్‌ట్నాంట్* సీబెర్ట్ అందరికీ మంచి ఇష్టుడయ్యాడు. ఇతడు ఎల్లప్పుడూ హుషారుగానూ మంచి సరదాగానూ వుంటూ, తన హాస్యరసంతో అందరినీ నవ్వించుతూ, గొప్ప ఉదారంగలవాడై తన స్నేహితులను సంతోషపరచేందుకు జర్మన్ మార్కులను నీళ్ళలా ఖర్చుపెట్టేవాడు. ఈ జర్మన్ మార్కులు మా దగ్గర కోకొల్లలుగా వున్నాయి. అవి లారీలలో రవాణా అవుతూన్నప్పుడు, మేం జర్మన్లపై దాడిచేసి ఆ లారీలన్నిటినీ ఏకమొత్తంగా పట్టుకుని ఆ డబ్బు అంతటినీ వశపరచుకున్నాం. అతని తండ్రి తూర్పు ప్రష్యాలో గొప్ప భూస్వామి

---

* ఓబెర్‌లోయ్‌ట్నాంట్—జర్మన్ సైన్యంలో సీనియర్ లెఫ్టినెంట్,—సం.

అనీ, యుద్ధం అయిపోయినాక, బ్రహ్మాండమూ భాగ్యవంతమూ అయిన అతని ఎస్టేటుకు తాము అతిథులుగా వెళ్ళవచ్చుననీ అతని స్నేహితులు ఉబలాటపడు తూండేవారు. అతడు చెప్పినదంతా నిజమే అని అతని స్నేహితులు పూర్తిగా నమ్మారు.

ఆ వూళ్ళో స్థానికవాసుడైన యాన్ కమీన్‌స్కియ్‌తో కూడా కుజ్నె త్సోవ్ పరిచయం చేసుకున్నాడు. కమీన్‌స్కియ్ పోలెండ్ దేశస్థుడు, ఒక పోలిష్ అజ్ఞాతవాసపు ఆర్గనైజేషనులో సభ్యుడు, జర్మన్లకు వ్యతిరేకమైన ఏ కార్యకలాపం లోనైనా సరే క్రియాశీలంగా పనిచేయడానికి అతి తహతహపడుతూన్న వ్యక్తి. కుజ్నెత్సోవ్‌కి సహాయం చేసేందుకు ఇతడు తనంతట తానే ఇష్టపూర్వకంగా అంగీ కరించి, తన అంగీకారాన్ని లిఖితపూర్వకమైన ప్రమాణంతో ధ్రువపరిచాడు కూడా.

కుజ్నెత్సోవ్ నుండి మాకు ప్రతిదినమూ రిపోర్టు అందుతూండేది. ఆ రిపోర్టులలో ముఖ్యమైన సమాచారం ఎంతైనా వుండేది. ఉక్రెయినియాలో జర్మన్లు తీసుకుంటూన్న వివిధ చర్యలను గురించీ, జర్మన్ కమాండ్ వేస్తూన్న పథకాలను గురించీ ఈ రిపోర్టులవల్ల మాకు తెలుస్తూవుండేది. నాజీలకు వ్యతిరేకంగా యుద్ధం చేసేందుకు తయారుగావున్న సోవియట్ వ్యక్తుల పేర్లూ, చిరునామాలూ కుజ్నెత్సోవ్ మాకు రిపోర్టు చేస్తూండేవాడు. సోవియట్ యుద్ధశ్రేణికి వెనుకనున్న ప్రాంతాలలో విధ్వంస కార్యాలనూ, టెర్రరిస్టు క్రియలనూ జరిపేందుకుగాను గెస్టాపో అక్కడకు పంపదలచుకున్న రహస్యపు ఏజెంట్ల పేర్లూ, వారి వివరణలూ అతడు సంపాదించ గల్గాడు.

ఒకనాడు ఒక రెస్టారెంటులో పౌల్ సీబెర్ట్ ఒక జర్మన్ ఓబెర్ గెఫ్రెయిటర్*తో పరిచయం చేసుకున్నాడు. ఇతడి పేరు ష్మిట్. ఇతగాడు రైక్స్ కమిస్సార్ కోఖ్ అంగరక్షకదళానికి పోలీసు కుక్కల్ని తర్ఫీదు చేస్తూంటాడు. ఎర్రగా, ముఖం నిండా మచ్చలున్న ఈ ష్మిట్, నీటుకాడూ తెగువరీ అయిన ఆఫీసరు సీబెర్ట్ తన పరిచయం కోరుతూండడం చూసి మహా పొంగిపోయాడు.

"నాకు ఎంతో సంతోషంగా వుంది మీతో పరిచయం కల్గడం, ఎంతో సంతోషంగా వుందండీ!" అని, అతగాడు సీబెర్ట్ పలకరింపుకి జవాబు చెబుతూ, సీబెర్ట్‌తో హృదయ పూర్వకంగా కరచాలనం చేశాడు.

"మీ పరిచయం కల్గడం నాకూ ఎంతో సంతోషంగావుంది. కుక్కలంటే నేను చెవికోసుకుంటాను. వాటి తర్ఫీదు అంటే కూడా నాకు అమితమైన సరదా.

---

* ఓబెర్ గెఫ్రెయిటర్—జర్మన్ సైన్యంలో కార్పొరల్. —సం.

మా తండ్రిగారి ఎస్టేటులో నాకు ఎన్నో కుక్కలున్నాయి...మీకు తీరుబడిగా వున్నప్పుడు నన్ను చూడ్డానికి రండి తప్పకుండా!" అన్నాడు కుజ్నెత్సోవ్.

ష్మిట్టుకి కుజ్నెత్సోవ్ తన "అఫీషియల్ చిరునామా" ఇచ్చాడు ష్మిట్ ఏ ఆలస్యమూ చేయకుండా ఆ ఆహ్వానాన్ని అందుకుని మరికొద్దిరోజులకే ఓబెర్ లోయుట్నాంట్ పౌల్ సీబెర్ట్‌ని చూడ్డానికి వెళ్ళాడు. తాను వస్తానని చెప్పిననాటికి, ష్మిట్ ఓ పోలీసు కుక్కని తనతోకూడా వెంటబెట్టుకుని వచ్చాడు. ఈ కుక్కని అతడు కోక్ కోసం తర్ఫీదు చేస్తున్నాడు.

"ఇది ఎనిమిదో కుక్క. గావ్‌లైటర్ కోసం నేనప్పుడే ఏడు కుక్కల్ని తర్ఫీదుచేశాను. వాటన్నిటిలోనూ ఇదే ప్రశస్తమైనది. ఆర్యేతరుణ్ణి ఎవరినైనాసరే ఇది ఇట్టే పోల్చేసుకుంటుంది, ఆమడ దూరంలో వున్న గెరిల్లాని చప్పున పసి కట్టేస్తుంది. ఎస్ఎస్‌ల కుక్కల దొడ్డినుండి దీన్ని నేను ప్రత్యేకమూ ఎంచి తీసు కొచ్చాను." అన్నాడు ష్మిట్.

"నిజంగానే? అబ్బా, ఎంత తెలివైన కుక్కండీ!" అన్నాడు కుజ్నెత్సోవ్ ఆశ్చర్యపడుతూ, దానికి ఓ సాసేజి ముక్క గిరవాటువేసి.

"తెలివైనదని మెల్లగా అంటారేమిటి? అద్భుతమైన కుక్క కదండీ ఇదీ!" అన్నాడు ష్మిట్ బడాయికొట్టుతూ, తను తర్ఫీదుచేసిన జంతువుకేసి అతి అపేక్షతో చూశాడు. కుక్క సంతోషంతో తోక ఆడిస్తూ, కుజ్నెత్సోవ్‌వైపు కృతజ్ఞతతో చూసింది

ఇక కొద్దిరోజులకల్లా గఫ్రైటర్ ష్మిట్ పూర్తిగా కుజ్నెత్సోవ్ ప్రభావం కిందకి వచ్చేశాడు.

ష్మిట్‌కి సీబెర్ట్ "చేబదుళ్ళు" ఇస్తూండేవాడు. రెస్టారెంటులో బాగా మేపే వాడు, ష్మిట్ వెలిబుచ్చిన మొరలన్నీ శ్రద్ధగా విని, తన పూర్తి సానుభూతిని వెల్ల డించేవాడు.

"కొందరున్నారు లెండి, వాళ్ళు ఈ యుద్ధం ధర్మమా అంటూ, తమ జన్మలో ఖర్చుపెట్టలేనంత డబ్బు చేసుకుంటున్నారు. మరి, నా లాంటివాడేమో, ఎర్రని ఏగానైనా కళ్ళచూడకుండా, యుద్ధం అయిపోయేసరికి చిప్ప చేతబట్టుకుని, వెర్రిమీద కొంగేసుకుని ఇంటికి పోతాడు—ఏం చెప్పమంటారు!" అంటూ ష్మిట్ తన కడుపులో వున్న ఏడుపునంతా ఏడ్చేశాడు.

"మంచివాళ్ళ పని ఎప్పుడూ అంతే లెండి! అయినా, మీరు అలా విచా

రించకండి. యుద్ధం అయిపోయినాక, మా తండ్రిగారితో చెప్పి, మిమ్మల్ని మా ఎస్టేటులో మేనేజరుగా వేయిస్తాను, మీకు రోజులు హాయిగా వెళ్ళిపోతాయి. మీ గురించి మా తండ్రిగారి పేర ఇదిగో ఇప్పుడే వుత్తరం రాసేస్తా" అంటూ కజెన్లోస్ అతగాణ్ణి సంబాళించాడు.

ఇటు సీబెర్ట్ కూడా ష్మిట్‌పై తనకు పూర్తి నమ్మకం వున్నట్టు అతగాడికి తోచేటట్టుగా ప్రవర్తించాడు. అందుకని అతడు ష్మిట్‌ని తన "ఫియాన్సీ"కి—వాల్కీ డొవ్గేర్‌కి—పరిచయం చేశాడు.

"ఆమె ఎంతో మంచి అమ్మాయి సుమండీ!" అని కజెన్లోస్ ష్మిట్‌తో రహస్యంగా చెప్పాడు. "కాని ఆమెని ఏలినాటి శని పట్టుకు పీడించుతూందండీ! ఆమె తండ్రిని గెరిల్లాలు చంపేశారు. ఆమె జర్మన్ వంశావళి డాక్యుమెంట్లు ఆ బందిపోటు దొంగల చేతిలో పడ్డాయి. ఇక దానితో, తను జన్మతః జర్మన్ని అని నిరూపించు కుందుకు ఆమెకు ఏ ఆధారమూ లేదిప్పుడు, పాపం!"

"అయ్యయ్యో! ఎంత పనైందండీ!... అయితే ఏం లెండి, నా స్నేహితు లున్నారు. వాళ్ళు ప్రాయ్‌లైన్ వలెన్‌తీనకి సాయంచేస్తారు" అన్నాడు ష్మిట్.

"మీరు సాయం చేస్తిరా, మీకు ఆజన్మాంతమూ కృతజ్ఞులమనుకోండి!" అంటూ కజెన్లోస్ మనఃపూర్వకమైన సంతోషాన్ని వెలిబుచ్చాడు. "ఏమైనా ఖర్చుపెట్టవలసివస్తే, అందుకు మీరేమీ వెనకతీయకండి. ఇదిగో, ఎందుకైనా మంచిది, ఇది మీ దగ్గర వుంచండి!" అని కజెన్లోస్ ఐదువందల మార్కులు నోట్లుతీసి ష్మిట్‌కి ఇచ్చాడు.

కొద్దిరోజులు పోయాక వాల్కీకి, తను "ఫోల్క్స్‌దోయిచ్," వంశానికి చెందినట్టుగా రూఢిపరుచుతూన్న డాక్యుమెంటూ, అందుకు తగిన అసనపు రేషను కార్డులూ ఆమెకి అందాయి.

అంతా సరిగా ఏర్పాటై సర్వమూ సాఫీగా నడచిపోతుండగా, తను పోలీసుల ఎదుట హాజరుకావలసిందని వాల్కీకి తటాలున సమను వచ్చింది. తను జర్మనీకి వెళ్ళవలసివుందని ఆమెకు అక్కడ తెలియజేశారు. ఏమైనాసరే, ఆమెను జర్మనీకి పంపనీయకుండా వుండాలనీ, అంతగా అవసరమైతే ఏ నిమిషంలోనైనా ఆమెను డిటాచ్‌మెంటుకి తిరిగి పంపించివేయడానికి మేం నిర్ణయించుకున్నామనే అను కోండి. కాని ఆమెను డిటాచ్‌మెంటుకు పంపించివేస్తే మేం వేసుకున్న పథకాలన్నీ తలకిందులై పూరుకుంటాయి. అందుకని ఎలాగైనా సరే, ఆమెకు ఆ పూళ్ళో

ఖాయంగా నివసించేందుకు హక్కు కల్పుజేస్తూన్న అధికారపత్రాన్ని సంపాదించి ఆమెకు ఇవ్వడం అవసరమైంది. ఈ పని కూడా తాను చేసి పెడతానన్నాడు ష్మిట్.

"ఇటువంటి చిక్కు వ్యవహారాలు పరిష్కరించడానికి కేవలం రైక్స్ కమిస్సార్ కోఖ్‌కి మాత్రమే అధికారం వుంది. ప్రస్తుతం ఆయన బెర్లిన్‌లో వున్నాడు. కాని మే నెలలో తిరిగి రోవ్నొ వస్తాడు. ఫ్రాయ్‌లైన్ వలెన్‌తీన, మీరు ఒక దరఖాస్తు రాసి ఇవ్వండి. దాన్ని నేను తీసికెళ్ళి రైక్స్‌కమిస్సార్ అడ్జూటాంట్, కెప్టెన్ బాబాఖ్‌కు ఇస్తాను. ఇతడు ఈ విషయాన్ని గావ్‌లైటర్‌కి తెలియజేస్తాడు" అన్నాడు ష్మిట్.

వాల్యా దరఖాస్తు రాసి ష్మిట్‌కి ఇచ్చింది. "ఖర్చుల కోసం" వెయ్యి మార్కులు అతని చేతిలో పడ్డాయి.

"ఈ విషయం తేలేవరకు మిమ్మల్ని ఎవరూ ఏ బాధా పెట్టరులెండి, ఫ్రాయ్‌లైన్ వలెన్‌తీన!" అని ష్మిట్, బెంగతో సతమతమవుతూన్న వాల్యాతో ఖరారు చేశాడు.

ష్మిట్ వెళ్ళిపోయిన తరవాత, ఇక గుండె తేలికపడి నికొలాయ్ నిట్టూర్చాడు.

"మరేం ఫర్వాలేదు, ఈ సంగతి ఇక తేలిపోయినట్టే. కాని తేలవలసిన సంగతి ఇంకొకటి వుండిపోయింది. చిట్టి కోల్యా వున్నాడా ఇక్కడ?"

"వున్నాడు, కొంత సేపట్నుంచి ముంగిట్లోనే కూచున్నాడు."

"వాణ్ణి రమ్మను!"

కోల్యా ఇంతకుముందే ఆ యింటి దగ్గరకు వచ్చాడు, కాని ష్మిట్ వెళ్ళి పోయేవరకు అవతలే వున్నాడు.

"ఏం ? ఏ చిక్కూ లేకుండానే వచ్చేశావా ?" అని అడిగాడు కుజ్నెత్సోవ్.

"ఆహా ! అంతా సరిగానే జరిగిపోయింది." అన్నాడు కోల్యా ఉత్సాహంగా.

"నువ్వు కాస్సేపు విశ్రాంతి తీసుకుని, ఏదో ఇంత కడుపులో పడేసుకో. మళ్ళీ చౌకికి పరుగెత్తాల్సి వుంటుంది నువ్వు."

కోల్యా మంచి దిట్టమైనవాడూ, చురుకైనవాడే అయినప్పటికీ, చౌకికి వెళ్ళివచ్చే సరికి అలసిపోయేవాడు. రోవ్నొనుండి చౌకికి ఇరవైఐదు కిలోమీటర్లు

రానూపోనూ యాభై కిలోమీటర్లు ఒక్క రోజులో నడవటమంటే తమాషాకాదు. కోల్యా విశ్రాంతి తీసుకునే లోపున, కుజ్నెత్సోవ్ క్యాంపుకి రాయవలసిన రిపోర్టు రాశాడు, ఓ గంటతరువాత వాల్యా కోల్యాను నిద్రనుండి లేపింది. కుర్రాడు చిత్తుగా అలసిపోయున్నాడు. కాని తన బాధ్యతను తాను ఎరిగి, చప్పున లేచిపోయి, తన నిక్కరూ షర్టూ సవరించుకున్నాడు.

"మహా జాగ్రత్తసుమా : అతి ముఖ్యమైన ప్యాకెట్టును నీ చేతికి ఇస్తున్నాను. దీన్ని తక్షణమే కమాండరుకి పంపించవలసిందని నేను చెప్పినట్టు చౌకీలో మనవాళ్ళతో చెప్పు. జవాబు కోసం నువ్వు చౌకీలోనే వుండి, జవాబురాగానే, దాన్ని నువ్వే పట్టుకొని నా దగ్గరికి వచ్చేయి"

ఆ ప్యాకెట్టుని కోల్యా అందుకుని, దాన్ని తన రహస్యపు జేబులోదాచేసుకుని వెళ్ళిపోయాడు.

"అయ్యో, పాపం!" అంది వాల్యా, వెళ్ళిపోతున్న కోల్యాకేసి చూస్తూ. "అశం శుశం ఎరుగని పిల్లడు ! ఈ వయస్సులో ఇంకా తల్లి దగ్గరే వుండాల్సిన కుర్రాడు !"

"అవును, నిజమే. కోల్యా చిన్న పిల్లడే, అయినా ఎంత ముఖ్యమైన పనిచేస్తున్నాడో చూడు మరి!" అన్నాడు నికొలాయ్ సాలోచనగా.

ఈ సారి ఆ కుర్రవాడు చౌకీకి వెళ్తూ, దారిలో చిక్కులో పడ్డాడు. ఓ ఐదు కిలోమీటర్లు వెళ్ళిన తరువాత, కోల్యాకి తటాలున కేక వినబడింది : "ఆగు !" అని. కోల్యా వెనక్కి తిరిగి చూసేసరికి, ఇద్దరు నాజీ సైనికులు అగపడ్డారు. కోల్యా రోడ్డుమీద నడుస్తుండగా, అతడికి వాళ్ళు అగపడలేదు. వాళ్ళు బహుశ ఏ మాటుగాగా వెనుకో దాగుని వుండాలి. తాను ఏమి చెయ్యాల్సింది కోల్యా తక్షణం ఆలోచించుకున్నాడు. చప్పున పరుగెత్తి అడవిలోకి పారిపోయాడు జర్మన్లు తుపాకి కాల్పులు ఆరంభించారు. బుల్లెట్లు రైంయ్ రైంయ్‌మని దూసుకుపోయాయి. కాని కోల్యాపరుగెత్తి నట్టడవి చేరుకొని, అక్కడ తలదాచుకున్నాడు.

కుజ్నెత్సోవ్ ఇచ్చిన ప్యాకెట్టు చౌకీకి భద్రంగా చేరింది దానిని అక్కడ నుంచి నాకు అందజేశారు.

## బూటకపు యజమానులూ, అసలు యజమానులూ

చిట్టికోల్య తీసుకువచ్చిన వుత్తరం ఆసక్తిదాయకంగా వుంది. హిట్లరు జన్మదినోత్సవం జరిపేందుకు రోవ్నోలో సన్నాహాలు జరుగుతున్నాయనీ, ఫ్యూరెరో* గౌరవార్థం ఏప్రిల్ 20న పెరేడ్ ఏర్పాటైందనీ ఉక్నెత్సోవ్ రిపోర్టుచేశాడు.

"ఈ పెరేడ్‌ను నేను 'కమాండ్ చేసేందుకు' మీరు అనుమతి ఇప్పించవలసిందని కోరుతున్నాను." అని ఉక్నెత్సోవ్ రాశాడు. ఇటువంటి వుత్తరాలే రోవ్నోలో వున్న ఇతర స్కౌట్ల దగ్గరనుండి కూడా మరికొద్దిరోజుల తరువాత అందాయి. "ఈ వూరి చౌకలో నాజీ ఆక్రమణదార్ల మొనగాళ్ళపై పగసాధించు కుందుకు అనుమతి ఇప్పించవలసిందని కోరుతున్నాను" అని షెవ్‌చూక్ రాశాడు.

వీటన్నింటికి నేను ఒకే రకం జవాబు పంపించాను: ఎంతమాత్రమూ వీల్లేదు. ఇటువంటి పనులు మనం సాగించుతూన్న స్కౌటు కార్యకలాపాన్ని విచ్ఛిన్నం చేసివేస్తాయి. సమయం వస్తుంది అప్పుడు హంతకులతో మనం లెక్కలు తేల్చుకుని తీరుతాం. పెరేడ్‌ను చూడ్డానికి వచ్చే ప్రేక్షక జనంలో మీరు కూడా వుండేందుకు నేను అనుమతి ఇస్తున్నాను. ఒకవేళ ప్రేక్షకులలో ఎవరైనా ఏ కార్యానికైనా పూనుకున్నట్టయితే, వారికి సాయుధ సహాయం చేయండి."

హిట్లరు జన్మదినోత్సవానికి జరుగుతూన్న సన్నాహాలు నాజీల నిజ స్వభావాన్ని సరిగా ప్రతిబింబించాయి. ఎస్‌ఎస్ మనుషులూ, మిలిటరీ పోలీసులూ గ్రామాలమీదపడి, ఆహారపదార్థాలనూ, తమ చేతికిదొరికిన వస్తువులన్నింటినీ లూటీ చేశారు. ఈ లూటీ సామానులు "పకేట్ ఔక్సియోన్" ఉద్యమం తాలూకు ప్రత్యేక కార్యాలయాలకు తరలించబడ్డాయి. ఈ "ప్రొక్యూర్‌మెంటు" కార్యం యావత్తూ కోఖ్ ప్రతినిధి జనరల్ క్నూట్ నడిపిస్తున్నాడు.

"పకేట్ ఔక్సియోన్" కార్యాలయాలవద్ద ఈ లూటీ సరుకు అంతా ఏ రకానికి ఆ రకం కేటాయించబడి, "ఫ్యూరెర్‌నుండి కానుకలు" అనే పేరుతో పది, పదిహేను కిలోగ్రాములు బరువుగల పార్సెల్సుకింద ఏర్పాటుచేయబడ్డాయి. ఈ పార్సెల్సులో ఒక్కొక్కటినీ అందమైన కాగితంలో చుట్టి చక్కని ప్యాకెట్టుగా తయారుచేసి వాటన్నిటినీ రోవ్నోలో వున్న జర్మన్లకీ, జర్మన్ యుద్ధ్రశేణికి, జర్మనీకి పంపించారు.

---

* ఫ్యూరెర్ అంటే "నాయకుడు," ఫాసిస్టు జర్మనీలో హిట్లర్‌ని ఈ పేరుతో పిలిచేవారు. —సం.

"ఫ్యూరెర్‌నుండి వచ్చిన" ఈ కానుకలు ఎంత ఖరీదయ్యాయో మా గెరిల్లాలూ, ముఖ్యంగా రోవ్నో ప్రజలూ ఎరుగుదురు. ఈ "కానుకలు" ఎలా సేకరించబడినవో, నెత్తురూ కన్నీటి రూపంలో ఎంతటి మూల్యాన్ని ప్రజలు చెల్లించవలసి వచ్చిందో వారికి తెలుసు.

పాత క్యాంపునుండి నూరుమంది గెరిల్లాలను తీసుకుని నా దగ్గరకు రావలసినదిగా స్త్రెహోవ్‌కి ఏప్రిల్ మధ్యలో ఆర్డరు పంపించాను. అతడు వచ్చి, ఈ "కానుకల" సేకరణ తతంగాన్ని జర్మన్లు సార్ని జిల్లాలో ఎలా జరిపినదీ చెప్పాడు.

జర్మన్ స్పెషల్ పటాలాలు జరిపిన చర్యలను గురించి మేం మా కొత్త క్యాంపుకి వస్తూండగా తోవలో మా కందిన సమాచారం సర్వమూ యథార్థమే. మార్చి 20న జర్మన్ స్పెషల్ పటాలపు సైనికులు మా గెరిల్లాల ఆధీనంలో ఉన్న గ్రామాలూ; గూడేలపైన – అందులోనూ ముఖ్యంగా రూద్న్య – బొబ్రోవ్‌స్కాయ గ్రామంపై–మిడుతల దండులా వచ్చి పడ్డారు. కాని గెరిల్లాలు మాత్రం వారికి దొరకలేదనుకోండి. వారు అక్కడకు వచ్చేలోపునే స్త్రెహోవ్ తన డిటాచ్‌మెంటుని తీసుకుని అక్కడనుంచి వెళ్ళిపోగల్గాడు. డిటాచ్‌మెంటుతోపాటు, గ్రామస్థులలో సగంమందికి పైగా అడవిలోకి వెళ్ళిపోయి దాగున్నారు. గ్రామంలో ఉండిపోయినవారు యమయాతన అనుభవించాల్సి వచ్చింది. నాజీలు గ్రామంలో ప్రవేశించి, గొడ్డు గోదల్ని తోలుకుపోయారు దొరికిన సామాన్లన్నిటినీ దోచుకుపోయారు. ఇదైన తరువాత యిళ్ళకి నిప్పంటించేశారు. ముసలాళ్ళనీ, పసిపిల్లల్నీ, జబ్బువాళ్ళనీ తుపాకులతో కాల్చి చంపేశారు, యువతీ యువకులను జమచేసి రవాణా చేసేందుకని తరలింపు శిబిరానికి తీసుకుపోయారు.

మేమిప్పుడు ఏ జిల్లాలలోనైతే గెరిల్లా కార్యాలను సాగించుతున్నామో ఆ జిల్లాలలోనూ యిదే జరుగుతూంది. "విజేతలచే" బానిస జీవనానికి తోలుకొనిపోబడుతూన్న జనంతోనూ, రైతులనుండి కొల్లగొట్టిన సామాన్లతో నిండిన బండ్ల వరుసలతోనూ రోడ్లన్నీ కిక్కిరిసి ఉన్నాయి.

జర్మన్లు ముందుగా నిర్ణయించుతున్న కార్యక్రమం ప్రకారం, ఏప్రిల్ 20న పెరేడ్ జరిగింది. రోవ్నో నగరంలోని సెంట్రల్ స్క్వేర్ చుట్టూ పోలీసు ఘాటు వేసేశారు. నగరంలో ఉన్న అన్ని జర్మన్ గారిజన్ యూనిట్లూ–స్పెషల్ సైన్యపు యూనిట్లూ, హెడ్‌క్వార్టర్స్ స్టాఫ్ రక్షణ యూనిట్లూ, ఎస్ ఎస్ యూనిట్లూ, మిలిటరీ పోలీసు యూనిట్లూ, పోలీసు యూనిట్లూ–స్క్వేరులో వరుసలుతీర్చి నిలబడ్డాయి.

ఉత్సవానికై నిర్మించబడిన వేదికలపై "గౌరవనీయులైన అతిధులు"— శైక్ష్యకమిస్సారియాట్ ఉద్యోగులు, మిలిటరీ ఆఫీసర్లు, పుర ప్రముఖులూ—వారి వారికి ప్రత్యేకంగా నిర్ణయించిన స్థానాలలో హాజరయ్యారు. అతిధులలో పౌల్‌సీబెర్ట్ కూడా వున్నాడు. అతనితో చెట్టాపట్టా వేసుకుని ఒక యువతి కూడా వుంది.

బ్రహ్మాండమైన హిట్లర్ చిత్రం ఒకటి వేదికకు ఎగువను అమర్చివుంది. ఎంద్రపీత కళ్ళల్లా పైకిపొడుచుకొస్తూన్న మిడిగుడ్లూ, షోకేలా మీసమూ, సన్నని నుదుటిపై పడుతూన్న ముందరి జుట్టుపాయా—యివన్నీ అతడి నెపోలియన్ భంగిమతో ఏమాత్రమూ నప్పడంలేదు.

నిర్ణయించిన వేళకి జర్మన్ ప్రధానాధికారవర్గ ప్రతినిధులూ, సైనిక పరిపాలనా ప్రతినిధులూ సౌఖ్యమైన కార్లలో అక్కడకు విజయం చేశారు. ఏరిక్ కోక్ ప్రధాన ప్రతినిధీ, పరిపాలనాధ్యక్షుడూ అయిన పౌల్ డార్గెల్ వేదికపై ప్రత్యక్షమయ్యాడు. పొడుగ్గా సన్నంగా ఉన్న యితడు తన గొప్పతనంతో తానే మురిసిపోతూ, యిటూ అటూ చూడకుండా ముక్కుసూటిగా అడుగులువేస్తూ తన ఉచిత స్థానాన్ని అలంకరించాడు. ఇతడి వెనుక వచ్చాడు కోక్ రెండవ ప్రతినిధీ, "పకేట్ ఔక్సియోన్" ముఖ్య నిర్వహణాధికారి అయిన క్నట్. బ్రహ్మాండమైన బానపొట్టను ఎంతో ప్రయాసతో మోసుకెళ్తూన్న యితగాడికి మెడ అనేది అసలు లేదేమో అనిపించింది: తలకాయకి కళేబరానికి మధ్య ఏకంగా ఒకటే కొవ్వుకండ బలిసిపోయింది. క్నట్ రోజుకుంటూ రొప్పుతుంటూ మెట్లు ఎక్కి వేదికపైకి వచ్చేసరికి బ్రహ్మాండమైంది. ఇతడి వెంట వచ్చారు: ఉక్రెయినియా ప్రధాన న్యాయమూర్తి డాక్టర్ ఫుంక్, స్పెషల్ సైనికబలాల కమాండర్ జనరల్ ఫన్ ఇల్‌గెన్, యింకా మరికొందరు హేమాహేమీలూనూ.

స్క్వేరుచుట్టూ పోలీసు ఘాటు ఉన్నప్పటికి గ్నెద్యూక్, షెవ్‌చూక్‌తో సహా మన గెరిల్లా సైనికులలో కొందరు స్క్వేరుకి రాగల్గారు. వీరిలో ప్రతివాడూ ఒక జత పిస్టల్సూ, రెండు మూడు టాంకు విధ్వంసక గ్రెనేడ్లతో సాయుధులై వచ్చాడు.

డార్గెల్ ఉపన్యసించాడు. "హిట్లర్ ఒనరించిన సేవ" గురించీ, "అజేయమైన జర్మన్ సేన" గురించీ వివరించి, "యిక్కడ, యుద్ధశ్రేణి వెనుక ప్రాంతాల్లో, సేనకు అవసరమైన యావత్తు సామగ్రి సరఫరాను జర్మన్ రాజ్యాధికారశక్తి ఆర్గనైజు చేయవలసి వుంటుంది" అని వక్కాణించాడు

ఆ ఉక్రెయినియన్ నగరపు స్క్వేరులో డార్గెల్ సిగ్గు బిడియాలు లేకుండా యిలా పలికాడు:

"ఓడిపోయినవారు ఆకలిపస్తులతో చస్తే చావనీయండి. ఆ విషయమై జర్మన్ జాతి ఏ మాత్రమూ పట్టించుకోదు. జర్మనీకి తన ఉన్నతాదర్శాలూ, ఆశయాలూ వున్నాయి. వాటిని సాధించేందుకు ఎంతటి మూల్యాన్నైనా చెల్లించి తీరుతుంది. కనికరాన్ని మీ మనసులనుండి పారదోలండి! కనికరం—బలవంతులకు సిగ్గు చేటైన గుణం! మీకిదే పిలుపు యిస్తున్నాను—నిర్దాక్షిణ్యంగా ఉండండి!"

పరిపాలనాధ్యక్షుని సంధిప్రేలాపనను మన గెరిల్లాలు మౌనంతో విన్నారు. ఆ ఫాసిస్టు క్షుద్రుణ్ణి తక్షణం అక్కడికక్కడే చంపిపారేయ్యాలని వారు మహాతహతహపడ్డారు కాని తమకిచ్చిన ఆదేశాలను వారు శిరసావహించి తీరాలి, అందుకని నాజీలకు పెరేడ్ జరుపుకొందుకు వారు అవకాశం ఇచ్చారు.

ఇజ్నెత్స్లోవ్ పెరేడ్ మైదానంనుండి వెళ్ళిపోతూ తన నేస్తురాలితో జర్మన్ భాషలో బిగ్గరగా అన్నాడు:

"మీవి ఎంత చక్కని పాదాలండీ! ఎంత ముచ్చటగా వున్నాయండీ! అందాన్ని విలువ కట్టగల్గిన వ్యక్తి జర్మన్ ఆఫీసరే! మిమ్మల్ని ఇంటివరకూ దిగబెట్టేందుకు అనుమతించండి!"

ఆ అమ్మాయి తన ఆనందపరవశిత వీక్షణాలను పరాక్రమశాలి అయిన ఆ జర్మన్ ఆఫీసరుపై సారించింది.

వీరిద్దరూ అక్కడ చుట్టూ మూగిన జనంలోనుండి బయటికి రాగానే, ఇజ్నెత్స్లోవ్‌తో వాల్య మెల్లగా అంది:

"ఏమీ చెయ్యవద్దని మనను ఆర్డరుచేయడంలో మన కమాండరు పొరపాటే చేశాడు. ఆ దృశ్యం చూడడం, ఆ మాటలు వినడం ఎంతో ఘోరంగా వుండెను, బాబూ!"

"నువ్వు పొరపాటు పడుతున్నావు, వాల్యా! మన పనికంతటికీ మనం ముప్పు తీసుకురాకూడదు. నువ్వేమీ బాధపడకు! వీళ్ళు ఇక్కడనుండి ప్రాణాలతో బయటపడడం కల్ల. ఇక్కడ యజమానులు వీళ్ళుకారు!" అలా అని, వీధిరెండవవైపు చప్పున చూసి, ఇజ్నెత్స్లోవ్: "అదిగో, ఆ మాసిపోయిన కోటు తొడుక్కుని, చింకిటోపీ పెట్టుకుని అవతలపక్క నడుస్తూన్న మనిషిని చూశావా? ఈవూరికి అసలైన యజమానులలో అతడొకడు" అన్నాడు.

రోవ్నోలో ఒక అజ్ఞాతవాస ఆర్గనైజేషను పనిచేస్తూందన్న సంగతి మాకు చాలా కాలంగా తెలుసు. ఫ్యాక్టరీల్లో మంటలు పుట్టి అవి తగలబడిపోవడమూ,

జర్మన్ ఆఫీసర్లు హతులవడమూ ఈ అజ్ఞాతవాస ఆర్గనైజేషను పనే అని పోల్చుకోవడం పెద్ద కష్టమేమీ కాదు. కాని ఈ ఆర్గనైజేషను ఏదో స్పష్టంగా తెలుసుకుందుకు మేం చాలాకాలం ప్రయత్నించాం, కాని మా ప్రయత్నాలేవీ ఫలించలేదు. మాకు లీలగా తెలియవచ్చిన సమాచారం పట్టుకుని మా గూఢచారులు తోగట్టా చేయగా చేయగా చిట్టచివరకు తెరేంతియ్ నొవాక్ అనే వ్యక్తి దగ్గరకు వారు వెళ్ళారు. ఇతడు బోల్షెవిక్కు, ఆ వూళ్ళో వున్న బనాతు ఫ్యాక్టరీడైరెక్టరూనూ. రోవ్నొలో వున్న అజ్ఞాతవాస ఆర్గనైజేషనుకి ఇతడు నాయకుడని అప్పుడు తేలింది.

పెరేడ్ జరిగిన కొద్దికాలానికి నొవాక్ మా క్యాంపుకి వచ్చాడు. ఈసమావేశ ఫలితంగా అతనితో మేం పూర్తి సంబంధం ఏర్పరచుకుని పనిచేయసాగాం.

ఈ ఆర్గనైజేషను రోవ్నొలో గొప్ప పని చేసింది. నొవాక్ నాయకత్వాన పనిచేస్తూన్న అజ్ఞాతవాసులూ మా డిటాచ్‌మెంటూ కలసి సాగించిన కార్యాలను గురించి మాత్రమే, అదైనా సంక్షిప్తంగా, ఇక్కడ వివరించుతాను.

సోవియట్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో వెలువరించుతూన్న వార్తలను ఈ ఆర్గనైజేషనుకి మేం క్రమశః సరఫరాచేయడంతో మా ఉమ్మడి కార్యకలాపం ఆరంభమైంది. ఈ వార్తలకు వీరు నకళ్ళు తయారుచేసి ప్రజలకు పంచిపెట్టేవారు. మాకుపారషూటువల్ల అందిన "ప్రావ్‌ద," "క్రాస్నయ జ్వెజ్దా" ("ఎర్ర నక్షత్రం") ఇంకా ఇతర పత్రికల ప్రతులను వీరికి అప్పుడప్పుడు పంపుతూండేవారం.

కుజ్నెత్సొవ్, షెవ్‌చూక్, గ్నిద్యూక్, నికొలాయ్ స్త్రుతిన్‌స్కియ్ లేక మా స్కౌట్లలో మరి ఏ వొకరైనా సరే ఆ వూళ్ళో ఆందోళన సాగించేందుకు గావి, కరపత్రాలు పంచిపెట్టేందుకు గాని వీలులేకుండా పోయింది. కాని ఈ పనిని నొవాక్ నాయకత్వానవున్న ఆర్గనైజేషను చేయగల్గేది. మేం సరఫరాచేస్తూండిన విషయ సామాగ్రిని వారు ఉపయోగించుకుని, విస్తృతమైన రాజకీయ ఆందోళనను ప్రజలలో ప్రారంభించారు.

నొవాక్ ఆర్గనైజేషనుకు చెందిన విధ్వంసక దళాలు మా సహాయంతో ముఖ్యమైన ధ్వంసక్రియలు రెండింటిని సాగించాయి.

కర్ర బ్లాకులు కోసే రంపపు మిల్లును టౌన్‌హోల్ట్జ్ అనే జర్మను నడుపుతూండేవాడు. ఈ మిల్లు జర్మన్ సైన్యం ఉపయోగించుతూండిన గ్యాస్ జనరేటర్ లారీలకు కర్ర బ్లాకులను సప్లై చేస్తూండేది ఆక్రమిత ఉక్రెయినియాలో

ఈ రకం మిల్లు ఇదొక్కటే. మా ఉమ్మడి పథకం ఫలితంగా ఈ మిల్లు నామ రూపాలు లేకుండా పూర్తిగా దగ్ధమై పోయింది.

రెండో ధ్వంసక్రియ రోవ్నో రైల్వేస్టేషను ప్లాట్‌ఫారంపైన పేలుడు. నైట్రిక్ ఆమ్లపు సీసాలతో ఎన్నో వాగన్లు ఆ స్టేషనులో దిగాయి. అవి నాలుగు గాలన్ల పెద్ద సీసాలు, బుట్టల్లో పెట్టి గడ్డితో చుట్టూ ప్యాక్‌చేసి వున్నాయి. ఆ సీసాలను నాజీలు ప్లాట్‌ఫారంపైన దింపారు. నొవాక్ మనుషులు మా దగ్గరనుండి రెండు డిలేడ్ ఏక్షన్ మందుపాతరలను తీసుకుని, వాటిని ఆ నైట్రిక్ ఆమ్లపు సీసాల మధ్యను పెట్టేశారు. మొదటి మందుపాతర పేలి, సీసాలు బద్దలై సీసాల్లోని ఆమ్లం పైకి వచ్చేసి, ప్లాట్‌ఫారం చెక్కపలకలపైన కాలువలు కట్టి పారి మండేసరికి, కడమ సీసాలతో వున్న బుట్టలకి నిప్పు అంటుకుని, అవి మండడం మొదలుపెట్టాయి. మంటలు ఆర్పేందుకని నాజీలు ఆదరా బాదరా పరుగెత్తారు. కాని ఈలోపున రెండవ మందుపాతర పేలి, సీసాల పేలుడు మొదలైంది. ఆమ్లం ఇటూ అటూ చిమ్ముతూ ుడడంచేతనూ, కొరకంచులు నలువైపులా ఎగురుతూండడంచేతనూ మంటల దగ్గరకు వచ్చేందుకే ఎవ్వరికీ వీల్లేకపోయింది. కొద్దినిమిషాలకల్లా యావత్తు ప్లాట్‌ఫారమూ బ్రహ్మాండమైన హోమగుండమైపోయింది. ఇహ ఆ మంట ఆర్పడం అసాధ్యమని తేలిపోయింది. మంటలు ఆర్పేందుకు రప్పించబడిన జర్మన్ పోలీసులూ, సైనికులూ చేసేదేమీలేక, విధ్వంసం చూడవచ్చిన ప్రేక్షకుల్లా అక్కడకొన్ని గంటలపాటు అలా చూస్తూ నుంచున్నారు.

నొవాక్ ఆర్గనైజేషను మా డిటాచ్‌మెంటుకి ఎనలేని సాయం చేసింది. అందునా, మందులూ, బేండేజీలూ, శస్త్ర పరికరాలూ వారు మాకు సంపాదించి ఇచ్చినందుకు వారికి మేము ప్రత్యేకమూ కృతజ్ఞులం. రోవ్నోలోని అన్ని ఆస్పత్రుల లోనూ, నగర పారిశుధ్య కేంద్రాలలోనూ రష్యన్ డాక్టర్లు - కొందరు యుద్ధ ఖైదీలుగా పట్టుబడినవారూ, కొందరు ఆ వూరినుండి సకాలంలో తరలివెళ్ళలేకపోయిన వారూ-పనిచేస్తూండేవారు. వీరి ద్వారా అజ్ఞాతవాస ఆర్గనైజేషను మనుషులు డాక్టర్ త్సెస్సార్‌స్కియ్ కోరిన మందులనూ, వైద్య పరికరాలనూ సంపాదించి ఇస్తూండే వారు.

ఈ డాక్టర్లు మా గెరిల్లా డిటాచ్‌మెంటు గురించి వినగానే, తాము కూడా అందులో చేరేందుకు అనుమతించమని కోరారు. ఆ రోజుల్లో మాకు వైద్యసిబ్బంది ఎంతగానో కొరవడింది. జర్మన్లతోనూ, బందిపోటుదొంగలుగా మారిన దేశద్రోహుల తోనూ మా పోరాటాలు మరింత తరచుగా జరుగుతూ వచ్చాయి. మా హతాహతుల

సంఖ్యకూడా పెరుగుతూ వచ్చింది. రోవ్నొలోవున్న డాక్టర్లతోనూ, డ్రెస్సర్లతోనూ అజ్ఞాతవాస ఆర్గనైజేషను మాట్లాడి, వారు మా క్యాంపుకి వచ్చి సాయంచేసేటట్టు ఏర్పాటుచేసింది. వీరు మా వద్దకు ఎప్పుడు వచ్చినా వుత్త చేతులతో వచ్చేవారుకారు. వీరిలో అనేకులు వూళ్లో ఆస్పత్రులనుండి ఏకంగా బండెడు సామాన్లను తమతో కూడా తీసుకొనివచ్చేవారు.

మరి కొద్దికాలానికి మా క్యాంపు వైద్యసిబ్బంది బాగా పెరిగింది. వివిధ వైద్యశాస్త్ర విభాగాలలో ప్రవీణులైన డాక్టర్లు పదముగ్గురూ, ఇంచుమించు ఇరవై మంది డ్రెస్సర్లూ మా వైద్యసిబ్బందిలో వుండేవారు. ఫుట్ పెడల్ డ్రిల్‌తో సహా డెంటల్ సర్జరీకి అవసరమైన పరికరాలన్నిటినీ తనతో కూడా తీసుకొని వచ్చిన ఒక డెంటిస్టు కూడా మా వైద్యసిబ్బందిలో చేరాడు. మా యువక గెరిల్లా, డాక్టర్ త్సెస్సార్‌స్కియ్ ప్రధానవైద్యుడుగా శస్త్రచికిత్సశాఖ, వైద్యచికిత్స శాఖ, దంత వైద్య శాఖలున్న పెద్ద మిలిటరీ హాస్పిటలు ఒకటి మా క్యాంపులో తయారైంది.

## కోఖ్ దర్శనమిప్పిస్తాడు

మే నెల ఒకనాటి ఉదయాన ఓబెర్‌గెఫ్రైటర్ ష్మిద్ వాల్యని చూడ్డానికి వచ్చి, ఆనాటి మధ్యాహ్నం నాలుగు గంటలకు ఆమె ఉక్రెయినియా రైక్ష్‌కమిస్సార్ ఏరిక్ కోఖ్ దర్శనం చేసుకోవచ్చునని చెప్పాడు :

"మీరు ఓబెర్‌లేయ్‌ట్నాంట్ సీబెర్ట్‌తో కూడా రావలసివుంటుందని ఆయన అడ్జూటాంట్ చెప్పాడు. మిమ్మల్ని ఒక జర్మన్ ఆఫీసరు సిఫార్సుచేస్తున్నా డన్న విషయాన్ని గావ్‌లైటర్ బహుశ స్వయంగా స్థిరపరచుకోవాలనుకుంటున్నా రేమో."

ష్మిద్ వెళ్ళిపోగానే, వాల్య నికోలాయ్ దగ్గరికి పరుగెత్తింది.

"ఏంచేయడమిప్పుడు? ఇందులో ఏదైనా మోసం వుందేమో సుమా!"

"వున్నా సరే ఇప్పుడిహ వెనకతీయడానికి వీల్లేదు. నేను నీతో వస్తా ననుకో... నన్ను హాజరుకమ్మంటాడని నేను ఎన్నడూ అనుకోలేదు సుమా. ఏ మాత్రం అనుకుని వున్నా, కమాండరునుండి ఆదేశాలను అర్థించివుండేవాణ్ణి" అన్నాడు కుజ్నెత్సోవ్.

"అయితే మరి, ఆయన అనుమతి లేనిదే, ఏమి చేయడానికి వీల్లేదా?" అంది వాల్య, కుజ్నెత్సోవ్‌కేసి అర్థగర్భితంగా చూస్తూనూ.

"ఆ విషయం నేను అక్కడక్కడే నిర్ణయించుకుంటాను" అన్నాడు కుజ్నెత్సోవ్.

రోవ్నాలో, "ఫ్రీడ్రిక్‌ష్ట్రాసె" అని జర్మన్లు కొత్తగా నామకరణంచేసిన పెద్ద రోడ్డుపైన ఆ సాయంకాలం నాలుగు గంటలు దగ్గరపడుతూండగా ఒక గుర్రబ్బండి వెళ్తూంది. అందులో వాల్యా దొవ్గేర్, నికొలాయ్ కుజ్నెత్సోవ్, ష్మిట్—ముగ్గురూ కూచున్నారు. "గెరిల్లాని ఆమడ దూరంనుండే పసికట్టగల్గిన" ఆల్‌సేషన్ కుక్క ష్మిట్ కాళ్ళదగ్గర ప్రశాంతంగా పడుకునుంది.

నికొలాయ్ ఒక కొత్త పెరేడ్ యూనిఫారంలో వున్నాడు. ఛాతిపైన అతని అలంకృతులన్నీ వున్నాయి: నాజీ పార్టీ సభ్యత్వ బ్యాడ్జి, యుద్ధంలో తాను రెండుసార్లు గాయపడినట్టు తెలియజేస్తూన్న రిబ్బన్లు, రెండు ఐరన్ క్రాసులు, అతడి బూట్లు నిగనిగ మెరుస్తున్నాయి. ఎడమచేతివైపు ఒరలో పిస్తలు వుంది. అతడిజేబులో సేఫ్టీ క్యాచ్ తప్పించివేసిన పిస్తలు మరొకటి వుంది. వాల్యా నలుపు గౌను తొడుక్కుంది. గౌను చేతికి, తండ్రి మరణానికి దుఃఖసూచకంగా నల్లని పట్టు రిబ్బను వుంది. తండ్రి గెరిల్లాలచేతిలో మరణించినట్టు మిలిటరీ పోలీసులనుండి ఒక సర్టిఫికెటును మేం ఆమెకు ఇదివరకే ఇచ్చాం.

కోచ్‌మేను కళ్ళెలను బిగించి పట్టుకుని తన సీటులో కూచునున్నాడు. కోచ్‌మేను మరెవ్వడూ కాదు—గ్నెద్యూక్. అతడి జేబులో పిస్తలువుంది. కోచ్‌మేన్ సీటుకింద పెట్టెలో కొన్ని టాంక్ విధ్వంసక గ్రెనేడ్లు వున్నాయి.

రోడ్డుకి రెండు పక్కలావున్న ఇళ్ళను జర్మన్లు తమ ప్రభుత్వపు ఆఫీసులకోసమూ, తమ ఉద్యోగుల వసతులకోసమూ ఆక్రమించుకున్నారు. రైక్స్ కమిస్సారియాట్—కేంద్ర ప్రభుత్వ ప్రతినిధి కార్యాలయం—రోడ్డు చిట్టచివరనుంది. రైక్స్‌కమిస్సారియాట్ పక్కనేవున్న గుడిసందులో, ముళ్ళతీగె ఎక్కించిన ఎత్తైన చెక్కగోడ వెనుక ఒక విడి ఇల్లు—కోఖ్ నివసించుతూన్న మహాసౌధం.

ఈ మహాసౌధం ఎదుట ఆగింది గుర్రబ్బండి.

సబ్‌మెషీన్ గన్నులతో సాయుధులైన ఎస్ ఎస్ మనుషులు చెక్కగోడ దరినే యిటువైపునుండీ, అటువైపునుండీ గస్తీలు తిరుగుతున్నారు.

ష్మిట్ చప్పున బండిదిగిపోయి, గేటులోవున్న గార్డ్‌రూమ్‌లోకి వెళ్ళి, కిటికీ ఎదుట నుంచుని:

"ఒబెర్‌లోయ్‌ట్నాంట్ పౌల్ సీబెర్ట్‌కి, ఫ్రాయ్‌లైన్ వలెన్‌తీన దొవ్గేర్‌కి

ప్యాసులు తయారుగా వున్నాయా?" అని ఆ గదిలో డ్యూటీమీదవున్న మనషిని అడిగాడు

"చిత్తం, సిద్ధంగా వున్నాయండి" అని జవాబు వచ్చింది.

డ్యూటీమీదవున్న మనిషి ష్మిట్‌ని వ్యక్తిగతంగా ఎరుగును. అందుచేత అతను కుజ్నెత్సోవ్, వాల్యల డాక్యుమెంట్లను ముందుగా తనిఖీచేయకుండానే భవనంలోకి వెళ్ళేందుకు ప్యాసులు ఇచ్చేశాడు.

గేటు దగ్గరనున్న ఎస్.ఎస్. మనిషి సెల్యూటుచేసి, ముగ్గురినీ లోపలికి పోనిచ్చాడు.

ఆ మహాసౌధం ఒక బ్రహ్మాండమైన తోటలోవుంది. సూర్యరశ్మితో ప్రకాశితమవుతూన్న ఓక్, లిండెన్, మేపిల్ వృక్షాలు తమ ఛాయలను తారు బాటపై ప్రసరించుకున్నాయి. లైలాక్ పొదలు తమ నెత్తావులను వెదజల్లుతున్నాయి. పూల మళ్ళ దగ్గరనూ, పండ్లచెట్ల దగ్గరనూ వున్న తోటమాలీలు తమ పనులలో మునిగివున్నారు.

మహాసౌధపు ఆవరణలోనే మహాసౌధానికి పక్కగా చిన్న చిన్న ఇళ్ళు కొన్ని వున్నాయి—ఇవి కావలి భటులూ, కోశ్ నౌకర్లూవుండే బసలు. ఈ వివరా లన్నీ ఇంకా ఇతర వివరాలనూ కుజ్నెత్సోవ్ తన మనస్సులో గుర్తుపెట్టుకున్నాడు.

"దయచేసి మీరు సరాసరి ఆ ద్వారంలోనుంచి వెళ్ళి అడ్జూటాంటుని కలుసుకోండి. నేనీ కుక్కను ఇచ్చేయడానికి వెళ్తాను" అన్నాడు ష్మిట్, కుజ్నె త్సోవ్‌కి మహాసౌధం సింహద్వారం చూపెట్టుతూ.

"నువ్వు తుపాకితో కాల్చేయడానికే నిశ్చయించుకున్నావా?" అని వాల్య ఉద్రేకంతో ఉక్కిరి బిక్కిరి అవుతూ అడిగింది కుజ్నెత్సోవ్‌ని

"తుపాకితో కాల్చేయగలనని నాకు నిశ్చయంగా తోచితే ఆ పనే చేస్తా" అని కుజ్నెత్సోవ్ జవాబు చెప్పాడు.

అడ్జూటాంట్ బాబాశ్ ఆగంతకులను మర్యాదగా కలుసుకుని, వారిని కోశ్ కచేరీగది వున్న రెండవ అంతస్తుకి తీసుకువెళ్ళాడు.

"దయచేసి కూర్చోండి. గావ్‌లైటర్ ఈ వేళ మంచి సరదాగావున్నాడు" అంటూ అతడు మందహాసంచేస్తూ అన్నాడు, "నేనిప్పుడే ఆయన దగ్గరకు వెళ్ళి మీరు వచ్చారని ఆయనతో చెబుతాను."

అతడు అలా అని, కోట దర్వాజాలా వున్న భారీ తలుపు తీసి, లోపలికి మాయమైపోయాడు.

వీరు కూచున్న వెయిటింగు రూములోనే, కోఖ్ దర్శనార్థం పిలుపుకోసం ఎదురుచూస్తూ కొందరు మిలిటరీ ఆఫీసర్లు కూడా వున్నారు వారిలో, నిండు యూనిఫారాలు వేసుకుని తమ పతకాలనూ, అలంకృతులనూ ధరించిన జనరల్సు యిద్దరున్నారు. వాల్యా, కుజ్నెత్సోవ్‌లు ఆ గదిలో కూర్చుని, ఇంకా నలువైపులా పరికించేలోపునే అడ్జూటాంట్ తిరిగి వచ్చి, వాల్యాతో:

"మీరు లోపలికి వెళ్ళండి" అన్నాడు. అని, కుజ్నెత్సోవ్‌వైపు తిరిగి, "మీరు ఇంకా కాస్సేపు వుండాలండి, హెర్ ఓబెర్‌లోయ్‌ట్నాంట్!" అన్నాడు.

వాల్యాకి తల గిరగిర తిరిగిపోయి మతిపోయినట్టు అయిపోయింది. "నా అంతట నేనే బయటపడిపోతానా ఏమిటి? కుజ్నెత్సోవ్‌ని లోపలికి రమ్మనమంటాడా? కుజ్నెత్సోవ్ కోఖ్‌ని తుపాకితో కాల్చేస్తాడా?" ఈ ప్రశ్నలన్నీ ఆమె మనసులో ఒక్కసారే మెదిలాయి. ఆమె తలుపు దగ్గర ఒకసారి వెనక్కి తిరిగి కుజ్నెత్సోవ్‌కేసి చూసింది. కుర్చీలో కూర్చున్న కుజ్నెత్సోవ్ తన పక్కనున్న వ్యక్తితో—ఎవరో కెప్టెన్‌తో—నిశ్చింతగా ఏదో మాట్లాడుతున్నాడు

అడ్జూటాంట్ కచేరీగది తలుపు తీసి, వాల్యాని లోపలికి పంపి, తలుపు మూసి; తను బయట వెయిటింగు రూములోనే వుండిపోయాడు.

వాల్యా కచేరి గదిలో అడుగుపెట్టిందో, లేనేలేదో రాక్షసిలా వున్న ఓ ఆల్‌సేషన్ కుక్క చెంగున ఆమె మీదకి ఎగిరింది. వాల్యా ఉలికిపడింది.

"వెనక్కి వచ్చేయ్!" అని జర్మన్ భాషలో బిగ్గరగా ఓ కేక వినబడింది.

కుక్క వెనక్కితిరిగి అక్కడనుంచి వెళ్ళిపోయింది. ఇందాకటి గొంతుకే వాల్యాని ఉద్దేశించి :

"కూర్చోండి!" అని ఆహ్వానించింది.

ఆ మాట ఉచ్చరించిన వ్యక్తికేసి వాల్యా భయంతో అదరిపోతూచూసింది. బల్ల దగ్గర ఓ వ్యక్తి కూచునున్నాడు — బ్రహ్మాండమైన మనిషి, స్థూలకాయుడు. పొట్లరు మీసం, ఎర్రని పొడుగాటి కనుబొమలు. ఇతడే కోఖ్ అని వాల్యా గ్రహించింది.

కోఖ్ మేజాబల్ల కచేరీగదిలో ఒక మూలవుంది. మేజాబల్లకి దగ్గరగానూ, దానికి లంబదిశగానూ పొడుగాటి టేబిలు వుంది. ఈ టేబిలు దగ్గర వాల్యకోసం కుర్చీ వేసివుంది. తనకి కోఖ్‌కి నడుమ, తనకు ఇటూ అటూ ఇద్దరు అంగరక్షక సైనికులు కూచున్నారు, కిటికీదగ్గర మరొకడున్నాడు. ఆ ఆల్‌సేషన్ కుక్క కోఖ్ పాదాలదగ్గర పడుకునుంది.

"అరి, దేవుడా ! ఈ మనిషి ఒక్కడికి ఇంతమంది అంగరక్షకులా !" అనుకుంది వాల్య. ఇంతలోపల ఆమెకు ఓ ప్రశ్న వినబడింది.

"ఏ కారణంచేత మీరు జర్మనీకి వెళ్ళనంటున్నారు ?" అని అడిగాడు కోఖ్, వాల్యకేసి చూడకుండా, తన ఎదుట వున్న వాల్య దరఖాస్తుకేసి చూస్తూనూ. "మీ శరీరంలో జర్మన్ రక్తం ప్రవహించుతూంది కదా, మన స్వదేశానికి మీ వంటి అమ్మాయిలు ఎంతైనా ఉపయోగపడతారే ! బోల్‌షెవిక్‌లను ఓడించేందుకు అందరూ పనిచేయాలి" అన్నాడు.

ఆ మాటలు అని, కోఖ్ తలెత్తి, ఇక సంభాషణ అంతా పూర్తి అయ్యే వరకూ తలదించకుండా వాల్యకేసి తదేకంగా చూస్తూనే వున్నాడు.

"మా అమ్మగారికి చాలా జబ్బుగా వుంది, మా చెల్లెళ్ళందరూ చిన్న పిల్లలు" అని వాల్య: తన మనసులోని గాభరా ఎంతో కష్టంమీద అణచుకుని, జవాబు చెప్పింది "మా నాన్నగారు మరణించిన తరువాత మా కుటుంబాన్ని పోషించేందుకు నేను పనిచేయాల్సి వచ్చింది. అందుకని రోవ్నోలో వుండిపోయే దుకు దయచేసి నాకు అనుమతి ఇప్పించండి. నాకు జర్మన్, రష్యన్, ఉక్రైనియన్ భాషలువచ్చు. నేనిక్కడ ఉండిపోయినప్పటికీ జర్మనీకి ఉపయోగపడగల్గుతాను."

"సీబెర్ట్‌గారితో మీకు ఎక్కడ పరిచయమైంది ?"

"రైల్లో ప్రయాణంచేస్తూండగా యాదృచ్ఛికంగా పరిచయమైంది. అప్పుడప్పుడు ఆయన యుద్ధశ్రేణి నుండి సెలవుమీద వచ్చినప్పుడు ఆయన తరచూ మా యింటికి వస్తున్నారు. మేం వివాహం చేసుకోవాలని అనుకుంటున్నాం" అందివాల్య సిగ్గుపడుతూ.

కోఖ్ వాల్యతో మరికొద్ది నిమిషాలపాటు మాట్లాడాడు. ఇంకా ఇతర జర్మన్ ఆఫీసర్లను ఎవరినైనా ఆమె ఎరుగునా ?—అని కోఖ్ ఆమెను ప్రశ్నించాడు. రైశ్చ్‌కమిస్సారియాట్‌లో పనిచేస్తూన్న ఆఫీసర్లలో కొందరి పేర్లే కాకుండా, గెస్టాపోలో కొందరి ఆఫీసర్ల పేర్లు కూడా వాల్య చెప్పేసరికి కోఖ్ సంతృప్తి చెందినట్టే అవుపడ్డాడు.

"మంచిది, ఇహ మీరు వెళ్లొచ్చు" అన్నాడు కోఖ్. అలా అని, ఓబెర్ లోయ్‌ట్నాంట్ సీబెర్ట్‌ను పిలిపించవలసిందని కఠోరమైన గొంతుకతో తన అంగ రక్షకులను ఆజ్ఞాపించాడు.

కుజ్నెత్సోవ్‌తో ఒక్క ముక్క అయినా చెప్పేందుకు వాళ్ళకి అవకాశం లేకపోయింది. వారిద్దరూ ఒకరికేసి ఒకరు చూసుకున్నారు: వాళ్ళచూపుల్లో భయమూ, ప్రశ్నా భావమూ వ్యక్తమైంది, కుజ్నెత్సోవ్ చూపుల్లో ప్రోత్సాహం వ్యక్తమైంది.

"హైల్ హిట్లర్!" అంటూ, పౌల్ సీబెర్ట్ గుమ్మందాటి గదిలో ప్రవేశించుతూ, తనచేయి చాచి సెల్యూటుచేశాడు.

"హైల్!" అని మేజాబల్ల దగ్గర కూర్చున్న వ్యక్తి ప్రత్యుత్తర మిచ్చాడు.

ఆల్‌సేషన్ గుర్రుమంది, కాని సీబెర్ట్ ముఖాన కనుబొమ అయినా కదల్లేదు.

కుజ్నెత్సోవ్‌ని కూర్చోమని కోఖ్ సంజ్ఞచేసి, ఇందాకట్లా వాళ్ళకూర్చున్న కుర్చీ చూపించాడు.

"ఆ ఐరన్ క్రాసులు మీకు ఎక్కడ బహూకరించారు?" అని కోఖ్ అడిగాడు.

"మొదటిది ఫ్రాన్సులోనండి, రెండోది తూర్పు యుద్ధశ్రేణిలోనండి, హెర్ గావ్‌లైటర్!" అని కుజ్నెత్సోవ్ జవాబుచెప్పాడు.

"ఇప్పుడేం చేస్తున్నారు మీరు?"

"గాయంనుండి కోలుకున్న తరువాత, నా యుద్ధశ్రేణి విభాగపు సప్లై శాఖలో పనిచేస్తున్నానండి."

"ఏ యుద్ధశ్రేణిలో?"

"కుర్స్క్ యుద్ధశ్రేణిలోనండి."

సీబెర్ట్ తన పత్రాలను తీసి కోఖ్‌కి చూపించేందుకని చేతిని పైజేబులోకి తోనిపేడు. కాని కాగితాలను తీసేలోపున, ఈ దోషరహిత చలనానికే తన పక్కనున్న ఎస్ఎస్ మనుషులు అనుమానపడి అప్రమత్తులయ్యారు. ఆక్షణంలోనే కుక్క చెంగున ఎగిరి కుజ్నెత్సోవ్ కాళ్ళదగ్గరకి ఉరికింది.

"సరే లెండి, మీరేమీ గాభరాపడకండి. మీ కాగితాలు నా అడ్జూటాంట్‌కి చూపించే వుంటారుగా।"

"అవును, చూపించానండి."

"మీరు ఎక్కడ పుట్టారు?"

"తూర్పు ప్రష్యాలో క్యోనిగ్స్‌బెర్గ్ ఆవల నలభై కిలోమీటర్ల దూరాన వున్న మా తండ్రిగారి ఎస్టేటులోనండి."

"మనమిద్దరం ఒక్క వూరివాళ్ళమే అన్నమాట।"

"అవునండి, హెర్‌గావ్‌లైటర్।"

"మన సైన్యంలో ఏమనుకుంటున్నారు?"

"మనవాళ్ళు మంచి పట్టుదలతో వున్నారండీ।"

"ఓ సంగతి చెప్పండి: దరిమిలా పరిణామాలవల్ల చాలామంది భయపడ్డారా ఏమిటి?"

"స్టాలిన్‌గ్రాడ్ అనే కదా మీ ఉద్దేశం? మనవాళ్ళకది మరింత గుండె నిబ్బరం కల్గించిందండి."

"అవును, అవును. మీరు మీ యూనిట్టుకి తిరిగి వెళ్ళిపోవచ్చు. మీ కుర్‌స్క్ విభాగంలో రష్యన్లకోసం ఓ అద్భుత బహుమానాన్ని వ్యూరెర్ తయారుగా వుంచాడన్న సంగతి గుర్తుంచుకోండి।" అన్నాడు కోఖ్ అర్థగర్భితంగా.

"అందుగురించి నాకే సందేహమూ లేదండి, హెర్‌గావ్‌లైటర్।"

కోఖ్ ఒక్క నిమిషం మౌనం వహించి, మళ్ళీ అన్నాడు :

"జర్మన్ ఆఫీసరు అయివుండీ, ఆర్యన్ రక్తం కల్గీ, అందునా ప్రష్యాలో పుట్టిన మీరు, ఎవరో ఒక పోలిష్ అమ్మాయిపట్ల ఇంత ఆసక్తి చూపడం నాకు ఆశ్చర్యంగా వుంది."

ఈ మాటలను కోఖ్ అంటూన్నప్పుడు అతని ముఖంలో ఎంతో అంత అసహ్యభావం వ్యక్తమైంది.

"హెర్ గావ్‌లైటర్। ఈ ఫ్రాయ్‌లైన్ శరీరంలో ప్రవహిస్తూన్నది జర్మన్ రక్తం. ఆమె తండ్రిగారి పత్రాలను నేను స్వయంగా చూశాను, ఆయన్ని దోపిడి దొంగలు పాశవికంగా హత్యచేసినట్టు వాటిలో వుందండి" అని సీబెర్ట్ సమర్థించుకున్నాడు.

"మన అధీన ప్రజల్లోని ప్రతి స్త్రీ తరఫునా ప్రతి జర్మన్ ఆఫీసరూ ఆర్థించుతూవస్తే, మన పరిశ్రమల్లో ఇహ పనిచేసేవాళ్ళే వుండరు. యుద్ధశ్రేణికోసం మన సర్వస్వాన్నీ ధారపోస్తూన్న సంగతీ, మనకు మనుషులు కొరవడుతున్నారనే సంగతీ మీకు తెలియనిదికాదు మీరు నేషనల్-సోషలిస్టు పార్టీ సభ్యులు, అందుచేత మీరు ఫోల్క్స్‌దోయిచ్ జనంతో సంపర్కం పెట్టుకోకూడదు. మనం జయించిన దేశాల్లో మనకు తాత్కాలికాధారంగా మాత్రమే ఈ జనం మనకు అవసరమవుతారు" అన్నాడు కోఖ్.

పౌల్ సీబెర్ట్‌ది "స్వచ్ఛమైన రక్తం" అనీ, తన "ఫ్యూరెర్" పట్ల అతని భక్తి అచంచలమైనదనీ కోఖ్‌కి అప్పటికే పూర్తిగా నమ్మకం కుదిరిపోయి, ఇహ అతగాడు గుక్క తిప్పుకోకుండా సీబెర్ట్‌కి పాఠం చెప్పడం మొదలుపెట్టాడు :

"అసలు విషయం ఏమిటంటే, రష్యన్లుగాని, ఉక్రైనియన్లుగాని, పోలిష్ వాళ్ళు కాని ఎవ్వరూ మనకి అవసరంలేదు. మనకి అవసరమైనది ఫలవంతమైన భూమి ఇక్కడ, నేటినుండి ఇక శాశ్వతంగా జర్మన్లే వుంటారు" అన్నాడు కోఖ్. అలా అని, తన గొంతుక అంతకంతకు మరింత పెద్దదిచేసి అన్నాడు: "మనం స్థానిక ప్రజని హానిరహితులనుగా చేసివేయాలి..."

ఈ భేటీ సాగిన ఇంచుమించు నలభై నిమిషాల కాలమంతటిలోనూ కుజ్నెత్సోవ్‌కి తన పంట్లాం కుడిజేబులో జారుచేసి సిద్ధంగా వుంచిన "వాల్టెర్" పిస్తోలు స్పర్శ కల్గుతూనే వుంది. ఆ పిస్తోలు తీసి, దానిలో వున్న బుల్లెట్లన్నిటినీ రోత పుట్టించుతూన్న ఈ "స్వదేశస్థుని" ముఖాన ఒక్కపాళంగా ఎప్పుడు పేల్చివేదునా అని కుజ్నెత్సోవ్ ఏ నిమిషానికానిమిషమే సిద్ధమయ్యాడు. అతగాడు తన వాగ్ధోరణికి తానే ఉక్కిరిబిక్కిరైపోతూ, పోలిష్ ప్రజలనూ, ఉక్రైనియన్ ప్రజలనూ ఏ విధంగా నిర్మూలించడమూ అనే క్లిష్టసమస్యను ఇప్పుడు పరిష్కరించుతున్నాడు...

కాని, అంగరక్షక భటులు తమ చూపులను కుజ్నెత్సోవ్‌నుండి క్షణ మాత్రానికైనా మళ్ళించక, అతని స్వల్పాతిస్వల్ప చలనాన్నీ సహితమూ కనిపెట్టుతూనే వున్నారు. ఆల్‌సేషన్ కూడా రెప్పవాల్చకుండా అతణ్ణి కనిపెట్టుతూనేవుంది. అక్కడకు దర్శనార్థం వచ్చిన వారిని కనిపెట్టుతూ ఉండేందుకే ఆ కుక్కను ప్రత్యేకంగా తర్ఫీదుచేసినట్టు స్పష్టంగా తేలిపోతూనే వుంది.

"ఇది ఇహ చెయ్యి ఎత్తనీయదు, పిస్తోలు కాల్చనీయదు..." అనుకున్నాడు కుజ్నెత్సోవ్.

తన కార్యక్రమాచరణోపన్యాసానికి తానే పొంగిపోతూ కోఫ్ మళ్ళీ ప్రారంభించాడు కుజ్నెత్సోవ్‌ను ప్రశ్నించడం.

"యుద్ధం అయ్యాక ఏంచేయాలనుకుంటున్నారు!"

"రష్యాలోనే వుండిపోవాలనుంది నాకు."

"ఈ దేశం మీకు నచ్చిందా?"

"ఫ్యూరెర్ నిర్ణయించిన రీతిలో ఈ దేశాన్ని రూపొందించేటట్టు పని చేయడం నా విధి."

"మీ జవాబు జర్మన్ ఆఫీసరుకి తగినట్టూ వుంది. సరే, మీ ప్రేయసిని ఇక్కడే వుండిపోయేందుకు అనుమతిందానులెండి. మనం జయించిన ప్రజలపట్ల జాలిపడవలసిన సమయాలు అప్పుడప్పుడు వుంటూంటాయి. కాని ఆ అమ్మాయిని పెళ్లి చేసుకునే ఉద్దేశం మాత్రం ఎన్నడూ పెట్టుకోకండి" అని కోఫ్ తన సంభాషణను పూర్తిచేసి, వాల్య దరఖాస్తుపైన ఏమిటో రాశాడు.

వాల్య అంతసేపూ వెయిటింగ్ రూములో కూచుని, ఆ భారీ తలుపుకి కళ్లు అప్పగించి గడియలు లెక్కపెడుతూంది, ఆ కాలానికి అంతమంటూ లేదనిపించింది. "ఇహ యిప్పుడు బుల్లెట్టు చప్పుడు వినబడుతుంది...యింకేముంది, యిప్పుడే...యిప్పుడే..." అనుకుంటూంది ఆమె. కాని ఆమెనోటినుండి వేరే మాటలు వచ్చాయి. ఆమె పక్కనకూచున్న జర్మన్ ఆఫీసరు ఏవో పొల్లుకబుర్లతో ఆమెను బాధించడం మొదలెట్టాడు.

"అవును. మా నేస్తులు చక్కనివాళ్ళున్నారు. మిమ్మల్ని వాళ్ళకి పరిచయం చేస్తాను..." అని వాల్య, జ్వరంలో పలవరించినట్టు, అతగాడికి జవాబు చెప్పింది

సరిగా ఆ సమయానికి కుజ్నెత్సోవ్ ప్రశాంతంగా చిరునవ్వు నవ్వుతూ కచేరీగదిలో నుంచి బయటికి వచ్చాడు. వాల్య పెట్టుకున్న దరఖాస్తు అతని చేతిలో ఉంది.

"హెర్ గావ్‌లెటర్ ఏమని రాశారు?" అని బాబాక్ కుజ్నెత్సోవ్‌ని బిగ్గరగా అడిగి, అతడి చేతిలోనుంచి ఆ కాగితం తీసుకుని గట్టిగా చదివాడు: "రోవ్నొలో ఉండిపోయేందుకు అనుమతి యివ్వడమైంది. రైఖ్స్‌కమిస్సారియాట్‌లో ఉద్యోగం చూపించండి' ఆహా! అభినందనలండీ మీకు, ఫ్రాయిలైన్! హెర్ ఓబెర్‌లెయ్‌ట్నాంట్, మీకు అభినందనలు!"

వెయిటింగు రూములో కూచ్చున్న వారందరూ లేచి నిలబడి, సీవెర్ట్‌నీ, వాల్కనీ అభినందించి, వారితో కరచాలనం చేశారు. బాబాక్ తన ప్రత్యేకానుగ్రహానికి చిహ్నంగా కొన్ని ఖరీదైన సిగరెట్టు ప్యాకెట్లను కుజ్నెత్సోవ్‌కి బహూకరించాడు.

వాల్క, సీవెర్ట్‌లు యిద్దరూ చెట్టాపట్టాలు వేసుకుని అక్కడనుండి వెళ్ళిపోయారు.

బస చేరుకున్న తరువాత, వాల్క అడిగింది కుజ్నెత్సోవ్‌ని:

"నిర్ణయానికి రాలేకపోయావా!"

"అది పిచ్చిపని అని తోచింది. ముగ్గురు సాయుధ భటులు; అంతేకాదు, నువ్వు గమనించావో లేదో, కిటికీ తెరల వెనకాల మరొకడెవడో ఉన్నాడు కూడా. ఆ పాడు కుక్క నా పాదాల దగ్గరే ఉందాయె. నేను పిసరంత కదిలినా సరే, నన్ను పట్టుకునివుండేవారే... కోఖ్ రోవ్నొనుండి వెళ్ళిపోకుండా వుండాలి, అంతే! వీడి గతి యిలు దగ్గర పడ్డాయి. వీడి నాశనం తప్పదు—ఆ నాశనం కూడా మన డిటాచ్‌మెంటుకి కాని, నీకుకాని, నాకుకాని, ఏ ప్రమాదభయమూ లేకుండానే. ఇహ 'పరీక్షతో నెగ్గాను.' తను ఏ మనిషితో మాట్లాడుతున్నాడో ఆ మనిషి ఈ జన్మలో జర్మనీ మొహం ఎలాంటిదో ఎరగని సోవియట్ గెరిల్లా అని రైక్స్‌కమిస్సార్ కోఖ్‌వంటి తూర్పు ప్రష్యను పోల్చుకోలేకపోయాడే! ఆ సంగతి తల్చుకుంటుందుకే వీల్లేకుండా ఉంది! మొత్తంమీద మన భేటీవల్ల ప్రయోజనం లేకపోలేదు. కుర్స్క విభాగంలో హిట్లర్ కొత్త దాడికి పథకాలు వేస్తున్నాడని కోఖ్ నాతో చెప్పాడు. కోఖ్ బెర్లిన్‌నుంచి యిప్పుడే తిరిగివచ్చాడన్న సంగతి మర్చిపోకు! అందుచేత యిది తాజా వార్త అన్నమాట. దీన్ని వెంటనే రిపోర్టు చేయాలి!"

## "ఏజెంట్లూ," "చీకటిబజారు వ్యాపారులూ"

చీకటిబజారు వ్యాపారి ఒకడు తరుచుగా ఒక సెకెండ్ హేండ్ షాపుకి వెళ్తూండడమూ, అక్కడున్న అన్ని రకాల వస్తువులనూ కొనివేస్తూండడమూ మర్చాక్ అనే పోలీసు ఏజెంటు కనిపెట్టాడు. ఈ చట్టావ్యాపారి రకరకాల శస్త్రచికిత్స పరికరాలనూ, ఖరీదైన సూటు ఒకటీ కొనడం మర్చాక్ ఒకనాడు చూశాడు. ఆ సూటు ఆ వ్యాపారికి సరిపడే సైజుది కాదని స్పష్టంగా తెలిసిపోతూనే ఉంది. దానిని అతడు తొడుక్కుని చూడలేదు కూడా. ఈ చీకటిబజారు వ్యాపారి గురించి మర్చాక్ తన మిత్రుడైన తోటి పోలీసు ఏజెంటుతో చెప్పాడు. ఆ చీకటిబజారు వ్యాపారిని అనుమానంమీద పట్టుకుందుకూ, అతడి దగ్గరనుండి లంచం కాజేసేం

దుకూ, లంచం యివ్వనని అతడు మొరాయించితే అతణ్ణి పోలీసు స్టేషనుకి తీసుకు వెళ్ళేందుకూ పోలీసు ఏజెంట్లు యిద్దరూ కూడబలుక్కున్నారు. ఆ చీకటిబజారు వ్యాపారికోసం వారిద్దరూ షాపులో కాసుకుని, అవకాశం దొరకగానే అతడితో ఏదో పిచ్చాపాటి కబుర్లు చెప్పి, అతణ్ణి సంభాషణలోకి దింపారు. వ్యాపారి కొద్దిగా తత్తర పడ్డాడు, కాని అదంతా వుత్త పోల్లు బాతాఖానీ అవడంచేత అతడు చిట్టచివరికి హుషారుగా మాట్లాడసాగాడు.

మర్చూక్ సూచనపైన, ఆ బాతాఖానీ పూర్తిచేసేందుకూ, తమకు పరిచయం కలిగినందుకు సంతోష సూచకంగా చిన్న వేడుక జరుపుకొందుకూ అక్కడకు దగ్గరలో ఉన్న రెస్టారెంటుకి వెళ్ళారు.

పోలీసు ఏజెంట్లు రెస్టారెంటులో ఖరీదైన మద్యమూ, దివ్యమైన భోజనమూ ఆర్డరుచేసి, అందుకైన ఖర్చు అంతా ఆ వ్యాపారి భరించాలని సూచించారు. అందుకు ఆ వ్యాపారి కూడా ఏ అభ్యంతరమూ వెలిబుచ్చలేదు.

విందు మంచి జోరుగా సాగుతూన్న సమయంలో పోలీసు ఏజెంటు మర్చూక్ చీకటి బజారు వ్యాపారితో యిలా అన్నాడు :

"చీకటిబజారు వ్యాపారి మంచి తెలివైనవాడై వుండాలి. అటువంటిది నువ్వు మా చేతికి మిడతంభట్లులా చిక్కావు!"

అలా అని, మర్చూక్ తన పోలీసు కార్డు తీసి తన కొత్త స్నేహితుడికి చూపించి, అతడు గనుక తన లాభంలో తమకు భాగం యిస్తే అతణ్ణి దయతల్చి తాము వదలిపెట్టేయవచ్చునని చెప్పారు. కాని ఆ వ్యాపారి మాత్రం ఆ బెదరింపులను లెక్కచేయకుండా సుష్టుగా భోజనంచేస్తూనే ఉన్నాడు. చిట్టచివరికి అతగాడు భోజనం పూర్తిచేసి, ప్రశాంతంగాలేచి, కమాండు చేస్తూన్నట్టుగా :

"బిల్లు చెల్లించండి!" అని ఆజ్ఞాపించాడు.

"ఇదేమిటి? ఎవడివయ్యా నువ్వు!" అని ఆపోలీసుఏజెంట్లు దబాయించారు.

చీకటి బజారు వ్యాపారి తన జేబులోనుంచి కార్డుతీసి, పోలీసు ఏజెంట్లకి చూపెట్టాడు. ఆ "కార్డుగల వ్యక్తి" గెస్టాపోయొక్క రోవ్నా నగరశాఖలో పని చేస్తూన్న ఉద్యోగి, వ్లదిస్లావ్ యాన్‌కేవిచ్ అని ఆ కార్డులో వుంది.

తక్షణమే ఆ రెస్టారెంటు బల్లదగ్గర పరిస్థితి పూర్తిగా మారిపోయింది. పోలీసు ఏజెంట్లు భోజనపు బిల్లు చెల్లించడమేకాకుండా, కాళ్ళావేళ్ళాపడి క్షమాపణ వేడుకున్నారు: గెస్టాపో మనుషులంటే పోలీసు ఏజెంట్లకి సింహస్వప్నమన్నమాటే!

రెస్టారెంటునుండి వెళ్ళిపోయినప్పుడు, పోలీసుఏజెంట్లు గుర్రబ్బండిని పిల్చి, యాన్‌కేవిచ్‌ని అందులో కూచోబెట్టి, అతడి బసకి తీసుకెళ్ళి దిగబెట్టారు.

యాన్‌కేవిచ్‌ది పగ సాధింపు తత్వంకాదని తెలిపోయింది. అంతేకాదు, అతడు మర్యాక్‌ని చూసేందుకు అతని ఇంటికి వస్తాననికూడా ఖరారుచేశాడు.

మా గెరిల్లా షెవ్‌చూక్ "ఉద్యోగరీత్యా" రోవ్నొ నగరంనుండి వెళ్ళి పోయి తిరిగి క్యాంపుకి చేరుకున్నప్పుడు, నా కీ కథ చెప్పాడు అతడే గెస్టాపొ మనిషి యాన్‌కేవిచ్.

షెవ్‌చూక్ పశ్చిమ ఉక్రెయినియాలో పుట్టాడు. అతడు పాతకాలంనాటి అజ్ఞాతవాస కార్యకర్త. పోలెండ్‌ను భూస్వాములు పరిపాలించుతూండిన రోజుల్లో, విప్లవక్రియలు సాగించినందుకు అతడు ఐదేళ్ళు ఖైదుశిక్ష అనుభవించాడు. 1939లో ఎర్రసైన్యం అతణ్ణి ఖైదునుండి విముక్తిచేసింది. అతడు మాగెరిల్లా డిటాచ్‌మెంటులో చేరినప్పటికి అతడికి నలభై య్యేళ్ళు దాటిపోయాయి.

షెవ్‌చూక్ రోవ్నొలో వున్న పరిస్థితులకు త్వరగా అలవాటుపడ్డాడు. ఆ వూళ్ళోవున్న అనేక జర్మన్లలాగానే ఇతడుకూడా నలుపురంగు కళ్ళద్దాలు పెట్టుకునేవాడు, వీధుల్లోకి వెళ్ళినప్పుడు చేతిలో పూలగుత్తి పట్టుకుని నడచేవాడు. చీకటిబజారులో చిల్లరవ్యాపారం చేసేవాడు. ఈ చీకటిబజారు వ్యాపారం జర్మన్ల కళ్ళు కప్పడానికి మాత్రమే. షెవ్‌చూక్ కొన్న వస్తువులలో అత్యధిక భాగం డిటాచ్‌మెంటుకి చేరేది అతడు గెస్టాపొ మనిషి అని ధ్రువపరుచుతూన్న కార్డు మేం స్వయంగా తయారుచేసినదే.

రెస్టారెంటులో ఈ కథ జరిగిన తరువాత, యాన్‌కేవిచ్‌గెస్టాపొ ఏజెంటని వూళ్ళో పుకారులేచింది. అతడు బసచేస్తూన్న భవనపు మేనేజరు అక్కడి "అను మానస్థులను" గురించి అతడితో రిపోర్టుచేయడం మొదలుపెట్టాడు. ఈ లోపున షెవ్‌చూక్ ఒక బసలోనే కాకుండా, అనేకుల బసలలో కూడా నివసించుతూండే వాడు. వీరు మాకు పరిచయస్థులై వుండి, మాకు సహాయం చేసేందుకు ఇష్ట పడ్డారు

రోవ్నొలో మా "చీకటిబజారు వ్యాపారి" మరొకడు కూడా పనిచేస్తూండే వాడు. పొడుగరి, అందగాడూ అయిన నికొలాయ్ గ్నెద్యూక్. ఇతణ్ణిఉక్రెయినియన్ అమ్మాయిలు "పూజ్యనేత్రాలు" అని పిలచేవారు. ఇతడు రోవ్నొలో బసీన్‌స్కీయ్ అనే మారుపేరుతో పోలెండ్ దేశస్థునిగా చెలామణీ అవుతూండేవాడు.

గ్నెదూ్యక్ వస్తువులను చవుకగా కొని, కొద్దిలాభం వేసుకని అమ్ముతూ అప్పుడప్పుడు నష్టానికి కూడా అమ్ముతూ, చీకటి బజారు వ్యాపారాన్ని ఒక ముసుగు కింద సాగించుతూండేవాడు. షెవ్‌చూక్ సందర్భంలోలాగానే, ఇతణ్ణి కూడా పోలీసు ఏజెంట్లు వేధించుక తినడం మొదలుపెట్టారు. అయితే, ఇతడు వారికిలంచం ఇచ్చి, వారిని లోబరుచుకున్నాడు.

గ్నెదూ్యక్ కూడా ఒక అజ్ఞాతవాస కార్యకర్తల గ్రూపును ఆర్గనైజుచేసి, అనేక రహస్య సాంకేతిక స్థలాలను ఏర్పాటుచేశాడు.

ఈ రోజులకు కొద్దిగా ముందుగా నికొలాయ్ స్త్రుతిన్‌స్కీయ్ లూత్స్క పట్నం వదలిపెట్టి రోవ్నొకి తిరిగి వెళ్ళిపోయాడు. లూత్స్కలో కొన్ని గూఢచారి దళాలను ఆర్గనైజుచేసి, వాటిచేత పని మొదలుపెట్టించాడు. లూత్స్కనుండి వచ్చేసే ముందు అతడు, ఎందుకైనా మంచిదని చెప్పి ముందుజాగ్రత్తతీసుకుని, ఆపట్నంలో జర్మన్లు ప్రచురించుతూన్న "ఉక్రైనియా వాణి" అనే దినపత్రిక విలేకరిగా పత్రాలు సంపాదించుకున్నాడు.

స్త్రుతిన్‌స్కీయ్ రోవ్నొలోని గెస్టాపొ, గెబీట్స్‌కమిస్సారియాట్* కార్యకలాపాలపై ప్రత్యేకమూ కన్నువేసి వుంచాడు. ఈ ఆఫీసులలోపనిచేస్తూన్న వారిలో అతనికి మంచి సహాయకులు దొరికారు. అతని తమ్ముడు జోర్జ్‌కూడా రోవ్నొలోనే గ్రిగోర్ వసిలేవిచ్ అనే మారుపేరుతో వుంటూ అన్నగారికి కుడిబుజంగా పని చేస్తూండేవాడు.

ఈ విధంగా మేం ఒక్కొక్క అడుగువేసుకునివెళ్తూ, రోవ్నొలోవున్న నాజీ కార్యాలయాలను మా గూఢచారులు పన్నిన వలలో పట్టివేశాం.

మా స్కౌట్లు ఇంచుమించు నిరంతరమూ రోవ్నొలోనే వుండేవారు, ఎప్పుడోగాని రోవ్నొ వదలిపెట్టేవారుకాదు. పెద్ద కుట్ర ఒకటి పన్నే ఉద్దేశంతో వారు ఒక్కొక్కరే వేర్వేరుగా పనిచేస్తూండేవారు. ప్రతి స్కౌటుకి ఒక సొంత హర్కారా వుండేవాడు. ఈ హర్కారా ద్వారా ఆ స్కౌటు చౌకీతోనూ, క్యాంపు తోనూ సమాచార సంబంధాలు నెరపుకొనే వాడు : చిట్టి కోల్య ద్వారా కుజ్నెత్సోవ్; డ్రొల్‌బునోవొ గ్రూపు హర్కారాల ద్వారా గ్నెదూ్యక్; మజూర ద్వారా షెవ్‌చూక్ జోర్జ్, యాద్విగ ద్వారా స్త్రుతిన్‌స్కీయ్.

* గెబీట్స్‌కమిస్సారియాట్—ప్రాంతీయ కార్యాలయం. —సం.

రహస్య కార్యం నడపవలసిన పరిస్థితులనుబట్టి, మా స్కౌట్లు ఎవరి మట్టుకు వారు విడివిడిగా పనిచేయవలసి వచ్చింది. కాని మా వాళ్ళు అప్పుడప్పుడు— పరస్పర సహాయం అవసరమైనప్పుడూ, లేక ఏదైనా ఒక చర్య ఉమ్మడిగా జరప వలసి వచ్చినప్పుడూ—ఒకరితో ఒకరు సంబంధాలు పెట్టుకునేవారు.

డిటాచ్‌మెంటులో ఎవరు రోవ్నోలో వుంటున్నదీ మా స్కౌట్లకు తరచుగా తెలిసేదికాదు. "పాతకాపులు" ఎవరో "కొత్త రిక్రూట్లకి" తెలిసేదేకాదు. ఈ కారణంచేత కొన్ని కొన్ని తమాషా సన్నివేశాలు సంభవించుతూండేవి. అటువంటి ఒక సన్నివేశం గురించి చెబుతాను.

లీదియ అనే అమ్మాయి మాకు క్రియాశీలంగా సహాయంచేస్తూండేది. ఆ అమ్మాయి యింటికి నికొలాయ్ గ్నెద్యూక్ ఒకసారి వెళ్ళాడు. లియో మెల్కో అనే వ్యక్తి గురించి ఇంతకుముందే చెప్పానుకదా. ఇతడు ఓబెర్‌లోయ్‌ట్నాంట్ పౌల్ సీబెర్ట్‌ని ఈ అమ్మాయికి పరిచయంచేశాడు. తనకు సాయంచేసేటట్టుగా ఈమెను ఒప్పించేందుకని సీబెర్ట్ తరుచు ఈమె ఇంటికి వెళ్తూండేవాడు.

ఒక్కొక్కప్పుడు సీబెర్ట్ లీదియ ఇంటికి వెళ్ళినప్పుడే గ్నెద్యూక్ కూడా అక్కడ వుండడంచేత, "జర్మన్ ఆఫీసరు" కంటబడకుండా ఆ ఉక్రైనియన్ గెరిల్లాను లీదియ తన ఇంట్లో ఎక్కడో దాచవలసి వచ్చింది.

"ఇదిగో, వినండి" అంది ఆమె ఒకనాడు గ్నెద్యూక్‌తో, "ఈ వెధవ పౌల్‌ని మనం ఈ లోకంలోనుంచి పంపించేస్తేనే గాని వీల్లేదు. ఎందు కొస్తున్నాడో మా యింటికి? వీణ్ణి చూస్తేనే నాకు అసహ్యంవేస్తూంది! పతకాలూ, అలంకృతులూ తగిలించుకుని పగటి వేషగాడిలా తయారవుతాడు. ఒక్క ముక్క అయినా రష్యన్ మాటాడలేడు. ఇహ, అతగాడు పోలిష్ భాషను చిత్రవధచేస్తూంటే—ఇహ నా వొళ్ళు మండిపోతుంది!"

"అంత పని అవసరమా అని?" అన్నాడు గ్నెద్యూక్, ఆమె ఎవరిని గురించి అంటూందో అతడికి రవంతైనా అర్థంకాక.

"అవసరమే మరి! నాజీ ముఖ్యుడు!" అందామె.

సీబెర్ట్ మళ్ళీ లీదియ ఇంటికి వచ్చినప్పుడు, సీబెర్ట్‌ని సన్నసన్నగా చూడగల్గే అవకాశం గ్నెద్యూక్‌కి ఆమె కల్గజేసింది, పక్క గదిలో దాగున్న గ్నెద్యూక్ తలుపుకున్న తాళపు కన్నంలోనుంచి చూశాడు – ఆ మనిషి మరెవ్వడూ కాదు,

కున్నాత్సేన్: లీదియకి ఆ రహస్యం తెలియజెప్పడమే మంచిదని గ్నెద్యూక్ నిశ్చయించి, చెప్పేశాడు. ఆ "జర్మన్ ఆఫీసర్" "వెధవ పౌలా", లీదియ ఆనాటినుండి మంచి స్నేహితులయ్యారు.

ఇలాటిదే మరొక సంగతి వినండి.

ఒకనాడు మన స్కౌట్లు ఇద్దరు రోవ్నొనుండి క్యాంపుకి తిరిగివచ్చేసి, తమ రిపోర్టుయిచ్చి, వూరిలో గెస్టాపోలో పనిచేస్తూన్న ఒక ఉక్రైనియన్‌తో తాము తారసపడ్డామనీ, అతడివలన తమకు నానా చిక్కులూ కలుగుతున్నాయనీ ఫిర్యాదు ఇచ్చారు.

"మిమ్మల్ని ఏం చిక్కులు పెడుతున్నాడు?" అని అడిగాడు లుకిన్.

"అతడు తరుచుగా హాన్నను చూడ్డానికి వస్తూంటాడు. మేం ఆమె ఇంట్లోనే రహస్యంగా కలుసుకుంటూంటామాయె."

"అతడు ఎలా వుంటాడో చెప్పగలరా? అతడి గురించి ఏమైనా వివరాలు మీకు తెలుసునా?"

"వాడొక ముసలి పిశాచం: కళ్ళజోడు పెట్టుకుంటాడు, మా బసకి వస్తూంటాడు ... ఇహ ఏం చెప్పమంటారు—వాడు గెస్టాపో మనిషి అని భవనం మేనేజరుకి సహితం తెలుసును: ఇహ, వాడి అంతుచూస్తేనేగాని లాభంలేదు, ఇప్పటికే ఆలస్యమైపోయింది"

"ఆగండి, ఆగండి:" అన్నాడు లుకిన్ కాస్తఆందోళన పడుతూ. "చీకటి బజారు వ్యాపారం చేస్తుంటాడు, వాడేనా?"

"ఇంకా అడుగుతారేమిటి? వాడే:"

ఆ మనిషి మిహాయిల్ షెవ్‌చూక్ అని తేలిపోయింది.

కొద్దిరోజులు పోయాక, షెవ్‌చూక్ హాన్నను "వివాహం చేసుకున్నాడు." తన "వివాహానికి" అతడు చాలామందిని ఆహ్వానించాడు. వివాహానికి వచ్చినవారిలో పోలీస్ ఏజెంట్ మర్చ్యాక్ కూడా వున్నాడు. దీనితో షెవ్‌చూక్ రోవ్నొ నగరవాసులతో ఒకడనీ, ఒక ఇంటివాడనీ నలుగురిలోనూ స్థిరపడిపోయింది.

అయితే అన్ని సందర్భాల్లోనూ మా కార్యకలాపాలు ఇంత సాఫీగా సాగిపోలేదు.

కరపెత్యాన్ అనే స్కౌటుని మేం అప్పుడప్పుడు పనిమీద రోవ్నొ పంపే

హారం. ఎర్ర సైన్యంలో లెఫ్టినెంటుగా పనిచేస్తూన్న ఒక ఆఫీసరు భార్య రోవ్నొలో వుంటూంది. కరపెత్యాన్ రోవ్నొ వెళ్ళినప్పుడల్లా ఆమె ఇంటికి వెళ్తూండేవాడు. ఆమెకి ఇద్దరు పిల్లలు.

ఒకనాడు సాయంకాలం కరపెత్యాన్ తాగి, ఆ యింటికి వచ్చాడు. అతడు వచ్చిన వేళకి అక్కడ ఇద్దరు పరాయివాళ్ళున్నారు. కరపెత్యాన్ నిషామీద వున్నాడేమో, మంచీ చెడ్డా చూసుకోకుండా ఇష్టం వచ్చినట్టూ పేలడం ఆరంభించాడు.

"నే నెవణ్ణో తెలుసా మీకు?" అనిబడాయిలు కొట్టడం మొదలుపెట్టాడు. "అబ్బే, మీ కేం తెలుస్తుంది? మీరు పోల్చుకోలేరు. నేను జర్మన్ల పాలిటి యముణ్ణి!"

ఆ యింటి ఇల్లాలు, కొత్తవాళ్ళ వెనుక నిలబడి, కరపెత్యాన్‌కేసి సంజ్ఞ చేసింది: మాట్లాడకోయ్. బాబూ—అని. కైపెక్కి వున్నాడేమో, కరపెత్యాన్ వూరుకుంటాడా?

"నాకు తెలుసును, నేను ఏమి మాట్లాడుతూన్నదీ. నువ్వూరుకో! నేవంటూన్నదేమంటే... చూశారూ— నన్నెవ్వడూ వుత్తచేతుల్తో ముట్టుకోలేడు, ఏమనుకున్నారో! ఇదిగో చూడండి!" అంటూ కరపెత్యాన్ తన రివాల్వరూ, చేతి బాంబులూ చూబెట్టాడు. "ఏం, హడలిపోయారా, లేదా! మిమ్మల్ని ఏమీ చెయ్యను లెండి. కాని, వాళ్ళున్నారే..."

ఆ పరాయివాళ్ళు ఈ మాటలు విని విని, మెల్లగాలేచి, వీడ్కోలు చెప్పి వెళ్ళిపోయారు.

ఈ కథ విషాదంతో అంతమైంది.

కరపెత్యాన్ క్యాంపుకి తిరిగివచ్చిన తరవాత, ఈ వృత్తాంతం గురించి మాట చెప్పనేలేదు. కాని రోవ్నొలో ఆ యింటికే వెళ్తూండిన నికొలాయ్ స్త్రుతిన్‌స్కీయ్,ఆయింటి ఇల్లాలునూఆమె పిల్లల్నీ గెస్టాపొలుఅరెస్టు చేశారని రిపోర్టుచేశాడు.

మా హెడ్‌క్వార్టర్స్‌లో కరపెత్యాన్‌న్ని ప్రశ్నించగా, అతడంతా ఒప్పుకున్నాడు. అతడు చేసిన నేరం క్షమించ వీలులేనిది. మా హెడ్‌క్వార్టర్స్ కమాండు నిర్ణయం ప్రకారం అతనికి మరణశిక్ష చెప్పి, అతణ్ణి తుపాకులతో కాల్చేశాం.

ఇది జరిగిన కొద్ది రోజుల తరవాత, జోర్జ్ స్త్రుతిన్‌స్కీయ్‌ని గెస్టాపొ అరెస్టు చేసింది. కరపెత్యాన్ బయటపెట్టిన రహస్యపు చిరునామాకి జోర్జ్ వెళ్తూన్నప్పుడు గెస్టాపొలు అతని కాపుకాసిపెట్టారు.

అడవిలో వున్న "పర్ణశాల" చౌకికి జోర్జ్ వెళ్తూండగా ఆ రోడ్డుమీద గెస్టాపొలు అతణ్ణి పట్టుకున్నారు. అతడు ఎలాగో ఒకలాగు పోలీసులచేతుల్లోనుంచి గుంజుకుని పారిపోగల్గాడు. అతడు పారిపోతూ కాల్పులు సాగించాడు. పోలీసులు అతడిమీద కాల్చారు. జోర్జ్‌ని ఎన్నిబాధలు పెట్టినా అతడు నోరు విప్పడనే సంగతి మాకు తెలుసు, ఆ విషయమై మాకెట్టి సందేహమూ లేదు. కాని మా కదమమనుషుల ఆచూకీ కూడా గెస్టాపొకి తెలిసిపోయే ప్రమాదం మాత్రం లేకపోలేదు.

అందుకని కొద్దిరోజుల తరువాత మా స్కౌట్లని రోవ్నోనుండి వెనక్కి పిలిపించి వేసేందుకే నిర్ణయించుకున్నాం. కుజ్నెత్సోవ్, షెవ్‌చూక్, గ్నెద్యూక్, నికొలాయ్ స్త్రుతిన్‌స్కీయ్‌లు రోవ్నో వదలిపెట్టి జ్డోల్‌బునోవొకి వెళ్ళిపోయి, ఈ రగడ అంతా తేలిపోయే వరకు జ్డోల్‌బునోవొలోనే వుండిపోయారు.

ముందుజాగ్రత్త కోసమని మేం తీసుకున్న ఈచర్య అనవసరమయినట్లు మాకు తరువాత తెలిసింది. రోవ్నోలో మా కార్యకలాపం గురించి గెస్టాపొకి ఏమీ తెలియలేదు.

## కొవ్పాక్‌తో సమావేశం

1943 ఫిబ్రవరిలో, మా పూర్తి డిటాచ్‌మెంటు ఇంకా సార్నీ అరణ్యాల లోనే వుంటూండిన రోజుల్లో, మాకు ఉత్తరదిశగా ఎక్కడోగాని, పెద్ద గెరిల్లా యూనిట్టు ఒకటి చర్యలు జరుపుతూన్నదని రోవ్నో, సార్నీ, క్లెసొవొ, రకీత్నో యిలలో వున్న మా స్కౌట్లే కాకుండా, స్థానిక ప్రజలనుండి కూడా మాకు తరచుగా రిపోర్టులు అందుతూండేవి.

"అక్కడ కొవ్పాక్ ఓ లక్ష గెరిల్లా సేనను నడుపుతున్నాడు" అని స్థానిక ప్రజలు చెప్పుకుంటూండేవారు.

"కొవ్పాక్ నాయకత్వాన వున్న ఒక పెద్ద గెరిల్లా డిటాచ్‌మెంటు గురించి మిలిటరీ పోలీసూ, స్పెషల్ సేనాబలాలూ చాలా ఆందోళన పడుతున్నాయి. కొవ్పాక్ అకస్మాత్తుగా ప్రత్యక్షమవుతాడనీ, జర్మన్ గారిజన్లనూ, వంతెనలనూ, రైళ్ళనూ నాశనం చేస్తాడనీ వీరు చెబుతున్నారు. అతడు రోవ్నోలోకి కూడా చొర బడతాడేమో అని వీరు భయపడుతున్నారు." అని కుజ్నెత్సోవ్ రోవ్నోనుంచి నాకు రాశాడు.

ఈ యూనిట్టు ఏమిటో, ఈ కొవ్పాక్ ఎవడో అప్పట్లో మా కింకా ఏమీ తెలియదు.

కొద్ది రోజులకల్లా వలెన్‌తీన్ సెమ్యోనొవ్ నాకు రిపోర్టుచేశాడు. కొవ్పాక్ గెరిల్లాలు క్న్యైజ్-సెలో గ్రామంలో అగపడ్డారనీ వారు ఆ చుట్టుపక్కల పల్లెటూళ్ళలో మకాం చేస్తున్నారనీ.

"నువ్వు వారిని చూశావా ?" అని నేను సెమ్యోనొవ్‌ని అడిగాను.

"నేను కొవ్పాక్‌ని చూడలేదు కాని, అతడి ప్రతినిధులు మన దగ్గరకు వస్తున్నారు."

ఆ వార్త నిజమే అయింది. మరొక గంటలో కొవ్పాక్ ప్రతినిధి నాతో మాట్లాడుతూనే వున్నాడు. నా దగ్గరకు వచ్చిన మనిషి పొడగరికాదు, పొట్టికాదు. మామూలుగా వున్నాడు: గుండుగా బొండాంలా వున్నాడు, పెద్దగడ్డం. అతడు గుర్రందిగి, తనకు తానే పరిచయం చేసుకుంటూ :

"నా పేరు వెర్షిగోర, కొవ్పాక్ డిటాచ్‌మెంటులో రికాన్నిసెన్స్ శాఖ నాయకుణ్ణి" అన్నాడు.

అతడి యూనిఫారం షర్టు కాలరుకు వున్నట్టి మూడు దీర్ఘ చతురస్రాలను బట్టి అతడు లెఫ్టెనెంట్ కర్నల్ అని తెలుస్తూంది. ఎడమ ఛాతిపైన రెడ్ బానర్ పతకం సరికొత్తది వుంది.

మా ప్రశ్నలకి వెర్షిగొర ముక్తసరిగా జవాబుచెప్పాడు. కాని జర్మన్ గారిజన్ పటాలాల స్థానాలను గురించీ, రోవ్నొలోనూ, రోవ్నొ జిల్లాలోనూ వున్న జర్మన్ సైనికుల సంఖ్య గురించీ, గెరిల్లాలు ఏ యే గ్రామాలను కంట్రోలు చేస్తూన్నదీ ఆ విషయం గురించీ మమ్మల్ని అనేక ప్రశ్నలడిగి సవివరంగా తెలుసుకున్నాడు.

"ఎర్ర సైన్యం వార్షికోత్సవం జరిపేందుకని సీదొర్ కొవ్పాక్, సెమ్యోన్ రూద్నెవ్‌లు నిశ్చయించారు, క్న్యైజ్-సెలో గ్రామంలో జరిగే ఈ ఉత్సవానికి మీరు రావలసినదిగా మిమ్మల్ని ఆహ్వానిస్తున్నారు. ఆహ్వానాన్ని మీకు అందజేయవలసినదిగా నన్ను కోరారు" అన్నాడు వెర్షిగొర.

ఫిబ్రవరి 23 తెల్లవారు జామున నేనూ, పపూనూ క్న్యైజ్-సెలో గ్రామానికి బయల్దేరాం. మా వెంట చిన్న గెరిల్లా దళం కూడా వచ్చింది.

నేను గెరిల్లా జీవితం గడుపుతూండిన రోజుల్లో, శత్రుశ్రేణి వెనుక ప్రాంతాల్లో గెరిల్లా డిటాచ్‌మెంట్లనీ, స్కౌట్లనూ, ఒంటరిగా పనిచేస్తూన్న గెరిల్లాలనూ నేను అనేక పర్యాయాలు కలుసుకోవడం తటస్థించింది. మరెందుచేతనో

గాని, ఈ సమావేశాలు నాలో ప్రగాఢ భావనలను రేకెత్తించేవి. "మేం వంటరు లంతాము. మేం ఎంతమందిమో వున్నాం. మేం సర్వత్రా వున్నాం" – అని నాకు అనిపించేది. కాని కొవ్పాక్‌తోనూ, అతని మనుషులతోనూ సమావేశాన్ని మాత్రం నా జీవితంలో నేనెన్నడూ మరచిపోలేను.

కొవ్పాక్ యూనిట్లు విడిసివున్న లెన్‌చిన్, వ్రద్నొక్ – లెన్‌చిన్‌స్కయ గ్రామాలలోనుంచి మేం వెళ్తూన్నప్పుడు, శత్రుశ్రేణి వెనుకప్రాంతాల్లోనేను వున్నానవే సంగతే మరచి పోయాను. సబ్‌మెషీన్‌గన్నులతోనూ, తేలిక మెషీన్‌గన్నులతోనూ సాయుధులైన సైనికులు వీధుల్లో తిరుగుతున్నారు. ఎరుపు పట్టీలూ, ఎర్రసైన్యపు నక్షత్రాలు వారి టోపీలపై మెరుస్తున్నాయి. కొవ్పాక్ సైనికులలో అనేకుల షర్టులపై అలంకృతులూ, ఆర్డర్లూ, కొత్త పతకాలూ తళుక్కులీనుతున్నాయి. అక్కడక్కడ గుడిసెల ఎదురుగా మెషీన్‌గన్నులూ అంతేకాదు, ఫిరంగులు సహితమూ వున్నాయి. గెరిల్లాలు పాటలు పాడుతున్నారు, ఒకరినొకరు సరదాగానూ హుషారుగానూ పలకరించుకుంటున్నారు.

కొవ్పాక్ బ్రహ్మాండమైన మనిషి అనీ, అతడి గొంతుక గంటలా ఖంగ్ ఖంగుమంటూంటుందనీ నేను అంతవరకూ మనసులో ఊహించుకున్నాను. అలాంటప్పుడు, మెల్లని గొంతుకతో మాట్లాడుతూన్న బక్కపలచని అరవయ్యేళ్ళ మనిషిని చూసేసరికి నేను ఎంతటిఆశ్చర్యచకితుడనయ్యానో మీరే ఊహించుకోగల్గుతారు. అతడి ఛాతిపైన "సోవియట్‌వీర" బిరుదానికి చిహ్నమైన స్వర్ణతార పతకమూ, ఆర్డర్ ఆఫ్ లెనిన్ తళతళ మెరుస్తున్నాయి.

"నమస్తే, కామ్రేడ్ మెద్వేదెవ్!" అన్నాడాయన. "బ్రాన్‌స్క్ అడవుల్లోనూ, ఇక్కడ ఉక్రెయినియాలోనూ మీ గురించి చాలా విన్నాము. మీరు ఎంతో గొప్పపనిచేస్తున్నారు!"

కొవ్పాక్ నా పై ప్రశ్నల వర్షం కురిపించాడు: మీరిక్కడ చాలాకాలమయ్యే వుంటున్నారా? మీరు ఏ విధంగా పని నడుపుతున్నారు? రోవ్నొ చేయవలా ఇంకా చాలాకాలమే వుంటారా? అన్ని విషయాలగురించీ ఆయనకు నేను సవివరంగా తెలియజేశాను.

"ఎర్ర సైన్యం ఇక్కడకు వచ్చేవరకూ మేం ఇక్కడే వుంటాం" అన్నాను.

మేం ఇలా మాట్లాడుతూ వుంగా, ఒక అందమైన పొడగరి ఆ గదిలోకి

వచ్చాడు. అతని ఆర్మీచొక్కాపైన ఆర్డర్లు మెరుస్తున్నాయి. అతని ముఖం అలసి పోయింది.

"నన్ను పరిచయంచేయనీయండి: ఇతడు నాకమిస్సార్" అగంతకుడికేసి చూపించాడు కొవ్పాక్.

మేమిద్దరం మనఃపూర్వకంగా కరచాలనం చేసుకున్నాం. సెమ్యోన్ రూద్నెవ్ మా సంభాషణలో కలిశాడు.

"మీ గెరిల్లాలు రోవ్నాలోనే పనిచేస్తున్నారట, నిజమే!" అని అడిగాడతడు.

అవునని నేను చెప్పగా విని, రూద్నెవ్ అత్యుత్సాహపడ్డాడు. మీరిపని ఎలా చేయగల్గారు? మీ మనుషులు ఏ యే డాక్యుమెంట్లను ఉపయోగించుతున్నారు? ఆ వూళ్ళో వున్న స్థానిక అజ్ఞాతవాస బోల్‌షెవిక్ ఆర్గనైజేషనుతో సంబంధాలను మీరు ఎలా స్థాపించుకోగల్గారు! నొవాక్ ఎవరు? అతడూ మీరూ ఏ విధంగా ఉమ్మడి చర్యలను ఆర్గనైజు చేయగల్గారు ? —అంటూ మా పనిగురించి అత్యంత స్వల్పవివరాలను గురించి సహితమూ అతడు నన్ను ప్రశ్నించాడు.

"మనం కూడా ఇటువంటి పని మొదలెట్టడం మంచిదండీ!" అన్నాడు రూద్నెవ్ కొవ్పాక్‌తో.

తన రికాన్నిసెన్స్ శాఖ నాయకునికి కూడా ఇటువంటి డాక్యుమెంట్లను సప్లై చేయవలసిందని కొవ్పాక్ నన్నుకోరి, ఇంకా ఇలా అన్నాడు :

"ఆ వూళ్ళోకి పంపించేందుకు తగిన మనుషులు మావాళ్ళలోనూవుంటారు, కాని నా దగ్గర జర్మన్ ఎవ్వడూ లేడు."

"జర్మనా ? అదేమిటి ?" అని అడిగాడు రూద్నెవ్.

"అవును మరి. వాళ్ళ గెరిల్లా ఒకడు రోవ్నాలోనే జర్మన్‌కింద చెలామణీ అవుతూ గెరిల్లా చర్యలు సాగిస్తున్నాడు!" అన్నాడు కొవ్పాక్.

"ఏమిటీ!... అతణ్ణి చూడ్డానికి వీలవుతుందండీ ?"

"దురదృష్టవశాత్తూ వీల్లేదండి. ప్రస్తుతం అతడు రోవ్నాలోవున్నాడు" అన్నానేన్ను.

"రోవ్నా ప్రాంతంలో మేం జరిపిన విధ్వంసకార్యాల ఫలితాలను గురించి మీ 'జర్మన్' ద్వారా తెలుసుకుందుకు వీలవుతుందండీ?" అని అతడడిగాడు.

ఈ విషయమై కుజ్నెత్సోవ్‌కి ఆదేశాలు పంపుతానని ఖరారుచేశాను.

సాయంకాలం కావస్తూంది. మూడుగదులనిండా టేబిల్సు వేసివున్నాయి. స్టాఫ్‌లో పనిచేస్తూన్నవారూ, బటాలియన్ కమాండర్లూ, కంపెనీ కమాండర్లూ—అంతా ఓ డెబ్భైమంది వరకూ టేబిల్సు దగ్గర కూర్చున్నారు.

మొదటి టోస్టు మన పార్టీకి. దానిని కొవ్పాక్ ప్రతిపాదించాడు. అతడు మాట్లాడిన తరువాత సెమ్యోన్ రూద్నెవ్ మాట్లాడాడు. తమ కమాండరూ, కమిస్సారూ చెప్పిన మాటలను ఆ మనుషులు ఎంతటి నిర్వ్యాజ ప్రేమతోనూ, భక్తితోనూవిన్నారో నిజంగా చూడవలసినదే!

వారిద్దరూ మాట్లాడిన తరువాత, నన్ను మాట్లాడమన్నారు.

మా డిటాచ్‌మెంటు గురించీ, కొవ్పాకూ, కొవ్పాక్ మనుషులూ ఆ ప్రాంతంలో ప్రత్యక్షమైన కారణంగా నాజీలు ఎంతగా హడలుతున్నారో, స్పెషల్ పటాలాలు గ్రామాల్లోనూ, గూడేల్లోనూ అతిజాగ్రత్తగా ప్రవేశించి, "కొవ్పాక్ మనుషులు మీ వూళ్ళో వున్నారా?" అని ఎంత ఆందోళనతో అడుగుతున్నారో ఆ విషయాలను గురించీ చెప్పాను. కొవ్పాక్ రోవ్నొపై దాడిచేస్తాడేమో అని ఆ పట్నంలో వున్న జర్మన్ "పరిపాలకులూ," వారి అడంగులూ భయంతో ఎలా బిక్కచచ్చిపోయున్నారో చెప్పాను.

ఎకార్డియన్ పక్కవాద్యంతో డాన్సులూ, నృత్యమూ చెలరేగుతూండగా ఉత్సవం ముగిసింది. తెల్లవారుట్ల మేం మా క్యాంపుకి బయల్దేరాం.

మరి మూడురోజుల తరువాత కొవ్పాక్ యూనిట్టు ప్రఖ్యాతిచెందిన తమ కార్పేథియన్ దండయాత్రపై బయల్దేరినప్పుడు, కమిస్సార్ రూద్నెవ్ కోరిన యావత్తు సమాచారమూ అతనికి పంపించాను.

నాలుగు నెలలు గడిచాయి. ఈ నాలుగు నెలలలోనూ మేం స్లూచ్, గోరీన్ నదులు దాటి, ఇంకా పశ్చిమదిశగా సాగివెళ్ళి త్సూమన్‌స్కీయె అడవులలో స్థిరపడ్డాం.

బాగా ఎండ కాస్తూన్న ఒక జూన్ దినాన, క్యాంపుకి రెండు కిలోమీటర్ల దూరాన్నున్న హైరోడ్డుకి చేరువగా వున్నట్టి మా రహస్యపు చౌకీ పంపిన హర్కారా గాభరాపడుతూ నా గుడారంలోకి రావడం నాకు జ్ఞాపకం వుంది.

"కామ్రేడ్ కమాండర్! జర్మన్ కాలమ్ ఒకటి జురావిచి గ్రామం తరఫు నుండి హైరోడ్డు మీదుగా వస్తూంది. అగ్రగామిదళమంతా కేవల్రీ, దాని వెనకాల—నాటుబండ్లమీద సైనికులు. ఫిరంగులుకూడా వున్నాయి" అని చెప్పాడు.

ఈ రిపోర్టు ఏమిటో నే నింకా గ్రహించుకునేలోపునే, మరో ఇద్దరు మనుషులు రొజుకుంటూ పరుగెత్తుకుని ఏకసమయంలో నా దగ్గరకు వచ్చారు: ఒకడు గస్తీచౌకిలో వుండే సైనికుడు; రెండోవాడు, క్యాంపుకి చేరువగా అడవిలో వున్న పచ్చికబయలులో మా పశువుల్ని మేపుతూన్న గెరిల్లా. జర్మన్ కేవ్లైరీని స్వయంగా చూశామని వారిద్దరూ చెప్పారు.

ఇక ఏ సందేహానికి తావులేకపోయింది: మా పై దాడిచేసేందుకు నాజీలు మూడు దిశలనుండీ విజృంభిస్తున్నారు.

రిజర్వు ప్లటూనికి తను నాయకత్వం వహించాల్సిందనీ, దాన్ని తీసుకుని శత్రుపార్శ్వాన కమాండ్ స్థానాన్ని ఏర్పాటు చేయాల్సిందనీ స్తేహొవ్‌ని ఆర్డరు చేశాను. నేను క్యాంపులోనే వుండిపోయి కదమ ప్లటూన్లకి నాయకత్వం వహించి, ఇతర చౌకిలతో సంబంధాలను ఏర్పరచుకున్నాను.

స్తేహొవ్ రెండువందల మీటర్లు సాగివెళ్ళేలోపునే, మెషిన్‌గన్ను కాల్పుల సుదీర్ఘధ్వనీ, దాని తరువాత సబ్‌మెషిన్‌గన్నుల, రైఫిళ్ళ భారీ కాల్పులూ వినబడ్డాయి.

ఈ కాల్పులు మనవాళ్ళవే అని నేను నిశ్చయించుకుని, మనకి అసలే తక్కువగా వున్న మందుగుండు సామగ్రిని మనవాళ్ళు వృధా చేస్తున్నారే అని భయపడి, బాగా గురిచూసుకుని మాత్రమే కాల్పులు కాల్చవలసిందనీ, మందుగుండు చాలా పొదుపుగా వాడవలసిందనీ హర్కారా ద్వారా ఆర్డరు పంపాను.

హర్కారా వెంటనే చెట్లమధ్య అదృశ్యమైపోయాడు.

సరిగా ఈ సమయానికి గస్తీచౌకినుండి నాకు రిపోర్టు అందింది:

"కామ్రేడ్ కమాండర్! జర్మన్లు ఫిరంగులను రోడ్డుపైన మోహరింటు తున్నారు!" అందుపైన, బజానొవ్‌ని:

"ముప్పైఐదుగురు సబ్‌మెషిన్‌గన్నర్లను తీసుకువెళ్ళి ఆ ఫిరంగులను పట్టుకోండి!" అని వెంటనే ఆజ్ఞాపించాను.

బజానొవ్ వెంటనే అడవిలో అదృశ్యమైపోయాడు.

యుద్ధం ముమ్మరంగా సాగుతూంది. "హుర్రా!" అని కేకలు వినబడ్డాయి.

"నాతో చెప్పకుండానే స్తేహొవ్ ఎదురుదాడికి దిగాడా ఏమిటి?" అని నేను అనుకున్నాను. ఇలా అనుకున్నాను, ఇంతట్లోకే నేను పంపిన హర్కారా తిరిగి వచ్చేసి రిపోర్టు చేశాడు:

"మీ ఆర్డరు అందజేశాను. అందుపైన శ్క్రమేడ్ స్తేహావ్, కాల్పులు వస్తూన్నది జర్మన్ల పక్షంనుండి అనీ, మనవాళ్ళు యించుమించు కాల్పులు కాల్చ డమే లేదనీ రిపోర్టు చేశాడు. రష్యన్ల 'హుర్రా' కేకలు శత్రుపక్షంనుండి ఎడతెరిపి లేకుండా వస్తూండడం విని అతడు ఆశ్చర్యపడుతున్నాడండి."

"తన మనుషులని ఎదురుదాడికి పంపవద్దని స్తేహావ్‌కి కబురు అంద జేయి. అతని ఎడమచేతివైపు శత్రు ఫిరంగులున్నాయి. బజానొవ్‌ని అక్కడకు పంపాను. స్తేహావ్‌ని బజానొవ్‌తో సంబంధం పెట్టుకోమని చెప్పు" అని ఆర్డ రిచ్చాను.

పరిస్థితి ఎలా ఉన్నదీ యింకా స్పష్టంగా తెలియలేదు. శత్రుపక్షంనుండి రష్యన్‌భాషలో "హుర్రా" అని కేకలు రావడమేమిటి? తమ అగ్రగామిదళంగా జర్మన్లుదేశద్రోహులను పంపారా ఏమిటి? నాకు కాని, నా పక్కనే ఉన్న లుకిన్‌కి కాని ఏమీ అర్థంకాలేదు. చిట్టచివరికి అంతా స్పష్టమైంది.

స్తేహావ్‌తో వెళ్ళిన రిజర్వ్‌ప్లటూన్‌కి బోరీస్ క్రూతికొవ్ నాయకత్వం వహించాడు. ఆ ప్రదేశ నైసర్గిక స్వభావానికి అనుగుణంగా అతని మనుషులు చెట్ల వెనుకనూ, చెట్లమొదళ్ళ వెనుకనూ మాటుచూసుకుంటూ శత్రువుకు అతి సమీ పంగా వెళ్ళారు. హటాత్తుగా బోరీస్‌కు ఒక స్త్రీ గొంతుక తనను పేరుపెట్టి పిలుస్తూం డడం వినబడింది :

"బోరీస్! యిదేమిటి? నీ వాళ్ళమీదే నువ్వు కాలుస్తున్నావా!"

ఆ గొంతుక శత్రుపక్షంనుండి వచ్చింది.

క్రూతికొవ్ ఆ అమ్మాయికేసి తేరిచూసి నిర్ఘాంతపోయాడు. "శత్రువు" మరెవ్వరూ కాదు—వెనుకటి రోజుల్లో కియెవ్‌లో తనతో కలిసి బడిలో చదువుకున్న అమ్మాయి, యిద్దరూ ఒకే బెంచీమీద కూచునేవారు. ఇద్దరూ ఒకరినొకరు కౌగిలించు కున్నారు.

ఇక కదన పరిస్థితులు యిలా పరిణమించాయి.

శత్రువు తన ఆర్టిలరీని హైరోడ్డుపై మోహరించి తయారవుతూండగా, బజానొవ్ హైరోడ్డు చేరుకుని, శత్రుసైనికులలో భయాందోళనలను పుట్టించాలనే ఉద్దేశంతో :

"బటాలియన్! మొదటి కంపెనీ—కుడిపక్కకు, మూడో కంపెనీ—ఎడమ పక్కకు, రెండో కంపెనీ—నా వెంట!" అని బిగ్గరగా ఆజ్ఞాపించాడు.

అతడు ఆజ్ఞ యిచ్చాడో లేదో, తను ఎరగని మనిషి ఒకడు తనదగ్గరకు వచ్చి:

"మన ఇటాలియన్ అప్పుడే మోహరించి సిద్ధంగా వుందండి!" అన్నాడు.

"ఏ ఇటాలియన్?"

"కొవ్పాక్ రెండో ఇటాలియన్!"

కాల్పులు ఆగిపోయాయి. ఇక యిరుపక్కల మనుషులూ "సోదర భావంతో" పలకరించుకోసాగారు. కొవ్పాక్ మనుషులు మామీదకి "విజృంభించారు."

స్తేహావ్‌తో కలిసి కొవ్పాక్‌ను చూడ్డానికి వెళ్ళాను. గత ఫిబ్రవరిలో మా తొలి సమావేశం స్నేహ సుహృద్భావ రశ్మితో ఎంతో "వెచ్చగా" వుండెననుకుంటే ఈసారి మా సమావేశం నిజంగా "కుత కుత ఉడికిపోతూండెను!"

ఇప్పుడు కొవ్పాక్ మనుషులు కార్పేథియా ప్రాంతంలోకి వెళ్తున్నారు. వారు భారీ ఆయుధాలను సమకూర్చుకున్నారు, యూనిఫారాలూ బూట్లూ తొడుక్కున్నారు. మేం కొత్తగా చేరుకున్న జిల్లాలో వారు అర్థాతుగా అగపడ్డానికి కారణం, వారు అతిత్వరగా పురోగమించడమే—వారు మా గస్తీచౌకీకి అగపడిన రోజున వారు ఏభై కిలోమీటర్లు పురోగమించారు. వారు వస్తూన్నట్టు మా స్కౌట్లు కాని, స్థానిక వాసులు కాని సకాలంలో మాకు హెచ్చరిక వార్త అందివ్వలేకపోయారు. వీరు కొవ్పాక్ మనుషులను చూసి జర్మన్లు అని పొరపాటుపడ్డారు, ఏమంటే కొవ్పాక్ కేవల్రీ రౌతులు యించుమించు అందరూ తాము యుద్ధంలో శత్రువునుండి సంగ్రహించిన జర్మన్ యూనిఫారాల్లోనే వున్నారు మరి.

కొవ్పాక్ మనుషులు మా క్యాంపుకు దగ్గరగా ఉన్న స్థలంలో దిగి విశ్రాంతి తీసుకున్నారు. ప్రతి దినమూ మేమూ వారూ కలుసుకునేవారం—మేము వారిని చూడ్డానికైనా వెళ్ళేవారం, లేక వారు మమ్మల్ని చూడ్డానికైనా వచ్చేవారు.

"మీ 'జర్మన్ని' మాకు చూపించండి" అన్నాడు కొవ్పాక్ ఓనాడు, కుజ్నెత్సోవ్ గురించి మా వెనుకటి సంభాషణను జ్ఞాపకం తెచ్చుకుని.

మర్నాడు కొవ్పాక్, రూద్నెవ్‌లు దగ్గరకువచ్చినప్పుడూ, మా "జర్మన్ని" వారికి పరిచయంచేశాం. కుజ్నెత్సోవ్ రోవ్నోనుంచి సరిగా అప్పుడే క్యాంపుకి వచ్చాడు.

"పని అంటే యిలా ఉండాలి!" అన్నాడు కొవ్పాక్ ఉక్రైనియన్ భాషలో, కుజ్నెత్సోవ్ జర్మన్ల యింట్లో చేరి, యింటి వాసాలు లెక్కపెట్టడం విని.

అతిథులకోసమని బల్లమీద ఉన్న రకరకాల సాసేజీలు చూసి కొవ్పాక్ ఆశ్చర్యపోయి :

"ఎక్కడ్నుంచి వచ్చాయండీ సాసేజీలు?" అని అడిగాడు.

"మేమే తయారుచేశాం."

ఆ రోజుల్లో మేం నిజంగా ఓ చిన్న సాసేజి ఫ్యాక్టరీని ఏర్పాటుచేశాం. అయితే మాకు నాజూకుపదార్థాలూ, తాయిలాలూ కావలసివచ్చి ఈఫ్యాక్టరీని ఏర్పాటు చేయలేదు. మా స్కౌట్లు వరుసగా వారంరోజులపాటూ, పక్షందినాలపాటూ డిటాచ్ మెంటుని వదలిపెట్టవలసివచ్చేది. అంతేకాదు, కొంతమంది స్కౌట్లు చౌకీలలో రోజులతరబడి డ్యూటీమీద ఉండేవారు. వీళ్ళు ఏదో తిండి తినాలి కద. గ్రామాల్లోకి వెళ్ళి అక్కడనుండి తిండి తెచ్చుకుందుకు వాళ్ళకి మేం అనుమతి యివ్వలేదు. పోనీ తమతో కూడా తినడానికి ఏదైనా తీసుకువెళ్ళామా అంటే, బ్రెడ్డు తప్ప మరేమీ లేదాయె. వండిన మాంసం తీసువెళ్తే అది తప్పున పాడైపోయేది. మనుషులు అర్ధాకలితో ఉండేవారు. ఈ సమస్యకి సాసేజీలే శ్రేష్టమైన పరిష్కారమని అప్పుడు తోచింది. మా డిటాచ్‌మెంటులో సాసేజి తయారుచేసేవాళ్ళు ఉన్నారని మాకు తెలిసింది. ఆ పనిలో వారు అందెవేసిన చేయి, ఏ సాసేజి ఫ్యాక్టరీ అయినా సరే, అటువంటివారిని నెత్తిమీద పెట్టుకుని పూజిస్తుందన్న మాట. ఈ సంగతి అంతా కొవ్పాక్‌తో చెప్పాను.

మేం భోజనపు బల్ల దగ్గర కూచుని అలా రెండు గంటలసేపు మాట్లాడుకున్నాం. ఇలా మాట్లాడుకుంటూండగా, ఒక గ్రూపు కొవ్పాక్ మనుషులు మా దగ్గరకు వచ్చారు.

"కామ్రేడ్ కమాండర్!" అని వారిలో ఒకడు కొవ్పాక్‌ని సంబోధించి. "మేం కర్నల్ మెద్వేదెవ్‌తో మాట్లాడవచ్చునా?" అని అడిగాడు.

"మాట్లాడండి."

"కామ్రేడ్ కర్నల్! సాసేజీలు ఎలా చేయడమో మాకు నేర్పవలసిందనే కోర్కెతో మీ దగ్గరకు వచ్చామండీ!" అన్నాడు ఆ మనిషి.

సాసేజీలుచేయడం నేర్చుకుందుకు కొందరు మనుషులను పంపవలసిందని కొవ్పాక్ తన సప్లై శాఖ నాయకుని పేర, అతడూ, రూద్నెవూ, నేనూ మాట్లాడుకుంటూండగా, అతడు చీటి రాసినట్లు తెలిసింది.

...కొవ్పాక్ యూనిట్ దాని దారిని అది వెళ్ళిపోయింది కొవ్పాక్

యూనిట్లు మా దగ్గరనుండి వెళ్ళిపోయేముందు, మా డిటాచ్‌మెంట్లకు పరస్పరమూ అత్యంతోపయోగంగావుండే సమాచారాన్ని రేడియో ద్వారా తెలియపరచుకునేందుకు ఒక రహస్యపు కోడునూ, కాల్ సిగ్నల్సునూ నిర్ణయించుకుని, రేడియో సంభాషణల కోసం ఒక టైమ్‌టేబిలు కూడా స్థిరపరచుకున్నాం.

## వాలోద్య

రోవ్నోలో అలికిడీ అడావుడీ లేకుండా నెమ్మదిగావున్న ఒక చిన్న వీధిలో చిన్న వాచ్ మేకరు దుకాణం ఒకటుంది. ఆ చిన్న దుకాణానికి ఓ చిన్న కిటికీవుంది. ఆ చిన్న కిటికీ పక్కనే, కిటికీకంటె పెద్ద సైన్‌బోర్డువుంది. అందు పైన: "ఇచ్చట అన్ని రకముల గడియారములు మరమ్మతు చేయబడును" అని వుంది. దుకాణం లోపల కిటికీ పక్కను కూచుని వాచ్‌మేకరు దీకియ్ పనిచేసుకుంటు న్నాడు. మా రహస్య సాంకేతిక స్థలాలలో ఒకటి ఈ దుకాణం. దీనిని షెవ్‌చూక్, ఇతర గెరిల్లాలు మరి ముగ్గురూ ఉపయోగించుకుంటూండేవారు.

ఒక రోజున పదకొండు, పన్నెండేళ్ళ కుర్రవాడొకడు ఆ దుకాణపు కిటికీ పక్కనుండే ఇటూ అటూ పచారుచేస్తూ వుండడమూ, కిటికీకేసి శ్రద్ధగా చూస్తూ వుండడమూ దీకియ్ కనిపెట్టాడు.

మరునాడు షెవ్‌చూక్ ఆ దుకాణం దగ్గరకువచ్చి, తన వాచీని వాచ్ మేకరుకి కిటికీలోనుంచి అందిచ్చి, అతడితో ఏమిటో మెల్లగా చెప్పి, తన వాచీని మళ్ళీ తీసుకుని వెళ్ళిపోయాడు. సరిగా ఆ సమయానికే, క్రితం రోజున దీకియ్‌కి అగపడిన కుర్రాడే ఆ వీధి అవతలివైపున మళ్ళీ అగపడ్డాడు.

"ఇదేదో అనుమానంగానే వుంది" అనుకున్నాడు వాచ్‌మేకరు.

ఓ గంట గడిచింది, రెండు గంటలు గడచాయి. ఆ కుర్రవాడు దుకాణపు కిటికీ దగ్గరకువచ్చి, కిటికీలోకి తలదూర్చి:

"మామయ్యగారూ।గెరిల్లాలు ఎక్కడ అగపడతారో మీకు తెలుసునండీ?" అని అడిగాడు.

"నీకేమైనా మతిపోయిందా ఏమిటి, అబ్బాయ్! నీ తలకాయ కాకపోతే, గెరిల్లాలేమిటి?" అని వాచ్‌మేకరు కసిరాడు.

ఆ కుర్రవాని నల్లని నిర్మల విశాల నయనాలలో భయభ్రాంతులు చప్పున పొడచూపాయి, కాని కుర్రవాడు మాత్రం అక్కడనుండి వెళ్ళిపోలేదు.

"మీరేమంటే అనండి గాని, మిమ్మల్ని అడిగితే మీరు తప్పకుండా తెలుసుకుంటారనే నా కనిపించిందండి. మీకు తెలియకపోయినా, గెరిల్లాలను తెలిసినవాళ్ళు మీకు బహుశ తెలుసునేమోనండి!" అన్నాడా కుర్రవాడు.

"తెలుసునా...తెలుసునా!...నా కెలా తెలుస్తుంది?"

"పోనీలెండి" అని కుర్రవాడు వెళ్ళిపోయాడు.

కాని దీకియ్‌కి ఆ కుర్రవాడిలో ఆసక్తిజనకమైనదేదో వున్నట్టు తోచి, దుకాణంలోనుంచి వీథిలోకివచ్చి, వీథిలోనుంచి నడిచి వెళ్ళిపోతూన్న కుర్రాణ్ణి:

"అబ్బాయ్, అబ్బాయ్, ఇలా రావోయ్!" అని పిలిచాడు.

కుర్రవాడు పరుగున వచ్చాడు.

"లోపలికి రా!" అన్నాడు వాచ్‌మేకరు.

కుర్రవాడు దుకాణం లోపలికి వెళ్ళాడు.

"గెరిల్లాల గురించి నీ కెందుకు కదా!" అని దీకియ్ అడిగాడు.

"ఎందుకో చెప్పేందుకు నాకు అధికారంలేదు. ఆ సంగతి గెరిల్లా డిటాచ్‌మెంటు కమాండర్ మెద్వెదెవ్ ఒక్కడితోనే చెబుతాను" అన్నాడు కుర్రాడు.

"అలాగటోయ్! సరేలే, ఇక్కడ కాస్సేపు కూచో."

దీకియ్‌కి తెలుసు షెవ్‌చూక్ నుంచి చీటి పట్టుకుని మా స్కౌటు లిసేయ్‌కిన్ మరి కాస్సేపట్లో తనదగ్గరికి వస్తాడని. మరికొద్ది నిమిషాల్లో లిసేయ్‌కిన్ దుకాణపు కిటికీ దగ్గరకి వచ్చి ఒక చీటి ఇచ్చాడు. దీకియ్ ఆ చీటి అందుకుని, లిసేయ్‌కిన్‌తో :

"ఇక్కడ నా దగ్గర ఓ కుర్రాడున్నాడయ్యా. ఆ కుర్రాణ్ణి నీతో అలా తీసుకెళ్ళి సంగతేమిటో కనుక్కో" అన్నాడు.

ఆ కుర్రాణ్ణి లిసేయ్‌కిన్ ప్రశ్నించగా, వీన్నిత్స నగరానికి చేరువను పని చేస్తూన్న "లెనిన్" గెరిల్లా డిటాచ్‌మెంటు తనను మెద్వెదెవ్ డిటాచ్‌మెంటుకి పంపించిందని వివరించాడు.

"ఇంతకుమించి నేను మరేమీ చెప్పను" అన్నాడు ఆ కుర్రాడు విస్ఫూర్తిగా.

"నీ పేరేమిటి ?"

"వొలోద్యా."

లిసేయ్‌కిన్ వొలోద్యాను తనతో కూడా తీసుకువెళ్ళాడు. ఫలానా చిరునామాకు అతడు వెళ్ళవలసిందనీ, అక్కడ ఒకకారు సిద్ధంగా వుంటుందనీ, ఆ కారులో అతడు క్యాంపుకి రావలసిందనీ షెవ్‌చూక్ పంపిన ఆదేశాలను దీకితుట అతడికి తెలియజేశాడు

ఇంతకుముందు కొన్ని రోజులనుండి కుజ్నెత్సోవ్, షెవ్‌చూక్‌లు ఎక్కడికైనా వెళ్ళేటప్పుడు కాలినడకను వెళ్ళడం మానివేశారు. వారికి అవసరమైనప్పుడల్లా రోవ్నోలో వున్న గెబీట్స్‌కమిస్సారియాట్ గేరేజినుండి ఒక కారు సప్లై అయ్యేటట్టు నికొలాయ్ స్త్రుతిన్‌స్కీయ్ ఏర్పాటు చేయగల్గాడు. ఈ విధంగా స్త్రుతిన్‌స్కీయ్, కుజ్నెత్సోవ్, షెవ్‌చూక్‌లకు అవసరమైనప్పుడల్లా ఒక కారూ, లేక లారీ వారికోసం తయారుగా వుండేది. ఒక్కొక్కప్పుడు గెబీట్స్‌కమిస్సారే కారు కోసం కనిపెట్టుకుని వుండవలసిన సందర్భాలు కూడా లేకపోలేదు. తన సొంత డ్రైవరు గెరిల్లాలనుకారులో ఎక్కించుకుని తీసుకువెళ్తూండడం కారణంగా డ్రైవరు అక్కడ హాజరుగా లేదనీ, డ్రైవరు వచ్చేవరకు తాను కనిపెట్టుకుని వుండవలసి వచ్చిందనీ పాపం గెబీట్స్‌కమిస్సారు ఎరగనే ఎరగడు.

నేనిప్పుడు చెప్పబోయే సంగతి ఆగస్టు చివరి రోజుల్లో జరిగింది.

నా దగ్గరనుండి ఆదేశాలను పొందడానికై కుజ్నెత్సోవ్‌నూ, రోవ్నోలో వున్న ఇతర స్కౌట్లనూ క్యాంపుకి రావలసినదిగా ఆర్డర్లు పంపించాను.

ముందుగా నిర్ణయించిన స్థలందగ్గర టన్నున్నర లారీఒకటివచ్చి ఆగింది. మాకు సాయం చేస్తూన్న గెబీట్స్‌కమిస్సారియాట్ డ్రైవరు జుబేంకొ, లారీనితీసుకుని యూల్స్క్ వెళ్ళేందుకు పెర్మిట్టు సంపాదించగల్గాడు. ఇందుకని నాజీ దినపత్రికలతోనూ, పాంప్లెట్లతోనూ లారీని సగానికి లోడుచేసుకుని, వాటిని యూల్స్క్‌లో అందజేసేందుకు ప్యాసు తీసుకుని రోవ్నోనుంచి బయల్దేరాడు.

వొలోద్యాను తీసుకుని లిసేయ్‌కిన్ లారీ నిలబడి వున్న చోటకు వెళ్ళాడు.

లారీ దగ్గరనుంచున్న కుజ్నెత్సోవ్ – ఓబెర్‌లోయ్‌ట్నాంట్ సీబెర్ట్– ఆ కుర్రాణ్ణి చూసి ఆశ్చర్యపడి, లిసేయ్‌కిన్ని అడిగాడు :

"ఎక్కణ్నుంచి లాక్కొచ్చావోయ్ ఈ కుర్రనాగమ్మని !"

"ఈ కుర్రావా ! ఇంకొక డిటాచ్‌మెంటు తనను పంపించిందని చెబుతూ మెద్వెదెవ్ డిటాచ్‌మెంటు కోసం వెతుకుతున్నాడయ్యా !" అన్నాడు లిసేయ్‌కిన్.

"లారీలోకి ఎక్కించు, తరువాత చూసుకుందాం ఆ సంగతేమిటో !" అన్నాడు జర్మన్ ఆఫీసర్ పౌల్ సీబెర్ట్.

అంతవరకూ లిసేయ్‌కిన్ చేయిపట్టుకుని నుంచున్న వాలోద్య ఆ జర్మన్ ఆఫీసర్ మాటలను వినీవినడంతో ఛట్టున లిసేయ్‌కిన్ చేయి వదిలేసి అక్కడ నుంచి పరుగెత్తాడు.

లిసేయ్‌కిన్ చెంగున రెండు దాట్లువేసి పారిపోతూన్న వాలోద్యని అందుకుని పట్టుకున్నాడు.

"ఓరి పిశాపుకానా ! ఎక్కడికి పారిపోతున్నావురా ?"

గెరిల్లాల గురించి గమ్మత్తుకి అన్నాను, నన్ను వదిలేయ్, మావయ్యా !"

"ఓరి వెధవా ! పోలీసులు పంపించార్రా నిన్ను ?"

"మీరే పోలీసులు !" అంటూ వాలోద్య వెక్కివెక్కి ఏడుస్తూ కున్నెత్సోవ్ కేసి కారాలూ మిరియాలూ నూరుతూ చూశాడు.

"అరె, నీ బొడ్డు పొక్క ! అతణ్ణిచూసి జడుసుకున్నావట్రా!" అన్నాడు లిసేయ్‌కిన్ నవ్వుతూనూ.

జర్మన్ ఆఫీసరు యూనిఫారంలో వున్న కున్నెత్సోవ్‌నుచూసి వాలోద్య అపోహపడి వుంటాడన్న సంగతి లిసేయ్‌కిన్ పూర్తిగా మరచిపోయాడు.

లిసేయ్‌కిన్ వాలోద్యకేసి వంగి, ఆ కుర్రవాడి చెవిలో ఏదో చెప్పాడు. ఇహప్పుడు వాలోద్య వినయవిధేయతలతో లారీ ఎక్కిపోయాడు.

మా స్కౌట్లు ఆరుగురు ఆ లారీలో ఎక్కారు. తమ ఆయుధాలను వారు నాటి దినపత్రికల కింద దాచేశారు. కున్నెత్సోవ్ డ్రైవరుపక్కను కూర్చున్నాడు.

రోవ్నొ నగరపు పొలిమేర దగ్గర ఒక బ్రహ్మాండమైన సైన్ బోర్డు వుంది. అందుపైన జర్మన్ భాషలో :

"ఒక్కటొక్కటిగా ప్రయాణంచేసే వాహనాలకు ఈ రోడ్డు నిషిద్ధం!" అని రాసివుంది.

తమపై గెరిల్లాలు దాడిచేసేయెడల ప్రతిఘటన సల్పేందుకని జర్మన్ల

కార్లనూ లారీలనూ రక్షకభటుల సాయంతో సామూహికంగా మాత్రమే ఈ రోడ్డు పైన వెళ్ళనిచ్చేవారు.

తను అత్యవసర కార్యంపై వెళ్ళాల్సి వుండడంచేత, రక్షక భటుల సాయమూ, లారీల సమూహమూ ఏర్పడేవరకు ఆగేందుకు తనకు వీల్లేదని పొలిమేర గేటు దగ్గరవున్న చౌకీదార్లతో కుజ్నెత్సోవ్ చెప్పాడు. అతడు చెప్పిన వివరణను విని చౌకీదార్లు లారీని వెళ్ళనిచ్చారు కాని అసలు అంతరాయం ఇంకా ముందే వుండెను.

రోవ్నొనుండి ఓ పది కిలోమీటర్లు వెళ్ళిన తరువాత, అక్కడ ఒక పెద్ద సైన్‌బోర్డువుంది. రోడ్డు మరమ్మత్తులో వుందనీ, ట్రాఫిక్ అంతా మరొక రోడ్డుకి మళ్ళవలసివుంటుందనీ ఆ బోర్డుమీద రాసివుంది. అనగా రమారమి పది కిలో మీటర్లు వెనక్కి వెళ్ళాలన్నమాట. వెనక్కి వెళ్ళకుండా సరాసరి ముందుకు వెళ్ళ డానికే కుజ్నెత్సోవ్ నిశ్చయించుకున్నాడు.

లారీ ఇంకా ముందుకుసాగి వెళ్ళేసరికి వంతెన ఒకటి వచ్చింది. ఆవంతెన దగ్గర చాలామంది జర్మన్లు మూగివున్నారు. లారీ వంతెనను సమీపించగా, జర్మన్ ఆఫీసరు ఒకడు లారీ దగ్గరకువచ్చి, అందులో కూచునున్న ఓబెర్‌లోయ్‌ట్నాంట్‌కి సెల్యూటుచేసి :

"చూడండయ్యా, వంతెన కాలిపోయిందండి. అంతే కాదండి, ఒంటరిగా వెళ్తూన్న లారీ ఈ రోడ్డుపైన వెళ్ళేందుకు వీల్లేదండి, హెర్ ఓబెర్‌లోయ్‌ట్నాంట్! ఇక్కడ గెరిల్లాలు మాటుదాగి దాడిచేసే అవకాశం వుందండి" అన్నాడు.

ఆ మాటలు విని కుజ్నెత్సోవ్ పెద్ద గొంతుకతో :

"గెరిల్లాలట గెరిల్లాలు! గెరిల్లాలుంటే ఇంట్లో తలుపులు బిడాయించుకుని కూచుంటామా ఏమిటి? ఇది యుద్ధం! నాకు తొందర పనివుంది!" అన్నాడు.

"రెజిమెంటల్ కమాండరుతో మీరు మాట్లాడాల్సి వుంటుందండి" అన్నాడా ఆఫీసరు తటపటాయించుతూ. "ఇదుగో ఆయనే వస్తున్నాడండి!"

"హైల్ హిట్లర్!"

"హైల్!"

ఈ పాటికప్పుడే లారీలోవున్న స్కౌట్లు తమ రివాల్వర్లను తయారుగా పట్టుకున్నారు. తను నిశ్చయంగా గెరిల్లాలతో వున్నానని ఇప్పుడిప్పుడే నమ్మకం ప్రారంభించిన వాలోద్య లారీలో ఓ మూల నక్కిపోయాడు.

మరొక రెండు నిమిషాలుగడిచిన తర్వాత, సాపర్ రెజిమెంట్ కమాండరు తన మనుషులను ఆర్డరుచేస్తూ వేసిన కేక లారీలోవున్న స్కౌట్లకి వినబడింది. ఆ ఆర్డరు ప్రకారం, వంతెనను మరమ్మత్తు చేస్తూన్న సైనికులు తమ గొడ్డళ్ళను అక్కడ పడేసి, లారీని సమీపించారు.

సైనికులు సమీపించడం చూసి మన స్కౌట్లు :

"ఇహ మొదలవుతుంది మజా!" అనుకున్నారు.

సరిగా ఆ క్షణానికి కుజ్నెత్సోవ్ ప్రశాంతంగా లారీ దగ్గరకు వచ్చి:

"అంతా సరిగానేవుంది, సాపర్లు మన లారీని లాగి అవతలి వొడ్డుకు చేర్చుతారు" అన్నాడు.

"మేం దిగిపోవాలా?" అని అడిగాడు లిసేయ్‌కిన్.

"మీరు అలా కూచునే వుండండి!"

ఓ ఏభైమంది జర్మన్ సాపర్లు ఆ లారీని ధ్వంసమైపోయిన వంతెనమీద నుండి తప్పించి, పక్కనున్న గోతుల్లోంచీ, బురదలోనుంచీ లాగడం మొదలెట్టారు.

"హైలెస్సా! హైలెస్సా!" అంటూ లారీలో కూచునున్న మావాళ్ళు లారీని లాగుతూన్న జర్మన్ సైనికుల్ని హుషారెక్కించారు.

ఈ తతంగమంతా ఓ పదిహేను నిమిషాలపాటు సాగింది. సాపర్లు లారీని లాగి అవతలి వొడ్డునున్న రోడ్డుమీదకి తీసుకురాగానే జువేంకో లారీని స్టార్టు చేసిపోనిచ్చాడు. ఇక మరే చిక్కూ లేకుండా లారీ ముందుకి సాగిపోయింది.

వారందరూ క్యాంపుచేరుకునేసరికి బాగాపొద్దుపోయింది.వొలోద్య గురించి నాకు తెలియపరచగానే ఆ కుర్రవానితో ఉదయాన మాట్లాడవచ్చుననే ఉద్దేశంతో, ఆ కుర్రవాడు పడుకుందుకు పడక వగైరా ఏర్పాట్లుచేయవలసిందని ఆదేశాలిచ్చాను. కాని ఆ కుర్రవాడు వెంటనే నా దగ్గరకు వచ్చాడు.

"కమాండర్ మెద్వెదేవ్ మీరేనా?" అని అడిగాడు.

"అవును, నేనే" అన్నాను.

"మీతో ఒక రహస్యమైన పనివుంది."

"అయితే చెప్పవోయ్!"

"మీ వొక్కరికే చెప్పాలి" అన్నాడు వొలోద్య.

నాతో కూడా స్తేహావ్, ఒకిన్, కుజ్నెత్సోవ్, త్రెస్పార్‌స్కీయులు వున్నారు.

"సంగతి చూశారా, కామ్రేడ్స్!" అన్నాన్నేను, నవ్వుతూ, "మేమిద్దరం రహస్యాలు మాట్లాడుకోవాలి. ఆ రహస్యాలు మీరు దాచుతారని మాకు నమ్మకం లేదు. సరే. వొలోద్య, నా నేలమాళిగలోకి వెళ్దాం మనం!" అన్నాను.

అక్కడకు వెళ్ళిన తరువాత వొలోద్య తన టోపీని తీసివేసి, దానికున్న అస్తరును పర్రున చింపేసి, అందులోనుంచి ఓ కవరు తీసి నా కిచ్చాడు. నేను ఆ కవరు తెరచి అందులోవున్న వుత్తరం చదువుకున్నాను. ఉత్తరం టైపుచేసి వుంది :

"ఈ వుత్తరం తీసుకువస్తూన్న వ్యక్తి 'లెనిన్' గెరిల్లా డిటాచ్‌మెంటుకు చెందిన పార్టీ ఆర్గనైజేషన్ కార్యదర్శి కుమారుడు, వొలోద్య సమొరూహ. ద్మిత్రియ్ మెద్వెదెవ్ నాయకత్వాన వున్న డిటాచ్‌మెంటు ఎక్కడ వున్నదో తెలుసుకుని రావలసిందని ఇతణ్ణి పంపించడమైనది..."

తమదగ్గర రేడియో ట్రాన్స్‌మిటర్ లేకపోవడంచేత ఇటువంటి డిటాచ్‌మెంటు ఒకటి పనిచేస్తూన్నదనే విషయాన్ని మాస్కోతో తాము స్వయంగా తెలియజేయలేక పోతున్నామనీ, ఈ విషయం మాస్కోకు తెలియజేయవలసిందనీ "లెనిన్" డిటాచ్‌మెంటు కమాండరు నన్ను కోరాడు. తను వున్న స్థానాన్ని కమాండరు తెలియపరచుతూ స్థలనిర్దేశ వివరాలను ఆ వుత్తరంలో పేర్కొని, రేడియో ట్రాన్స్‌మిటర్‌నూ ఇతర ఉపకరణాలనూ మాస్కోనుండి తీసుకొనివచ్చే విమానం ఆ స్థలానికి రావలసిన దినాలనూ, సిగ్నల్సునూ వివరించాడు. వొలోద్యను మాస్కోకి పంపించవలసిందనే మరొక కోరికతో ఆ వుత్తరం ముగిసింది.

కుర్రవాడికేసి నేను పరిశీలనగా చూశాను. కుర్రవాడు తన పంట్లాం అస్తరు చింపి, అందులోనుండి మరొక వుత్తరం బయటికి తీశాడు.

"ఇంకా మరొక వుత్తరమా ఏమిటి!" అన్నాన్నేను.

"ఆ వుత్తరానికి నకలే. ఒకవేళ నా టోపీ ఎక్కడైనా పోయినట్టయితే, దానిలో వున్న వుత్తరానికి ఇది నకలు" అంటూ మొదటి కవరువంటిదే మరొక కవరు అందించాడు.

"మా దగ్గరకు ఎలా రాగల్గావ్?" అని అడిగాను.

అప్పుడు చెప్పాడు వాలోద్య విశేషాలు. పదిహేను రోజులపాటు ప్రయాణం చేసి సుమారు ఐదువందల కిలోమీటర్లు నడిచాడు వాలోద్య. రాత్రిపూట అడవిలోనో, పొలాల్లోనో, ఏదైనా షెడ్డు కనబడితే ఆ షెడ్డులోనో పడుకునేవాడు. దారిలో బిచ్చం అడుక్కుని, వాళ్ళూ వీళ్ళూ యిచ్చినది తినేవాడు. ఏ వూరినుంచి వస్తున్నావు అబ్బాయ్?—అని ఎవరైనా అడిగినట్టాయెనా, తల్లితండ్రులు చనిపోయారనీ, అత్తయ్య దగ్గరకు వెళ్తున్నాననీ చెప్పేవాడు. అడిగినప్పుడు ప్రతిసారీ ఒక కొత్త చిరునామా ఇచ్చేవాడు: ప్రొస్కూరావా జిల్లాలో అడిగినప్పుడు తన అత్తయ్య షెపెతోవ్కాలో వున్నట్టూ, షెపెతోవ్కా జిల్లాలో అడిగినప్పుడు ఆమె రోవ్నోలో వున్నట్టూ చెప్పాడు.

వాలోద్య రోవ్నో చేరుకుని ఆ వూళ్ళో కొన్నిరోజులు తిరిగాక అప్పుడు వాచ్‌మేకరు దగ్గరకి వెళ్ళాడు.

"మా గురించి వాచ్‌మేకరుకి తెలుసునని నువ్వు ఎలా అనుకున్నావు?"

"నాకు తెలీదు మరి. కాని అతడికి తెలుసునని నాకు అనిపించింది. ఒక వేళ అతడు లుచ్చా అయివుంటే నేను అతడికి దొరక్కుండా పారిపోయుందును."

"నీ అదృష్టం బాగుందనే అనాలి, వాలోద్య! అంతే మరి!"

వాలోద్య మా డిటాచ్‌మెంటులో వున్నాడు. చాలా రోజులవరకూ అతణ్ణి మాస్కోకి పంపించలేకపోయాం. మా దగ్గరనుంచి వెళ్ళిపోవడానికి వాలోద్యకికూడా మనసొప్పలేదు.

ఆ కుర్రవాడిమీద గెరిల్లాలందరికీ అపేక్ష కుదిరింది. ఆ కుర్రవాణ్ణి ఎవరో రోజూ వొళ్ళు సబ్బుతో రుద్ది కడిగినట్టు ఎప్పుడూ శుచిగా, నవ్వుతూ, సరదాగా వుండేవాడు.

ఇహ ఇప్పుడు చిట్టి కోల్యా తన స్కౌటు పనులు పూర్తి చేసుకుని క్యాంపు చేరుకునేసరికి, తన యీడు గెరిల్లా సైనిక కామ్రేడ్ మరొకడు తనకు తోడు దొరికాడు. వాలోద్య, కోల్యాలు ఇద్దరూ అప్పుడే "అనుభవజ్ఞులైన" గెరిల్లాలుగా తయారయ్యారు. అయితే కోల్యా జీవితంలోనే మరింత ఆసక్తిదాయకములై ఒళ్ళు జలదరించుకుపోయే సన్నివేశాలు సంభవించాయి.

"చౌకినుండి రోవ్నోకి నేనింతవరకూ అప్పుడే పదిహేనుసార్లు నడిచాను. ఒక్కొక్కప్పుడు నిజంగా హడలేసుకొస్తుందన్నమాటే. ఓ సౌఖ్యమైన దినాన బయల్దేరాను. ఎక్కడ చూసినా పోలీసులే. కనబడిన పోలీసువాడికల్లా సెల్యూట్

దేస్తూ, 'నమస్తే!' అని పలకరించుతూ వెళ్ళాను. ఒకణ్ణి మాత్రం నేను పలకరించ లేదు. అప్పుడతగాడు తన పిస్తలు తీసి :

'ఇలా రా, రా! వచ్చి, ఆ గోడ దగ్గర నిలబడు!' అని అరిచాడు.

'నేను—ఏడవడం మొదలెట్టాను :

"మామయ్యా! నన్ను చంపేయకు మామయ్యా!' అంటూబతిమాలుకున్నా.

"కాని అంతసేపూ నా మనసులో నేను: 'నికొలాయ్ కుజ్నెత్సోవ్‌కి అందజేయవలిసిందని చెప్పి నా పంట్లాం అస్తరులో రహస్యంగా వుంచి కుట్టిన వుత్తరమూ, డబ్బూ అందవేమో, అయ్యో!' అని అనుకుంటూనే వున్నా.

"ఆ పోలీసువాడు అరిచాడు :

'ఎక్కడికి వెళ్తున్నావురా?' అని.

"ఇంటికి వెళ్తున్నాను, మామయ్యా! అమ్మ ఆస్పత్రిలో వుంటే, అమ్మని చూడ్డానికెళ్ళా' అన్నాను.

'దానితో వాడు నా మాటలు నమ్మి, నన్ను వెళ్ళిపోనిచ్చాడు.

"మరొక సౌఖ్యమైన దినాన, రోవ్నోలో మా రహస్యపు బస ఒకదానిలో గేన్య బొగాన్‌తో నాకు పరిచయమైంది. ఆ కుర్రాడికి పదేళ్ళు. 'నా అడ్జూటాంట్‌గా వుంటావురా?' అని అడిగాను వాణ్ణి. 'ఉంటానురా!' అన్నాడు. నేను పనిమీద వెళ్ళి నప్పుడు ఇద్దరం కలిసివెళ్ళేవారం. కుజ్నెత్సోవ్ నన్ను ఎక్కడికైనా పంపించినప్పుడు, ఇద్దరం కలిసి వెళ్ళేవారమేమో – ఎంతో సరదాగా వుండేది. ఇద్దరం వుండడంచేత మా గురించి ఎవ్వరూ పట్టించుకునేవారుకారు కూడానూ. నేను చౌకికి వెళ్తున్నప్పుడు ఒకనాడు వాడూ నాతో వచ్చాడు. వాడు నడవలేక చచ్చాడన్నమాటే–కాని అలాగే నడిచాడు సుమా. ఓ సౌఖ్యమైన దినాన ఇద్దరం కలిసి ఓ షాపుకి వెళ్ళాం – ఏదో కొనుక్కుందుకని. షాపువాడికి ఇరవై మార్కుల నోటుఇచ్చి, చిల్లర ఇమ్మన్నాను.

"నీకు ఇంత డబ్బు ఎక్కడ్నుంచి వచ్చిందిరా? పోలీసుకి అప్పజెప్తానురా నిన్ను!" అన్నాడు వాడు.

"నోటు అక్కడ పారేసి పారిపోయాం. దానితో ఇహ గేన్య కంగుతినే శాడు, అంతే... మరి కనబడలేదు."

చిట్టి కోల్య చెప్పిన కబుర్లన్నిటినీ వాలోద్య నోరెళ్ళబెట్టుకుని అతి శ్రద్ధగా వినేవాడు.

వాలోద్యతో చిట్టి కోల్యా బంతి సంగతి చెప్పాడు. ఆ బంతి సంగతి డిటాచ్ మెంటులో వున్న మా కెవ్వరికీ తెలియనే తెలియదు.

ఆ సంగతి ఒక్క కుజ్నెత్సోవ్‌కీ, వాల్యకీ మాత్రమే తెలుసు. కాని ఆ సంగతి మరెవ్వరికీ తెలియనివ్వమనీ, రహస్యంగా వుంచితీరుతామనీ వారిద్దరూ ఆ కుర్రవాడితో ఖరారుచేశారు. అది ఎలా జరిగిందో చిట్టి కోల్యాయే స్వయంగా ఇలా వాలోద్యతో చెప్పాడు :

"చుట్టుపక్కలవాళ్లు నా గురించి పట్టించుకోకుండా వుండాలని చెప్పి కుజ్నెత్సోవ్ ఓ మాటు నన్ను ఒకరి ఇంట్లోనూ, మరొకమాటు మరొకరి ఇంట్లోనూ వుంచేవాడు. ఓ సౌఖ్యమైన దినాన నన్ను ఓ అత్తయ్య ఇంటికి పంపించాడు. నేను ఆ యింటికి వెళ్ళి అడిగాను : 'మీ దగ్గిర సబ్బు వుందాండి, అమ్మకానికి ?' అది మా సాంకేతికపదం. 'వుంది, లోపలికిరా !' అందామె. మరుచటివాడు వాళ్ళ అబ్బాయీ, నేనూ వీధిలోకెళ్లాం ఆడుకుందుకని. నేను వీధిలో ఇటూ అటూ తచ్చాడాను, నన్ను కలుసుకుందుకు రావలసిన మనిషికోసం చూస్తూనూ, తటాలున అగపడింది – ఓ బంతి. చక్కగా నల్లగా వుంది – కుండాబంతి ఆడుకునే బంతిలా వుంది. బంతిని తీద్దామని నేను అనుకునేసరికి, ఆవిడె కొడుకు ఆ బంతిని చప్పున లాగేసి జేబులో పడేసుకున్నాడు. 'నాకిచ్చేయిరా!' అని అడిగాను. కాని వాడు ఇవ్వాడుకాడు. నేనూ, వాడూ ఆ బంతికోసం కాట్లాడుకున్నాం. వాడిదగ్గరనుండి బంతి లాక్కున్నాను. వాడు మొర్రోమని గోలపెడుతూ తల్లిదగ్గరికి వెళ్ళిపోయాడు. నన్నప్పుడు కుజ్నెత్సోవ్ చివాట్లుపెట్టాడుకదా, ఇహ చెప్పలేం ! ఆ బంతిని కుజ్నెత్సోవ్ నా దగ్గరనుంచి తీసు కుని ఆ పిల్లాడికిచ్చేశాడు. బంతి ఇచ్చేయడమంటే నా మనస్సు మహా నొచ్చుకుంది. కాని నేనేమీ అనలేదు–కాని ఆ సంగతి గురించి ఎవ్వరికీ తెలియకూడదని మాత్రం కుజ్నెత్సోవ్‌ని బతిమాలుకున్నాను. ఈ సంగతి నువ్వు కూడా ఎవ్వరితోనూ చెప్ప కూడదు సుమా ! నలుగురూ నవ్వుతారు : 'చూశావా, గెరిల్లా అయివుండి కూడా, ఓ చిన్న బంతికోసం పోట్లాటపెట్టుకున్నాడు వీడు !...' అంటారు."

మా చిన్నారి సహాయకులు ఒకరితో ఒకరు చెప్పుకున్న ఈ వాస్తవ కథ లను విని మహా జాలివేసింది. వారిది బడికి వెళ్ళవలసిన యీడు, ఎండకాలంలో ఏట్లో హాయిగా నీళ్ళు తుళ్లించి స్నానంచేస్తూ, చలికాలంలో కులాసాగా మంచుపైన స్కేటింగుచేస్తూ సంతోషంగా గడపవలసిన వయస్సు. మామూలుగా ఏ చీకూచింతా లేకుండా జరిగిపోవలసిన బాల్యంనుండి యుద్ధం వీరిని అమాంతమూ వేరుచేసివేసి, భీషణ గెరిల్లాపోరాటంలోకి తీసుకొచ్చేసింది. ప్రజలు మా బాలవీరులతోనరించిన యుద్ధ

సేవకై వారిపట్ల మా డిటాచ్‌మెంటు సభ్యులు మనోవాక్కాయకర్మలా కృతజ్ఞులై వుంటారు.

## మృత్యునోటనుండి విముక్తి

నాజీల చేతిలో చిక్కిన జోర్జ్ స్త్రుత్రిన్‌స్కియ్ ఎక్కడున్నాడో అది అతని జాడకోసం ఎంతకాలమో వెతికాం, కాని ఫలితం లేకపోయింది. ఆ విషయమై వృద్ధుడు వ్లదిమిర్ స్త్రుత్రిన్‌స్కియ్‌తో మేం ఏమీ చెప్పేవారంకాం, ఒకవేళ చెప్పినా అసలు యథార్థం మినహా ఇంకేమైనా కల్పించి చెప్పేవారం.

"మీకు తెలియదా ఏమిటి, పనులన్నీ అతి రహస్యంగా జరగాలన్న విషయం. జోర్జ్ ఎక్కడున్నదీ, ఏ పనిచేస్తూన్నదీ మీకు చెప్పేందుకు వీల్లేదు మరి. మీరు మాత్రం ఏవిధంగానూ బెంగపెట్టుకోకండి: జోర్జ్ క్షేమంగా తిరిగివస్తాడు" అనేవాణ్ణి.

నా మాటలు విని వృద్ధుడు స్తిమితపడి, నా దగ్గరనుంచి వెళ్లిపోయేవాడు.

కాని నికొలాయ్ స్త్రుత్రిన్‌స్కియ్‌కి మాత్రం యథార్థం తెలిసివుండడంచేత తన తమ్ముణ్ణి తల్చుకుని యమయాతన అనుభవించేవాడు.

నికొలాయ్ ఎన్నెన్నో ప్రయత్నాలుచేశాడు తన తమ్ముడి గురించి తెలుసుకుందుకు. చిట్టచివరికి అతనికి సరైన ఆచూకీ దొరికింది.

క్రితం ఎండాకాలంలో నికొలాయ్‌కి లరీస అనే అమ్మాయితో పరిచయం కల్గింది. లరీస గెస్టాపో ఆఫీసులో తుడుపులూ, ఊడ్పులూ పనిచేస్తూండేది. అమ్మాయి సన్నంగా చీపురుపుల్లలా వుంటుంది. అందుకని ఆమెగురించి ఎవ్వరూ పట్టించుకునేవారుకారు కదా, ఆమెకేసే చూసేవారుకారు.

లరీస యథేచ్ఛగా మా కోసం అతిప్రమాదకరమైన గూఢచారి పనికి పూనుకుంది. ఆ పని సాగించేందుకని, ఆమె యజమానుల అనుగ్రహం సంపాదించే ఉద్దేశంతో తన పనిని త్రికరణశుద్ధిగా చేస్తూ, ఎక్కడా ఒక పిసరైనా ధూళిదుమ్మూ లేకుండా గదులన్నీ అతిశుభ్రంగా వుంచి, వస్తువులన్నిటినీ ఎక్కడివక్కడ సర్దేసి నీటుగా వుంచడమే కాకుండా, తనంత తానే ఇష్టపూర్వకంగా వారికోసం చిన్న చిన్న పనులు కూడా చేసిపెట్టుతూండేది. తన పనిని ఆమె ఎంత జాగ్రత్తగా చేసేదంటే మా కవసరమైన రహస్యపు డాక్యుమెంట్లను–టోపోగ్రాఫికల్ మ్యాపులూ, సెర్చివారంటు ఫారాల పుస్తకాలూ, అరెస్టువారంటు ఫారాల పుస్తకాలూ, సెర్చి పంచనామా ఫారాలను– గెస్టాపో ఆఫీసు గదుల్లోనుంచి సంగ్రహించి మా కిచ్చే

పనిని కూడా అంత జాగ్రత్తగానూ చేసింది. ఒకసారి ఆమె ఒక గెస్టాపో ఆఫీసరు మేజాసొరుగులోనుండి గెస్టాపో స్టాంపు తీసుకొచ్చి నికొలాయ్ స్త్రుశీన్‌స్కీకి ఇచ్చింది. ఈ పని చేయడంలో ఆమె అతిమిక్కిలికి పోయింది. నికొలాయ్ చాలా కాలం క్రితమే ఇటువంటి స్టాంపుకి నకలు తయారు చేశాడు. ఈ ఫోర్జరీ స్టాంపు గుద్దిన పత్రాలెన్నిటినో మా స్కౌట్లకిచ్చాం. ఆ పత్రాలను మా స్కౌట్లు వాడుతున్నారు కూడానూ. ఈ స్టాంపు చోరీ జరిగినట్టు బయటపడితే బ్రహ్మాండమైన గడబిడ బయల్దేరుతుంది. అందుకని దానిని లరీస ఆదరా బాదరా పట్టుకుపోయి, దానిని సన్నసన్నగా మళ్ళీ యథాస్థానంలో పెట్టేసింది.

లరీస ఆఫీసుగదులను ఊడ్చి శుభ్రంచేసినప్పుడు, ఆఫీసులో వాడుకచేసిన కార్బన్ పేపర్లను లరీస పారవేయకుండా జాగ్రత్తగా పోగుచేసి వాటిని తీసుకొచ్చి నికొలాయ్‌కి ఇస్తూండేది. ఆ కార్బన్‌పేపర్లను నికొలాయ్ ఓ అద్దం ఎదుట వుంచి, వాటిమీద రాసివున్న దానిని చదివేవాడు. దీనివల్ల ఇతర సమాచారంతో పాటు, తాకట్టు వ్యక్తులుగా బంధించబడినవారి పేర్ల జాబితాలూ, తుపాకికాల్పులవల్ల మరణ శిక్షలు అనుభవించవలసివున్న వ్యక్తుల పేర్ల జాబితాలూ, తుపాకికాల్పులవల్ల మరణ శిక్షను అనుభవించినవారి మృతదేహాలు ఇతరుల కంటపడకుండా వుండేందుకు తీసుకొనవలసిన చర్యలూ బయటపడ్డాయి.

ఈ కార్బన్ పేపర్లను అద్దం ఎదుట పెట్టుకుని నికొలాయ్ చదువుతూండగా, ఒక కార్బన్‌పేపరుపైన అరెస్టులోవున్న వ్యక్తుల పేర్ల జాబితా అతడికి అగపడింది. ఆ జాబితాలో "వసిలేవిచ్, గ్రేగొర్" అనే పేరు కూడా వుంది. ఇది మన జోర్జ్ పేరే.

జోర్జ్ బతికే వున్నట్టూ, అతణ్ణి ప్రశ్నించినప్పుడు, అతడు తన అసలు పేరు బయట పెట్టకుండా, తన మారుపేరు ఇచ్చినట్టూ స్పష్టమైంది.

గెస్టాపో జైలులో పనిచేస్తూన్న కొంతమంది జైలు వార్డర్లతో లరీసకి పరిచయముంది. ఆమెద్వారా నికొలాయ్ వీరితో సంబంధం ఏర్పరచుకున్నాడు. ఇందుకు రాజమార్గం వుండనేవుంది— డబ్బు. లంచం పెడితే ఎటువంటి "ఉపకారం" అయినా జరిగిపోయేది. ఒకసారి పెట్టిన లంచం ఫలితంగా, జోర్జ్ ఇంకా జైల్లోనే వున్నట్టు వార్డర్లు చెప్పారు. మరోసారి పెట్టిన లంచం ఫలితంగా, జోర్జ్‌కి పార్శెలు వెళ్ళింది. ఈ విధంగా నికొలాయ్ జోళ్లూ, బట్టలూ, భోజన పదార్థాలూ జోర్జ్‌కి పంపించాడు.

క్రమక్రమంగా జైలు పరిస్థితులను గురించి సవివరమైన సమాచారం

అంతా నికొలాయ్‌కి తెలిసింది. జోర్జ్‌కి తగిలిన గాయం మానడం మొదలుపెట్టిందనీ కాని విచారణ కాలంలో గెస్టాపొలు కొట్టిన దెబ్బలకి పుండు మళ్ళీ పచ్చిచేసిందనీ తెలిసింది. ఇహ తరువాత తెలిసింది : గెస్టాపొకి జోర్జ్ సోవియట్ గెరిల్లా అయి వుంటాడనే అనుమానం కల్గి, అతణ్ణి ప్రతిదినమూ విచారణచేస్తున్నట్టు. తుపాకి కాల్పుల రూపంలోనూ, చిత్రహింసల రూపంలోనూ మృత్యువు జోర్జ్ కళ్ళఎదుట నిరంతరమూ తాండవించుతూనే వుండేది.

మా డిటాచ్‌మెంటులో స్తుశ్రితీన్‌స్కియ్‌ల బంధువు మరొకతను కూడా వుండేవాడు—పెత్రో మమొనేత్స్. ఇతడు యోధ్యతోబుట్టువు, పోలిష్ సైన్యంలో మాజీ కార్పొరల్. సెప్టెంబరులో నికొలాయ్ స్తుశ్రితీన్‌స్కియ్ క్యాంపుకి వచ్చి, మమొనేత్స్‌ని తనతో కూడా తీసుక వెళ్ళేందుకు అనుమతి కోరాడు.

“నేనూ ఇతనూ కలిసి జోర్జ్‌ని విడిపించడానికి ప్రయత్నిస్తాం.” అన్నాడు.

ఇద్దరూ రోవ్నో వెళ్ళారు. కొద్ది రోజులకల్లా నికొలాయ్ ద్వారా మమొనేత్స్‌కి అక్కడి జైలు సెక్యూరిటీ పోలీసులో ఉద్యోగందొరికింది. అనతికాలంలోనే మమొనేత్స్ చండశాసనుడైన “పోలీసువాడు”గా పేరు సంపాదించుకున్నాడు. తన పైఅధికార్ల దృష్టిలో పడేందుకే అతడు సర్వదా ప్రయత్నించుతుండేవాడు. గెరిల్లాలను నానా బండబూతులూ తిట్టేవాడు. ఇక అన్నిటికంటె ముఖ్యం—పై అధికార్ల అనుగ్రహం సంపాదించేందుకని, వారికి వెన్న, కొవ్వు, మా గెరిల్లాలు తయారు చేసిన సాసేజిలూ సప్లై చేస్తూండేవాడు. కొద్దిరోజుల్లో మమొనేత్స్‌కి హెడ్‌పోలీసుగా ప్రమోషను దొరికింది. ఇక దానితో అతడికి జోర్జ్‌ని చూసే అవకాశం లభించింది.

“జోర్జ్‌ని మనం పోల్చుకోలేమన్న మాట. క్రూరవాడు ఏమిచిత్రహింసలు అనుభవించాడో కదా ! ఉత్త ఎముకలూ చర్మమూ...”

దీని తరువాత జోర్జ్‌కి తరుచుగానే పార్శిల్సు అందేవి. అయినప్పటికి ఇంచుమించు ప్రతిరోజూ అతణ్ణి గెస్టాపొలు చితుకబాదేవారేమో, అతనిఆరోగ్యంబాగు పడడం అసాధ్యమైపోయింది.

మమొనేత్స్ జైలు చీఫ్ వార్డరుతో స్నేహంచేసి, “లాభసాటిబేరం” ఒకటి అతడికి కుదిర్చిపెడతానన్నాడు. అరెస్టులో ఉన్న ఒక ప్రైవేటు బిల్డింగు కంపెనీకి కూలీలుగా సప్లై చేసినట్లయితే మంచి డబ్బు చేసుకోవచ్చునని చెప్పాడు.

"ఓ యిరవైమంది ఖైదీలనూ, ముగ్గురు నలుగురు పోలీసులనూ నాకివ్వండి. ఖైదీలను కూలికి తోల్తాను నేను. లాభం మనంపంచుకుందాం" అన్నాడు మమొనేల్స్.

చీఫ్ వార్డరు చాలా రోజులవరకూ ఒప్పుకోలేదు. కాని ఆ కంపెనీ అడ్మినిస్ట్రేషన్ కింద పంపించిందని చెబుతూ మమొనేల్స్ సప్లైచేసిన ఆహారపదార్థాలూ, డబ్బూ అతగాడు రుచిమరిగేసరికల్లా మెల్లిమెల్లిగా "మెత్తపడ్డాడు."

అక్టోబరు చివరిరోజుల్లో మమొనేల్స్‌కి తెలిసింది—జోర్జ్‌కి తుపాకి కాల్పుల వల్ల మరణ శిక్ష విధించారని. ఈ సంగతి యింకా జోర్జ్‌కి తెలియదు. ఇక ఏమైనా సరే ఆలస్యం చేసేందుకు వీల్లేకపోయింది.

నవంబరు 8న మమొనేల్స్ ఒక జట్టు ఖైదీలను కూలిపనిమీద ఊళ్ళోకి తోలుకెళ్ళాడు. ప్రత్యేకమైన లంచం ముట్టజెప్పేసరికి జోర్జ్‌ని కూడా ఆ జట్టులో చేరనిచ్చాడు చీఫ్ వార్డరు. ఖైదీలను జైలు సెల్సులోనుంచి తీసుకుని వెళ్తున్నప్పుడు మమొనేల్స్ జోర్జ్ చెవిలో నాలుగు మాటలు వూదాడు.

ఖైదీలు జైలు విడిచిపెట్టి, ఓ రెండు మూడు బ్లాకులు నడిచేసరికల్లా జోర్జ్‌కి "మొహం ఝుమాలుమని" కిందపడిపోయాడు. మమొనేల్స్ సెక్యూరిటీపోలీసు స్క్వాడ్‌కి హెడ్ అవడంచేత, కడమ ఖైదీలతో సాగివెళ్ళవలసినదిగా తన దళాన్ని ఆర్డరుచేసి:

"ఈ వెధవ దొంగవేషాలు వేస్తున్నాడు. వీడి అంతు నేను తేల్చుతాను!" అని గర్జించాడు.

అలా అంటూ మమొనేల్స్ జోర్జ్‌ని అక్కడున్న యింటి ముంగిట్లోకి బరబర ఈడ్చుకుపోయాడు.

మమొనేల్స్ జోర్జ్‌ని తప్పకుండా అక్కడ తుపాకితో కాల్చేస్తాడని పోలీసులు విశ్వయించుకున్నారు.

కాని జోర్జ్‌ని మమొనేల్స్ ఆ యింటి ముంగిట్లోకి ఈడ్చుకుపోగానే, జోర్జ్ చెంగున లేచిపోయాడు. జోర్జ్, మమొనేల్స్‌లు యిద్దరూ ఆ యింటి ప్రహరీ గోడ గంతేసి, పక్కయింటి ముగింట్లోనుంచి వెనుక సందులోకి పారిపోయారు. క్రితం రోజునుండీ అప్పుడే అక్కడ ఒక కారు డ్యూటీమీద ఆగివుంది. ఆ కారులో ఇజ్నెతోవ్, నికొలాయ్ స్త్రితిన్‌స్కీయులున్నారు.

జోర్జ్ మృత్యునోటనుండి తప్పించుకుని వచ్చిన వార్త విన్నతరువాత మా

కాని కుజ్నెత్సోవ్, ఈలోపున అక్కడకు వచ్చిన స్ట్రెకిన్‌స్కియ్ ఇద్దరూ కలిసి ఇల్‌గెన్‌ని పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు.

"మే మెవరమో మీతో స్పష్టంగా చెప్పనే చెప్పం. మీరు గెరిల్లాలకోసం వెతుకుతున్నారు–ఇదుగో చూడండి, మీ ఎదటే వున్నారు. గెరిల్లాలు!" అన్నాడు కుజ్నెత్సోవ్.

"రాండి, సాయంచేయండి!" అని బొబ్బరించాడు ఇల్‌గెన్.

అతణ్ణి కిందకి పడదోసి, నోట్లో చేతిరుమాలు కుక్కి, కారు దగ్గరకి ఈడ్చుకుపోయి, కార్లో కుదేస్తుండగా అతడి నోట్లో కుక్కిన చేతిరుమాలు వూడొచ్చేసింది. దాంతో అతడు మళ్ళీ బొబ్బరించాడు. సెంట్రీ పరుగున వచ్చి:

"రిలీవింగ్ పార్టీ వస్తూంది!" అని కుజ్నెత్సోవ్‌ను చూసి కేకేశాడు.

కుజ్నెత్సోవ్ తన యూనిఫారం కోటు సరిచేసుకుని, "అతడి నోట్లో గుడ్డ కుక్కేయ్!" అని చెప్పి, ఆ వస్తూన్నవాళ్ళకేసి వెళ్ళాడు. వాళ్ళు రిలీవింగ్ పార్టీ మనుషులుకారు–వాళ్ళు నలుగురు జర్మన్ ఆఫీసర్లు. కుజ్నెత్సోవ్ వాళ్ళదగ్గరకు వెళ్ళి తన గెస్టాపో బిళ్ళ (ముందుకు ఎప్పటికైనా పనికివస్తుందని, తాను "వ్యక్తిగతంగా సంపాదించిన విజయచిహ్నం") వారికి చూపి:

"జర్మన్ యూనిఫారం వేసుకున్న గెరిల్లాని పట్టుకున్నాం. అతడు జనరల్‌ని హత్య చేయడానికి వచ్చాడు. మీ డాక్యుమెంట్లని దయచేసి ఇలా ఇవ్వండి!" అన్నాడు.

వారు తమ డాక్యుమెంట్లను కుజ్నెత్సోవ్‌కి ఇచ్చారు. గెస్టాపోనుండి ఒకానొకప్పుడు సంగ్రహించబడిన ఆ బిళ్ళ అధికారానికి వారు తల ఒగ్గక తప్పలేదు. కుజ్నెత్సోవ్ వారి పేర్లు తన నోటుబుక్కులో రాసుకుని:

"మీరు ముగ్గురూ వెళ్ళొచ్చు. కాని గ్రానావ్‌గారూ!" అని నాల్గవ వ్యక్తిని సంబోధించి: "మీరు మాత్రం గెస్టాపో ఆఫీసుకి మాతో రండి!" అన్నాడు.

వారి డాక్యుమెంట్లను కుజ్నెత్సోవ్ చూసినప్పుడు అతనికి తెలిసింది, గ్రానావ్ రైఖ్ కమిస్సార్ ఏరిక్ కోఖ్ తాలూకు సొంత డ్రైవరని. "వీడు మనకి ఉపయోగపడతాడు!" అనుకున్నాడు కుజ్నెత్సోవ్.

గ్రానావ్ కుజ్నెత్సోవ్‌తో కలిసి కారుదగ్గరికి వెళ్ళాడు. కుజ్నెత్సోవ్

కమీన్‌స్కీయ్, గ్నెద్యూక్‌లకు సంజ్ఞచేశాడు. దానితో వారిద్దరూ గ్రానావ్‌ని కారు లోపలికి తోసేసి, అతణ్ణి నిరాయుధుణ్ణి చేసివేశారు.

ఐదుగురు కూర్చునే "ఓపెల్"లో ఇప్పుడు ఏడుగురున్నారు.

ఆ రాత్రి, ముఖ్యంగా మరుచటి ఉదయమూ వూళ్ళో గొప్ప గగ్గోలు లేచింది. జనరలే మాయమైపోయాడు! గెరిల్లాలకోసం గెస్టాపో వూరంతా గాలించింది. పహరావాళ్ళు వీథుల్లో గస్తీ తిరుగుతున్నారు. సాయుధ పోలీసులు ఇంటింటికీ వెళ్ళి ఇళ్ళు సోదాచేయడం మొదలెట్టారు.

"నేరస్థుం జాడ" పసికట్టేందుకని జర్మన్లు ఆదరా బాదరా వెతుకు తూండగా, ఆ పాటికప్పుడే మా "పర్ణశాల" చౌకీలో, సెంట్రీ, తైనాతీమనిషీ ఇద్దరూ తాము మొదట ఎలా భయపడిపోయారో, ఆ తరువాత ఇల్‌గెన్‌ని పట్టుకోవడంలో తాము ఎలా సాయపడ్డారో ఆ సంగతులన్నీ చెబుతున్నారు. అదేసమయంలో కోఖ్ ప్రతినిధీ, ఉక్రైనియాలో ప్రధాన న్యాయమూర్తి అయిన ఫుంక్ దర్శనంకోసమని, అతని ఆఫీసు వెయిటింగు రూములో కుజ్నెత్సోవ్ ఒక మెత్తని తోలుకుర్చీలో హాయిగా కాళ్ళు చాపుకొని కూర్చున్నాడు.

ఆల్‌ఫ్రెడ్ ఫుంక్ హోదా "ఎస్ ఎస్–ఓబెర్‌ఫ్యూరెర్". ఉక్రైనియాలో ఉద్యోగానికి ముందు, జర్మన్ ఆక్రమిత జెకోస్లోవాకియాలో ప్రధానన్యాయమూర్తిగా వుండి, జెక్‌దేశ భక్తులను అతి నిర్దాక్షిణ్యంగా శిక్షించాడు. ఇతడు ఉక్రైనియాకు వచ్చి, తన రక్తపాతక్రియలను ఇక్కడ కూడా కొనసాగించాడు. ఇతని ఆజ్ఞలపైన యావన్మంది ఖైదీలూ జైళ్ళలోనే తుపాకిగాల్పులకు బలిఅయ్యారు. ఏ పాపమూ ఎరగని వేలాది ప్రజలు కాన్సంట్రేషన్ క్యాంపుల్లో ఉరితీయబడ్డారు.

గేల్, క్నట్‌ల హత్యలూ, డార్గెల్‌పై హత్యాప్రయత్నమూ జరిగిన వెను వెంటనే, రోవ్నొ జైలులో వున్న ఖైదీలందరినీ తుపాకులతో కాల్చివేయవలసిందని ఫుంక్ ఆజ్ఞ జారీచేశాడు. ఈ హంతకునికి మరణశిక్ష విధించాలని అప్పుడు మేం నిర్ణయించాం. కుజ్నెత్సోవూ, స్త్రుతిన్‌స్కీయూ, కమీన్‌స్కీయూ, ఫుంక్‌కి ప్రతి ఉదయమూ క్షురకర్మచేసే మంగలివాడూ–ఈ నలుగురూ కలసి ఈ శిక్ష అమలు జరిపేందుకు ఒక పథకం తయారుచేశారు.

మరొక పదిహేనునిమిషాలలో ఫుంక్ అక్కడకు వస్తాడని కుజ్నెత్సోవ్‌కు తెలుసును. వెయిటింగు రూములో ఫుంక్ సెక్రెటరీ తప్ప మరెవ్వరూ లేరు. సెక్రెటరీ అమ్మాయితో కుజ్నెత్సోవ్ వాతావరణం గురించి పొల్లు బాతాఖానీకి దిగాడు. బాతా

కాసీ సాగించుతూన్నంత సేపు అతడు కిటికీలోనుంచి వీథికేసి చూస్తూనే వున్నాడు. వీథిలో ఇటూ అటూ తచ్చాడుతూన్నాడు యాన్ కమీన్‌స్కీయ్.

వీథిలో వున్న మంగలిషాపు కిటికీ తెరకేసి చూస్తున్నాడు కమీన్‌స్కీయ్.

క్షురకర్మ ముగిసిన తరువాత ఫుంక్ మంగలిషాపునుండి ప్రధాన న్యాయ స్థానానికి బయల్దేరుతాడనగా, మంగలివాడు తన షాపు కిటికీ తెర తీసేటట్టు ముందుగా ఏర్పాటైంది. ఫుంక్ న్యాయస్థానానికి బయల్దేరినట్టు కుజ్నెత్సోవ్‌కి తెలియజేయడాని కని కమీన్‌స్కీయ్ తన టోపీ తీసేసి, తల గోక్కునేటట్టుకూడా ఏర్పాటైంది.

"సాయంకాలం ఆరుగంటలకి ఫ్రీడ్రిఖ్‌ష్ట్రాసె, దోయిచ్‌ష్ట్రాసెల మొగని మీ కోసం నేను కనిపెట్టుకుని వుంటాను. మనం ఎక్కడికైనా వెళ్ళి సరదాగా కాల క్షేపం చేద్దాం. మీరు వస్తారుకదూ?" అన్నాడు కుజ్నెత్సోవ్ సెక్రెటరీ అమ్మాయితో.

"వస్తాను" అంది ఆ అమ్మాయి.

సరిగ్గా ఆ సమయానికి కమీన్‌స్కీయ్ సంజ్ఞచేయడం కుజ్నెత్సోవ్ గమనించాడు.

"దయచేసి ఓ గ్లాసు టీ ఇప్పించగలరా! మహా చెడ్డ ఎండగా వుందండీ ఈవేళ!" అన్నాడు కుజ్నెత్సోవ్.

"దానికేముందండీ, కెప్టెన్‌గారూ! క్షణంలో తీసుకొస్తా!"

సెక్రెటరీ తిరిగి వెయిటింగు రూములోకి వచ్చేసరికి ఆ గదిలో ఎవ్వరూ లేరు. ఆమె ఆశ్చర్యపడి బుజాలు ఎగరేసి, తన బల్లదగ్గర కూచుంది. సరిగా ఆ క్షణానికి ఫుంక్ ఆ గదిలో అడుగుపెట్టాడు. సెక్రటరీకేసి చూసి, "గూటెన్ మోర్గెన్!" * అని ఓ మొరుగు మొరిగి, అతడు తన కచేరీగదిలోకి వెళ్ళిపోయాడు.

ఓ నిమిషం అయిందో లేదో, కచేరీగదిలోనుంచి రెండు తుపాకికాల్పుల చప్పుళ్ళు వినబడ్డాయి. సెక్రెటరీ అమ్మాయి హడలిపోయి తన కుర్చీలోనుంచి చెంగున గంతువేసింది. ఆ క్షణంలో కచేరీగదిలోనుంచి కెప్టెను రావడం ఆమె చూసింది, అతడు ఆమెకేసి కన్నెత్తి చూడకుండా, మెట్లదగ్గరకి వెళ్ళాడు.

ప్రధాన న్యాయస్థానపు భవనం నిండావున్నారు జనం. కాల్పుల

* "గూటెన్ మోర్గెన్!" జర్మన్ భాషలో "సుప్రభాతం!" – అను.

చప్పుడు అందరూ విన్నారు. కాని కుజ్నెత్సోవ్‌పై ఎవ్వరికీ అనుమానం తోచలేదు. అతడు వీథిలోకి వెళ్ళిపోయాడు. గెస్టాపో మనుషులతోనూ, మిలిటరీ పోలీసులతోనూ నిండిన రెండు కార్లు అప్పుడే ఆ భవనంముందు ఆగాయి. గెస్టాపో మనుషులు కార్లలోనుండి దిగి, కాల్పుల చప్పుడు వినవచ్చిన మొదటి అంతస్తు కిటికీలకేసి ఆశ్చర్యంతో చూశారు.

కుజ్నెత్సోవ్ వారిపక్కనే నుంచుని ఆశ్చర్యం నటించి తను కూడా కిటికీలకేసి చూశాడు. "హత్య జరిగింది! హంతకుణ్ణి పట్టుకోండి!" అనేకేకలు వినబడి, అందరూ భవనంలోకి చొరబడేసరికి, కుజ్నెత్సోవ్ పక్కసందులోకి మళ్ళి, ఓ ముంగిట్లోకి వెళ్ళి, ఆ ప్రహరీ ఎక్కి అవతలి పక్కకు గంతేసి, ఇంకొక ప్రహరీ ఎక్కి అవతలి పక్కకు గంతేసి తనకారు చేరుకున్నాడు. కారులో స్ట్రొలిన్‌స్కియ్ డ్రైవరుసీటులో కూచునున్నాడు.

గెస్టాపో మనుషులూ, మిలిటరీ పోలీసులూ ఆ భవనంచుట్టూ ఘాటువేసి, గెరిల్లాను పట్టుకుందుకని భవనం ఎక్కి, పైకప్పూ, అటకగదీ వెతికారు. ఇహ చిట్ట చివరకు, కొందరు జర్మన్ ఆఫీసర్లతోసహా ఓ ఇరవైమందిని పట్టుకుని భవనంలో నుండి బయటికి తీసుకొచ్చి, ఆ ఇరవైమందినీ గెస్టాపో స్టేషనుకి తీసుకుపోయారు. వీథిలో తన స్థానంలో నిలబడివున్న కమీన్‌స్కియ్ ఇదంతా చూస్తూనేవున్నాడు.

ఈలోపున కుజ్నెత్సోవ్, స్ట్రొలిన్‌స్కియ్‌లు వూరి పొలిమేరదాటి ఎంతో దూరం వెళ్ళిపోయారు.

మేం "మృత్యురాజు"తో యుద్ధంచేసిన తరువాత ఉత్తరదిశగా వెళ్తున్న సమయంలో ఈ ఘటన సంభవించింది.

## విరామం

మా క్యాంపునుండి వైదొలగుడు ఏమంతసులువుగా జరగలేదు. త్స్వామన్ స్కియె అరణ్యంలో మేం వుండిన ఆరునెలలోనూ మా సంఖ్య పెరగడమేకాకుండా, బోలెడంత సంసారం పెరిగింది. ఉప్పువేసి నిలవచేసిన మాంసమూ, కొవ్వూపిపాలు, నిలువ సాసేజి పెట్టెలు, నాజీల తుపాకి కాల్పులకు బలిఅయిన పోలిష్ రైతుల పొలాలనుండి మేం స్వయంగా కోసి జాగ్రత్త పెట్టిన గోధుమలు బస్తాలకి బస్తాలు– ఇవన్నీ వుండెను. మాదగ్గర, రకరకాల పరికరాలెన్నిటితోనో ఈనాడు అమర్చబడిన రిపేర్ వర్క్‌షాపు సామానుకే ఒక బండికి బండీ అవసరమైంది. వీటికితోడు, దర్జీల

సామానూ, గొడారివాళ్ళ సామానూ, ఇంకా కదమ సామానూ బోలెడంత వుండనే వుంది. మా బండ్ల వరుసలో ఏభై బండ్లున్నాయి, బండికి జత గుర్రాలు; "మృత్యు రాజు" మామీద నడిపిన యుద్ధయాత్రను మేం నాశనంచేసిన తరువాత, ఆయుద్ధంలో మాకు పట్టుపడిన ఫిరంగులు, మోర్టార్లు, గ్రెనేడ్లు, మందుపాతరలు, మందుగుండు సామగ్రి, ఇంకా ఇతర విజయచిహ్నాలనూ తీసుకువెళ్ళేందుకు గుర్రాలనూ, బండ్లనూ అదనంగా ఏర్పాటుచేయాల్సి వచ్చింది.

వర్షాలనుండి రోడ్డు శుభ్రంగా చెడిపోయింది, బండ్లూ, మనుషులూ కదలటమే కష్టమైపోయింది. ఇందువల్ల ఎంతో ఇబ్బందిపడ్డాం, ఇక క్షతగాత్రులు నిజంగా యమయాతనే అనుభవించారు.

జర్మన్ స్పెషల్ సైనికబలం మా క్యాంపు చేరుకుని, అది పూర్తిగా ఖాళీగా వున్నట్టు వారికి నమ్మకం తోచిన పిదప మమ్మల్ని వెంబడించారు. మా జాడ తెలుసుకోవడం కష్టమేమీకాదు, ఎందుచేతనంటే మేమే కాకుండా ప్రొకొప్యూక్, కరస్యోవ్‌ల డిటాచ్‌మెంట్లూ, బాలిత్స్కీయ్ బెటాలియనూ, మగొమేత్ గ్రూపూకూడా ఆ దారంటే వెళ్ళాయి. మేమందరమూ మా పాత స్థలాలను వదలిపెట్టేశాము. మా జాడలను తెలియకుండా చేసేందుకు మాకు ఏ విధంగానూ వీలుపడలేదు.

అయినప్పటికీ జర్మన్లు మమ్మల్ని పట్టుకోలేకపోయారు. ఇందుకు మొదటి కారణం: వారు మా వెంటబడడంలో జాప్యం చేశారు; రెండోది: మా జాడలు అడవిలోకి దారితీయడం చూసుకుని, వారు మహారణ్యాన్ని గాలించడంలో బోలెడంత వేళ దండుగచేసుకున్నారు. ఏనిమిషాన హఠాత్తు పోరాటం జరుగునో అని భయపడుతూ, దృఢమైన పంక్తులు తీర్చి ముందుకు సాగేవారు.

మా డిటాచ్‌మెంటు నూటఏభై కిలోమీటర్లు ముందుకువెళ్ళి, మేం మజిలీ చేయ నిశ్చయించుకున్న త్స్వెలోక్విచి-వెల్కీ గ్రామానికి ఐదుకిలోమీటర్ల దూరంలో వున్నామనగా, ఆకాశాన తూర్పుదిశను బ్రహ్మాండమైన అగ్నిగోళం ఒకటి మెల్లగా పైకిలేవడం అగపడింది.

"ఇదేమిటిది? మీ ప్రాంతంలో సూర్యుడు తమాషాలు చేస్తూంటాడా ఏమిటి!" అని రోడ్డుమీద నుంచున్న ఓ రైతుని అడిగాను.

"ఈవేళ మంచుతుపాను రాబోయే సూచన ఇది" అని అతడు జవాబు చెప్పాడు.

"మంచుతుపానా? అరె! ఆకాశాన పిసరంత మబ్బైనాలేదు, అసలు గాలే లేదుకదా!" అన్నాడు లుకిన్.

కాని ఆ రైతు మాటే నిజమైంది.

దిగ్మండలంనుండి ఎగువకు లేస్తూన్న సూర్యబింబం అంతకంతకు చిన్నదై పోయి, దానికి అదోకమోస్తరు కాంతిలేని తెలుపుదనం వచ్చేసింది, ఇక తరువాత నల్లనిమబ్బులు క్రమేణలేచి సూర్యుణ్ణి కప్పేశాయి.

ఆ గ్రామంలో మా మనుషులకి బసలు ఏర్పాటుచేసి, వారిని బసల్లోకి పంపించామో లేనేలేదో, దూదిముద్దల్లాంటి మంచుపెచ్చులు పడడం ఆరంభమైంది. తెల్లని తొలిమంచు తునకల పాల తెలుపుదనం చూడడానికి ఎంతో ఇంపుగావుండెను. కాస్సేపటికి జోరుగా లేచిందిగాలి. అంతకంతకు మరింతగా పొత్తుగా పడింది మంచు. మరి పది నిమిషాలకి రెండు మూడు మీటర్లకు ఆవలనున్న వస్తువు ఇక కంటికి కానరాలేదు.

మంచుతుపాను సుమారు రెండుగంటలసేపు వికటాట్టహాసం చేసింది; మంచు కుప్పతెప్పలుగా కొట్టుకొచ్చింది.

మంచు కుప్పలు ఒకరోజుకంటె అట్టే కాలం నిల్చివుండవని మాకు తెలుసును, ఏమంటే మంచు నేలపై గడ్డకట్టేందుకు నేల ఇంకా చల్లపడలేదు. అయినప్పటికీ అందరం ఆనందించాం: మంచు పడడంనుంచి మా జాడలు తుడుచుకుపోతాయి. మంచు కరిగేప్పటికి, ఏమైనాసరే ఇహ ఆ రోడ్డుపైన జర్మన్ లారీలు కదల్లేవు, రోడ్లన్నీ ఎంతగా బురదతో నిండిపోతాయంటే ప్రయాణానికి అసలు అవకాశమే వుండదు.

* * *

ప్రొకొవ్యూక్ డిటాచ్‌మెంటు కూడా, మాతోనే త్సెల్యోవిచి-వెర్ఖ్ గ్రామంలోనే విడిసింది. కరస్యోవ్ డిటాచ్‌మెంటు మాకు ఓ రెండు కిలోమీటర్ల దూరాన స్తీర్ నదీతీరానవున్న ఖ్లినొక్ గ్రామాన్ని ఆక్రమించుకుంది. బాలిత్స్కియ్ బెటాలియన్ త్సెల్యోవిచి-వెర్ఖ్‌కి ఉత్తరంగా ఇరవై కిలోమీటర్ల దూరానున్న అడవిలోకి తన వెనుకటి శిబిరానికే తిరిగివెళ్ళిపోయింది.

త్స్వానమన్‌స్కియె అడవుల్లోనుంచి మేమే కాకుండా, "ఫ్యోదొరొవ్-చెర్నిగొవ్‌స్కియ్" అని పేరువడసిన ఫ్యోదొరొవ్ నాయకత్వానవున్న పటాలం కూడా

ఆ ప్రాంతానికే వచ్చేసింది ఇతని మనుషులు త్సెర్కోవిచి-వెర్కికి పడమరగా ముప్పైఐదు కిలోమీటర్ల దూరానవున్న అడవిలో మకాం పెట్టుకున్నారు.

మేమిక్కడ పది, లేక పన్నెండు రోజులకంటె హెచ్చుకాలం వుండదల్చు కోలేదు. జర్మన్ స్పెషల్ సైనికబలం నిర్మానుష్యమైపోయిన త్స్యూమన్స్కియె అడవుల్లో తిరిగి తిరిగి విసుగెత్తి అక్కడనుండి వెళ్ళిపోగానే, మేం మళ్ళీ అక్కడకు తిరిగివెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నాం. మేం ప్రారంభించిన కార్యాన్ని ఇంకా అభివృద్ధిచేయడం ఎంతైనా అవసరమైంది.

త్స్యూమన్స్కియె అడవుల్లో మేం వుంచేసిన మొబైల్ గ్రూపు మా స్థానే పనిచేయలేకపోతూంది; అంతేకాకుండా ఆ గ్రూపుతో మేం సరాసరి రేడియో సంబంధాలను స్థాపించుకోలేకపోయాం.

ఎర్రసైన్యం పురోగమించుతూంది. మొదట ఒక స్థానంలోనూ, తరువాత వేరొక స్థానంలోనూ నిలదొక్కుకుందామనే ఆశతో నాజీ హైకమాండు తన సైనిక బలాలను పదేపదే పునర్వ్యవస్థీకరించింది వాటిని యుద్ధశ్రేణిలో వివిధ విభాగాలకు బదిలీచేసింది. ఈ సైనికబలాల చలనాలను ముందుగానే కనిపెట్టి, వాటిని ఎప్పటి కప్పుడు మాస్కోకు రిపోర్టుచేయడం మా కర్తవ్యం.

ఆక్రమణదార్లలో భయాందోళనలు పుట్టించేందుకూ, వారి రక్షణ సన్నాహాలకు అవరోధం కల్గించేందుకూ, లూటీ సామానుతోసహా వారు దేశంనుండి వెళ్ళి పోకుండా వుండేందుకూ వారిని చికాకుపెట్టి పీడించవలసిందని మా కమాండునుండి అక్టోబరు చివరిరోజుల్లో మాకు ఆజ్ఞవచ్చింది. ఈ ఆజ్ఞను మేము, రోవ్నాలో వున్న కుజ్నెత్సొవ్, స్త్రుత్వీన్స్కియ్, షెవ్చూక్, నొవాక్ తదితరులకూ, జ్డొల్బునోవొలో వున్న క్రెస్నొగొలొవెత్స్‌కి అందించాము.

ఇంతేకాకుండా మేం త్సెర్కోవిచి-వెర్కి గ్రామానికి వెళ్తూ తోవలోవున్నప్పుడు, అనేక పోరాట గ్రూపులకు విధ్వంసన, గూఢచారి కర్తవ్యాలను ఒప్పచెప్పి వాటిని రోవ్నా పంపించాం.

విమానావతరణ క్షేత్రంగా ఉపయోగపడే ఒక జాగా త్సెర్కోవిచి-వెర్కి సమీపంలో కనబడింది. ఈ జాగా తాలూకు స్థలనిర్దేశ వివరాలను మాస్కోకు రేడియోచేశాం. కాని విమానం ఏదీరాలేదు. ఇందుకు కారణమేమని వాకబుచేయగా, మా డిటాచ్‌మెంటు క్షతగాత్రులనూ, కరనొవ్, ప్రొకొప్యూక్ డిటాచ్‌మెంట్ల క్షతగాత్రులనూ ఫ్యోదొరొవ్-చెర్నిగోవ్స్కియ్ నాయకత్వాన వున్న గెరిల్లా పటాలానికి పంపవలసిందని మాస్కోనుండి ఆదేశాలు అందాయి.

గాయపడినట్టి, జబ్బుతో బాధపడుతూన్నట్టి కామ్రేడ్లపట్ల మేం శత్రు ఆక్రమిత ప్రాంతంలో అడుగుపెట్టిన తొలిరోజునుండీ ప్రత్యేకంగా శ్రద్ధతీసుకున్నాం. గాయపడినవారి గురించి జాగ్రత్తతీసుకోవడమనే నియమాన్ని గెరిల్లాలు పరమపవిత్రంగా భావించుకుంటారు. మా క్షతగాత్రులను మేమిప్పుడు వేరొక డిటాచ్‌మెంటుకి ఒప్పజెప్పాల్సిందనే సమస్య మా కెదురైంది. ఆ డిటాచ్‌మెంటు గురించి ఎన్నో మంచి సంగతులను మేం విన్నప్పటికీ మా కామ్రేడ్లు ఇకముందు ఏ పరిస్థితులలో వుండాల్సివస్తుందో స్వయంగా చూడాలని మేం నిశ్చయించుకున్నాం. ఇరవైమంది గెరిల్లాల ఎస్కార్టుతో మేం—కరస్యోవ్, ప్రొకోప్యూక్, నేనూ—ఫ్యోదొరొవ్-చెర్నిగొవ్‌స్కియ్‌ని చూడ్డానికి బయల్దేరాం.

ఫ్యోదొరొవ్‌ను కలుసుకున్నప్పుడు అతడు మా యెడల చూపిన ఆదరణ గురించి వివరించడం కష్టమే. అతనితో గడపిన దినాన్ని నే నెన్నటికీ మరచిపోలేను.

చెర్నిగొవ్ ప్రాంతంనుండి బ్ర్యాన్‌స్క్-అడవుల మీదుగా తాను సాగించిన మార్చిగురించి అలెక్సేయ్ ఫ్యోదొరొవ్ మాతో చెప్పాడు. బ్రాన్‌స్క్ అడవులలో ఒక గెరిల్లా డిటాచ్‌మెంటుకి నేను 1941—1942 లో నాయకత్వం వహించాను.

"ఆ ప్రాంతపు ప్రజలు మిమ్మల్ని ఎరుగుదురు, వారు మిమ్మల్ని జ్ఞాపకం వుంచుకున్నారు సుమండీ, కామ్రేడ్ మెద్వెదెవ్। పరాక్రమశీలురైన మీ గెరిల్లాల సమాధులను మేం చూశాం. వారిని చక్కని జాగాలలో ఖననంచేశారు మీరు। సమాధులకు మంచి అందమూ చిత్రోపమైన స్థలాలను మీరు ఎంచారు. మీచీఫ్-ఆఫ్-స్టాఫ్ స్తరొవేరొవ్ సమాధి నాకు ప్రత్యేకంగా జ్ఞాపకం వుంది. బతాయెవొ గ్రామం దగ్గర అడవిలో వుంది ఆ సమాధి. సమాధుల చుట్టూ పెరిగిన గడ్డి గాదమూ మా కుర్రాళ్ళు తీసివేసి అంతా శుభ్రంచేసి, వాటిపైన పుష్పగుచ్ఛాలను వుంచారు. ఇక స్తరొవేరొవ్ మరణానికి మళ్ళీ మరొకసారి పగ సాధించుకుందుకని నాజీలపై కసితీరా దెబ్బతీశాం. బతాయెవొ గ్రామంలో ఒక పెద్దపోలీసు బలాన్ని నాశనంచేశాం."

ఫ్యోదొరొవ్ డిటాచ్‌మెంటులో భేషైన హాస్పిటలే వుంది. మా క్షతగాత్రులను ఆ హాస్పటలుకి పంపవచ్చునా అని ఆయనను మేం అడిగాం.

"ఇంకా అడుగుతారేమిటి? తప్పకుండా పంపండి। మా దగ్గర మంచి డాక్టర్లున్నారు. విమానావతరణ క్షేత్రాన్ని మేం ఆర్గనైజుచేయగానే క్షతగాత్రులను మాస్కో పంపించుతాం" అన్నాడాయన.

మా గాయపడిన కామ్రేడ్లతో నేను ఇలా అన్నాను :

"'సోవియట్ వీర' బిరుదాంకితుడైన మేజర్ జనరల్ ఫ్యోదొరొవ్ నాయకత్వాన వున్న పటాలంలోని హాస్పటలుకి మిమ్మల్ని పంపిస్తున్నాం. ఇక్కడ మీకు ఏదో ఒక మోస్తరుగా జరిగిందనుకోండి. అక్కడకూడా మీకు ఇలాగే జరుగుతుంది. అది మంచి బలమూ, యుద్ధపటిమగల పటాలం—సుప్రీమ్ సోవియట్ సభ్యుని నాయకత్వంకింద వుండదగిన పటాలం. మిమ్మల్ని అక్కడకు పంపించడంలో మాకు ఏ బెంగాలేదు. నాది ఒక్కటే కోరిక : మన డిటాచ్‌మెంటు ప్రతిష్ఠకి భంగం రాకుండా చూడండి. క్రమశిక్షణతో మెలగుతూ సర్వకాల సర్వావస్థలయందూ సోవియట్ గెరిల్లా అనే పేరుకి తగినట్టూ ప్రవర్తించండి."

కొద్దిరోజుల తరువాత ఫ్యోదొరొవ్ మమ్మల్ని చూడ్డానికి వచ్చాడు. ఈ సమావేశం చాలా చిక్కు పరిస్థితులలో జరిగింది మేమందరం కలిసి భోజనం చేస్తూన్న వేళకే సరిగా, నాజీ విమానాలు త్సెల్కొవిచి-వెల్కి గ్రామంపై అనేక పర్యాయాలు వలయాలు తిరిగాయి. అనుమానాస్పదమైనది దేనినీ అవి కనిపెట్టలేక పోవడంవల్ల మాకు పదిహేను, ఇరవై కిలోమీటర్ల దూరానున్న ఒక గ్రామాన్ని అవి నిర్దాక్షిణ్యంగా బాంబుచేశాయి. బాంబింగు పూర్తిగా ఆ రోజంతా జరిగింది. గ్రామంపై నల్లని పొగ మబ్బులు పొత్తుగా లేచాయి. ఇక రాత్రిపూట ఎర్రగా వెలుగుతూన్న ఆకాశాన మేఘాలు రక్తవర్ణంతో ప్రకాశించాయి.

మాకు సంతోషంతో శరణు ఇచ్చిన త్సెల్కొవిచి-వెల్కి గ్రామస్థులు విమానదాడి ప్రమాదానికి గురికాకుండా వుండాలనే ఉద్దేశంతో మేం అడవిలోకి వెళ్ళిపోయాం : అడవిలోనే తాత్కాలికంగా ఒక శిబిరం ఏర్పాటుచేసుకున్నాం.

* * *

కుజ్నెత్సోవ్, స్త్రితీన్‌స్కీయ్‌ల గురించి గాథలకి గాథలూ బయల్దేరాయి. అందునా ప్రత్యేకంగా, గెరిల్లా డిటాచ్‌మెంట్లలోనే వీరిని గురించి అనేక కథలు చెప్పుకున్నారు. వీరిద్దరినీ ఆహ్వానిస్తూ ఆయా డిటాచ్‌మెంట్లనుండి కామ్రేడ్లు మా దగ్గరకు రాసాగారు కాని ఆ ఆహ్వానాలను కుజ్నెత్సోవ్, స్త్రితీన్‌స్కీయ్‌లు అందుకుని అక్కడకు వెళ్ళలేకపోయారు ఏమంటే వీరి పోలికలు బయటపడినట్టయితే అవి గెస్టాపోకి ఎక్కడ తెలిసిపోతాయో అనే భయంతో వీరి గురించి మా డిటాచ్‌మెంటు మనుషులకి సహితం సాధ్యమైనంతవరకు తెలియనివ్వకుండానే వుంచాం. కాని కరసోవ్‌ని చూడ్డానికి మాత్రం వీరిని వెళ్ళనిచ్చాను. వీక్తొర్ కరసోవ్, అతని కమిస్సార్ మిహాయిల్ ఫిలొనేన్‌కొ మాకు మంచి ఇష్టులయ్యారు. కుజ్నెత్సోవ్ ఉరాల్స్ ప్రాంతపువాడనీ, ఒక విధంగా చూస్తే, అతడు ఇంచుమించు తమవూరివాడే

అని వారు తెలుసుకుని, సైబీరియన్ పద్ధతిలో నిర్మించిన స్నానగృహంలో స్నానం చేయవలసిందని అతనిని వారు ఆహ్వానించారు.

"అంత హాయిగా స్నానంచేసి ఏ కాలమైందో!" అన్నాడు కుజ్నెత్సోవ్ అక్కడ్నుంచి తిరిగివచ్చిన తరువాత. "మా స్వగ్రామంలో సహితం ఇంత చక్కని స్నానగృహాన్ని చూడలేదు నేను. ఎగువ అటకమీద వున్న మనిషికి ఆవిరివల్ల ఊపిరి ఆడదు, ఇహ కిందనేమో చల్లగా వుంటుంది. ఆవిరి స్నానమంటే అదీ ఆవిరి స్నానం!"

"మన స్నానగృహాన్ని మరచిపోయినట్టున్నావే? ఆవేళ కూలిపోయినది!" అని అక్కడున్నవారిలో ఎవరో అడిగారు.

కుజ్నెత్సోవ్ ఒకనాడు చేసిన "ఆవిరి స్నానం" గురించి జ్ఞాపకం తెచ్చుకుని అందరూ నవ్వారు. మామూలు చూమ్ పద్ధతిలో మేమొక స్నానగృహంకట్టాం. పొగ బయటికి పోయేందుకని నడికప్పున పెద్ద కన్నం వుంచాం, నెగడిమీద పెద్ద తొట్టెలో నీరు కాగుతూంది. బయటనుండి నీరు తెచ్చుకుందుకు అవసరంలేకుండా, స్నానగృహంలోనే లోతైన గోయితీశాం. ఈ స్నానగృహంలో స్నానంచేయడం ఏమీ సంతృప్తికరంగా లేకపోయింది: నెగడినుంచి వస్తూన్న సెగ ఎంత తీవ్రంగా వుంటేనంటే అక్కడ నుంచుందుకే వీల్లేకపోయింది. నెగడినుంచి కాస్త దూరంగా వెళ్ళేసరికి— ఎముకలు కొరికేస్తున్నంత చలి.

కుజ్నెత్సోవ్ స్నానంచేస్తూండగా, స్నానగృహం అమాంతం కూలిపోయింది. వొళ్ళుశుభ్రంగా కడుక్కుందుకని చక్కగా సబ్బు రాసుకున్న కుజ్నెత్సోవ్ చన్నీళ్ళ నూతిలో పడిపోయాడు. నలుగురూ కలసి అతణ్ణి నూతిలో నుంచి పైకితీశారు— అతడి వొళ్ళంతా బురద పూసుకుపోయింది. తమ గుడిసెల నుండి క్రామెడ్లు డబ్బాలతో వేన్నీళ్ళు తీసుకొచ్చి అతడికిచ్చారు. అతడు చలిలో నుంచుని స్నానంచేశాడు. ఒకరు తెచ్చిన వేన్నీళ్ళు పోసుకుని, మరొకరు మళ్ళీ మరొక డబ్బా వేనీళ్ళు తెచ్చి ఇచ్చే వరకూ అలా చలిలో నుంచునే వుండేవాడు. అతడు "ఆవిరి స్నానం చేయడం" కాదు కాని, ఇంచుమించు చలితో గడ్డకట్టుకుపోయాడన్నమాటే.

* * *

ఆగంతకులు వస్తున్నారని ఒకనాడు డ్యూటీమీద వున్న గెరిల్లా రిపోర్టుచేశాడు. ఓ పదిమంది గుర్రపు రౌతులు నింపాదిగా మా క్యాంపు దగ్గరకి వచ్చారు.

ఆనందానికి ఇక మేరలేకపోయింది. ఆ వార్త వృద్ధుడు స్త్రితిన్స్కీయ్‌లో సంతోష విషాదాలు రెండింటినీ రేకెత్తించింది. జోర్జ్ ఎంతటి ప్రమాదంనుండి బయటపడి నదీ అతడు క్యాంపులో ప్రత్యక్షమైన తరువాత మాత్రమే తండ్రికి తెలిసింది. ఇప్పుడు తండ్రి కళ్ళ ఎదుటనుంచున్నది—అందాలు ఉట్టిపడుతూ సంతోషం తొణికిసలాడుతూన్న జోర్జ్ కాదు. ఈ వ్యక్తి—చిట్టచివరి దశ నిస్త్రాణ అనుభవించుతూ, అన్ని ప్రశ్నలకూ నిస్తేజంగా ప్రత్యుత్తరమిస్తూన్న జోర్జ్.

"నిన్ను కొట్టారా?"

"కొట్టారు."

"ఎలా వుండెనో నీకు?"

"వుండెనులే."

"భరించగల్గావా?"

"మొదట భరించగల్గాను, నోరు విప్పలేదు, తర్వాత తిట్లుతిట్టాను."

"మరి, వాళ్ళు?"

"వాళ్ళకేం—యింకా బాగా బాదారు."

జోర్జ్ ఆరోగ్యం బాగుపడేందుకని, మా అరణ్య జీవితపరిస్థితి పరిమితుల ననుసరించి, మాకు అవకాశమున్న సదుపాయాలన్నిటినీ మా క్యాంపులో సమకూర్చేందుకు మేం ప్రయత్నించాం. అందుకు అతని యౌవనప్రాయం కూడా యితోధికంగా సహాయపడింది. త్వరలోనే అతడు మళ్ళీ స్కౌటుపని ప్రారంభించాడు.

## ప్రతిఫలం

ఏరిక్ కోక్...పౌల్ డార్గెల్...హెర్మన్ క్నేట్...యివన్నీ పశ్చిమ ఉక్రైనియాలో తాత్కాలిక నాజీ ఆక్రమణకాలంలో పేరుమోసిన పేర్లే. నాజీ ముఠా నాయకులైన వీరు తమ గులాముల సాయంతో ఉక్రైనియా గడ్డపై మనుతూండిన సర్వాన్నీ దోచుకున్నారు, సర్వాన్నీ కాల రాసివేశారు, సర్వాన్నీ దుంపనాశం చేసివేశారు. ఈ పేర్లు ఒక్కసారి తల్చుకుంటేనే చాలు—వొళ్ళు కంపరమెత్తుతుంది, ద్వేషం పెల్లుబుకుతుంది. జైళ్ళతోనూ, ఉరికంబాలతోనూ, సజీవఖననాలు జరిగిన కందకాలతోనూ, అసలాది నిర్దోషుల మరణంతోనూ ఈ పేర్లు శాశ్వతంగా పెనవేసుకుపోయాయి.

ఉక్రైనియా రైక్స్‌కమిస్సారూ, ఆదేసమయంలో తూర్పు ప్రష్యా గావ్ లైటరూ అయిన ఎరిక్ కోక్, క్యోనిగ్స్‌బెర్గ్ పట్నంలోనే స్థిరంగా ఉంటూ, అప్పుడప్పుడు రోవ్నా నగరం వచ్చి కొద్దిరోజులు మాత్రమే ఉండి, మళ్ళీ క్యోనిగ్స్‌బెర్గ్ వెళ్ళిపోయేవాడు. అతనికి క్యోనిగ్స్‌బర్గ్‌లో సొంత ఫ్యాక్టరీలూ, మిల్లులూ వుండేవి. స్థానిక ప్రభుత్వాధ్యక్షుడైన పౌల్‌డార్గెల్ "రాజకీయవ్యవహారాల్లో" కోక్ ప్రతినిధిగా వ్యవహరించుతూండేవాడు. ఇతడు రోవ్నాలోనే స్థిరంగా వుంటూ కీయెవ్, నికోలాయెవ్, ద్నిప్రొపెత్రోవ్‌స్క్ వగైరా నగరాలలోని నాజీ ప్రభుత్వోద్యోగి ముఠాల "కార్యకలాపాలను" స్వయంగా సమన్వయపరచేందుకుగాను ఆ పట్టణాలకు అప్పుడప్పుడు వెళ్తూండేవాడు. పశ్చిమ ఉక్రైనియా అంతటా అల్లుకొనిపోయిన ఉక్రైనియన్ జాతీయవాది ముఠాల నాయకత్వం కూడా డార్గెల్ చేతిలోనే వుండేది.

ఉక్రైనియాలో వున్న ఈ నాజీ దొంగల గురువులకి తగిన ప్రతిఫలం ముట్టజెప్పేందుకు కుజ్నెత్సోవ్ అప్పుడే చాలారోజులనుండే పథకం తయారు చేస్తున్నాడు సెప్టెంబరు తొలిరోజుల్లో మేం కొన్నిదినాలపాటు కూచుని ఈ పథకాన్ని సవిరంగా చర్చించాం.

క్యాంపునుండి వెళ్ళిపోయేముందు కుజ్నెత్సోవ్ నాకు వీడ్కోలు చెప్పి, మూసివేసిన కవరు ఒకటి నా చేతిలో పెట్టి :

"దురదృష్టవశాత్తూ ఏదైనా జరిగినట్టయితే ఎందుకైనా మంచిదని దీన్ని మీకిస్తున్నాను. దీన్ని మీ దగ్గర వుంచండి" అన్నాడు. అని కరచాలనంచేసి గబాగబా వెళ్ళిపోయాడు.

ఆ కవరుకేసి చూశాను. అందుపైన నాలుగే నాలుగు మాటలు రాసివున్నాయి : "నా మరణానంతరం దీనిని విప్పవలెను."

ఈ రోజుల్లో వాల్య దొవ్గేర్ రైక్స్‌కమిస్సారియాట్‌లో పనిచేస్తూంది. ఆమెకు ఒప్పజెప్పిన పని: డార్గెల్ రోజువారీ టైమ్‌టేబుల్‌ను క్షుణ్ణంగా అధ్యయనం చేయడం. అతడు ఎప్పుడు ఆఫీసుకి వెళ్తాడో, ఆఫీసునుండి ఎప్పుడు ఇంటికివస్తాడో ఆ వేళలూ, ఇంకా అతడిని పోలికపట్టేందుకు అతని వ్యక్తిగత వివరాలూ తెలుసుకోవడం ఈ పనిని ఆమె అతి జాగ్రత్తగా నెరవేర్చింది. కుజ్నెత్సోవ్‌కి అవసరమైన ఫోటోగ్రాఫ్ యావత్తూ ఆమె సేకరించి అతనికి ఇచ్చింది. —డార్గెల్ ఏ రోడ్డువెంట, ఏ వీధిలోనుంచి వెళ్తాడో ఆ రోడ్డు వెంటే ఆ వీధిలోనుంచే కుజ్నెత్సోవ్‌ను తీసుకెళ్ళింది. డార్గెల్ ప్రతిరోజు మధ్యాహ్నం ఖచ్చితంగా 2 గంటల 30 నిమిషాలకు రైక్స్‌కమిస్సారియాట్‌నుండి వెళ్ళిపోతాడని, ఎల్లప్పుడూ అతనితో కూడా ఒక ఎరుపు

తోలుసంచి పట్టుకున్న ఒక అడ్జూటాంట్ వుంటాడనీ ఆమె చెప్పింది. కుజ్నెత్సోవ్ డార్గెల్‌ని ఒక్కసారే, ఆనాడు పెరేడ్ సందర్భంలో అతడు ఉపన్యసించినప్పుడు మాత్రమే, చూశాడు. అందుకని, డార్గెల్‌ని పోల్చుకుందుకు కుజ్నెత్సోవ్ కేవలం తన జ్ఞాపకశక్తిపైనే ఆధారపడ్డాడు.

ఆనాడు సెప్టెంబరు 20. రోవ్నో గెబీట్స్‌కమిస్సారియాట్ డ్రైవరు, యుద్ధఖైదీ కలీనిన్ ఓ సరికొత్త "ఓపెల్ కపిటేన్'' కారుని నికొలాయ్ కుజ్నెత్సోవ్‌కి సప్లై చేశాడు.

జర్మన్ సైనికుని యూనిఫారంలో వున్న నికొలాయ్ స్ట్రుతీన్‌స్కియ్ డ్రైవర్‌సీటులో కూచున్నాడు. వెనుక సీటులో ఓబెర్‌లోయ్‌ట్నాంట్ పౌల్ సీబెర్ట్—అనగా కుజ్నెత్సోవ్—కూచున్నాడు.

"ష్లోస్‌స్ట్రాసె'' అని జర్మన్లు కొత్తగా నామకరణం చేసినట్టి పెద్దవీథిలో వున్న రాజభవనం డార్గెల్ నివాసం.

ఉన్నతశ్రేణికి చెందిన జర్మన్ ఉద్యోగులు మాత్రమే ఆ వీథిలో నివసిస్తుంటూండేవారు. పోలిష్‌వాళ్లకి, ఉక్రైనియన్లకూ ఆ వీథి దేవిడీమన్నా. ఆ వీథిలో తిరగడానికి ఒక్క జర్మన్లకు మాత్రమే అనుమతి వుంది.

కుజ్నెత్సోవ్, స్ట్రుతీన్‌స్కియ్‌లు ఇద్దరూ తమ ఆయుధాలను తయారీలో వుంచుకుని, కారులో బయల్దేరి, డార్గెల్ రైక్స్‌కమిస్సారియాట్‌నుంచి తన ఇంటికి మామూలుగా నడిచి వెళ్ళే వేళకే సరిగా వీరు కారుమీద వెళ్ళారు. ఆ చర్య జయప్రదమవ్వాలంటే నిమిషాలమీద పని జరగాలి.

వీథిలో కారు పెట్టుకుని నిలబడడం ప్రమాదంతో కూడుకున్న పని. డార్గెల్ భవనం దగ్గర మిలిటరీ పోలీసులు నిరంతరం కాపలా వుంటారు. మరి కొందరు మిలిటరీ పోలీసులు ష్లోస్‌స్ట్రాసెలో తిరుగుతూ వుంటారు. అంతేకాకుండా, ఒక మిలిటరీ పోలీసు ఫెల్ద్‌వేబెల్, మఫ్తీలో వున్న గెస్టాపో మనిషీ—ఇద్దరూ డార్గెల్ రైక్స్‌కమిస్సారియాట్‌లోనుంచి బయటకు వచ్చే వేళకు రెండు నిమిషాలు ముందుగా అక్కడ ప్రత్యక్షమవుతారు. ఆ మనుషులు ఇద్దరూ ఆ చుట్టుప్రక్కల అనుమానాస్పదమైనది ఏదీ లేదుకదా అని పరిశీలించుతూ డార్గెల్ ముందు నడుస్తారు.

అక్కడకు దగ్గరగా వున్న ఒక సందులో ఆగడానికి నిశ్చయించుకున్నారు కుజ్నెత్సోవ్, స్ట్రుతీన్‌స్కియ్‌లు. ఆ సందులోనుంచి చూస్తే, రైక్స్‌కమిస్సారియాట్ సింహద్వారం స్పష్టంగా కనబడుతూంటుంది. సరిగా 2 గంటల 30 నిమిషాలకు జనరల్ డార్గెల్ రైక్స్‌కమిస్సారియాట్‌లోనుండి బయటకు వచ్చాడు. ఎర్రని తోలుసంచి చంకను పెట్టుకున్న అతని అడ్జూటాంట్ అతనితోకూడా వున్నాడు.

"వాళ్ళే" అన్నాడు కుజ్నెత్సోవ్, "కోల్యా, కారు జోరుగా పోనీయ్."

కారు ఝామని వెళ్ళి, ఇద్దరు నాజీలనూ వెనుకనుండి అందుకుంది. కుజ్నెత్సోవ్ రివాల్వరు చేతబుచ్చుకుని, కారులోనుంచి బయటకువచ్చి డార్గెల్, అడ్జూటాంటుల వెనుకనుండి వెళ్ళి, వారిని సమీపించాడు. తమ వెనుకనుండి వస్తూన్న అడుగుల చప్పుడు విని, నాజీలు వెనక్కి తిరిగారు. తనకు సరిగా ఎదుటవున్న జనరల్‌పై కుజ్నెత్సోవ్ మూడుసార్లు రివాల్వరుతో కాల్చాడు, తర్వాత అడ్జూటాంట్‌పై కాల్చాడు. ఆ కాల్పులకు వాళ్లు కిందపడిపోయిన తర్వాత, కుజ్నెత్సోవ్ మళ్ళీ మరొకసారి వాళ్ళపై కాల్చాడు.

కుజ్నెత్సోవ్ చప్పున కారులోకి ఉరికేసరికల్లా స్త్రుత్రిన్‌స్కియ్ కారుని మంచి జోరుమీద పోనిచ్చాడు. క్షణమాత్రంలో వారు అదృశ్యులైపోయారు. ఇదంతా ఏ రెండు నిమిషాల్లోనో జరిగివుంటుంది.

రివాల్వరు కాల్పులు వినబడగానే వీథిలో నడుస్తూన్న మనుషులు నాలుగు దిక్కులా చెదరిపోయారు. ఇది సరిగా మధ్యాహ్న భోజనపు విరామసమయం అవడంచేత వీథినిండా జనం వున్నారు కూడా. ఇళ్ళ కిటికీలు దభీలున మూసుకున్నాయి. ఆ గాభరానుండి అందరూ తెప్పరిల్లి చూసేసరికి; ఆ కారు ఐపూ జాడా లేకుండా మాయమైపోయింది.

ఇది జరిగిన రెండు రోజుల తరువాత కులికోవ్, గలూజో అనే మాస్లొట్లు ఇద్దరు క్యాంపుకి వచ్చి, రోవ్నొనుండి వెలువడిన తాజా జర్మన్, ఉక్రైనియన్ వార్తా పత్రికలను తీసుకొచ్చి యిచ్చారు. అప్పటికప్పుడే కుజ్నెత్సోవ్ క్యాంపుకి వచ్చేసి క్యాంపులోనే వున్నాడు. ఆ పత్రికలను కుజ్నెత్సోవ్ అతి ఆదుర్దాగా తీసుకుని చదవడం మొదలెట్టి, ఇహ... కొయ్యబారిపోయాడు. తాను రివాల్వరుతో కాల్చివేసిన మనిషి డార్గెల్ కాదు - ఆ మనిషి రైళ్ళ ఫైనాన్స్ సలహాదారుడు, డాక్టర్ హాన్స్ గేల్; రెండో మనిషి అతడి అడ్జూటాంట్ వింటర్. ప్రజలనుండి మరింతగా పన్నులు పిండేందుకని గేల్ కొద్దిరోజుల క్రితమే రోవ్నొ వచ్చాడు.

"నికొలాయ్! ఇదేమిటి, ఇలా మతాబా కాల్చారేమిటి?" అన్నాన్నేను.

"ఏదో భ్రాంతిలో పడిపోయాను, అంతేమరి, ఏదో భ్రాంతిలో పడిపోయాను. డార్గెల్ ముఖం నాకు బాగా జ్ఞాపకం వుంది సుమండీ! అందునా, ఆ అడ్జూటాంట్ చేతిలో ఎరుపు తోలుసంచి వుందికూడాను. మరి, ఏమిటనుకోవడం? దీని అర్థం ఏమిటైవుంటుంది?" అన్నాడు కుజ్నెత్సోవ్, తన ఆశ్చర్యాన్ని అణచుకోలేక.

ఇదంతా తరువాత స్పష్టమైంది, గేల్‌కి డార్గెల్‌కి చాలా దగ్గర పోలిక లున్నాయని. ఉజ్నెత్సోవ్ డార్గెల్‌ని ఒక్కసారే చూశాడు, మరి అలాంటప్పుడు అతనివల్ల పొరపాటు జరగడం సహజమే. అందుకని అతన్ని తప్పుపట్టడానికి వీల్లేదు. అయినప్పటికీ, మరేమీ ఫర్వాలేదు, ఆ తప్పు దిద్దుకోవచ్చు...

గేల్ హత్య జరిగిన తరువాత మరి పదిరోజులకి ఉజ్నెత్సోవ్, స్ట్రిలిన్‌స్కియ్‌లు రోవ్నోకి తిరిగివెళ్ళిపోయారు. ఈ సారి ఉజ్నెత్సోవ్ హోదా పెరిగింది: అతడు "హౌప్ట్‌మన్"—అనగా కెప్టెన్—అయ్యాడు. ఏమంటే జర్మన్ ఓబెర్‌లోయ్‌ట్నాంట్ యూనిఫారంలో వున్న వ్యక్తికోసం నాజీలు దర్యాప్తు చేయడం ప్రారంభించారు.

"ఓపెల్" కారుకి ఇప్పుడు కొత్త నలుపురంగూ వచ్చింది, పాత నంబరు ప్లేటు మారిపోయి, కొత్త నంబరుప్లేటూ వచ్చింది. అదే స్థలంలో పట్టపగలు, మధ్యాహ్నం సరిగా 2 గంటల 30 నిమిషాలకి డార్గెల్ పైనా, అతడి అడ్జూటాంటు పైనా ఉజ్నెత్సోవ్ చేతిబాంబులు విసిరాడు. ఇద్దరూ పడిపోయారు. చేతిబాంబు తునక ఒకటి చిన్నది ఉజ్నెత్సోవ్ ఎడమచేతికి తగలడంచేత అతడు గాయపడ్డాడు. అయితేనేం, అతడు కారులోకి చప్పున ఉరికేయగల్గాడు.

ఈ సారి మాత్రం గొప్ప ప్రమాదమే ఎదురైంది. ఆ స్థలానికి చేరువనే జర్మన్ గస్తీ కారు ఒకటి కాపలా డ్యూటీమీద వుంది. ఈ గస్తీ కారు పక్కనుండే స్ట్రిలిన్‌స్కియ్ తన కారు తీసుకెళ్ళాలి. గెస్టాపో తమ గస్తీ కారులోకి దూకారు, కాని వాళ్ళడ్రైవరు బహుశ హడలిపోయి, కారుని స్టార్టుచేయలేకపోయాడు. అతడు తంటాలుపడి స్టార్టుచేసే వేళకి, ఆ నల్ల "ఓపెల్" అప్పటికప్పుడే ఎంతో దూరం వెళ్ళిపోయింది.

నాజీలు నల్ల కారుని వెంబడించారు. ఉజ్నెత్సోవ్, స్ట్రిలిన్‌స్కియ్‌లు వూరు పొలిమేర చేరుకునేసరికి, నాజీల గస్తీకారు తమవెంట రావటం ఉజ్నెత్సోవ్‌కి కనబడింది. ఇంతట్లోకి తమ కారు ముందు, అచ్చంగా తమ కారువంటి మరొక నల్లని "ఓపెల్" వెళ్తూండడం ఉజ్నెత్సోవ్ గమనించాడు.

"ఎడమవైపు మళ్ళించేయ్!" అని అతడు స్ట్రిలిన్‌స్కియ్‌ని కేకేశాడు.

స్ట్రిలిన్‌స్కియ్ తన కారుని ఎడమవైపు సందులోకి మళ్ళించి అక్కడ్నుంచి మరో సందులోకి పోనిచ్చాడు.

గెస్టాపోలు తమ ఎదుట వెళ్తూన్న "ఓపెల్"ని వెంటాడారు, కాని అది మా క్రామేడ్లున్నది కాదు.

గెస్టాపోలు పూరవతం హైకోర్టుపైన పట్టేశాడు "నేరస్థులని." ఆ నల్ల "ఓపెల్" అందుకుని, దానిమీద తుపాకులు కాల్చారు. ఓ బుల్లెట్టు కారు టైరులోకి దూసుకుపోయింది. దాంతో, మంచి జోరుమీద వెళ్తున్న ఆ "ఓపెల్" గిర్రున ఒక చక్కరు తిరిగి, పక్కనున్న కాలువలోకి బోల్తాకొట్టింది. హడలుతో సగం ప్రాణాలు ఎగిరిపోయిన ఓ జర్మన్ మేజరుని ఆ కారులోనుంచి గెస్టాపోలు బయటికి ఈడ్చి, అతగాణ్ణి మెత్తగా తన్ని, గెస్టాపో స్టేషనుకి తీసుకుపోయారు.

కుజ్నెత్సోవ్, స్త్రుత్రిన్స్కియ్‌లు "పర్ణశాల"ను సురక్షితంగా చేరుకుని అక్కడనుండి క్యాంపుకి వచ్చేశారు

కాని, తరువాత అందిన సమాచారాన్ని బట్టి, డార్గెల్ చచ్చిపోలేదని తెలిసింది. ఆ చేతిబాంబు పేవ్‌మెంటు అంచునున్న రాతికట్టుకు తగిలింది. అలా తగలడంతో, బాంబు తునుకలూ, విదారణా వెనుక దిశగా మళ్ళిపోయాయి. డార్గెల్‌కి ముఖం ఝుమాలుమని, కిందపడ్డాడు, బలమైన గాయాలు తగిలాయి. అతణ్ణి బెర్లిన్ పంపించేశారు. దానితో ప్రభుత్వాధ్యక్షునిగా అతడి రాజకీయజీవితం అంతమైపోయింది.

రోవ్నోలో పనిచేస్తూన్న గెస్టాపో, మిలిటరీ పోలీసు నాయకులందరినీ, అగ్రశ్రేణి ఉద్యోగులలో చాలామందినీ ఉద్యోగాలనుండి బర్తరఫుచేస్తూ మరికొద్ది రోజులకి బెర్లిన్ నుండి ఫర్మానాలు జారీఅయ్యాయి.

నాజీలకు ప్రతిఫలం ముట్టజెప్పుతూ జరిపిన కార్యాలపై లేచిన గగ్గోలు సోవియట్ ప్రజలకు ఎంతో ఆనందం కల్గించింది: శత్రుశ్రేణి వెనకనున్న ఈ ప్రాంతంలో సహితం నాజీ ఆక్రమణదార్లతో మనవాళ్లు లెక్కలు తేల్చుకుంటున్నారు.

బర్తరఫుల మూలంగా ఖాళీ అయిన స్థానాలలో కొత్తగా వచ్చిన నాజీలు సహితం ఆక్రమణదార్లకు సహాయం చేయలేకపోయారు.

ఈలోపున "పర్ణశాల"లో నూతన సన్నాహాలు ప్రారంభమయ్యాయి. రైక్స్‌కమిస్సారియాట్ నుండి ఇటీవల కొత్తగా సంగ్రహించిన "మెర్సెడెస్" కారుకి సరికొత్తరంగు వేశాం రంగు ఇంకా ఆరకపోయినా, కుజ్నెత్సోవ్, స్త్రుత్రిన్స్కియ్‌లు అందులో కూచుని మళ్ళీ రోవ్నో వెళ్ళిపోయారు.

"ఓ సౌఖ్యమైన రోజున ఈ కొత్త రంగును చూసి నాజీలు మిమ్మల్ని పట్టుకుంటారు సుమండీ!" అన్నాడు చిట్టి కోల్యా.

"మేం మంచి జోరుమీద వెళ్తూంటాం. ఆ జోరుకి కొత్తరంగు ఆరిపో తుందిలే!" అని జవాబుచెప్పాడు స్త్రిలిన్‌స్కీయ్.

కొత్తరంగుతో నిగనిగలాడుతూన్న ఆ "మెర్సెడెస్" లో కుజ్నెత్సోవ్, స్త్రిలిన్‌స్కీయ్‌లు రోవ్నా నగరానికి బయల్దేరారు. నగరం పొలిమేరనున్న పోలీసు చౌకీదార్లు ఆ కారు చూసి :

"ఆగండి! మీ డాక్యుమెంట్లు చూపించండి!" అని అడిగారు.

కుజ్నెత్సోవ్ తన డాక్యుమెంటునీ, కారు తాలూకుపత్రాలనూ చూపెట్టాడు. చౌకీదార్లు వెళ్ళమన్నారు కానీ మరో నాలుగు బ్లాకులుదాటి ముందుకు సాగివెళ్ళే సరికి, మరో పోలీసు చౌకి ఎదురైంది. ఆ చౌకీదార్లు కారును చూసి :

"ఆగండి! మీ డాక్యుమెంట్లు చూపించండి!" అని అడిగారు.

కుజ్నెత్సోవ్ కోపంతెచ్చుకుని :

"ఇదేమిటండీ? ఇందాకట్లా చూపించాంగా!" అని గదమాయించాడు.

ఆ మిలిటరీ పోలీసువాడు కుజ్నెత్సోవ్ చెవిలో రహస్యంగా చెప్పాడు :

"క్షమించండయ్యా! ఈవేళ అడుగడుగునా పత్రాల తనిఖీ వుంటుం దండి : జర్మన్ యూనిఫారాల్లో వున్న బందిపోటుదొంగల ఆరా తీస్తున్నా మండయ్యా!" అన్నాడు. అని, "చిత్తం! మీరు వెళ్ళొచ్చునండి!" అన్నాడు.

"కోల్యా! ఇదిగో ఆ సందులోకి తిప్పేయ్ కారుని ఇలా అడుగడుగునా చెకింగ్ జరిగితే, ఎక్కడో ఒకచోట దొరికిపోవచ్చు" అన్నాడు కుజ్నెత్సోవ్.

ఆ బ్లాకు చివర వున్న సందులోకి స్త్రిలిన్‌స్కీయ్ "మెర్సెడెస్"ని మళ్ళించి, సందు మొగిన ఆపాడు. కుజ్నెత్సోవ్ కారులోనుంచి దిగి, హైరోడ్డు మధ్య నుంచుని :

"కోల్యా! హైరోడ్డు మీద ఓ కన్ను వేసివుంచు. నేనేమో ఇక్కడ జర్మన్లకి సాయంచేస్తా!" అన్నాడు.

మరి నాలుగు నిమిషాలకల్లా కుజ్నెత్సోవ్ అక్కడ నిలబడి, అటుపక్క వచ్చిన కారును నిలువరించి :

"ఆగండి! మీ డాక్యుమెంట్లు చూపించండి!" అన్నాడు.

చెకింగు అయిపోయిన తరువాత ఆ కారు వెళ్ళిపోయింది. ఇంతట్లో మరో కారు రావడం చూసి కుజ్నెత్సోవ్ చేయి అడ్డుగా చాపాడు. కారు ఆగింది.

"ఆగండి! మీ డాక్యుమెంట్లు చూపించండి!" అన్నాడు.

కారులో వున్న వ్యక్తి.

"కెప్టెన్‌గారూ! ఇదేమిటండీ? ఇది మూడో సారి అండీ, డాక్యుమెంట్లు తనిఖీచేయడం!" అన్నాడు.

"క్షమించండి! ఈవేళ అడుగడుగునా చెకింగు వుంటుందండి. జర్మన్ యూనిఫారాల్లో వున్న బందిపోటుదొంగల ఆరా తీస్తున్నామండి!" అన్నాడు.

ఆ కారు వెళ్ళిపోయిందో లేనేలేదో, ఇంకోకారు అలా వెళ్ళింది.

"ఆగండి! మీ డాక్యుమెంట్లు చూపించండి!" అని కుజ్నెత్సోవ్ బిగ్గరగా ఆజ్ఞాపించాడు.

"కెప్టెన్‌గారూ! మీరేమీ గాభరాపడకండి!" అన్నాడు ఆ కారులో వున్న వ్యక్తులలో ఒకడు, తన గెస్టాపో బిళ్ళ చూపెడుతూ: "మేం కూడా ఆ బందిపోటు దొంగ ఆరాయే తీస్తున్నాం" అని "నే నెవరినో నీకు తెలియలేదన్నమాట!" అని అర్థమిస్తూన్నట్టు వ్యంగ్యంగా నవ్వాడు. ఆ కారు ముందుకు సాగిపోయింది.

ఈ విధంగా కుజ్నెత్సోవ్ రెండుగంటల సేపు వచ్చి పోయే కార్లను చెకింగుచేశాడు. ఇంతట్లో స్త్రుత్రిన్‌స్కియ్ అతని దగ్గరకు వచ్చి, వెనుక వున్న చౌకీదార్లు చెకింగు అప్పుడే ఆపుచేశారని చెప్పాడు. అప్పుడు కుజ్నెత్సోవ్ తను కూడా చెకింగు ఆపుచేశాడు. ఇద్దరూ కారు ఎక్కిపోయి, ఇక నిశ్చింతగా వెళ్ళి పోయారు.

ఆనాడు పెరేడ్ జరుగుతూన్నప్పుడు కుజ్నెత్సోవ్, వాల్యా వేదికపైన వారికేసి చూసేసరికి, అసాధారణంగా స్థూలకాయుడైన ఒక వ్యక్తి వారికి అగపడ్డాడు. అతడు ఉక్రెయినియన్ ప్రభుత్వపు సాధారణ వ్యవహారశాఖ డెప్యూటీ రైక్స్ కమిస్సారూ, నిలువుదోపిడీ "పకేట్ ఔక్సియోన్" ఆఫీసుకు నాయకుడూ అయిన జనరల్ క్నుట్.

ప్రజలను దోచుకోవడమే క్నుట్ వృత్తి. "పకేట్ ఔక్సియోన్" ఆఫీసు ఖానదాస్తీ దొంగసొత్తే. లూటీ సామాన్లలో అమూల్యమూ, ప్రశస్తమూ అయిన వస్తువులను ఇతడు తన సొంతం కోసం ఎంచుకుని తన ఇంటికి నడిపించేసేవాడు. ఈ కార్యకలాపం ప్రారంభం అయిన తరువాత ఇతడు ఎంత డబ్బు సంపాదించా డంటే ఇహ చెప్పడానికి వీల్లేదన్నమాట. డబ్బు సంపాదనతోపాటు ఇతడికి వక్క

పెరిగిపోయి , ఎంతలా దుక్కతన్నాదంటే ఆ మనిషికి నడిచేందుకే దుస్సాధ్యమై పోయింది. అతడు అచ్చంగా ఓ బ్రహ్మాండమైన పందిలా అగపడతాడు.

"పకేట్ ఔక్సియాన్" ఆఫీసు రైల్వేలైను పక్కనే వున్న లీజియాన్ రోడ్డుపైన వుంది. సరిగా ఈ రోడ్డుపైనే, ఆఫీసుకు చేరువగా, తమ కారులో ఆగారు కుజ్నెత్సోవ్, స్త్రిలిన్‌స్కియ్, యాన్ కమీన్‌స్కియ్‌లు. వారు అట్టేసేపు ఆగవలసిన అవసరం లేకపోయింది. జర్మన్లకు స్వాభావికమైన సమయపాలనతో సరిగా ఆరుగంటలకి క్నుట్ తన ఆఫీసులోనుంచి బయటకు వచ్చాడు.

క్నుట్ కూచునున్న కారు తమ కారు పక్కనుండి వెళ్తూన్న క్షణంలో కమీన్‌స్కియ్ కారులో నుంచుని, ఒక టాంకు విధ్వంసక గ్రెనేడ్‌ను ఆ కారులోకి విసిరాడు. ఆ దెబ్బకి కారు ముందరి భాగం తుక్కుతుక్కుకింద ఎగిరిపోయింది. స్టీరింగు ధ్వంసమైపోవడంతో ఆ కారు ఎదురుగా వున్న ప్రహరీని గుద్దుకుంది. కుజ్నెత్సోవ్, స్త్రిలిన్‌స్కియ్‌లు తమ సబ్‌మెషిన్ గన్నులతో ఆ కారుమీద బుల్లెట్ల వర్షం కురిపించి, ఇహ అక్కడనుంచి తమ కారులో ఝూమని వెళ్ళిపోయారు.

గేల్ ఖనన క్రియ ఘనంగా జరిపారు, బోలెడన్ని పుష్పగుచ్ఛాలు సమర్పించబడ్డాయి, గంభీరోపన్యాసాలు చెలరేగాయి. డార్గెల్‌పై జరిగిన హత్యాప్రయత్నం గురించి కూడా పత్రికల్లో గొప్పఆర్భాటం జరిగింది. కాని క్నుట్ గురించి పల్లెత్తు మాటైనా ఎవ్వరూ పేకలేదు. ఒక పంక్తి అయినా పత్రికల్లో పడలేదు—ఆ మనిషి అంటూ ఒకడు ఈ ప్రపంచంమీద ఎన్నడూ లేదన్నట్టూ, చీమైనా కుట్టనట్టూనూ ।

క్నుట్ హతుడైనప్పటికీ జర్మన్లు మాత్రం ఆ విషయమై గప్‌చుప్‌గా వూరకున్నారు అవునుమరి : వారు "యజమానులు," వారు "నూతన వ్యవస్థ"ను స్థాపించారు, వారు విజేతలు; అయినప్పటికీ వారిలో ముఖ్యులను ఆక్రమిత ఉక్రెయినియా రాజధాని అయిన రోవ్నో నగరపు నడివీథుల్లో పట్టపగలు గెరిల్లాలు చంపి పారేస్తున్నారు । పోనీ, అంతటితో తీర్నిందా అంటే, తీరలేదే — ఆ నేరస్థులెవరో జాడా నీడా లేకుండా మాయమైపోయారు । మరి అలాంటప్పుడు నోరు మూసుకుని వూరుకోవడమే ఉత్తమం. ఇది జరగకముందే పరిస్థితి గడ్డుగా వుండెననుకుంటే, ఇప్పుడు మరీ దుర్భరమైపోయింది : ఇన్నాళ్ళూ రాత్రిళ్ళు వీథుల్లో తిరగడం ప్రమాదకరం అనుకుంటే, ఇప్పుడు పగలు తిరగడం మరీ ప్రమాదకరంగా వుంది.

# కొత్త క్యాంపులో

శరత్కాలపు వర్షాలూ—చలిరాత్రులూ గెరిల్లాలను వేధించుకు తినేశాయి—అందునా వెచ్చని దుస్తులు లేనివారు చిత్రహింసలే అనుభవించారు. క్రితం చలి కాలంలో విమానాలు పారాషూట్లతో పడవేసిన గొర్రెబొచ్చు కోట్లు ఇప్పుడు సాంతం శిథిలించుకుపోయాయి. వేసవికాలంలో నెగళ్ళ దగ్గర పడుకున్నప్పుడు బిచాణాలుగా మాత్రమే అవి ఉపయోగపడుతున్నాయి. కొత్తగా వచ్చిచేరిన గెరిల్లాలకు వెచ్చని దుస్తులు అసలే లేవు.

అందుకని చలికాలానికి ఒక కొత్త క్యాంపును నిర్మించడం గురించి సమాలోచనలు ప్రారంభించాం.

ఈ క్యాంపుకి తగిన స్థలంగా బెరెస్త్యాని, లొపాతెన్ గ్రామాలు రెండింటి మధ్యను, సన్న గేజి రైల్వేలైనుకు చేరువనున్న అడవిలోని జాగాను ఎంచుకున్నాం. పైన్‌వృక్షాలు ఎత్తుగా వుండడంచేత, అవి మా క్యాంపును విమానాలకుఅగపడకుండా చేశాయి. దట్టంగా మొలచిన పొదలు క్యాంపును రైల్వేలైనునుండీ, దానికి సమాంతరంగావున్న హైరోడ్డునుండి కనబడకుండా చేశాయి.

క్యాంపు నిర్మాణం ఏమంత స్వల్పస్థాయిలో జరగలేదు నాలుగు కంపెనీలూ, హెడ్‌క్వార్టర్స్ స్టాఫూ, స్కౌట్లూ, మెడికల్‌కోరూ, రేడియో ఆపరేటర్లూ, సప్లైలటూనూ—వీటన్నిటికోసమూ పెద్ద బారకాసులే కట్టవలసి వచ్చింది. బారకాసులకి తోడు స్నానపు గదులూ, కదమ వసతులకోసం కట్టడములూ అవసరమయ్యాయి.

క్యాంపు నిర్మించడంలో మేమీ పాటికి మంచి అనుభవమే గడించాం మొదట సైట్‌ప్లాను సిద్ధం చేసుకున్నాం, ఆ తరువాత నిర్మాణకార్యం ఏవిధంగా సాగవలసినదీ ఒక ఖచ్చితమైన కార్యక్రమం వేసుకున్నాం. ఇవన్నీ అయిన తరువాతనే నిర్మాణం ప్రారంభించాం.

క్యాంపు జాగా బోడిగా వుండకూడదనే ఉద్దేశ్యంతో క్యాంపు స్థలంలో వున్న చెట్లనే కాదుకదా, క్యాంపు జాగాకి రెండు కిలోమీటర్ల లోపునున్న చెట్లను వేటినీ కొట్టివేయలేదు. ప్రతి బారకాసుకి ఒకటిన్నర మీటరు లోతుగోయి తీసి, ఆ గోతిపైన బారకాసు కట్టాం. ఈ విధంగా కట్టడంవల్ల నేలమట్టంపైన అసలు బారకాసు కనబడక, పైకప్పు మాత్రమే కనబడేది.

మెడికల్ కోర్ కోసమూ, రేడియో ఆపరేటర్ల కోసమూ అవసరమైన

బారకాసులను మొదట కట్టారు. మూడు రోజుల్లో రేడియో ఆపరేటర్లు కొత్త గుడిసెల లోకి వెళ్ళిపోయారు. పొయ్యిగూటికోసం ఖాళీ పెట్రోలు డ్రమ్ము ఒక దానిని ఉపయోగించారు. పొయ్యికి యిటూ అటూ పడక బంకులు ఏర్పాటు చేశారు. నిజమైన కిటికీ ఒకటి కట్టి, కిటికీ దగ్గర టేబిలు వేశారు. ఏరియల్ తీగెను టేబిలు దగ్గరకు వచ్చేటట్లు చేసి, టేబిలుపైన ట్రాన్స్‌మిటర్లు వుంచారు. ఈ టేబిలు దగ్గర రేడియో ఆపరేటర్లు కూచుని, టైమ్‌టేబిలు ప్రకారం మాస్కోతో ప్రసార సంబంధాలు సాగించేవారు.

మెడికల్ కోర్ కోసం నిర్మించిన కట్టడం ఇంతకంటే బాగుంది. ఇరవై పడకలున్న ఆస్పత్రిని ఒక కుటీరంలో ఏర్పాటుచేశారు. ప్రతి క్షతగాత్రునికి ఒక బల్లమంచమూ, సరికొత్త కసవుతో నింపిన పరుపూనూ. డ్యూటీ డాక్టరుకి, మెడికల్ నర్సులకి ఆస్పత్రి ద్వారంలోనే ఒక చిన్న గది; అవుట్ పేషెంట్ల కోసం ఒక డ్రెస్సింగ్ రూమూ, డెంటల్ సర్జరీకి ఒకగది. గదులు వెలుగ్గా ఇమ్ముగావున్నాయి. మిద్దె లోకప్పునుండి మట్టిపెచ్చులు గదిలోకి రాలకుండా వుండేందుకు పారమాటు గుడ్డతో చాందినీ కట్టాం. మెడికల్ కోరు రెండవ కుటీరంలో ఆపరేషన్ థియేటరు వుంది. గది వెలుగ్గావుంది. డాక్టర్ త్సెప్సార్స్కియ్ యిచ్చిన ఆదేశాలననుసరించి ఒక ప్రత్యేకపు ఆపరేషన్ టేబిలు తయారైంది.

హెడ్‌క్వార్టర్స్‌కోసం కట్టినది అసలైన ఇల్లు. ఆ యింటికి ఏడు గదులున్నాయి. ఆ యిల్లు ఇదివరకు జర్మన్లచే గ్రామపెద్దగా నియమించబడిన వ్యక్తిది. ఏకంగా ఆ యింటిని సొంతమూ మేం క్యాంపుకి తరలించేశాం.

హెడ్‌క్వార్టర్స్ ఇంటిచుట్టూ క్యాంప్ కమాండాంట్ ప్లటూను సైనికుల బసలూ, స్కౌట్ల బసలూ, మెడికల్ కోర్ మనుషుల బసలూ, రేడియో ఆపరేటర్ల బసలూ వున్నాయి. వీటికి రమారమి రెండువందల మీటర్లదూరాన రైఫిల్‌కంపెనీల షెడ్లూ, సాసేజి ఫ్యాక్టరీ, నిలువ మాంసపు ఫ్యాక్టరీ, స్టోర్సు, బేకరీతోసహా సప్లై ప్లటూన్ షెడ్లూ లేచాయి– లేచాయి అనడంకంటె, భూమిలోకి దిగాయి అనడమే సరిగా వుంటుంది.

కంపెనీలకోసం కట్టిన బసలు ఎంత విశాలంగానూ, సదుపాయంగానూ, వున్నాయంటే: ఇక వాటిని "చూమ్‌లు" అనడం మానేసి హాస్టల్సు అనేవాళ్ళం. వాటికి ఇటుకలతోకట్టిన పొయ్యిగూళ్ళూ, అసలైన కిటికీలూ వుండడమేకాకుండా, బల్లకట్టుగచ్చుకూడా వుంది. ఇక రెండవ కంపెనీ బసలో నేలపైన చెక్కపలకలు అమర్చి పార్కెట్టుగచ్చు మోస్తరుగానే తయారుచేశారు.

ఒక్కొక్క షెడ్డు తయారైన తరువాత ఔత్సాహిక బృందపు కాన్సర్టూ డాన్సింగూతో సహా గృహప్రవేశపు విందు జరుపుతునేవారం ఆ షెడ్డులో.

• • •

కూర్స్క్ యుద్ధరంగంలో రష్యన్లకోసం హిట్లర్ అందజేయబోతున్నాడని క్రితం మే నెలలో కుజ్నెత్సోవ్‌తో కోచ్ చెప్పిన "అద్భుత బహూమానం" సంపూర్ణమైన విఫలతతో అంతమైంది. నాజీలు లక్షా ఇరవై వేల సైన్యాన్ని నష్టపోయి తిరోగమనం చిత్తగించారు. సెప్టెంబరు చివరిరోజులనాటికి ఎర్రసైన్యం ద్నీప్ర్ నదీ తీరానికి పురోగమించింది.

ఆత్మవిశ్వాసంతోనూ, ఆత్మసంతృప్తితోనూ ఒకనాడు మిడిసిపడిన జర్మన్లు ఈనాడు తాము విజయోన్ముఖులమనే విశ్వాసానికి తిలోదకాలిచ్చేసుకున్నారు.

"వారందరిలోనూ ఇప్పుడు అత్యంత ఉత్సాహవంతుడూ, అత్యంత కృతనిశ్చయుడూ అయిన ఆఫీసరు నేనే అని నా నమ్మకం!" అన్నాడు కుజ్నెత్సోవ్ నవ్వుతూనూ.

ఉక్రైనియా రాష్ట్రపు సారవంతమైన భూములను ఇక తమ గుప్పిట్లో వుంచుకునే ఆశ ఎలాగూ లేదని జర్మన్లు భంగపాటుచెంది, ఇక ఆ రాష్ట్రంనుండి ఆహారపదార్థాలను ఏ మేరకు పిండేందుకు వీలుంటుందో ఆ మేరకు పిండేందుకు ప్రయత్నించారు, కాని ఏమీ కార్యం లేకపోయింది.

అనేక గెరిల్లా డిటాచ్‌మెంట్లు సోవియట్ ప్రజలలో నాజీలకు వ్యతిరేకంగా ప్రతిఘటననూ, పోరాటాన్నీ ఆర్గనైజు చేయసాగాయి. ప్రజలు ఆహారపదార్థాల గిడ్డంగులను ధ్వంసంచేసి వేశారు, రైళ్ళనూ వంతెనలనూ పేల్చివేశారు, ఆహార సేకరణకై పంపబడిన జర్మన్ సైనికదళాలను నాశనం చేసివేశారు.

గెరిల్లా డిటాచ్‌మెంట్లు ఏయే స్థలాల్లో తమ స్థావరాలను ఏర్పరచుకున్నాయో ఆ ప్రాంతాల్లో జర్మన్ల పరిస్థితి ప్రత్యేకమూ గడ్డుగా పరిణమించింది. ఉత్తరాన సార్ని–కోవెల్ రైల్వేలైనునుండి, దక్షిణాన రోవ్నో–లూట్స్క్ రైల్వేలైను వరకూ, తూర్పున గొరీన్ నదినుండి పశ్చిమాన ఇంచుమించు లూట్స్క్ వరకూ–ఈ సరిహద్దులలోపల వున్న బ్రహ్మాండమైన భూభాగంలో నాజీ ఆక్రమణదార్లకు సిగ్గూ నిప్పులూ పుట్టలేదు, ప్రజలు తిండిగింజలనుగాని, జీవాలను గాని ఇవ్వనిరాకరించారు. ఈ ప్రదేశంలో అనేక గెరిల్లా డిటాచ్‌మెంట్లు: ప్రొకొపూక్ డిటాచ్

మెంటు; ఫ్యోదొరొవ్ యూనిట్టుకో బాలిత్స్కీయ్ నాయకత్వాన వున్న బెటాలియన్ కరస్యోవ్, మగొమేత్‌ల నాయకత్వాన వున్న డిటాచ్‌మెంట్లు, మా డిటాచ్‌మెంటూ యుద్ధచర్యలు సాగించుతూనే వున్నాయి.

యుద్ధశ్రేణులలో వున్న యథార్థ పరిస్థితులను కప్పిపుచ్చి, ఎర్రసైన్యం ఇక త్వరలోనే ఓటమి తింటుందనే కాకమ్మ కథలను జర్మన్లు ప్రచారంచేస్తూ, నగదు రూపంలోనూ, వస్తురూపంలోనూ పన్నులు వసూలుచేస్తామని ప్రజలను దబాయించారు.

కాని రష్యన్ సామెత చెప్పినట్టు, ఊక చూపించి ముసలి పిచ్చికను పట్టలేం. ఇక గెరిల్లాలూ, రైతులూ జర్మన్లను మునుపటికంటె మరింత ఎక్కువగా ప్రతిఘటించసాగారు. జర్మన్లు అసాధారణ శిక్షాచర్యలకు దిగారు. గెరిల్లాలతోనూ, స్థానిక ప్రజలతోనూ పోరాడ్డానికని జర్మన్లు ప్రత్యేక విమానాలను ఉపయోగించడం ప్రారంభించారు. ఇంచుమించు ప్రతిరోజూ స్క్వాడ్రన్లకి స్క్వాడ్రన్లే శాంతియుత గ్రామాలనూ, గెరిల్లాలు స్థావరాలను స్థాపించుకున్న అడవులనూ బాంబు చేయసాగాయి.

ఆక్రమణదార్లపై మేం సార్నీ అడవులలో సాగించిన పోరాటాన్నే ఈ కొత్త జిల్లాలో కూడా కొనసాగించాం. జర్మన్ ఎస్టేట్లను తగలబెట్టాం. రైల్వేలైన్లపై విధ్వంసకకార్యాలు జరిపాం. మేం ఆ జిల్లాకు వచ్చిన తరువాత, జర్మన్ల చేతిలోనుండి మరొక జిల్లాను కూడా స్వాధీనం చేసుకున్నాం. మరి అలాంటప్పుడు జర్మన్లు మా పట్ల ద్విగుణీకృతమైన "శ్రద్ధ" చూపడంలో ఆశ్చర్యపడవలసినదేమీలేదు. పెద్దపెద్ద సైనికదళాలు ఈనాడు ఒక గ్రామంలో అగపడితే, మరునాడు మరో గ్రామంలో అగపడేవి. బందిపోటుదొంగలుగా తయారైన దేశద్రోహులు ఆయుధాలనూ, మందుగుండునూ చేతబుచ్చుకుని తమ యజమానుల అనుగ్రహం సంపాదించేందుకు దొరికిన ప్రతి అవకాశాన్నీ వినియోగించుకున్నారు.

నాజీలతోనూ, వారి కిరాయిమనుషులతోనూ జరిగిన ఒక చిన్న యుద్ధంలో ప్రేమ పాత్రుడైన కామ్రేడూ, సాహసికుడైన గెరిల్లా సైనికుడూ, సప్లై ప్లటూనులో నాకు డెప్యూటీగా పనిచేస్తూండినట్టి ఇవాన్ సొకొలోవ్ మరణించాడు. కవీ, మా గెరిల్లాలకు కొత్త కొత్త సోవియట్ పాటలు నేర్పిన గాయకుడూ అయిన గ్రీష మ్యయిలోవ్స్కీయ్ కూడా నేలకొరిగాడు.

మాస్కోనుండి విమానంమీద వచ్చిన గ్రీష మా డిటాచ్‌మెంటులో అందరికంటే ఆలస్యంగా చేరాడు. ఆలస్యాన్ని కూడదీసుకుందుకుని గ్రీష ఎంతో ఆదుర్దా

పడ్డాడు. సాహసకార్యం ఏదైనా చేయవలసి వుండినప్పుడు అందుకు తనను పంపించ వలసిందని నన్ను కోరేవాడు. వీరోచితకార్యం నెరవేర్చాలని గ్రీష కలలు కంటూండే వాడు. ఒకనాడు గ్రీష తన కామ్రేడ్లతో యథాలాపంగా మాట్లాడుతూ :

"నేను చచ్చిపోవలసే వుంటే పశ్చిమాభిముఖుడనై శత్రువుపై దాడిచేస్తూ మరీ చచ్చిపోవాలని వుంది నాకు!" అన్నాడు.

"పశ్చిమాభిముఖుడనై." శత్రువుపై పురోగమించి, ఆక్రమణదార్లను తన మాతృభూమినుండి తరిమివేద్దామనే ప్రతి సోవియట్ పౌరుని ఆశయాన్నీ ఈ మాటలు ఎంత చక్కగానూ, ఎంత స్పష్టంగానూ వ్యక్తం చేస్తున్నాయో కదా!

ఈ చిన్న చిన్న యుద్ధాల్లోనూ, సాయుధ సంఘర్షణలలోనూ చాలామంది గెరిల్లాలు గాయపడ్డారు. స్గెర్గేయ్ స్తెహోవ్‌కి పేలుడు బుల్లెట్టు తగిలి చేయి గాయ పడింది.

చిన్న యుద్ధమో, సాయుధ సంఘర్షణో లేని రోజే ఇంచుమించు వుండేది కాదు. డిటాచ్‌మెంటుకి మనుషులు ఎంతమందో గణనీయమైన సంఖ్యలో అవసర మయ్యారు. వెనుకటి రోజుల్లో ఐదుగురినీ, పదిమందినీ ఏ పనికైనా పంపితే, ఇప్పుడు అదే పనికి ఒక కంపెనీ, రెండు కంపెనీలు పంపుతున్నాం. మునుపు ఒకరిద్దరు స్కౌట్లు రోవ్నొ, లూత్స్క్ లేక జ్డోల్‌బునోవొకి వెళ్ళితే, ఇప్పుడు వీరి రక్షణకోసం వీరివెంట చాలామంది గెరిల్లాలను పంపవలసి వచ్చింది. అంతేకాకుండా మా డిటాచ్ మెంటు వేరువేరు భాగాలుగా విడిపోయింది కూడా. సార్నీ అరణ్యాలలో రెండు వందలమంది వుండిపోయారు; ఒక ప్రత్యేక కర్తవ్యంపై కోవెల్ చేరువగా డెబ్భై మంది వుండిపోయారు; దీనికి తోడు రోవ్నొ, లూత్స్క్ వెళ్ళేదారిలో వున్న "పర్ణ శాలలో" మెరికల్లాంటివారు ఓ ఇరవైమంది నిరంతరమూ వుండేవారు.

వెనుకటి రోజుల్లో మా డిటాచ్‌మెంటును పెద్దదిచేసేందుకు మేం ఆదుర్దా పడలేదు, కొత్తవారిని చేర్చుకున్నప్పటికీ కూడా, మా గూఢచారి కార్యాలకోసం ఉప యోగపడేవారిని మాత్రమే చేర్చుకునేవారం. సంఖ్యను పెంచుకోవడమే మా ఉద్దేశమై వుండినట్టయితే, ఏకంగా ఒక సేననే మేం పోగుచేసి వుండేవారం — గెరిల్లా డిటాచ్ మెంట్లలో చేరేందుకని మనుషులు బ్రహ్మాండమైన సంఖ్యలో సిద్ధమయ్యారు. కాని, అట్టే పెద్దదికాకుండానూ, అయినప్పటికీ ఉసులుగా వుండే డిటాచ్‌మెంటుతోనే గూఢ చారి పనులను మేం సులువుగా సాగించగల్గాం.

ఇప్పుడు పరిస్థితులు వేరు: గెరిల్లా సైనికులు పెద్ద సంఖ్యలో అవసర మయ్యారు.

రోవ్నొలో వున్న మా స్కౌట్లూ, నొవాక్ మనుషులూ, మా డిటాచ్ కోసం నమ్మకస్థులను రిక్రూట్ చెయ్యడం మొదలుపెట్టారు. రోవ్నొనుంచి క్యాంపుకి వచ్చినప్పుడల్లా పదిమందినీ, ఇరవైమందినీ కొత్తవారిని తీసుకొస్తూండేవారు.

ఈ కొత్తవారితో నవూమెన్కొ, చెర్నెన్కొ అనే ఇద్దరు దేశద్రోహులు మా డిటాచ్‌మెంటులోకి తొల్చుకొనివచ్చారు. వీరు ఒక నెలరోజులు మాతో వుండి, తరువాత అదృశ్యమైపోయారు. నవూమెన్కొ గెస్టాపొ తాలూకు రహస్యపు ఏజెంటు అనీ, మా సంఖ్య గురించీ, మా ఆయుధాలను గురించీ సమాచారం తెలుసుకునే కర్తవ్యంతో అతడు పంపబడినట్టూ బాగా కొంతకాలం గడచిన తరువాత మాత్రమే మాకు తెలియవచ్చింది.

రోవ్నొలో పరిస్థితులు అతి క్లిష్టంగా పరిణమించాయనీ, గూఢచారులూ, గెస్టాపొ మనుషులూ వీధుల్లో పొంచి వుంటున్నారనీ, ఇంచుమించు వచ్చిపోయే వారందరి నివాసపు పెర్మిట్లనూ తనిఖీచేస్తూ ముఖాలను పరిశీలనగా చూస్తున్నారనీ, ఇళ్ళపై దాడిచేస్తున్నారనీ నవూమెన్కొ అదృశ్యమైన కొద్దిరోజులకి కుజ్నెత్సొవ్, స్తుత్రిలిన్‌స్కియ్, షెవ్‌చూక్‌లు రిపోర్టు చేశారు. "నవూమెన్కొ కారెక్కి వూరులో తిరుగుతూన్నట్టూ, అతడితో కూడా గెస్టాపొ మనుషులున్నట్టూ చూశామని కొందరన్నారు" అని స్తుత్రిలిన్‌స్కియ్ తన రిపోర్టులో రాశాడు.

నవూమెన్కొకి రోవ్నొలో మా కున్న రహస్యపు చిరునామాలు ఏవీ తెలియవు, అయినప్పటికీ ఒక చిరునామా తాలూకు ఆరా మాత్రం అతడు గెస్టాపొకి ఇవ్వగల్గాడు. రోవ్నొ పెద్ద వీధిలో ఒకసందు మొగిని వున్న ఒక చిన్న రెండు అంతస్తుల ఇంటిలో ఒక ఫ్లాటులో ఒకామె ఒక్కర్తే వుంటూంది. మా మనుషులు కులికోవ్, గలూజొలు ఎల్లప్పుడూ ఆ ఇంటికే వెళ్తూండేవారు. యుద్ధం ముందు రోజుల్లో కులికోవ్ పల్లెటూరి స్కూలు మేష్టరుగానూ, గలూజొ వ్యవసాయశాస్త్ర నిపుణుడుగానూ వుంటూండేవారు. 1943 తొలిరోజుల్లో వారిద్దరూ మా డిటాచ్‌మెంటులో చేరారు. కులికోవ్, గలూజొలను మేం రోవ్నొకి చాలాసార్లు పంపాం.

గలూజొకి కుజ్నెత్సొవ్‌కి కొంత దగ్గర పోలిక వుంది. ఆ కారణంచేత గెస్టాపొలు గలూజొనిచూసి, అతడు కుజ్నెత్సొవే అనిఅనుకున్నట్టుంది బహుశామా. కాని పౌల్ సీబెర్ట్‌మీద మాత్రం వారికి ఏ విధమైన అనుమానమూ తట్టలేదు.

ఒకనాడు రాత్రిజర్మన్లు ఆ యింటిని చుట్టుముట్టేరారు. వారిని తొలుత

ఇంటామె చూసింది. చూసి, మా వాళ్ళని లేపింది. గలూజో కిటికీలోనుంచి చూసి, ఆమెతో :

"మీరు ఇంటినుంచి వెంటనే వెళ్ళిపోండి. ఏదో ఉపాయం ఆలోచించి వాళ్ళను తప్పించుకుని వెళ్ళిపోండి, లేదాంటే ఇంట్లో ఎక్కడో దాక్కోండి. మేం ఇక్కడే వుంటాం" అన్నాడు.

ఆమె వెళ్ళిపోయింది.

"రూస్ ! గెరిల్లా ! బయటికి వచ్చేయ్ !" అంటూ జర్మన్ గొంతుక ఒకటి వీధిలోనుంచి వినబడింది.

కులికోవ్, గలూజోలు ఆదరా బాదరా తలుపునీ, కిటికీని ఫర్నిచరుతో బారికేడు చేసేశారు.

జర్మన్లు తలుపు బద్దలుకొట్టడానికి ప్రయత్నించారు. గెరిల్లాలు కిటికీల్లో నుండి కాల్పులు ప్రారంభించారు. యుద్ధం ప్రారంభమైంది. రైఫిళ్ళూ, సబ్‌మెషీన్ గన్నులూ, మెషీన్‌గన్నులూ ఆ చిన్న యింటిపై కాల్పులు జరిపాయి. కాని వీటి వల్ల కూడా ఫలితం లేకపోయింది. గెరిల్లాలు గురితప్పకుండా కాల్చడంచేత శత్రు బలగంలో ఒకరి తరువాత ఒకరు నేలరాలారు. ఇకప్పుడు జర్మన్లు అదనపుసహాయం కోసం కబురుచేశారు.

భారీ క్యాలిబర్ మెషీన్‌గన్ను అమర్చివున్న ఒకకారు వచ్చింది. కాని ఆ ఇంటికున్న ఒక కిటికీలోనుంచి విసరెిన చేతిబాంబు ఆ కారుకి తగలడంతో, మెషీన్ గన్నుతో సహా కారు ధ్వంసమైపోయింది. శత్రువు ఇంకా అదనపు బలాలకుకబురు చేయవలసి వచ్చింది.

రోవ్నో నగరం నట్టనడుమ ఇద్దరు సోవియట్ దేశభక్తులకూ, కనీసం ఓ నూరుమంది వున్న నాజీ స్పెషల్ సైనిక బలగానికీ జరిగిన యీ యుద్ధం ఆరు గంటలకు పైగా సాగింది. తమ దగ్గరవున్న కాట్రిడ్జిలన్నింటినీకులికోవ్, గలూజోలు ఉపయోగించేశారు, చేతిబాంబులన్నిటినీ శత్రువుపై ప్రయోగించేశారు. ఇక అన్నీ పొంతం అయిపోయిన తరువాత మాత్రమే జర్మన్లు వీరిద్దరినీ—వీరి మృతకాయాలనే పట్టుకున్నారు. గాయాలు తగిలి వొళ్ళంతా నెత్తురు కారుతూన్న వీరిద్దరూ తమ నిస్సహాయ స్థితిని గ్రహించి, తమ రైఫిల్ బుల్లెట్లకు తామే నేలకొరిగారు.

కాని నవూమెన్కో ద్రోహం ఇంతటితో అంతం కాలేదు.

# "మృత్యురాజు" నాశనం

1943 నవంబరు 6 వేకువజాము నుండీ మా రేడియో అపరేటర్లు తమ హెడ్‌ఫోన్లను ఒక్క క్షణమాత్రానికైనా తీసివేయకుండా అలా పెట్టుకునే వున్నారు. వాన్య స్త్రోకొవ్ లౌడ్‌స్పీకరు దగ్గర కూచుని, దానిని అదేపనిగా రెగ్యులేటుచేస్తున్నాడు. మాస్కోనుండి ప్రసారం ఏ క్షణం వస్తుందో విందామనే ఆతృతతో గెరిల్లాలు అతని చుట్టూ మూగారు.

చిట్టచివరకు సాయంకాలానికి అతనికి వేవ్‌లెంగు దొరికింది—మన సైనిక బలాలు కీయెవ్ పట్టణాన్ని వశపరచుకున్నట్టు తెలియజేస్తూ దినకార్యక్రమాన్ని అనౌన్సరు చదువుతున్నాడు। ఈ శుభవార్త యావత్తు దేశాన్ని ఆనందంలో ముంచెత్తింది. ఉక్రైనియా రాజధాని మన వశమైనదన్న వార్తను విని, మేం ఎంత సంతోషభరితులమయ్యామో మీరు ఊహించుకోవచ్చు। మేం ఉన్నదే ఉక్రైనియా, కాని మేమున్న ప్రదేశం ఇంకా శత్రుశ్రేణి వెనుక ప్రాంతంలోనే వుంది. అయినప్పటికీ విజయమూ, యావత్తు ఉక్రైనియన్ గడ్డ విముక్తి ఆసన్నమవుతూంది.

క్రితం ఏడాదిలాగానే ఈ సారి కూడా, అక్టోబరు సోషలిస్టు మహా విప్లవపు ఇరవై ఆరవ వార్షికోత్సవానికి అంకితం చేయబడిన మాస్కోపట్టణ సోవియట్ ఉత్సవ సమావేశ ప్రసారాన్ని గెరిల్లాలు విన్నారు.

ఈనాడు అంతమైన సంవత్సరం—ఇరవై ఐదవ, ఇరవై ఆరవ వార్షికోత్సవాల మధ్య కాలం—దేశరక్షణ మహాయుద్ధంలో నిర్ణయాత్మకమైన మలుపుగా పరిణమించింది. ఈ సంవత్సరంలో ఎర్రసైన్యం ప్రారంభించిన ఎదురుదాడి జర్మనీని ఘోరవిపత్తు దరికి తెచ్చింది.

నవంబరు 7 ఉదయాన అడవిలో డిటాచ్‌మెంటు నలుచదరపువ్యూహంలో సమావేశమైంది మా రేడియో ఆపరేటర్లు క్రితం రాత్రి రేడియో ద్వారా అందుకొన్న వార్షికోత్సవ దినకార్యక్రమం డిటాచ్‌మెంటు ఎదుట చదవబడింది. ఉత్సాహభరితమైన "హుర్రా!" హర్షధ్వానాలతో యావత్తు అరణ్యమూ మార్మోగింది.

మధ్యాహ్నానికల్లా అతిథుల రాక మొదలైంది. వారందరూ మా పొరుగున వున్న గెరిల్లా డిటాచ్‌మెంటు కమాండర్లు: బాలిత్స్కియ్, కరస్యోవ్, ప్రొకొప్యూక్, మగొమేత్‌లు. ప్రతివారూ తమ తమ డిటాచ్‌మెంట్లనుండి చిన్న గెరిల్లాగ్రూపులను తమతో తీసుకువచ్చారు.

"ఆహా! ఎంత చక్కని క్యాంపండీ! యుద్ధం అయిపోయినాక దీన్ని

శేషైన విశ్రాంతి నిరంగా ఉపయోగించుకోవచ్చునే!" అన్నారు అతిథులు, క్యాంపు అంతా తిరిగి, మా క్యాంపు ఏర్పాటూ, మా క్యాంపు నిర్మాణవిధానమూ చూసి.

దివ్యమైన పండుగ విందు ఆరగించిన తరువాత, కాన్సర్టు వేడుక జరిగింది.

రంగస్థలం కొత్తరకంగా మంచి చిత్రంగా తయారు చేశారు. రంగస్థలం కోసం వేదిక నిర్మించి, వేదిక నాలుగు మూలలా నెగళ్లు వేశారు. ఈ నెగళ్ళ ఫలితంగా కాంతి ఛాయల ప్రభావం అద్భుతంగా వ్యక్తమైంది.

వలెన్‌తిన్ సెమ్యోనొవ్, బజానొవ్‌లు రంగస్థలంపై అగపడేసరికి అందరూ ఆశ్చర్యపోయారు. వారిద్దరూ కలిసి- అచ్చంగా సర్కస్ వాళ్ళల్లా- అంతరుపల్లటీలు కొట్టుతూ, వాలుమొగ్గలు వేస్తూ శేషైన జిమ్నాస్టిక్ ఫీట్లు చూపెట్టారు. నెగళ్లు ప్రసరించుతూన్న వెలుగు నీడలు వీరి విగ్రహాలపై పడి, థియేటర్లలో స్పాట్ లైట్లు ఉపయోగించినట్టుగానే వుండెను.

రోవ్నొనుండి వచ్చిన కొత్తరిక్రూట్లలో ఆ వూరి థియేటర్లలో పనిచేసిన నటులుకూడా వున్నారు వీరిలో ఒకడు చార్లీ చాప్లిన్ని బాగా అనుకరించాడు. ఇతడు రంగస్థలంనుండి నిష్క్రమించగానే, రీవస్ రంగంమీదకి వచ్చి, తను కూడా చార్లీ చాప్లిన్ అనుకరణను ప్రదర్శించాడు. రీవస్ అచ్చు చార్లీ చాప్లిన్‌లాగానే పైకి అగపడ్డాడు ఇతని అనుకరణలో కళ ఏమంతగా ప్రదర్శితమవకపోయినా, వృత్తి మాన నటుని ప్రదర్శనకు ఏమీ తీసిపోలేదు.

మా అతిథులు తమ డిటాచ్‌మెంటు మనుషులను తీసుకుని వెళ్ళిపోయిన తర్వాత, రాత్రి సుమారు పదకొండు గంటలకి, కాన్సర్టు ఇంకా అవుతూండగా, స్తేహొవ్ నాదగ్గరకొచ్చాడు. నేను ముందు వరుస కుర్చీలో- అనగా కలప దుంగలపై - కూచున్నాను.

స్తేహొవ్ నా పక్కను వంగి:

"మీతో ఒక్క నిమిషం మాట్లాడాలి! ఇలా వస్తారా?..."అన్నాడు.

నేను లేచి అతనివెంట వెళ్ళాను.

"బెరెస్త్యాని గ్రామంనుంచి ఈ క్షణమే స్కౌట్లు వచ్చారు" అని ఉద్విగ్న కంఠంతో చెప్పాడు: "మోటార్లపై ఆర్టిలరీతో ఒక పెద్ద స్పెషల్ సైనిక బలగం ఇక్కడకు వచ్చిందని వీరు చెప్పారు. ఒక ట్రైనునిండా పెద్దసైనికబలం

తిగినట్టు కివెర్ల్సి స్టేషనునుండి ఒక గంటకిందట ఒక రిపోర్టు అందింది. రేపు ఉదయాన మనపై దాడిచేయాలనే ఉద్దేశంతో మన క్యాంపుకి దారిచూపగల్గే గైడ్ల కోసం వెతుకుతున్నారట."

ఈ వార్త మేము అనుకోనిది కాకపోవడంచేత మా కేమీ ఆశ్చర్యం కల్గించలేదు. మా డిటాచ్మెంటుపై దాడిచేసే ఉద్దేశంతో మేం వున్న అరణ్యాలపై దండువెడలేందుకు స్పెషల్ సైనికబలాలు సన్నద్ధమవుతున్నాయని వార్షికోత్సవానికి ఓ రెండు వారాలకు ముందు కుజ్నెత్సోవ్ రిపోర్టుచేశాడు. కుజ్నెత్సోవ్ ఇలా రాశాడు.

"కోఖ్ రోవ్నా వచ్చినట్టు నాకు తెలిసింది. ఉక్రెయినియాలో వున్న స్పెషల్ (ప్యూనిటివ్) సైన్యాల కమాండరైన జనరల్ ఫన్ ఇల్ గెన్ని తన దగ్గరకు రావలసిందని ఆజ్ఞాపించి, కర్నల్ మెద్వెదెవ్ నాయకత్వాన వున్న గెరిల్లా డిటాచ్మెంటుని నాశనంచేసేందుకు అత్యవసర చర్యలను వెంటనే తీసుకోనవలసి నదిగా ఆర్డరు చేశాడు. 'మృత్యురాజు' అని పేరుమోసిన జనరల్ పిప్పర్ నాయకత్వాన ఒక యుద్ధయాత్ర వెడలవలసినదిగా తాను ఆర్డరు జారీచేశానని జనరల్ ఫన్ ఇల్గెన్ తన స్నేహితులతో చెప్పాడు. గెరిల్లాలతో 'వారి క్యాంపు లోనే మాట్లాడే' ఉద్దేశంతో వారిపై దండువెడలుతూన్న సైనిక బలాలకు తాను స్వయంగా నాయకత్వం వహించేందుకు సన్నద్ధమవుతున్నాడు."

"జనరల్ ఇల్గెన్కి మీతో మీ క్యాంపులోనే మాట్లాడే అవకాశం కల్గించేందుకు నా వంతు నేను కాయశక్తులా పనిచేస్తాను."

కుజ్నెత్సోవ్ ఒక కార్యాచరణ పథకాన్ని తన వుత్తరానికి జతచేసి పంపాడు. ఈ పథకాన్ని మేం పరిశీలించినమీదట దానిని ధ్రువపరచాం.

దేశద్రోహి నవూమెన్కోతో జరిగిన ఉదంతం తమపరి, మా క్యాంపు సరిగా ఎక్కడ వున్నదీ ఒకవేళ నాజీలకు తెలిసిపోయిందేమో అనే అనుమానం మాకు తట్టింది. స్తెహొవ్మా, నేనూ సంప్రదించుకుని, క్యాంపు దగ్గర నిలిచి శత్రువుతో యుద్ధంచేయడానికే నిశ్చయించుకున్నాం.

కాన్సర్టులో అప్పుడు జరుగుతూన్న అంశం ముగిసిన తరువాత, నేను వేదికపైకివెళ్ళి:

"కామ్రేడ్స్ ! శత్రువుయొక్క స్పెషల్ సైనికబలాలు రేపు ఉదయం మనపై దాడిచేయబోతున్నట్టు మనకి సమాచారం అందింది. మనం వెనుకంజ

వేసేదిలేదు. మన నియమానికి మనం కట్టుబడివుంటాం : తొలుత శత్రువునుధ్వంసం చేయ్, తరువాత తిరోగమించు!" అన్నాను.

"భేష్, భేష్! హుర్రా!" అని గెరిల్లాలు హర్షధ్వానాలు చేశారు.

నిశ్శబ్దంగా వుండవలసిందని కోరేందుకు నేను చేయెత్తాను :

"కాన్సర్టు కొనసాగుతుంది!" అన్నాను.

"మాతృభూమి రక్షణకై కదనభూమికి కదలండి" అనే పాటను కొందరు ఎత్తుకునేసరికి అందరూ ఆ పాటలో గొంతుకలిపారు.

కాన్సర్టు సాంతమూ ఇంకా మరొక గంటసేపు సాగింది.

యుద్ధానికి సర్వసన్నద్ధులమై పడుకున్నాం. క్యాంపుచుట్టూ అదనపు చౌకీలు ఏర్పాటుచేశాం. స్కౌట్లను—కొందరిని కాలినడకనూ, గుర్రాలపై కొందరినీ—బెరెస్త్యాని దిశగా పంపాం.

తెల్లవారేసరికి వలెన్ తీన్ సెమ్యోనొవ్ గుర్రాన్ని దౌడుతీయిస్తూ బెరెస్త్యాని చుట్టుపక్కల ఎక్కడి నుండో వచ్చి :

"పెద్ద నాజీకాలమ్ ఒకటి గ్రామంనుండి మన క్యాంపుమీదకి వస్తూంది!" అని రొజుకుంటూ చెప్పాడు.

ఇంచుమించు అదే సమయానికి దూరంనుంచి మెషిన్‌గన్ను కాల్పుల చప్పుడు వినబడింది. మాకు పదికిలోమీటర్ల దూరానున్న బాలిట్స్కియ్ క్యాంపు పరిసరాలనుండి ఆ చప్పుడు వినవచ్చింది. అక్కడ ఏమి జరుగుతుందో, ఏదైనా సహాయం అవసరమేమో కనుక్కొందుకూ, జర్మన్ల దాడిని ఎదుర్కొందుకు మేం తయారుగా వున్నామని బాలిట్స్కియ్‌కి తెలియజేసేందుకూ కేవల్రీ స్కౌట్లను పంపాను.

మా డిటాచ్‌మెంటులో ఇప్పుడు సుమారు ఏడువందల ఏభైమంది వున్నారు. డిటాచ్‌మెంటుని నాలుగు పోరాట కంపెనీలూ, రెండు ప్లటూన్లూ—స్కౌట్ ప్లటూనూ, క్యాంపు కమాండాంటు ప్లటూనూ—కింద విభజించాం.

మొదటి కంపెనీకి బజానొవ్ కమాండరు. ఈ కంపెనీ బెరెస్త్యానినుండి వస్తూన్న శత్రువు మీదకి పురోగమించింది. రెండవ కంపెనీకి సెమ్యోనొవ్ కమాండరు ఈ కంపెనీని శత్రు పార్శ్వదిశగా వెళ్ళి, శత్రు ఆర్టిలరీ, మోర్టార్లూ, కమాండ్ చౌకీ—ఇవి ఎక్కడవున్నాయో చూసి, వాటి వెనుకనుండి వెళ్ళి వాటిపైదెబ్బ కొట్టవలసిందని ఆజ్ఞాపించాను.

క్యాంపులో నుండి రెండవ కంపెనీ బయల్దేరిన వెంటనే చౌకీనుంచి రిపోర్టు వచ్చింది—క్యాంపుమీదకి శత్రు కాలమ్ మరొకటి ఇంకొక దిశనుండి వస్తూందని. ఈ కాలమ్‌ని ఎదుర్కొనేందుకు నాల్గవ కంపెనీలో ఒక భాగాన్ని పంపాను. కడపు భాగాన్ని మా కుడి పార్శ్వానికి రక్షణగా నియమించాను. మూడవ కంపెనీని క్యాంపుచుట్టూ వున్న చౌకీలకు పంపించాను.

ఈ విధంగా మా సైనికబలాలు మోహరించబడ్డాయి. స్కౌట్ల గ్రూపు ఒకటి, కమాండాంట్ ప్లటూనూ రిజర్వుకింద మిగిలాయి.

ఉదయం సుమారు పదిగంటలకు యుద్ధం ప్రారంభమైంది. మా మొదటి కంపెనీపై నాజీలు మెషీన్‌గన్నులనూ, సబ్‌మెషీన్‌గన్నులనూ భీషణంగా ప్రయోగించారు. తమ మోర్టారు, ఆర్టిలరీ కాల్పుల మాటున నాజీలు దృఢమైన కాలమ్ వ్యూహంలో పురోగమించారు. ఇందుకు జవాబుగా మా మనుషులు ప్రయోగించిన స్టాండు మెషీన్‌గన్నుల, చేతి మెషీన్‌గన్నుల కాల్పులకి నాజీలు ఇక విధిలేక కొద్దిసేపు ఆగిపోయి, మాటుకోసమని నేలపైన బోర్ల సాగిలబడ్డారు. తరువాత ఒక ఆజ్ఞ వినబడడంతో నాజీలు లేచి మళ్ళీ దాడిచేస్తూ ముందుకు తరలివచ్చారు.

శత్రువును మా సబ్‌మెషీన్‌గన్ల కాల్పుల పరిధిలోకి రానిచ్చి, ఇకప్పుడు మా మనుషులు తిరుగుదాడి ప్రారంభించారు. గెరిల్లాల "హుర్రా!" కేకలతో దిక్కులు ప్రతిధ్వనించాయి.

జర్మన్ల రెండవ కాలమ్‌కూడా దాడికి దిగింది. ఈ కాలమ్‌తో మా నాల్గవ కంపెనీలో ఒక భాగం యుద్ధం చేసింది.

గాయపడినవారు వరుసగా క్యాంపుకి చేరుకున్నారు, కొందరిని మోసుకుని తీసుకువచ్చారు, కొందరు వారంతటవారే వచ్చారు.

సుదీర్ఘ యుద్ధంలో నిలబడలేమన్న సంగతి మేం ఎరుగుదుం: మందుగుండు సామగ్రి మాకు కొరవడింది. కాబట్టి శత్రు పార్శ్వాలపై దాడి చేసేందుకు చిన్న చిన్న దళాలను పంపవలసిందని బాలిత్స్కియ్‌కి, కరస్యోవ్‌కి కబురుపంపాను: ఇందువల్ల జర్మన్ సైనికబలాలను పాక్షికంగా మరలించవచ్చునని ఉద్దేశించాను.

జర్మన్ ఆర్టిలరీ మా క్యాంపు దిశగా కాల్పులు జరిపింది. కాని ఫిరంగి గుండ్లు క్యాంపుకి రెండువందల మీటర్ల దూరాన మాత్రమే పడి పేలుతున్నాయి.

మొదటి కంపెనీనుంచి కబురు వచ్చింది—వారిదగ్గర వున్న మందుగుండు సామగ్రి ఇక అయిపోతూందనీ, స్టాండు మెషీన్‌గన్నుకి బుల్లెట్లు లేకపోవడంచేత

దాని కాల్పులు అప్పుడే ఆగిపోయాయనీ. కమాండాంట్ ప్లటూన్నుండి ఒక దళాన్ని వారికి సాయంగా పంపాం. మరికొంతసేపటికి మళ్ళీ రిపోర్టు వచ్చింది: "మందు గుండు సామగ్రి ఇంచుమించు సాంతం అయిపోయింది. సహాయం పంపవలసింది, లేని పక్షమందు ఇక నిలబడలేం" అని.

"ఈగలను పట్టినట్టు పట్టేస్తున్నాం, కాని వాళ్లు పుట్టలకి పుట్టలూ వచ్చి పడుతున్నారు. వెర్రిగా దాడిచేసి మనలను హడలుగొట్టాలని చూస్తున్నారు" అన్నాడు హర్కారా.

సెమ్యోనొవ్ కంపెనీ బయల్దేరి అప్పుడే నాలుగు గంటలు కావస్తూంది. అయినా, ఇంతవరకూ దాని పత్తా తెలియడమేలేదు. అది ఎక్కడ వున్నట్టు? ఏం చేస్తూన్నట్టు?

మొదటి కంపెనీకి సహాయం కోసమని కడమ యూనిట్లనుండి వీలైనంత మందిని పంపుతూ వచ్చాం. కాని ఇది కొద్దికాలానికే ఉపయోగపడింది.

మేం ఓడిపోతూన్నట్టే కనబడింది.

బాలిత్స్కీయ్ దగ్గరకూ, కరస్యోవ్ దగ్గరకూ పంపిన హర్కారాలు తిరిగివచ్చారు. తాను సహాయం పంపే స్థితిలో లేననీ, శత్రువు తనపై ఏ నిమిషమైనా దాడిచేయవచ్చుననీ, ఆ దాడినుండి ప్రతిరక్షణకై తాను కాచుకున్నాననీ బాలిత్స్కీయ్ జవాబు పంపాడు. శత్రుపార్శ్వంపై దెబ్బతీసేందుకని పూర్తి బెటాలియన్ని పంపిస్తున్నానని కరస్యోవ్ చీటి రాసి పంపాడు.

నాజీలు రెండు వైపులనుండీ ఒత్తిడిని మరింత ఉధృతంచేశారు. ఇప్పటికప్పుడే వారి ఆర్టిలరీ కాల్పుల చప్పుడు మా క్యాంపుకు అంతకంతకు మరింత దగ్గరగా వినబడుతూ వచ్చింది. మా చిట్టచివరి రిజర్వు గ్రూపు—తేలిక గాయాలు తగిలి, సరిగా అప్పుడే వైద్యసహాయం పొందిన పదిహేనుగురి గ్రూపు-బుర్లతేన్కొ నాయకత్వాన క్యాంపునుండి బయల్దేరింది.

ఆర్టిలరీ షెల్స్ క్యాంపులోనే పడి పేలుతున్నాయి. బ్రహ్మాండమైన పైన్ వృక్షాలు ఫెళఫెళ విరిగి పడుతున్నాయి. జర్మన్లు అంతకంతకు మరింత దగ్గరగా వచ్చేస్తున్నారు. ఇప్పటికప్పుడే ఏడుగంటలైె సాగుతూంది యుద్ధం. కరస్యోవ్ నాయకత్వాన వున్న గెరిల్లాల జాడకాని, సెమ్యోనొవ్ నాయకత్వాన వున్న కంపెనీ జాడకాని ఇంతవరకూ తెలియనేలేదు.

సాయంకాలం ఐదుగంటల తరువాత, గుర్రాలను కట్టి బండ్లు సిద్ధం చేయవలసిందనీ, ప్రమాదంగా గాయపడినవారిని బండ్లలో వేయవలసిందనీ ఆజ్ఞాపించాను. గాయపడినవారిలో పధ్నాల్గురు మాత్రమే ఆయుధాలను ధరించగల్గే స్థితిలో వున్నారు. త్సెస్సార్‌స్కీయ్, ఇతర డాక్టర్లూ క్షతగాత్రులనూ, బండ్లనూ కాపాడాలి. గాయపడినవారినీ, బండ్లనూ కాపాడేందుకు పార్శిణి యుద్ధం సాగించవలసిందని ఆర్డరుచేసేందుకు కమాండాంట్ ప్లటూనులో మిగిలినవారిని తీసుకుని నేను రణరంగపు కేంద్రవిభాగానికి వెళ్ళాను.

మేం గనుక చీకటిపడే వరకూ నిలదొక్కుకుని వుండలేని పక్షమందు, జర్మన్లు మా చుట్టూ బిగించుతూన్న చక్రబంధంలోనుంచి మేం బయటపడలేకపోతామనే సంగతి గ్రహించాను.

తటాలున జర్మన్ ఆర్టిలరీ కాల్పుల దిశనుండి "హుర్రా" అని వస్తూన్న రష్యన్ కేకలు మాకు స్పష్టంగా వినబడ్డాయి.

ఈ "హుర్రా" కేకలు మణిగిపోయాయో లేనేలేదో, ఇంద్రజాలికుడు మంత్రదండం ఆడించినట్టుగా, ఆర్టిలరీ కాల్పులు ఒక్కపట్టున ఆగిపోయాయి. మరి ఐదు నిమిషాలలో శత్రు మోర్టార్ల నుండి కాల్పులు మళ్ళీ మొదలయ్యాయి... కాని—ఈ సారి జర్మన్ల మీదనే కాల్పులు సాగించాయి.

శత్రుశ్రేణులలో కలవరమూ, భయాందోళనలూ చెలరేగాయి. శత్రు సైనికులు తమ ఆయుధాలను అక్కడికక్కడే పారేసి పరుగెత్తసాగారు పరుగెత్తి పారిపోతూన్న శత్రుసైనికులను మా మనుషులు వెంటతరుముతూ వారి పైబడ్డారు.

ఏమిటీ అద్భుతం ?

అద్భుతమేమీ కాదు సహజంగానే. ఈ యుద్ధంలో జయం మనదే అనే విషయాన్ని సెమ్యోనొవ్ కంపెనీ నిశ్చయంచేసివేసింది. సెమ్యోనొవ్ కంపెనీ శత్రుశ్రేణి వెనుకనుండి చుట్టుతిరిగివెళ్ళింది. సెమ్యోనొవ్ ఏమీ తొందరపడకుండా శత్రుస్థావరాన్ని క్షుణ్ణంగా రెకన్నాయిటర్ చేసి, శత్రు ఆర్టిలరీ ఎక్కడుందో, మోర్టార్ బేటరీలు ఎక్కడున్నాయో స్థిరపరచుకున్నాడు. శత్రువుకి మూడు ఫిరంగులూ, మూడు ఇటాలియన్ మోర్టార్లూ, ఒక పది గొట్టాల మోర్టారూ వున్నట్టూ, బేటరీ స్థానాలనుండి రెండువందల మీటర్ల దూరంలో వేసిన గుడారంలో కమాండ్ చౌకీ వున్నట్టూ కనిపెట్టాడు.

సెమ్యోనొవ్ తన కంపెనీని రెండు గ్రూపులకింద విడదీశాడు. రెండు

గ్రూపులూ ఏకసమయంలో దాడిచేశాయి. ఒక గ్రూపు జర్మన్ల ఫిరంగుల మోర్టార్ల మీద పడి, వాటిని నాశనంమీదకి తిప్పి కాల్పులు జరిపాయి. రెండవ గ్రూపు జర్మన్ల కమాండ్ చౌకీనీ, యుద్ధాన్ని నడిపించేందుకు ఈ కమాండ్ చౌకి ఇస్తూన్న ఆజ్ఞలను ప్రసారంచేస్తూన్న రేడియో స్టేషనునీ పట్టుకుంది. జర్మన్లు సాగించుతూన్న ఈ దండన చర్యకు నాయకత్వం వహించిన "మృత్యురాజు" జనరల్ పిప్పర్‌తో సహా పంధొమ్మండుగురు స్టాఫ్ ఆఫీసర్లు హతులయ్యారు. ఈ దెబ్బతో యుద్ధం ఇటో అటో తేలిపోయింది.

ఇక కరసోవ్ సంగతి కూడా చెప్పవలసి వుంది. యుద్ధచర్య అంతమవు తూందనగా కరసోవ్ శత్రుపార్శ్వం పైబడి శత్రువును శుభ్రంగా మర్దించాడు.

రమారమి పదకొండు గంటలకి మాత్రమే మా సైనికులు క్యాంపుకి తిరిగి చేరుకున్నారు. అక్కడక్కడ చెదిరిపోయిన జర్మన్ గ్రూపులను మా మనుషులు అడవిలోకి తరిమికొట్టారు. బెరెస్త్యానిలో వున్న సుమారు నూటఏభైమంది శత్రు సైనికులు ఆ గ్రామంలోనే వుండిపోయి, మేం దాడిచేస్తామేమో అని మా దాడికోసం కాచుకొనున్నారు. కాని ఇప్పుడు మేం వారిమీదకి వెళ్ళి తలపడడంలో అర్థమేమీ లేదనిపించింది.

మరుచటి ఉదయాన జర్మన్లు అదనపు బలాలను రప్పించుకుని మామీదకి వస్తారనీ, క్యాంపుపై విమానదాడి సాగించుతారనీ నేను దృఢంగా నమ్మాను. మా క్యాంపు దిశగా మరొక జర్మన్ కాలమ్ కివెర్ట్సి స్టేషనునుండి వస్తూందని ఆ రాత్రే మాకు కబురు అందింది. తెల్లవారే లోపున క్యాంపును వదలిపెట్టేసేందుకు నిర్ణయించుకున్నాం.

మా హతాహతులలో మరణించినవారు పన్నెండుగురు, క్షతగాత్రులు ముప్పై ఇద్దరు. మరణించినవారిని ఖననంచేసి, క్షతగాత్రులను డాక్టర్ల సంరక్షణకు ఒప్పగించి క్యాంపును ఖాళీచేయడం మొదలెట్టాం.

మేం క్యాంపునుండి వైదొలగుతున్నామనీ, యుద్ధంలో శత్రువునుండి మేం స్వాధీనం చేసుకున్న సామగ్రిలో కొంతభాగం మా వద్దనుండి తాము తీసుకొన వచ్చుననీ తెలియజేస్తూ బాలిట్స్కియ్, కరపోవ్‌లకు కబుర్లు పంపాను.

శత్రువునుండి మేం వశంచేసుకున్న సామగ్రి బ్రహ్మాండంగావుంది. జర్మన్ల సామానుబండ్ల తోలాకి తోలా—ఆయుధాలూ, మందుగుండు సామగ్రీ, ఫిరంగిగుండ్లూ, మందు పాతరలూ, దుస్తులతో నిండిన నూటఇరవై బండ్లను—పట్టు కున్నాం. మూడు ఫిరంగులూ, మూడు మోర్టారులూ, పెద్ద సంఖ్యలో మందు

పాతరలూ, గ్రెనేడ్లూ, సబ్‌మెషీన్ గన్నులూ, రైఫిళ్లూ, బోలెడన్ని కాట్రిడ్జిలూ వశపరచుకున్నాం.

జనరల్ పిప్పర్ నాయకత్వాన మొత్తంమీద సుమారు రెండువేల ఐదు వందలమందివున్న మూడు ఎస్.ఎస్. బెటాలియన్ల స్పెషల్ సైనికబలగంతో మేం తలపడ్డామని మాకు దొరికిన స్టాఫ్ డాక్యుమెంట్లనుబట్టి మాకు తెలిసింది.

ఆ డాక్యుమెంట్లనుబట్టి, యుద్ధం ప్రారంభమైనప్పటినుండీ జనరల్‌పిప్పర్ స్పెషల్ సైనికచర్యలను నడిపించుతూండినట్టు తెలియవచ్చింది. అతడూ, అతడి ఎస్.ఎస్. బెటాలియన్లూ నాజీ ఆక్రమిత దేశాలన్నిటిలోనూ పనిచేశాయి, ఉక్రైనియాలో ఓ ఐదునెలలపాటు స్వైరవిహారం చేశాయి.

జనరల్ పిప్పర్ స్టాఫ్ మ్యాపుమీద మా క్యాంపు జాగావున్న అరణ్యపు చౌకం ఎర్ర పెన్సిలుతో మార్కు చేసివుంది. ఇది నవూమెన్కో పనే, అందుకు సందేహంలేదు. కాని మాక్యాంపు జాగా సరిగా ఎక్కడవున్నదీ అతగాడు కచ్చితంగా నిర్దేశించలేకపోయాడు. శత్రు ఆర్టిలరీ, మోర్టారు కాల్పులు క్యాంపుకి తగలకుండా గురితప్పి క్యాంపుకి దూరంగా పడడానికి ఇదే కారణం.

ఉదయం రెండు గంటలకు గెరిల్లాలు గత ఇరవై నాలుగు గంటల్లోనూ తొలిసారిగా భోజనం చేశారు. మూడు గంటలకల్లా మేం క్యాంపు ఖాళీచేయడం మొదలెట్టాం. ఇంత చక్కని క్యాంపు వదలిపెట్టేయడమంటే మాకు ఎంతో విచారం వేసింది, మళ్ళీ చలిలో గడ్డకట్టుకుపోవడమూ, వానలో నానడమూ అంటే ఎంతో బాధ అనిపించింది. కాని గత్యంతరం లేకపోయింది.

మా డిటాచ్‌మెంటు విశ్రాంతి తీసుకుందుకూ, ఖాళీలు భర్తీ చేసుకుని మళ్ళీ వెనకటి స్థితికి చేరుకుందుకూ, గాయపడినవారిని విమానంమీద మాస్కోకు పంపేయత్నాలు చేసేందుకూ రోవ్నో ప్రాంతపు ఉత్తర సరిహద్దుకు తాత్కాలికంగా వైదొలగడానికి నిశ్చయించుకున్నాం. చ్యోర్నియ్ నాయకత్వాన చిన్న దళాన్ని త్సూమన్‌స్కియె అరణ్యాలలో వుంచేశాం. స్పెషల్ సైనికబలాల చేతుల్లో పడకుండా వ్యూహం పన్ని తప్పించుకుని తిరుగుతూండడమూ, రోవ్నోనుండి వస్తూవుండే మా మనుషులను కలుసుకుంటూ వుండడమూ, ఈ పనులను వారికి ఒప్పగించాం.

మేం వైదొలగగా ఖాళీ అయిపోయిన అరణ్యపు చౌకంపై మేం వెళ్ళిపోయిన మరునాడు నాజీ విమానాలు బాంబుచేసి మెషీన్‌గన్నులు ప్రయోగించాయి.

నాజీలు తీవ్రమైన ఆర్టిలరీ కాల్పులు జరిపిన పిదప క్యాంపును నిరాఘాటంగా సమీపించారు. వారు మా క్యాంపునుండి తిరిగి వెళ్ళిపోతూ తమ "విజయ చిహ్నాలను"—మేం అక్కడ నేలగూల్చిన జర్మన్లను-బళ్ళకు ఎక్కించుకుని మరీ వెళ్ళిపోయారు. శవాల సంఖ్య ఏమంత తక్కువకాదు; కనీసం ఆరువందలమంది నాజీలనైనా మేం నాశనంచేసి వుంటాం.

జనరల్ పిప్పర్ కళేబరాన్ని బెర్లిన్‌కు విమానం మీద తీసుకుపోయారు. పిప్పర్ మరణం గురించి నాజీ దినపత్రికలు రాస్తూ, అతడు ఆక్రమణాధికార్లకు మూలవిరాట్టుగా వుంటూండేవాడంటూ బొబ్బున ఏడ్చాయి. అంతేగాని, అతణ్ణి "మైస్టర్ టోడ్" - "మృత్యురాజు" అని మాత్రం అనలేదు.

## పరిశేషం

ఉక్రైనియాలోని స్పెషల్ సైనిక బలాలకు నాయకత్వం వహించు తూండిన జనరల్ ఇల్‌గెన్ మేల్నిచ్నయ వీథిలో ఆక్రమించుకున్న భవనపు గేటు ముందు సెంట్రీ ఎల్లప్పుడూ పహరా కాస్తూండేవాడు. "ఓ సౌఖ్యమైన రోజున" నిక్కరు తొడుక్కొన్న ఓ చిన్నకుర్రాడు "మౌత్ ఆర్గన్" వూదుకుంటూ అక్కడ తచ్చాడాడు. ఆ కుర్రాడు సెంట్రీ ఎదుటనుండి అనేక పర్యాయాలు ఇటూ అటూ తిరిగాడు.

"ఏయ్, అబ్బాయ్! ఎందుకిలా తిరుగుతున్నావిక్కడ?"

"తిరగడం లేదే నేను."

"ఫో, ఫో! ఇది జనరల్‌గారి ఇల్లు, తెలుసా? నిన్ను పట్టుకున్నానంటే, అప్పుడు అనుభవిస్తావ్!"

కుర్రాడు పరుగెత్తి పారిపోయాడు, కాని పక్కసందు మొగిని ఆగి, ఆ భవనంమీద ఓ కన్నువేసి వుంచాడు.

మరి కాస్సేపటికి, ఓ తోలుసంచి పట్టుకుని వాల్యా ఆ భవనం దగ్గరకివచ్చి:

"నమస్తే!" అని సెంట్రీని పలకరించి, "జనరల్‌గారు ఇంకా రాలేదా?" అని అడిగింది.

"రాలేదు."

"మరైతే, లోపల ఎవరున్నారు?" అని అడుగుతూ, వాల్యా భవనంకేసి ముఖం తిప్పింది.

"తైనాతీమనిషి."

"నేను లోపలికెళ్ళి జనరల్‌గారికోసం కనిపెట్టుకొనుంటాను. ఆయనకోసం రైక్స్‌కమిస్సారియాట్‌నుండి అర్జంట్ టపా వుంది."

జనరల్ ఇల్‌గెన్ కోసం వాల్య ఇదివరకు పెక్కుసార్లు టపా పట్టుకొచ్చి వుండడంచేత, ఆమెను సెంట్రీలు ఎరుగుదురు.

వాల్య భవనంలోకి వెళ్ళేసరికి, ఆమెకు తైనాతీమనిషి ఎదురయ్యాడు. ఈ తైనాతీమనిషి జనరల్‌గారి నౌకరీలో చేరి కొద్దిరోజులే అయింది.

ఈ సంగతి వాల్యకి తెలుసు. అయినప్పటికీ ఆమె ఆశ్చర్యం నటించి:

"నేను రైక్స్‌కమిస్సారియాట్ మనిషిని. మునుపటి తైనాతీమనిషి ఏడీ?" అని అడిగింది.

"బెర్లిన్ వెళ్ళాడు."

"ఏం, ఎందుకెళ్ళాడూ?"

"విజయచిహ్నాలు పట్టుకెళ్ళాడు. దయచేసి లోపలికి వచ్చి కూర్చోండి. జనరల్‌గారు వస్తారు."

"కూర్చోడానికి నాకు వేళలేదు. బట్వాడా చేయాల్సిన అర్జంట్ టపా ఇంకా వుంది. అది బట్వాడా చేసి మళ్ళీ వస్తాను. జనరల్‌గారు రావడం ఇంకా ఆలస్యమవుతుందా ఏమిటి?"

"అవదండి, ఈ పాటికి వచ్చేస్తూండాలండి."

తను మళ్ళీ వస్తానని సెంట్రీతో చెప్పి ఆమె వెళ్ళిపోయింది. వెళ్ళిపోతూం డగా సందు మొగిని ఆ కుర్రాడు కనబడ్డాడు.

"నువ్వు పరుగున వెళ్ళి, అంతా సరిగా వుందని చెప్పు. వాళ్ళని రమ్మను." అంది వాల్య ఆ కుర్రాడితో.

చిట్టి కోల్య పరుగు పరుగున ఓ ఇంటికెళ్ళాడు. ఆ ఇంట్లో కుజ్నెత్సోవ్, స్త్రుతీన్‌స్కియ్, కమీన్‌స్కియ్, గ్నెద్యూక్‌లు చిట్టికోల్య కోసం ఆదుర్దాతో కని పెట్టుకున్నారు.

వారు కొద్ది నిమిషాల్లో ఇల్‌గెన్ భవనం చేరుకున్నారు. కెప్టెన్ యూని ఫారంలో వున్న కుజ్నెత్సోవ్ కారులోనుండి మొదట దిగి, భవనందగ్గరకువెళ్ళాడు.

జర్మన్ ఆఫీసరుని చూసి సెంట్రీ సెల్యూటుచేసి :

"హాప్ట్‌మన్‌గారూ! జనరల్‌గారు ఇంకా రాలేదండి!" అన్నాడు.

"నాకు తెలుసును!" అని కుజ్నెత్సోవ్ జర్మన్‌లో జవాబుచెప్పి భవనం లోపలికి వెళ్ళాడు,

కుజ్నెత్సోవ్ వెంట వెళ్ళాడు స్ట్రుత్రిన్‌స్కియ్.

ముందుహాల్లో తైనాతీమనిషి కునుకుతున్నాడు.

"నేను సోవియట్ గెరిల్లాని" అని తన మాటలు తుంచుతూ అన్నాడు కుజ్నెత్సోవ్. "నీకు బతుకాశవుంటే నాకు సాయంచెయ్యి, లేదూ—మరి, నీ ఖర్మం!"

"జర్మన్ హాప్ట్‌మన్ ఏమిటి, గెరిల్లా ఏమిటి?" అనుకుని తైనాతీమనిషి బెంబేరెత్తిపోయాడు. మనిషి గజగజ వణికిపోతూ హడలుతో పళ్ళు కొరకబడి పోయాయి.

"నేను ఎల్లప్పుడూ మీ పక్షమేనండి... మమ్మల్ని బలవంతాన మిలిటరీ లోకి ఈడ్చుకొచ్చారండి..." అని అతగాడు గొణిగాడు.

"సరే, కాని—ఖబడ్దార్!"

పిరికిమందు తిన్న ఆ తైనాతీమనిషి, జర్మన్ ఆఫీసర్ గెరిల్లాయే అనే సంగతి ఇంకా నమ్మలేక భ్రాన్పడిపోయి, అలా చూస్తూ నుంచుండిపోయాడు.

"నీ పేరు?" అని అడిగాడు కుజ్నెత్సోవ్.

"కుక్ కో."

"కూచుని, నేను చెప్పినది రాయి!" అని కుజ్నెత్సోవ్ ఆజ్ఞాపించాడు.

కుజ్నెత్సోవ్ చెప్పిన ప్రకారం తైనాతీమనిషి ఇలా రాశాడు: "మీరు పెట్టిన తిండికి ధన్యవాదాలు, నేను గెరిల్లాల దగ్గరకి వెళ్తున్నాను. జనరల్‌గారిని నాతో కూడా తీసుకెళ్తున్నాను. కుక్ కో."

ఈ చీటి బాగా కనబడేటట్టుగా, దానిని జనరల్ ఇల్‌గెన్ కచేరీగదిలో మేజాబల్లపైన పెట్టారు.

"ఇంటి యజమాని వచ్చేలోపున, మన పని మనం కానిద్దాం!" అన్నాడు కుజ్నెత్సోవ్ స్ట్రుత్రిన్‌స్కియ్‌తో.

కుజ్నెత్సోవ్, స్ట్రుత్రిన్‌స్కియ్‌లు ఆ భవనం సాంతం క్షుణ్ణంగా సోదా చేసి, డాక్యుమెంట్లనూ ఆయుధాలనూ పోగుచేసి, వాటిని ఓ మూటకింద కట్టారు.

స్తుప్రిటిన్‌స్కీయ్ తైనాతీమనిషిదగ్గర వుండిపోయాడు, కుజ్నెత్సోవ్ మాత్రం సెంట్రీ దగ్గరకు వెళ్ళాడు. అప్పటికప్పుడే గ్నెద్యూక్ ఆ సెంట్రీ పక్క నుంచుని, అతడితో అంటున్నాడు :

"ఉక్రైనియన్ పుట్టుకపుట్టి, ఇప్పుడు నువ్వుజర్మన్‌వి ఎలాఅయ్యావోయ్?"

"బతుకాశ వుంటే నోర్మయ్" అన్నాడు సెంట్రీ, ఆదేమిటోనిరుత్సాహంగానూ, అనిశ్చితంగానూ, "నేను జర్మన్ని కాను!"

"నువ్వు జర్మన్‌వి కాకపోతే గెరిల్లాలకు సాయంచెయ్!" అన్నాడు గ్నెద్యూక్.

"ఏం ? ఒప్పందం కుదుర్చుకుంటున్నారా ఏమిటి?" అని అడిగాడు కుజ్నెత్సోవ్, వీరి వెనుకనుండి వస్తూనూ.

సెంట్రీ చటున కుజ్నెత్సోవ్‌కేసి వెనక్కి తిరిగి :

"హౌస్ట్‌మన్‌కూడానా?" అని అడిగాడు మిడిగుడ్లు పెద్దవిచేసుకుని.

"హౌస్ట్‌మన్‌కూడానూ! నాతో ఇలా రా!" అని కుజ్నెత్సోవ్ సెంట్రీని ఆజ్ఞాపించాడు.

"ఆఫీసరుగారూ! జనరల్‌గారి ఇంట్లో నేను అడుగుపెట్టకూడదండీ!" అన్నాడు సెంట్రీ.

"కూడదూ గీడదూ అవతలపెట్టు! ఏది, నీ రైఫిల్? ఇలా ఇయ్యి!" అన్నాడు కుజ్నెత్సోవ్ సెంట్రీతో. అలా అని కుజ్నెత్సోవ్ ఆ సెంట్రీని నిరాయుధుణ్ణి చేసివేశాడు.

కుజ్నెత్సోవ్ వెంట అడుగులువేసుకుంటూ వెళ్ళాడు సెంట్రీ.

సెంట్రీ స్థానంలో గ్నెద్యూక్ నుంచున్నాడు.

అంతవరకూ కారులోకూర్చున్న కమీన్‌స్కీయ్ కారుదిగి, భవనందగ్గర ఇటూ ఆటూ పచారుచేయసాగాడు.

ఇదంతా పొద్దుపోతుండగా జరిగింది. అప్పటికింకా కాస్త గడ్డివెలుగుంది. వీధిలో జనం ఎవరి పనులమీద వారు తిరుగుతున్నారు.

ఓ ఐదునిమిషాలతరువాత, స్తుప్రిటిన్‌స్కీయ్ ఆ భవనంలోనుండి బయటకు

వచ్చాడు. అతడు సెంట్రీ యూనిఫారంలో వున్నాడు, చేతిలో రైఫిలు వుంది. అతడు సెంట్రీ స్థానంలో నుంచున్నాడు. గ్నెద్యూక్ భవనంలోకి వెళ్ళాడు.

అంతా సిద్ధంగావుంది, కాని ఇల్‌గెన్ ఇంకారాలేదు. ఇరవై నిమిషాలు గడచాయి, ముప్పై నిమిషాలు గడచాయి, నలభై నిమిషాలు గడచాయి, అప్పటికీ రాలేదు ఇల్‌గెన్.

అంతవరకూ గేటులో పహరాకాస్తూ ఇప్పుడు హాల్లోకూచున్న సెంట్రీ తటాలున కుజ్నెత్సోవ్‌తో అన్నాడు :

"ఏదో ప్రమాదం వచ్చేటట్టేవుంది. కొద్దిసేపట్లో రిలీవింగ్ సెంట్రీ వచ్చే వేళైంది నన్ను మళ్ళీ సెంట్రీ డ్యూటీలోకి వెళ్ళనివ్వండి. సాయంచేయడానికి నిశ్చయించుకున్నాను, తప్పకుండా సాయంచేస్తాను."

"రిలీవింగ్ సెంట్రీ వచ్చేవేళ అయిందంటున్నాడు. నిజమే?" అని కుజ్నెత్సోవ్ తైనాతీమనిషిని అడిగాడు.

"చిత్తం, నిజమేనండి!" అన్నాడు తైనాతీమనిషి.

గ్నెద్యూక్ స్త్రిలిన్‌స్కియ్‌ని పిలచాడు స్త్రిలిన్‌స్కియ్ తన యూనిఫారం తీసివేశాడు. సెంట్రీ తిరిగి తన స్థానంలో నుంచున్నాడు. కాని సెంట్రీని కనిపెట్టుతూ అతడిపక్కనే నుంచున్నాడు కమీన్‌స్కియ్ స్త్రిలిన్‌స్కియ్ వెళ్ళిపోయి కారులో కూచున్నాడు.

ఈలోపున ఇల్‌గెన్ వచ్చాడు. అతడు తన కారులోనుంచి త్వరగా దిగి, డ్రైవరుని వెళ్ళిపోమని చెప్పి భవనంలోకి వెళ్ళిపోయాడు.

"ఎద్దులా వున్నాడు. వీణ్ణి లొంగదీయడం కష్టమే. నేను వెళ్ళి సాయం చేస్తాను" అన్నాడు స్త్రిలిన్‌స్కియ్, లోపలికివెళ్ళిపోతూన్న జనరల్‌కేసిచూసి, కమీన్‌స్కియ్‌తో.

జనరల్ ఇంట్లో ప్రవేశించిన వెంటనే తైనాతీమనిషి తలుపు మూసివేయడంతో, కుజ్నెత్సోవ్ తన పిస్టల్ని ఇల్‌గెన్‌కేసి గురిపెట్టించి, ప్రతిమాటనూ ఒత్తి పలుకుతూ:

"జనరల్! మిమ్మల్ని అరెస్టుచేస్తున్నాను. నేను సోవియట్ గెరిల్లాను. నేను చెప్పినట్టూ నడుచుకుంటిరా, మీకు ఏ హానీ జరగదు" అన్నాడు.

"ఓరి దేశద్రోహి వెధవా!" అని ఇల్ గెన్ గొంతు చించుకుని అరచి, తన పిస్టలు ఒర తాకబోయాడు.

"నా పేరు బేగ్మ" అని, వారిలో పొట్టిగా లావుగా వున్న వ్యక్తి తనకు తాను పరిచయంచేసుకుని నన్ను సమీపించాడు.

"దయచేయండయ్యా!" అన్నాన్నేను.

వసీలియ్ బేగ్మ యుద్ధం ముందురోజుల్లో రోవ్నొ ప్రాంతపు పార్టీ కమిటీ సెక్రటరీగా వుండేవాడు. ఇప్పుడు సహితం అతడు తన స్థానం విడిచిపెట్టి లేదు: అజ్ఞాతవాసపు పార్టీ కమిటీలో సభ్యుడుగా వుంటూనే, రోవ్నొ జిల్లాలోని గెరిల్లా ఉద్యమానికి చీఫ్-ఆఫ్-స్టాఫ్గానూ, ఒక గెరిల్లా పటాలానికి కమాండరుగానూ పనిచేస్తున్నాడు. ఆ నాటివరకూ నేనతనిని కలుసుకొనడం తటస్థించలేదు, కాని అతనిగురించి ఎంతో విన్నాను, అతణ్ణి కలుసుకుందుకు చాలాకాలంగా నిరీక్షిస్తున్నాను.

వసీలియ్ బేగ్మ ఎంతో దూరంనుండి-ఆ ప్రాంతపు ఈశాన్యంనుండి- వచ్చాడు. అతడు వచ్చిన పని పూర్తిచేసుకున్న తరువాత భోజనానికి కూర్చున్నప్పుడు చెప్పాడు- ఎవరో కాని ఒక గెరిల్లా జర్మన్ ఆఫీసరులా యూనిఫారం వేసుకుని రోవ్నొనగరంలో వున్న జర్మన్లకి సింహస్వప్నంగా తయారయ్యాడట, పట్టపగలు నడి వీధుల్లో నాజీలలో మొనగాళ్ళనే చంపి పారేస్తున్నాడట, జర్మన్ జనరల్నే పట్టుకుని పారిపోయాడట.

తాను ఏ వ్యక్తి గురించైతే చెబుతున్నాడో ఆ వ్యక్తి తన పంక్తినేభోజనం చేస్తున్నాడని బేగ్మ రవంతైనా ఊహించుకోలేదు. బేగ్మ కథనానికి లుకిన్ అడ్డు పడబోయాడు, కాని వద్దని నేను చేసిన సంజ్ఞను లుకిన్ కనిపెట్టి వూరకున్నాడు. కుజ్నెత్సోవ్ మాత్రం బేగ్మ చెబుతూన్నది శ్రద్ధగా విన్నాడు.

"అద్గదీ పని! ఆ పని ముందు మనం చేస్తూన్నది బలాదూర్!" అన్నాడు వసీలియ్ బేగ్మ.

ఆ మాటలు అతడన్న తరువాత, ఇహప్పుడు ఆ వీరగాథలకు చెందిన మా గెరిల్లాను అతడితో పరిచయంచేశాను.

• • •

మేము మొదట ఏర్పాటుచేసుకున్న కాలంకంటె హెచ్చుకాలమే త్సెలోక్విచి-వెల్కి దగ్గర క్యాంపులో వుండిపోయాం. మాస్కోనుండి మందుగుండు సామగ్రినీ, రేడియో బేటరీలనూ తీసుకువచ్చి మాకు అందించుతుందని మేం

నిరీక్షించుతూండిన విమానం ఇంకా రాలేదు, అదిరాకుండా మేం అక్కడనుంచి మా పాత క్యాంపుకి వెళ్ళిపోయేందుకు మా కమాండ్ అనుమతించలేదు.

"నన్ను బెరస్త్యాని వెళ్ళనీయండి. మనవాళ్ళకి ఇక్కడ వుండడం ముళ్ళ మీద వున్నట్టుంది. రోవ్నో వెళ్ళిపోవాలని వాళ్ళు మహా ఉబలాటపడుతున్నారండీ!" అన్నాడు లుకిన్ నాతో.

నేను సరేఅన్నాను. లుకిన్ ఒక కంపెనీని, ఒక స్కౌటు గ్రూపునూ తీసుకుని త్సూమన్‌స్కియె అడవులకి బయల్దేరాడు.

లుకిన్‌నుండి మరి మూడురోజులకే మాస్కోమీదుగా మాకు ఒక రేడియో గ్రాము అందింది. రైల్వేలైను దాటినతరువాత తాను శత్రువుల జట్టుతో హఠాత్తుగా తలపడినట్టూ, శత్రువుని లక్షణంగా మర్దించినట్టూ అతడు రిపోర్టుచేశాడు.

ఇది జరిగిన ఓ వారంరోజులతరువాత, యావత్తు డిటాచ్‌మెంటుని రోవ్నో జిల్లాకు తీసుకొని వెళ్ళిపోయేందుకు అనుమతి లభించింది. ఎటువంటి చిక్కూ లేకుండానే క్షేమంగా మేం రోవ్నో జిల్లా చేరుకున్నాం.

పైన్ వృక్షాలతో నిండిన ఒక మహారణ్యంలోవున్న ఓ చిన్న గ్రామంలో మేం మజిలీ చేస్తూండగా, మాస్కోనుండిఅందిన రేడియోగ్రామును లీద షెర్‌స్త్నోవ నాకు అందించింది. అందులో హైకమాండ్ మా విజయాలనుగురించి మమ్మల్ని అభినందించి, సోవియట్ యూనియన్ సుప్రీమ్ సోవియట్ ఆజ్ఞప్రకారం మా డిటాచ్‌మెంటులోని నూటఏభైమంది గెరిల్లాలకు సోవియట్ యూనియన్ ఆర్డర్లూ, పతకాలూ బహూకరించబడినట్టు తెలియజేసింది. కుజ్నెత్సోవ్, స్త్రుతిన్‌స్కియ్, స్తెహోవ్, కమీన్‌స్కియ్, నాకూ ఆర్డర్ ఆఫ్ లెనిన్; షెవ్‌చూక్, జోర్జ్‌స్త్రుతిన్‌స్కియ్‌లకు అరుణపతాక ఆర్డరు; గ్నెద్యూక్కి అరుణతార ఆర్డరు బహూకరించబడింది. త్సెస్సార్‌స్కియ్, వలెన్‌తీన్ సెమ్యోనొవ్‌లకు ప్రథమశ్రేణి "మాతృదేశరక్షణ యుద్ధం" ఆర్డరు లభించింది. రేడియో ఆపరేటర్లందరికి ఆర్డర్లు లభించాయి. రెండువందలమందికి పైగా గెరిల్లా పతకాలు బహూకరించబడ్డాయి. చిట్టి కోల్యాకి కూడా ప్రథమశ్రేణి గెరిల్లా పతకం లభించింది.

ఈ వార్త క్షణంలో డిటాచ్‌మెంటు అంతటికీ తెలిసిపోయింది. బహూకృతులు అందినవారు పరస్పరం అభినందించుకున్నారు.

"ఈ బహుమతికి అందరికంటెనూ మీరే తగినవారు" అన్నాను నేను కుజ్నెత్సోవ్‌తో, అతణ్ణి అభినందించుతూనూ.

"మాతృదేశం పట్ల నా విధి ఇప్పుడు మరింత అధికమైంది" అని కుజ్నె త్సోవ్ బదులు చెప్పాడు.

## వీడ్కోలు

ఎర్ర సైన్యం పశ్చిమదిశగా జాంబవంతుని అంగలతో పురోగమించు తూంది. ఉక్రెయినియాలో కియెవ్, ద్నెప్రొపెత్రోవ్స్క్, ఇంకా అనేక ఇతర ప్రాంతాలు విముక్తిచేయబడ్డాయి. రోవ్నొ ప్రాంతంలో కొంతభాగం కూడా తిరిగి వశపరుచుకోబడింది. మన విమానదళం సార్నె, రోవ్నొ, లూత్స్క్ నగరాలలోని జర్మన్ మిలిటరీ స్థలాలను బాంబుచేసింది, తిరోగమించుతూన్న జర్మన్ సైనిక కాలమ్‌లనూ బాంబుచేసింది.

రోవ్నొ నగరంలో ఘోరమైన భయాందోళన చెలరేగింది. నగరంలో వున్న ఆఫీసులు ల్వోవ్ పట్టణానికి తరలించివేయబడుతున్నాయి. జర్మన్లు తమ బాటీ సామాన్లను ప్యాక్ చేసుకుని, తమ సూట్‌కేసులను తామే స్వయంగా రైలు స్టేషనుకి మోసుకుపోయారు.

"నాజీ డేగ ఎగిరిపోయింది" అంటూ ఏరిక్ కోఖ్ గురించి వ్యంగ్యంగా సూచించుతూ కుజ్నెత్సోవ్ నా పేర రాశాడు. "యుద్ధశ్రేణిలో జరుగుతూన్న ఘటనలకి, నగరంలో మా మనుషులు లేవదీసిన రగడకి ఈ ప్రాశనపక్షి చిత్తుగా బెదిరిపోయింది. ఇక్కడనుంచి వేగమే పలాయనం చిత్తగించేందుకు నిశ్చయించు కుని, క్రిస్టమస్ విందుకోసం డిసెంబరు 25 వరకూ ఆగకుండా, 22 నే విందు ఆరగించి ఈ పక్షి ఎగిరి పారిపోయింది."

"ఆ విందుకి నేను ఆలస్యంగా వెళ్ళినందుకు నన్ను నేను ఎన్నటికీ క్షమించుకోలేను. అతగాడు ఇక్కడకు మళ్ళీ వచ్చేటట్టులేదు, మరి అతణ్ణి హజామతు చేసేందుకు నేనేమో సర్వమూ సిద్ధంచేశానాయె."

"నేనిక్కడలేని రోజుల్లో ఫన్ ఓర్టెల్ అనే ఒక గెస్టాపొ మనిషి ఇక్కడ తిరుగుతూండేవాడు. ఇతడి దగ్గరనుండి లీదియ కొంత సమాచారం సంపాదించింది, కాని ఆ సమాచారం ఎంతవరకు నమ్మదగినదో నేను చెప్పలేను. విమానంలా ఎగిరి, అమితవేగంతో నాలుగు వందల కిలోమీటర్ల దూరంవెళ్ళి, బ్రహ్మాండమైన విధ్వంసక శక్తిని గల్గిన ఒక రకం బాంబును జర్మనీలో కనిపెట్టారని ఫన్ ఓర్టెల్ చెప్పాడు. ఇతడితో నేను స్వయంగా 'సంప్రతించాలి', ఆ అవకాశం మీకు కూడా కల్గజేయ

వచ్చుననీ ఆశించాను. కాని ఓర్టెల్ ఇక్కడనుండి అకస్మాత్తుగా అదృశ్యమయి పోయాడు."

కాగా, మరి ఎనిమిది నెలల పిదప నాజీలు ప్రయోగించ మొదలుపెట్టిన ఈ ఎగిరే గ్రెనేడ్లను గురించిన సమాచారాన్ని మేం వెంటనే మా కమాండుకు తెలియజేశాం.

జర్మన్ హెడ్‌క్వార్టర్స్ స్టాఫ్‌లు తూర్పునుండి పడమరకు ఐదిలీచేయ బడుతూన్నట్టూ, రోవ్నొలో పెద్ద భవనాలు చాలావాటికింద జర్మన్లు మందు పాతర లను పెట్టినట్టూ కజ్నెత్సోవ్ రిపోర్టుచేశాడు.

మన సైన్యంచే విముక్తికాబడిన ప్రాంతాలనుండి పారిపోయిన గెస్టాపో మనుషులూ, జర్మన్ మిలిటరీ పోలీసులూ బ్రహ్మాండమైన సంఖ్యలో రోవ్నొ చేరుకో సాగారు. ఆ నగరంలో ఇదివరకెన్నడూ కనీవినీయెరగనంతగా దమనకాండ విలయ తాండవం చేసింది. అరెస్టుకాబడిన వ్యక్తులను మిలిటరీ పోలీసులు మామూలుగా తుపాకి కాల్పులకు బలిపెట్టుతూండే బేలయ వీథినుండి ఈనాడు ప్రతిరాత్రీ, పొద్దు గూకినది మొదలు పొద్దుపొడిచేవరకు, కాల్పుల చప్పుళ్లు నిర్విరామంగా వినబడ్డాయి. కాల్పులు విచక్షణారహితంగా జరిగాయి. గూడుతోకప్పిన లారీలు రాత్రి అంతా తిరుగుతూ శవాలను వూరు అవలకు తీసుకుపోయాయి.

కజిమీర్ దొంబ్రోవ్‌స్కీయ్‌ని నాజీలు అరెస్టుచేశారు.

"గెస్టాపోకి మన గురించి ఏదో భోగట్టా దొరికినట్టుంది, చూడగా" అన్నాడు లుకిన్ నాతో, ఈ అరెస్టు గురించి రిపోర్టు చేస్తూ.

అతడి అనుమానం కొద్దిరోజుల్లో రూఢి అయింది.

ఫెల్ట్ ఫ్యాక్టరీ డైరెక్టర్ నొవాక్ ఒకనాడు ఫ్యాక్టరీలో తన ఆఫీసులో కూచుని న్నాడు. టేబిలు సొరుగులో కొన్ని టాంక్ విధ్వంసక గ్రెనేడ్లువున్నాయి. అతడి జేబులో రివాల్వరుంది. తటాలున ముగ్గురు గెస్టాపో మనుషులు అతని ఆఫీసు లోకి చొరబడ్డారు.

"ఫ్యాక్టరీ డైరెక్టరు ఎక్కడున్నాడు?" అని వారిలో ఒకడు వచ్చీరాని రష్యన్ భాషలో నొవాక్‌ని అడిగాడు.

"నొవాక్‌తో మాట్లాడాలా మీరు?" అని అడిగాడు నొవాక్,

"అవునవును! ఎక్కడున్నాడు?"

"ఇప్పుడే మేడమీదకెళ్ళాడు. నాతో రండి, అతడెక్కడున్నాడో చూపిస్తాను" అన్నాడు నొవాక్.

"అవసరంలేదు. మీరిక్కడే కూచోండి. అతడెక్కడున్నాడో మేమే చూసుకుంటాం" అంటూ వాళ్ళు తొందర తొందరగా మేడమీదకెళ్ళారు.

టేబిలు సొరుగులో వున్న గ్రెనేడ్లను నొవాక్ తన చేతిసంచిలో పెట్టేసుకుని, తన జేబులోవున్న రివాల్వరు సేఫ్టీకేచ్ తప్పించేసి, ఆదరా బాదరా తన ఆఫీసు గదిలోనుంచి బయటికి వచ్చేశాడు. ఇంటికి వెళ్ళిపోదాం అనుకున్నాడు. కాని సఫ్టీలో వున్న ముఖ్కురలిద్దరు ఇంటి దగ్గర వుండడం చూశాడు.

ఆ మరునాడు గెస్టాపొ మనుషులు నొవాక్ తండ్రిని అరెస్టుచేశారు. ఇంతకు ఓ నెలముందే, ఎందుకైనా మంచిదని మేం నొవాక్ భార్యని బిడ్డనీ మా క్యాంపుకి తీసుకువెళ్ళిపోయాం వారిని తరువాత ఫ్యోదొరొవ్‌కి ఒప్పజెప్పాం.

నికొలాయ్ స్త్రుతిన్‌స్కియ్ ప్రాణాంతక పరిస్థితులలో చిక్కుకున్నాడు. అతడు ఎల్లప్పుడూ ఎంతో జాగరూకుడై వుంటూ, రహస్యకార్యాల్లో పాటించవలసిన ముందుజాగ్రత్తలన్నీ పాటించేమనిషి అయినప్పటికీ, అతని ఆచూకీ మరి ఎలాగో బయటపడిపోయింది. తనుముందుగా ఏర్పాటు చేసుకున్న బసలలో ఒక బసకిఅతడు వెళ్ళాడు బసలోకి వెళ్ళిన పావుగంటలోపునే, కిటికీలోనుంచి మోటారుచప్పుడూ, తరువాత దబదబ తలుపు కొట్టుతూన్న చప్పుడు వినబడింది.

"గెస్టాపొ!" అని ఆ యింటి యజమాని స్త్రుతిన్‌స్కియ్‌ని హెచ్చరించి స్త్రుతిన్‌స్కియ్‌ని మరొక గదిలోకి తీసుకుపోయాడు.

ఇద్దరు గెస్టాపొ మనుషులు ఇంటి తలుపు బద్దలుకొట్టి ఇంట్లోకి చొరబడ్డారు.

"వాడు ఏడీ!" అని కేకలువేస్తూ, వాళ్ళు పిస్టల్సు ఝుళిపించారు.

"ఎవడు ?"

"ఎందుకి వేషాలు ?" అంటూ వారిలో ఒకడు చేయియెత్తి తన పిస్టలుతో ఇంటియజమానిని బాదబోయాడు.

సరిగా ఆ క్షణానికి స్త్రుతిన్‌స్కియ్ అక్కడ ప్రత్యక్షమై పిలవని పేరంటంగావచ్చిన ఆ ఇద్దరి అతిథులనూ తన రివాల్వరు కాల్పులకి బలిచేసేశాడు. నేల రాలిన ఇద్దరు గెస్టాపొ మనుషుల పిస్టల్సునూ స్త్రుతిన్‌స్కియ్ సంగ్రహించి, తనూ ఇంటియజమానీ రెండవ అంతస్తు పెద్దమెట్టుమీదకి దూసుకుపోయి, అక్కడున్న

కిటికీలోనుంచి వీధిలోకి చూసేసరికి, మిలిటరీ పోలీసులతో నిండిన ఒకలారీ వీధిలో వుండడం వారికి కనబడింది.

"హైల్ !" అని స్త్రితీన్‌స్కీయ్ కేకవేసి, మిలిటరీ పోలీసులమీద పిస్తలు కాల్పులు ప్రయోగించాడు.

మిలిటరీ పోలీసులు ఆదరా బాదరా ఒకరి కాళ్ళలో ఒకరు పడుతూ లారీలోనుంచి కిందకు గాభరాపడుతూ గంతేస్తూండగా, స్త్రితీన్‌స్కీయీ ఇంటి యజమానీ పోలీసులు గాభరాపడుతూండడం గమనించి, ఇదే సమయమనుకుని, ఇంట్లో నుంచి తప్పించుకుని పారిపోయారు.

నగరంలో పరిస్థితులు ఇంతగడ్డుగా వున్నప్పటికీ, మన స్కౌటుసైనికులు అక్కడ నుండి వచ్చివేయదల్చుకోలేదు. ఆక్రమణదార్లకు ఉచితరీతిని "వీడ్కోలు" ఏర్పాటుచేయడం ఎంతైనా అవసరమని వారు భావించారు.

తమ సేన "అజేయమనీ", తాము జయించిన భూభాగం ఆచంద్ర తారార్కం తమ ఆధీనంలో వుంటుందనీ నాజీలు ఒకప్పుడు నమ్మారు. ఈనాడు వారు అక్కడనుండి పరుగు పరుగున, తమ పిక్కబలంతువకొద్దీ పరుగెత్తవలసివచ్చింది పురోగమించుతూన్న ఎర్రసైన్యంనుండి తప్పించుకు పారిపోయేందుకు జర్మన్లూ, వీరి కంటె రవంతైనా ఆలస్యం చేయకుండా దేశద్రోహులు మహా తొందరపడ్డారు. రోవ్నొ రైల్వేస్టేషను జనంతో ఎంత కిక్కిరిసి వుందంటే, లోపలికి వెళ్ళేందుకే వీల్లేకపోయింది. భీతావహులైన "విజేతల"తో రైల్వేస్టేషను యావత్తూ కిటకిటలాడి పోతూంది.

పడమటికి పారిపోయేందుకు కారు కోసమని ఎంత డబ్బుఅయినా ఖర్చు రించేందుకు సిద్ధపడి కార్లకోసం జనం ఎగబడ్డారు, కాని కారుదొరకడం గగనమై పోయింది. స్త్రితీన్‌స్కీయ్, నొవాక్‌ల మనుషులు చాలా గేరేజీలలో పనిచేస్తున్నా రేమో, వీరు ఏదో ఒకసాకుచెప్పి, లారీలనూ, కార్లనూ గేరేజీలలోనుంచి కదలకుండా చేసేవారు. డ్రైవర్లు తాము చేయగల్గినదంతా చేశారు; పెట్రోలులోనూ,ఇంజన్లలోనూ ఇసుకపోసేవారు; గేరేజీల ద్వారాల్లో మందుపాతరలు పాతేవారు, కార్లలో మందు పాతరలు వుంచేవారు; ఎలక్ట్రిక్ వైరింగు తెంపేసేవారు, స్విచ్‌కీలు పట్టుకుపోయే వారు; ఒక్కొక్కప్పుడు ఏకంగా కార్లనే తగలబెట్టేసేవారు ఇదంతా చూసి జర్మన్లు రౌద్రులైపోయి వెర్రికేకలు పెట్టేవారు. కాని ఏమీ చేయలేకపోయేవారు. గేరేజీలలో నుంచి కార్లు బయటికి వచ్చేవికావు, ఒకవేళ వచ్చినా దారిలో పాడైపోయేవి.

రోవ్నొనుంచి బయటపడేందుకు ఒక్కటే మార్గం మిగిలింది—రైల్వే. రోవ్నొ రైలుస్టేషనుచుట్టూ మిలిటరీ పోలీసు ఘాటు పెట్టేసి, అక్కడ ఏదో ఒక విధంగా ఓ పద్ధతి అంటూ నిలబెట్టేందుకు ప్రయత్నించారు. ఫస్టుక్లాసు వెయిటింగు రూమ్‌లో సీనియర్ ఆఫీసర్లనూ, జనరల్సునూ మాత్రమే ఉండనిచ్చారు. ఈ ఉన్నత శ్రేణి దోపిడీదొంగల తాలూకా "ఫ్రాయ్‌లైన్"లూ, "ఫ్రావ్"లూ పెద్దపెద్ద సూట్‌కేసులతో వెయిటింగు రూములలో పడిగాపులు కాస్తూ కూచున్నారు. ఇహ తక్కువ హోదాగల వాళ్ళందరూ రెండోక్లాసు, మూడోక్లాసు వెయిటింగు రూములలోనే కూచున్నారు. వీళ్ళదగ్గర వున్నవీ పెద్దపెద్ద సూట్‌కేసులే. స్పెషల్ ప్యాసులు వున్నవారినే స్టేషనులోనికి రానిచ్చారు. అయితే ఏం, షెవ్‌చూకూ, మనస్కొట్లలో బూద్నిక్ అనే మరొక స్కొటూ ఓ చిన్న సూట్‌కేసు-కాని బరువైన సూట్‌కేసు పట్టుకుని, ఏమైనాసరే ఎలాగో ఒకలాగు స్టేషనులోపలికి వెళ్ళేందుకు నిశ్చయించుకున్నారు, షెవ్‌చూక్ గేటులోకి వెళ్ళబోయాడు.

"ప్యాసు చూపెట్టు!" అని గేటులోవున్న పోలీసు దబాయించాడు.

"ప్యాసు ఎక్కడో పోయిందయ్యా!" అన్నాడు షెవ్‌చూక్ జేబులు వెతుక్కుంటూ.

"ప్యాసులేకపోతే వీల్లేదు, వెళ్ళిపో!" అనేశాడు పోలీసు.

బూద్నిక్ కాస్త పక్కగానుంచుని ఇదంతా కనిపెడుతున్నాడు. షెవ్‌చూక్ అతడి దగ్గరకువెళ్ళి :

"ఇలాగైతే కార్యంలేదు, మనం దొరికిపోతాం. మరోపనిచేద్దాం. అదుగో చూస్తున్నావా, ఎంతమంది జర్మన్ ఆఫీసర్లు కాలినడకనొస్తున్నారో స్టేషనుకి!" అన్నాడు.

"చూస్తున్నా. అయితే ఏమిటి?"

"ఏమీలేదూ, మనం వెళ్దాం..."

సాయంకాలం అయ్యేసరికి షెవ్‌చూక్ ఒక ఫీటన్‌లో కూచుని స్టేషనుకి వచ్చాడు. కోచ్‌మేను సీటులో బూద్నిక్ కూచున్నాడు. స్టేషనుకు వెళ్ళే వీధిలో వీధిపొడుగునా లూటీ సామాన్లు మోసుకొని వస్తూన్న మొగవాళ్ళూ, ఆడవాళ్ళూ వరుసులు తీర్చి నుంచునున్నారు, ఒకరికంటె ఒకరు ముందుకువెళ్ళేందుకు ప్రయత్నిస్తున్నారు. ఫీటను ఏ తొందరాలేకుండా మెల్లగా వెళ్తూంది: ఫీటన్‌లో కూచున్న షెవ్‌చూక్, తన ఫీటన్‌లోకి "సహప్రయాణీకుని"గా ఎవరిని ఎక్కించుకుందునా

అని, కాలినడకను వెళ్తూన్న మనుషులకేసి జాగ్రత్తగా చూస్తున్నాడు. పెద్ద భారీ సూట్‌కేసులు రెండింటిని మోయలేక మోయలేక మోస్తూ, చెమటలుకక్కుతుంటూన్న లెఫ్టినెంట్ కర్నల్ ఒకడు అతనికి అగపడ్డాడు. ఆ ఆఫీసరు సూట్‌కేసులను దించి, తన గుడ్డటోపీని తలమీదనుంచి తీసి, చెమటతో తడిసిపోయిన చేతిరుమాలుతో ముఖమూ, బట్టతల గుండూ వొత్తుకోవడం మొదలెట్టాడు. అతడికిచేరువగా షెవ్‌చూక్ తన ఫీటన్ ఆపించి, అతి నిష్కపటమైన మందహాసంతో:

"ఆఫీసరుగారూ! బండిలోకి దయచేయండి!" అన్నాడు.

"స్టేషనుకేనా? ధన్యవాదాలు" అని సంతోషంతో వచ్చీరాని రష్యన్ భాషలో బదులుచెప్పాడు లెఫ్టినెంట్ కర్నల్.

"వోయ్ కోచ్‌మెన్! సామాన్లు బండిలో పెట్టవోయ్!" అని షెవ్‌చూక్ "కోచ్‌మేన్"న్ని కేకేశాడు.

"కోచ్‌మేన్" చెంగున దిగి, ఆఫీసరుగారి సూట్‌కేసులను చప్పున చేతుల్తో ఎత్తి ఫీటన్‌లో పెట్టి, విధేయతతో ఆయన్ని బండిలోకి ఎక్కించి, బండిలో కూచోబెట్టి, తను తన సీటులోకి ఎక్కికూచుని, గుర్రాల్ని అదిలించి బండిని స్టేషనుకి తీసుకెళ్ళాడు.

"ధన్యవాదాలు, ధన్యవాదాలు!" అని ఆఫీసరుగారు కృతజ్ఞతాసూచకంగా గొణిగి, కాస్త స్తిమితపడి నిట్టూర్చి, చేతిరుమాలు తీసి మళ్ళీ మరొకసారి చెమట పట్టిన తలకాయ వొత్తుకున్నాడు.

ఫీటన్ రైలుస్టేషనుదగ్గరకు వచ్చి ఆగేసరికి షెవ్‌చూక్, యూద్నిక్‌లు ఆఫీసరుకంటె ముందే ఫీటన్‌లోనుంచి దిగిపోయి, అతని నోటనుండి మాటవచ్చేలోపునే అతని సూట్‌కేసులను బండిలోనుంచి దింపేసి, వాటినీ, తమ సొంత సూట్‌కేసునూ పట్టుకుని:

"ఆఫీసరుగారూ! మరేం పర్వాలేదులెండి, సామాన్లకి మేం వున్నాంగా!" అంటూ స్టేషను గేటులోకి వెళ్ళారు.

వీరిద్దరివెంట వెళ్ళాడు ఆఫీసరు.

"ప్యాస్ చూపెట్టండి!" అని గేటులోవున్న మిలిటరీ పోలీసు వీళ్ళిద్దరినీ దబాయించి ఆపేశాడు.

"వీళ్ళు నామనుషులే లెండి, వాళ్ళని లోపలికి వెళ్ళనీయండి" అన్నాడు లెఫ్టినెంట్ కర్నల్.

షెవ్‌చూక్, బూద్నిక్‌లు స్టేషనులో అడుగుపెట్టారు. జర్మన్ ఆఫీసర్లతో నిండిపోయున్న ఫస్టుక్లాసు వెయిటింగురూములోకి వీళ్ళిద్దరూ వెళ్ళి కాస్త ఖాళీజాగా చూసి, లెఫ్టినెంట్ కర్నల్‌గారి సూట్‌కేసులను అక్కడ దించారు. మరి కాస్త దూరాన ఉప్పగాపెట్టివున్న సామాన్లమధ్య షెవ్‌చూక్ తన సొంత సూట్‌కేసును వుంచాడు.

"ఆఫీసరుగారూ, సెలవు। క్షేమంగా వెళ్ళిరండి।"

"ధన్యవాదాలు।" అన్నాడు ఆ ఆఫీసరు.

"దానికేమిటిలెండి। అన్నిటికీ మీకు మా ధన్యవాదాలు।" అన్నాడు షెవ్‌చూక్ చిరునవ్వు నవ్వుతూ.

తమ చిన్న సూట్‌కేసుగురించి "మరచిపోయి" షెవ్‌చూక్, బూద్నిక్‌లు స్టేషనులోనుంచి బయటికి వచ్చేసి, ఫీటన్‌లో వెళ్ళిపోయారు. మరొక మూడు నాలుగు గంటలలో రైల్వేస్టేషను బాగా కనబడే ఒక ఇల్లుచేరుకుని, ఆ ఇంటినుంచి రైల్వే స్టేషన్ని శ్రద్ధగా కనిపెట్టారు.

వారిద్దరూ రైల్వేస్టేషనులో "మరచిపోయిన" సూట్‌కేసులో ముప్పై కిలోగ్రాముల టి. ఎన్. టి. డిలేడ్ ఏక్షన్ మందుపాతర ఒకటి అమర్చబడివుంది.

ఆ మందుపాతర రాత్రి రెండుగంటలకి పేలింది. వెయిటింగురూము గోడ ఒకటి ఎగిరిపోయింది. గోడ ఎగిరిపోయేసరికి, పైకప్పు విరిగి లోపలికి కూలి, తమ సూట్‌కేసులతోనూ, తమ "ఫ్రాయ్‌లైన్"లతోనూ, తమ "ఫ్రావ్"లతోనూ ఆ గదిలో వున్న సుమారు వందమంది జర్మన్ ఆఫీసర్లపైన పడి, అందరి ప్రాణాలనూ పొట్ట బెట్టుకుంది.

ఆ ఘటన ఇంతటితో ముగియలేదు. ఈ మందుపాతర పేలిన సమయానికే మిలిటరీ రైలు ఒకటి స్టేషనుదగ్గరకు వస్తూంది. రైలు తటాలున నిల్చిపోయింది, రైల్లో వున్న జర్మన్‌సైనికులు వ్యాగన్లలోనుంచి గంతేసి, ఇటూ అటూ చెదిరి పోయారు. సోవియట్ విమానాలు రైల్వేస్టేషనుని బాంబుచేస్తున్నాయని వారు నిశ్చ యంచేసుకున్నారు. ఈలోపున, అంతవరకూ రైల్వేస్టేషను చుట్టూ ఘాటువేసి పహరా కాస్తూన్న మిలిటరీ పోలీసులూ, గెస్టాపో మనుషులూ పరుగెత్తుతూన్న సైనికులను

చూసి, వారు సోవియట్ గెరిల్లాలే అయివుంటారని నిశ్చయించేసుకుని, వారిమీద కాల్పులు సాగించారు. అదనపు బలాలను స్టేషనుకు పంపవలసినదిగా పూళ్కోకి కబురువెళ్ళింది. ఆ కబురు అందుకుని వచ్చిన కొత్త బలాలు "విధ్వంసకారుల"పై కాల్పులు ప్రయోగించాయి. ఇటునుంచి కాల్పులూ, అటునుంచి కాల్పులూ ఓ ఇరవై నిమిషాలపాటు జరిగాయి. ఇక "ఇరుపక్షాలకి" సహజంగానే నష్టాలు సంభవించాయి.

ఉదయం అయ్యేసరికల్లా రోవ్నోలో ఎక్కడ విన్నా, ఎవరు మాట్లాడుకున్నా రైల్వేస్టేషనులో జరిగిన పేలుడు గురించే. జర్మన్లు పూర్తిగా కంగారుపడిపోయారు. మధ్యాహ్నానికి తరూలున ఇంకొక పేలుడు జరిగింది—వూరి మధ్యనే. జర్మన్ ఓర్ట్స కమాండాంటూర్ భవనం పేల్చివేయబడింది. ఇరవై నాలుగు గంటల్లోనూ రెండు పేల్చివేతలు!

ఓర్ట్సకమాండాంటూర్ భవనంలో సగం బేస్‌మెంటు మట్టానికి ఒక అంతస్తువుంది. మనుషులను అరెస్టుచేసినప్పుడు వారివద్ద వున్న సొంత వస్తువులను పోలీసులు స్వాధీనంచేసుకుని, వాటిని నిలువచేసే గిడ్డంగిగా ఈ అంతస్తు ఉపయోగపడుతూంది. కమాండాంటూర్‌లో నౌకరీచేస్తూన్న వారిలో కొజ్లోవ్ అనే ఓ మనిషి వున్నాడు. ఇతడు అజ్ఞాతవాస కార్యకర్తల గ్రూపులో సభ్యుడు. ఈ పేల్చివేతలకు ఎంతో కాలం పూర్వనుండే షెవ్‌చూక్‌కి ఇతడితో పరిచయం వుంది. షెవ్‌చూక్ ఆదేశం ప్రకారం ఇతడు ఒక డిలేడ్ ఏక్షన్ మందుపాతరను ఆ గిడ్డంగిలో పై అరమీద వుంచాడు. పనిచేయవలసిన వేళకి మందుపాతర "చక్కగా పనిచేసింది."

ఈ పేల్చివేతలను సాగించుతూన్న విధ్వంసకారులను పట్టుకుందుకని గెస్టాపో వూరంతా గాలించుతూండగా, నొవాక్ గ్రూపుతో కలసి మేం కొత్తవిధ్వంస క్రియలకు సిద్ధమయ్యాం, మా స్కౌట్లకు గూఢచారి కార్యాలు ఒప్పజెప్పాం.

తాము నగరం వదలిపెట్టేయక తప్పదని జర్మన్లు ఎరిగి వుండడంచేత వంతెనల కిందనూ, రోడ్లకిందనూ, నగరంలో వున్న పెద్ద భవనాల కిందనూ మందుపాతరలుపెట్టే కార్యానికి వారు ఉపక్రమించారు. ఈ కార్యాలన్నిటినీ మా స్కౌట్లు శ్రద్ధగా కనుపెట్టారు. జర్మన్లు ఏ యే స్థలాలలో మందుపాతరలు పెట్టారో ఆ వివరాలన్నిటినీ స్కౌట్లు మా డిటాచ్‌మెంటుకి రిపోర్టుచేశారు. ఇక మా వంతు మేం ఆ సమాచారాన్ని మా కమాండుకు రిపోర్టుచేశాం. విమానాశ్రయాలలో విమానాల రాకపోకలను మా మనుషులు కనిపెట్టేవారు, నాజీలు తమ మందుగుండు సామగ్రినీ, వైమానిక బాంబులనూ ఎక్కడెక్కడ నిలువచేశారో తెలుసుకునేవారు, తిరోగమించుతూన్న సైనిక కాలమ్‌లు ఏ యే రోడ్లపైన వెళ్తున్నాయో కనుగొనేవారు.

మా సైనికస్నేహితుల్లు ఆక్రమణదార్లను ముప్పతిప్పలూ పెట్టుతూ, వారిపై క్రియాశీలంగా యుద్ధం సాగించారు.

అతి జాగ్రత్తగా తయారుచేసిన పథకాలకు ఇప్పుడు సమయంకాదని షెవ్‌చూక్ తెలుసుకుని, ఒక టాంకువిధ్వంసక గ్రెనేడ్‌ను పట్టుకొని రోవ్నోలో తిరగసాగాడు. గ్రెనేడ్‌కి ఒక "ప్రతిరక్షణకవచపు" తొడుగును రివస్ తయారు చేశాడు. ఈ తొడుగుకోసమని, ఒక దానితో ఒకటి తీగెతో దృఢంగా బంధించబడి ప్రతిదానిపైన పలుచోట్ల గంట్లుపెట్టబడిన పలంపటి మేకులను అతడు గ్రెనేడ్ చుట్టూ అమర్చాడు. ఇటువంటి గ్రెనేడ్ పేలినప్పుడు కనీసం ఓ వంద తునకలైనా నలువైపులా ఎగురుతాయి.

షెవ్‌చూక్ ఒక జర్మన్ రెస్టారెంటు పక్కనుండి వెళ్తూ, ఆ రెస్టారెంటులో ఎంతోమంది జర్మన్ ఆఫీసర్లు వుండడం చూశాడు. షెవ్‌చూక్ ఇక మీనమేషాలు లెక్కపెట్టకుండా గ్రెనేడ్‌ను రెస్టారెంటు కిటికీలోనుండి లోపలికి విసిరేశాడు. పదిహేడుగురు ఆఫీసర్లు అక్కడికక్కడే హతులయ్యారు.

రోవ్నోలో మేం సాగించిన ధ్వంసక్రియలలో చివరి రెండు క్రియలూ జర్మన్లను శుభ్రంగా హడలుగొట్టేసి భయభ్రాంతులను చేసివేశాయి.

వీటిలో ఒకటి "కసినో" హోటేలు సెంట్రల్ రెస్టారెంటు పేల్చివేత. రోవ్నో నగరంలో ఉన్న అన్ని రెస్టారెంట్లలోనూ బేషైన ఈ రెస్టారెంటు జర్మన్ వీథి నెం. 49 భవనపు కింది అంతస్తులో ఉంది. "కసినో" రెస్టారెంటులో ముగ్గురు ఉక్రైనియన్ అమ్మాయిలు—లీజ, గలీన, ఇరీన—ఊడ్చులూ తుడుపులూ పనులు చేస్తూండేవారు. నొవాక్ గ్రూపువారూ, మాస్నేహితుల్లలో ఒకరూ వీరితోపరిచయం చేసుకున్నారు. ఒక్కొక్కటి ఆరు ఏడుకిలోగ్రాముల బరువుగల డిలేడ్ ఏక్షన్‌మందుపాతరలు రెండింటిని నొవాక్ ఆఅమ్మాయిలకు యిచ్చాడు. జనవరి శతదయాన, ఆ ముగ్గురు అమ్మాయిలూ ఈ మందుపాతరలను బాల్చీలలోపెట్టి, వాటిపైన అలుకుగుడ్డలు కప్పి రెస్టారెంటులోకి తీసుకెళ్ళారు. జనరల్సుకోసం ప్రత్యేకం రిజర్వుచేసిన గదిలో టేబిలు కింద కట్టారు; ఆటు తరువాత ఆ అమ్మాయిలు మామూలుగా గదులుఊడ్చి, కడిగి, శుభ్రంచేసి పనులు పూర్తిచేసుకుని, ముందుగా ఏర్పరచుకున్న సాంకేతిక స్థలానికి వెళ్ళగా, అక్కడనుంచి వారిని మా మనుషులు మా క్యాంపుకి తీసుకువెళ్ళిపోయారు.

మధ్యాహ్నపు భోజనసమయానికి, రెస్టారెంటునిండా జర్మన్లు వున్నప్పుడు మందుపాతరలు పేలాయి. జనరల్సు భోజనంచేస్తూన్న గదిలో పెట్టిన మందుపాతర

మొదట పేలింది. గదిపైకప్పు, గోడలూకూలిపోయాయి. విరిగి పడిపోయిన శిథిలాలతో గది ద్వారం మూసుకుపోయింది, గదిలో భోజనం చేస్తూన్న ఆఫీసర్లు ఇకబయటికి రాలేకపోయారు. మరి పది నిమిషాలలో రెండో మందుపాతర పేలింది.

పైఅంతస్తుల్లోని హోటేల్లో నివసించుతూన్న ఆఫీసర్లు భీతావహులై కిటికీల్లో నుంచి సరాసరి వీథిలోకి ఉరికేయసాగారు, కిందపడి కాళ్లూచేతులూ విరుచుకున్నారు, తలకాయలు పగులగొట్టుకున్నారు. చచ్చినవారిని శిథిలాల్లోంచి బయటికి లాగుతూండగా, మిలిటరీ పోలీసులు ఆ చుట్టుపక్కల వీథులచుట్టూ సందులచుట్టూ ఘాటువేసేసి, ఆ దరిదాపులకే ఎవ్వరినీ రానిచ్చారుకారు. మొదటి గదిలో ఏడుగురు–అందులో ముగ్గురు జనరల్సు–చచ్చిపోయారనీ, రెండవగదిలో సుమారు డెబ్బైమంది చచ్చిపోయారనీ మాకు తరువాత తెలిసింది.

రెస్టారెంటులో పేలుడులు మధ్యాహ్నం మూడు గంటలకు జరిగాయి. మళ్ళీ ఆ రోజు రాత్రి ఎనిమిది గంటలకు రోవ్నా స్టేషనుగుండా వెళ్తూన్న ఒక రైలు పేల్చివేయబడింది.

ఈ రైలు వెళ్తూన్న పట్టాలపై నొవాక్ గ్రూపు ఒకముప్పై కిలో గ్రాముల మందుపాతర పెట్టింది. మందుపాతరనుండి వచ్చే తీగెలు ఫెల్ట్ ఫ్యాక్టరీ స్విచ్‌కి తగిలించబడ్డాయి. ఉన్నతహోదా జర్మన్ అధికారులు ప్రయాణం చేస్తూన్న ఆ స్పెషల్ రైలు ఎప్పుడు వస్తుందా అని నొవాక్ నాయకత్వానవున్న అజ్ఞాతవాస కార్యకర్తల గ్రూపు మనుషులు పగలూ రాత్రీ స్విచ్‌బోర్డుదగ్గర డ్యూటీలోవున్నారు. చిట్టచివరి నిమిషంలో జర్మన్లు మందుపాతరను కనిపెట్టారు. కాని దానిని తీసివేయలేకపోయారు. ఆ స్పెషల్ రైలు మంచి జోరుతో వస్తూంది. రైల్వేలైను పక్కను ట్రెంచిలు తవ్వుతూన్న సైనికులు ట్రెయిన్ డ్రైవరుకు సిగ్నలు చేశారు, కాని వీరు చేస్తూండిన సిగ్నలుని డ్రైవరు చూసుకోలేదు కాబోలు, చూసుకున్నప్పటికి బహుశ సకాలంలో బ్రేకు వేయలేకపోయుంటాడు.

ఆ సమయంలో నొవాక్ స్వయంగా స్విచ్ దగ్గరవున్నాడు. అతడు స్విచ్‌వేశాడు. ఇంజను తటాలున నిలబడిపోయింది, ప్యాసింజరు బోగీలు ఒకదానినొకటి ఢీకొని, ఒకదానిపైన ఒకటి ఎక్కిపోయాయి. ఫలితంగా, యుద్ధరంగానికి వెళ్తూన్న నాజీ ఆఫీసర్లూ, సైనికులూ హతులయ్యారు, ఎందరో వికలాంగులయ్యారు.

పిలువని పేరంటంగా వచ్చిన అతిథులకు మేం ఈ విధంగా "పిక్నిక్" లిచ్చాము."

# చివరి మార్చి

ల్వోవ్ పట్టణానికి తరలివెళ్ళేందుకు మాకు డిసెంబరు చివరిరోజుల్లో అనుమతి లభించింది. ఎర్రసైన్యం అతిత్వరితగతిని పురోగమించుతూంది. జితోమిర్, బేలయ త్సేర్కొవ్, రకిత్నాయె, క్లెసొవొ, సార్నీ వూళ్లు విముక్తిచేయబడ్డాయి. మా క్యాంపులోవున్న మాకు అప్పటికే ఆర్టిలరీ కాల్పుల చప్పుడు, ముఖ్యంగా తెల్లవారే ముందూ, రాత్రిళ్లూ స్పష్టంగా వినబడసాగాయి. ఈ ఆర్టిలరీ సంగీతం విని గెరిల్లాలు మహదానందభరితులయ్యారు.

ఇక మేం జాప్యం చేసేందుకు వీల్లేకపోయింది. ఏమంటే మన సైన్యమే మమ్మల్ని "చుట్టుముట్టుతుంది," మేమేమో ఆక్రమణదార్లను ఇంకా మరికొంత దూరం "సాగనంపాల్సి" వుందాయె. రోవ్నొ, జ్డొల్బునొవొలలోనూ, ఇంకా ఇతర చౌకీలలో వుంటూన్న మా స్కౌట్లు జనవరి మొదటి రోజుల్లో తిరిగి క్యాంపుకి వచ్చేశారు. ఎర్రసైన్యం వచ్చేవరకు అక్కడే వుండవలసిందని ఆజ్ఞాపించి కొద్దిమందిని మాత్రం ఆ స్థలాలలో వుంచేశాం. తన గ్రూపులోని కొందరు మనుషులతో సహా నొవాక్ కూడా మా క్యాంపుకి వచ్చేశాడు. మా డిటాచ్మెంటులో మొత్తం మనుషుల సంఖ్య సుమారు వెయ్యీరెండువందలకు పెరిగింది.

వాల్య వొవ్నేర్ రోవ్నొలో వుండిపోయింది. రైక్స్‌కమిస్సారియాట్ ఉద్యోగినిగా ఆమె ల్వోవ్‌కి కదమ జర్మన్లతో వెళ్ళిపోవలసివుంది. ఆమె గురించి కుజ్నెత్సోవ్ చాలా బెంగపడ్డాడు. ఈమధ్య కొంతకాలంనుండి తన "ఆప్తమిత్రులు" తనపట్ల అనుమానపడుతూన్నట్టుగా అతనికి రోవ్నొలోనే అనిపించింది.

"వాళ్ళు నన్ను నిజంగా అనుమానించుతూవ్నట్టయితే ఆమె కూడా ప్రమాదంలో వున్నట్టేమరి. ఆమె నాకెంతో ఆప్తురాలైంది, ఇద్దరం కలసి ఎంత అనుభవించామో!" అన్నాడు కుజ్నెత్సోవ్.

అతని బెంగకు కారణం లేకపోలేదని తరువాత జరిగిన సంగతులనుబట్టి తెలిసింది: జర్మన్లు ల్వోవ్‌కి తిరోగమించే ముందురాత్రి గెస్టాపొ వాల్యని అరెస్టు చేసింది.

ల్వోవ్‌కి మేం బయల్దేరివెళ్ళడం ఆలస్యమైంది. ల్వోవ్‌కి సాగివెళ్ళేందుకు మేం అనుసరించవలసిన కొత్త మార్గాన్ని తెలియజేసే టోపోగ్రాఫికల్ మ్యాపులు మా దగ్గర లేకపోయాయి, మా రేడియో ట్రాన్స్మిటర్లకు సరిపడినన్ని

బేటరీలు మా దగ్గర లేకపోయాయి, మా సోవియట్ ఆయుధాలకు మందుగుండు కూడా మావద్ద కొరవడింది.

ఇక కాలం వృథా చేయకూడదని నిశ్చయించుకుని, ల్వోవ్ పరిసర ప్రాంతాలకు త్వరత్వరగా సాగివెళ్ళగల్గే మొబైల్ గ్రూపును పంపించాం ఈ గ్రూపుకి మేం ఒప్పజెప్పిన పనులు: ల్వోవ్ చుట్టుపక్కల ప్రాంతాల్లో మాక్యాంపుకి అనువైన స్థలాన్ని చూడడమూ, ఆ పట్నంలోనే సాంకేతికస్థలాలుగా ఉపయోగపడే బసలు ఏర్పాటుచేయడమూ. ఇరవైమంది మనుషులను ఎంచి, వీరితో ఈ గ్రూపును ఏర్పరచాం. వీరిలో ఒకడు పస్తుహోవ్. యుద్ధం ముందురోజుల్లో యితడు ల్వోవ్‌లో మునిసిపల్ యింజనీరుగా వుండేవాడు. ఇతనికి ఒప్పగించిన ప్రత్యేక కర్తవ్యం: పట్నంలోని భూగర్భ సొరంగాలను గురించి క్షుణ్ణంగా తెలుసుకోవడం.

ల్వోవ్ పట్టణానికి వెళ్ళేందుకు రేడియో ఆపరేటరు మరీన కిహ్ చాలా ఉబలాటపడింది.

"ల్వోవ్ నాకు అరచేతిలో ఉసిరికాయి. నేను ఆ వూరిలో పనిచేశాను. నాకు బంధువులూ, పరిచయస్థులూ వున్నారక్కడ. ఈ గ్రూపుతో అక్కడకి నన్నెందుకు పంపించరు?" అని ఆమె నన్నడిగింది.

"నువ్వు కొద్దిగా ఓపికపట్టాలి మరి. డిటాచ్‌మెంటుతో కలిసి వెళ్ళువుగాని యిప్పుడు నీకు అతిముఖ్యమైన పని ఒప్పజెప్తాం: అక్కడ నీకు తెలిసినవారిలో ఎవరిని మన స్కౌట్లు కలుసుకుంటే మంచిదో యిప్పుడు నువ్వు బాగా ఆలోచించి, వారికి మనవాళ్ళను పరిచయంచేస్తూ ఉత్తరాలు రాయి" అని ఆమెకి బదులు చెప్పాను.

మరీన తన అక్కకి, కొందరు పరిచయస్థులకి ఉత్తరాలు రాసి, ఈ గ్రూపుకి కమాండరుగా నియమితుడైన క్రూతికొవ్‌కి యిచ్చింది. జనవరి 5న ఈ గ్రూపు మా క్యాంపునుండి బయల్దేరింది. ఆ గ్రూపులో ఒక రేడియో ఆపరేటరు ఉన్నప్పటికీ, మరి వారిదగ్గరనుండి మాకు నాటికీ నేటికి ఏ కబురూ అందలేదు.

ఏ పనీ లేకుండా గోళ్ళు గిల్లుకుంటూ అనవసరంగా కూచున్నందుకు కుజ్నెత్సోవ్ మహ బాధపడిపోయాడు.

"చూడండి, ఏమిటి జరుగుతూందో!" అన్నాడు కుజ్నెత్సోవ్ నాతో, "ఎర్రసైన్యం ఎంతో త్వరగా ముందుకు సాగిపోతూందంటే, ఇక జర్మన్లకి త్వరలోనే ల్వోవ్‌ను ఖాళీచేసి వెళ్ళిపోవడం తప్పనిసరి అవుతుంది. వాళ్ళు అక్కడనుంచి వెళ్ళిపోయే లోపునే అక్కడ ఏదో కొంత పని చేసేందుకు నాకు వీలుంటుంది. నా కోసం

వాళ్ళ ఎదురుచూసూ ఉంటుందికూడానూ. నన్ను ఒక్కడ్ని అక్కడకు వెళ్ళ నీయండి," అన్నాడు కుజ్నెత్సోవ్ నాతో.

"మీరు అనేది నిజమే అనిపించుతూంది నాక్కూడానూ. డిటాచ్‌మెంటు యావత్తూ మెల్లగా వెళ్తుంది, దానితోపాటు మీరు కూడా తాళ్ళీడ్చుకురావడం ఎందుకు?" అన్నాను.

ఈసారి కుజ్నెత్సోవ్ కోసం లూత్స్క పట్నంలో ఉన్న గెబీట్స్‌కమిస్సార్‌నుండి కారు "ఎరువు పుచ్చుకున్నాం." ఆ కారుకి తిరిగి కొత్త రంగువేసేందుకు మాకు వీలైందికాదు, అందుకు వేళలేకపోయింది. అయినప్పటికీ, ఏమైనా సరే ఆ కారుని గుర్తుపట్టేందుకు వీలులేకుండా చేసేందుకని, దానికి మునలి రూపు యిచ్చాం—కారు బాడీకి గీతలుపెట్టేశాం, చక్రాల డిస్కులు తీసేశాం. ఈ "శస్త్ర క్రియ" యావత్తూ స్త్రుతీన్‌స్కియ్ ఆదేశాల ప్రకారం, గెబీట్స్‌కమిస్సారియాట్ గేరేజినుంచి ఆ కారుని తోలుకుని వచ్చిన డ్రైవరు బెలోవ్ నిర్వర్తించాడు.

ల్వోవ్ పట్టణాన్ని బాగా ఎరిగిన బెలోవ్, యాన్ కమీన్‌స్కియ్‌లను కుజ్నెత్సోవ్‌తో కూడా పంపడానికి నిర్ణయించాం. లోయ్‌ట్నాంట్ పౌల్ సీబెర్ట్ పేరుతో తయారుచేసిన పాత డాక్యుమెంట్లనే కుజ్నెత్సోవ్ తనతో తీసుకెళ్ళాడు, కాని ఈ డాక్యుమెంట్లకి అదనంగా, ల్వోవ్‌కి వెళ్ళేందుకూ, అక్కడినుండి "ఉద్యోగ సంబంధమైన కార్యాలపైన" క్రాకొవ్ పట్టణానికి వెళ్ళేందుకూ అనుమతిపత్రాలను కూడా అతనికి యిచ్చాం. ఎర్రసైన్యం చేతిలో పడకుండా పారిపోతూన్న బడా చట్టావ్యాపారి అయినట్టు యాన్ కమీన్‌స్కియ్ నటించాడు.

ఈ సన్నాహాలు జరుగుతూండగా, మా యావత్తు డిటాచ్‌మెంటుతో మేం ల్వోవ్ దిశగా కదలివెళ్ళాం. కుజ్నెత్సోవ్ యింకా మాతోనే ఉన్నాడు. డిటాచ్‌మెంటు మెల్లగా వెళ్ళింది. కుజ్నెత్సోవ్ కారు తనంతట అది అంత మెల్లగా వెళ్ళలేక పోతుంది. మొదటి గేరులో నడిపించినప్పటికీ అది మా కాలమ్‌కంటే ఎంతోముందుకే వెళ్ళిపోతుంది, అంతేకాకుండా ఆ యింజను చప్పుడువల్ల జర్మన్లకి మా ఆమాకీ తెలిసిపోయి ఉండేది. అందుకని దానిని స్టార్టుచేయకుండా, దానికి ఓ జత చక్కని గుర్రాలనుకట్టి లాగించాం. డ్రైవరుసీటులో బెలోవ్ కూర్చున్నాడు. అతడి పక్కను నేను కూర్చున్నాను, వెనుక సీటులో కుజ్నెత్సోవ్, కమీన్‌స్కియ్‌లు కూర్చున్నారు. అన్ని అద్దాలూ మూసేసిన ఆ కారులో మేం కూర్చుని, ల్వోవ్ పట్నంలో మా కార్య కలాపం గురించి వివరంగా చర్చించాం.

మేం రోవ్నో—లూత్స్క, రైల్వేలైను దాటాల్సివుంది. ఇదిప్పుడు కష్ట

సాధ్యమైన పని అయింది. గస్తీచౌకీల సంఖ్య సాధ్యమైనంతవరకు తగ్గించేందుకని జర్మన్లు యించుమించు అన్ని లెవెల్ క్రాసింగులనూ బందుచేసేశారు: వాటికి ముళ్ళ తీగెంతో కంచెపెట్టేసి, వాటికి వెళ్ళే దార్లలో మందుపాతరలు పెట్టారు. ఇక తెరచి వుంచిన లెవెల్ క్రాసింగుల దగ్గర రక్షణ దుర్గాలను నిర్మించారు. మా అశ్వికసైన్యాట్లు రైల్వేలైనుని పలుచోట్ల దాటేందుకు ప్రయత్నించారు, కాని ప్రతిస్థలంలోనూ మెషిన్ గన్ను కాల్పులు వారిని అడ్డుకున్నాయి. మా డిటాచ్మెంటు పెద్దది అవడంచేత, రైల్వేలైను దాటేందుకు చాలాసేపు పట్టుతుంది. నాజీ యూనిట్లతో తలపడడం బుద్ధి లేనిపనే అవుతుంది, అవి అదనపు బలాలను తెచ్చుకోగలవు, అంతేకాదు—కవచవాహనాల ట్రెయినునే రప్పించుకోగలవు.

రైల్వేలైను దాటేందుకు ఎక్కడైనా సందు దొరకుతుందేమో అని మేం వెతుకుతూ, రోడ్ల వెంట తిరోగమించుతూన్న జర్మన్ ఇన్ ఫెంట్రీ, మోటరైజ్డ్ కాలమ్‌లు మాకు కనబడేసరికి, మేం మాటుకాసి వాటిపై దాడిచేశాం.

ఇక జాప్యం కూడదని కుజ్నెత్సోవ్ నిశ్చయించుకున్నాడు. నేను అభ్యంతరం చెప్పలేదు. రైల్వేలైను ఎప్పుడు దాటగల్గుతామో ఎవరికి తెలుసును గనుక!

కుజ్నెత్సోవ్ బయల్దేరే వేళ దగ్గరపడింది.

"మరి, నేను వెళ్తాను, సెలవిప్పించండి!" అన్నాడతడు.

అతణ్ణి కౌగలించుకున్నాను, రష్యన్ ఆచారం ప్రకారం ఒకరినొకరం ముమ్మాటు ముద్దు పెట్టుకున్నాం. తరువాత అతడు లుకిన్, స్తెహొవ్, స్త్రుతిన్స్కియ్ తదితర కామ్రేడ్ల దగ్గర సెలవుతీసుకున్నాడు. అతనిని కౌగలించుకుని హృదయపూర్వకమైన వీడ్కోలు చెప్పాలని ప్రతివాడికీ అనిపించింది.

కుజ్నెత్సోవ్ లెవెల్ క్రాసింగు దగ్గరకు సరాసరి వెళ్ళలేదు. తనను వేటాడుతూన్నట్టు అతనికి అనిపించింది. అందుకని జాగ్రత్తగా వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. హైరోడ్డు చేరువగా రైల్వేలైనుకి ఓ రెండు కిలోమీటర్ల దూరాన వున్న ఒక చిట్టడవిలో కారు ఆపుచేశాడు అతడితో వున్న మనుషులు కారు పైకి అగపడకుండా వుండేందుకని దానినక్కడ దాచేశారు. తెల్లవారేవరకు కుజ్నెత్సోవ్ అడవిలోనే వుండిపోయాడు. తెల్లవారుతూండగా తిరోగమనంలో వున్న ఒక జర్మన్ మోటారు కాలమ్ అటు వెళ్ళడంచూసి, దానితో కలసి అతడు రైల్వేలైను దాటేశాడు. 1944 జనవరి 17న ఇది జరిగింది.

కుజ్నెత్సోవ్‌కి మేం వీడ్కోలు చెప్పినప్పుడు, అతణ్ణి ఒకటి రెండు రోజుల్లో ల్వోవ్‌లో తప్పకుండా కలుసుకుంటామనే నమ్మాం. కాని సంగతంతా ఇంకొక విధంగా జరిగింది. మరొక నాల్గురోజుల తరువాత లూత్స్కనుండి వచ్చిన హర్కారా ద్వారా, కుజ్నెత్సోవూ, కమీన్‌స్కియూ, బెలోవ్‌లు ల్వోవ్ వెళ్ళేముందు లూత్స్కలో అంత కాలం ఎందుకున్నారో మాకు తెలియలేదు. ఆ ఊరునుండి వెళ్ళిపోతూండగా, లెవెల్ క్రాసింగు గేటుదగ్గర వారి కారును ఒక జర్మన్ గస్తీదళం ఆపి, వారి డాక్యుమెంట్లను తనిఖీచేయసాగింది. డాక్యుమెంట్లను ఒక గెస్టాపో మేజరూ, ఇద్దరు మిలిటరీ పోలీసులూ తనిఖీచేయడం మొదలుపెట్టారు. ఏదో తికమక జరిగిందని కుజ్నెత్సోవ్‌కి అనుమానం తోచింది. దానితో ఇక ఒక్కనిమిషమైనా వెనకతీయక, డాక్యుమెంట్ల తనిఖీ జరుగుతూండగా, ఆముగ్గురు జర్మన్లనూ కుజ్నెత్సోవ్ తటాలున తన పిస్టల్‌తో కాల్చివేశాడు. కారును ఝామని ముందుకు పోనిచ్చి, లెవెల్ క్రాసింగు అడ్డుకర్రను కారుతో గుద్దించేసి, కారుని మంచి జోరుమీద పోనిచ్చారు. ఈ సంగతి జరిగిన తరువాత, కుజ్నెత్సోవ్ గురించి చాలా కాలంవరకు నాకు మరేమీ తెలియలేదు.

ఏది యేమైనా సరే, రైల్వేలైను దాటితీరాలని జనవరి 19 న ఒక నిర్ణయానికి వచ్చాం. రైల్వేలైను దాటేందుకు తగిన స్థలంగా రెండు లెవెల్ క్రాసింగుల మధ్య, లైనుకి ఇటూ అటూ కాలువలు మెరకగా వున్న విభాగాన్ని ఎంచుకున్నాం.

రెండు పెద్ద గ్రూపులను పురోగామి దళాలుగా ముందు పంపించాం— రైల్వేలైను దాటేందుకు మేం ఎంచుకున్న రైల్వేలైను విభాగానికి ఎడమ పక్కకు ఒక గ్రూపునూ, కుడి పక్కకు రెండవ గ్రూపునూ పంపించాం. ఒకవేళ కవచశకటపు రైలును వచ్చినట్టాయెనా, దానిని తప్పక పేల్చివేయవలసిందనీ, యావత్తు డిటాచ్‌మెంటూ రైల్వేలైను దాటిందని వారికి కబురు అందేవరకూ వారు శత్రువుతో పోరాటం సాగించుతూండవలసిందనీ ఈ రెండు గ్రూపులకూ హెచ్చరించాం.

రైల్వేలైను దాటేందుకు డిటాచ్‌మెంటుకి గంటన్నర పట్టింది, ఇంకా హెచ్చు సేపే పట్టిందేమో కూడానూ. మాకు ఏ అంతరాయమూ కల్గలేదు, ఒక్క తుపాకిగుండైనా పేల్చనవసరంలేకపోయింది.

జనవరి 19 న మేం రైల్వేలైను దాటాం, 20 ని మాకు శత్రువుతో యుద్ధాలు ప్రారంభమైయ్యాయి. మేం రెండువందల కిలోమీటర్లు వెళ్ళాల్సివుంది:

ఈ రెండువందల కిలోమీటర్ల పొడుగునా అడుగడుగునా మా పైబడ్డానికని శత్రుసైనికులు బలమైన మాట్లు వేసి తయారుగా వున్నారు.

మేం రాత్రిపూట విరామంలేకుండా తరలివెళ్ళేవారం, మాటుదాగి వున్న శత్రువును ఎదుర్కొని యుద్ధంచేసేవారం. మరి, పగటిపూట విశ్రాంతి తీసుకునే వారం. విశ్రాంతి తీసుకుంటూండగానే మళ్ళీ యుద్ధం ఎదురయ్యేది. మేం ఒక పద్ధతి ఏర్పరచుకున్నాం: ఒక యూనిట్టు యుద్ధం చేస్తూన్న సమయంలో, మరొక యూనిట్టు వంట వండి విశ్రాంతి తీసుకోవడం. మేం మార్చ్‌వేస్తూ వెళ్తూన్నప్పుడు, ఇప్పుడు కూడా, వ్లదీమిర్ స్త్రిలిన్‌స్కియ్ ఉండేనే గాని మాకు జరిగిందికాదు. పరిస్థితి నిరంతరం ప్రమాదభరితంగా వున్నప్పటికీ కూడా, సప్లై ప్లటూన్ డిప్యూటీ కమాండరుగా అతడు ఎప్పుడుపడితే అప్పుడే సైనికులకు భోజనం అందేటట్టు ఎల్లవేళలా ఏర్పాటు చేసేవాడు, గాయపడినవారి గురించి శ్రద్ధతీసుకునేవాడు.

ఇంచుమించు ప్రతి గ్రామంలో ప్రవేశించేముందూ మేం యుద్ధం చేయవలసే వచ్చింది. నేను ఈ విధంగా ఆజ్ఞాపించాను: ఏ గూడెంలో అయినా, ఏ గ్రామంలో అయినా శత్రు స్త్రీలు కాని, సాయుధదళాలు కాని కనబడినట్లాయెనా, ఆ గ్రామంలో అడుగుపెట్టేముందు, దానిపై ఫిరంగులూ, మోర్టార్లూ ప్రయోగించాలి. ఈ చర్య మాకు బాగా సహాయపడింది. ఓ పదిహేను సాల్వోలు పేలేవి, కేవ్రలీ స్క్వాడ్రన్‌లో సగం భాగం "హుర్రా" కేకలతో విజృంభించేది. ఇది జరిగిన తరువాత, శత్రువుచే ఖాళీచేయబడిన పల్లెలోకి డిటాచ్‌మెంటు ఇకప్పుడు ప్రవేశించేది.

ఒక్కొక్కప్పుడు మరొకలాగునకూడా జరిగేది. గ్రామంలోకి వెళ్ళేవారం— గ్రామం ఖాళీగా వుండేది: గ్రామస్థులు వుండేవారుకాదు, పశువులు వుండేవికావు, కోళ్లూ, బాతులూ వుండేవికావు, గుడిసెల్లో ఫర్నీచరూ వుండేదికాదు. ఎక్కడికి మాయమైపోయినట్టు? జర్మన్లు గ్రామంలో వుండినవారందరినీ మూట ముల్లెతోసహా గొడ్డుగోవలతో సహా జర్మనీకి తీసుకుపోయారా యేమిటి?—అనుకునేవారం.

ఈ ప్రశ్నలకు నికొలాయ్ స్త్రిలిన్‌స్కియ్, షెవ్‌చూక్, వలెన్‌తీన్ సెమ్యోనొవ్, నొవాక్‌లు సమాధానం కనిపెట్టారు.

ఒక గుడిసెలో వున్న కొట్టుగది గచ్చుకు ఒక కన్నం వున్నట్టు వీరికి అగపడింది. ఆ కన్నం పైకి కనబడకుండా కప్పేందుకు అందుపైన ఒక పీపా జాగ్రత్తగా పెట్టివుంది. ఆ పీపాను వీరు పక్కకు నెట్టారు. సెమ్యోనొవ్ ఒక దీపం పట్టుకుని ఆ కన్నంలోకి దిగబోయాడు. తటాలున కన్నం అడుగునుండి — తుపాకి

కాల్పు చప్పుడు. వెనువెంటనే—బయటికి వచ్చేశాడు సెమ్యోనొవ్. "బుద్ధిగా బయటికి వచ్చేయండి!" అని మావాళ్ళు కేకవేశారు. జవాబులేదు.

మేం జర్మన్లతో ఒకసారి తలపడినప్పుడు, మాకు కొన్ని పొగబాంబులు కనబడ్డాయి. వాటిని తీసుకున్నాం. కాని మాకవి ఉపయోగపడవనే అనుకున్నాం. వాటినిప్పుడు ఉపయోగించేందుకు నిశ్చయించుకున్నాం—ఒక బాంబును కన్నంలోకి విసిరాం. కొద్ది నిమిషాల్లోకి ఆ కన్నం అడుగునుండి: "శరణు! శరణు!" అని కేకలు వినబడ్డాయి—ఇక వెనువెంటనే ఆ కన్నంలోనుంచి, తొలుత ఒక తుపాకి, తరువాత—మసితో కాయనలుపెక్కిన ఒక బందిపోటుదొంగ ముఖమూ ప్రత్యక్షమైంది. అతగాడివెంట మరొకడు కూడా ఆ కన్నంలోనుంచి బయటికొచ్చాడు. గ్రామస్తులకి, వారి చరాస్తులకి ఏమైందీ వీరివల్ల మాకు తెలిసింది.

గ్రామస్థులు తమ ఇళ్ళకింద "నేలమాలెలు" కట్టాలనీ, తిండిగింజల్నీ, పశువులనూ తమ యావత్తు చరాస్తులనూ పైకి కనబడకుండా ఆ "నేలమాలెల"లో దాచి వేయాలనీ, బోల్షివిక్‌లు గ్రామంలోకి వచ్చినట్టయితే గ్రామస్థులు సహితం "నేలమాలెల"లో దాగుండాలనీ గెస్టాపోలు ఆజ్ఞాపించారు, లేకుంటే గ్రామస్థులను కాల్చి పారేస్తామని బెదిరించారు. ఈ సమాచారం నిజమో కాదో అని పరీక్షించాం. నిజంగానే చాలా ఇళ్ళలో గచ్చుకింద కట్టిన "నేలమాలెలు" వున్నాయి. తిండిగింజలూ, ఆవులూ, గుర్రాలూ, పందులూ, బాతులూ, కోళ్లూ, తదితర చరాస్తులూ ఆ "నేలమాలెల"లో అగపడ్డాయి. చాలారోజులవరకూ సరిపడేటంత మంచినీరు అన్ని "నేలమాలెల"లోనూ నిల్వచేసివుంది. గ్రామస్థులు మమ్మల్ని చూసి, మేము సోవియట్ మనుషులమని పోల్చుకుని, వారంతటవారే ఆ "నేలమాలెల"లో నుంచి బయటికి వచ్చేశారు.

జర్మన్లచే బలోపేతంగా పరిరక్షించబడిన గెలీషియా సరిహద్దును మేము దాటినప్పుడు, మా డిటాచ్‌మెంటు ప్రత్యేకమూ అనేక యుద్ధాలు చేసింది. అంతేకాదు, మేము తరలివచ్చిన యావత్తు మార్గమూ అత్యంత కష్టభూయిష్ఠంగా పరిణమించింది. కార్పేతియన్ పర్వతపంక్తుల లోతట్టు కొండలు అక్కడ మొదలయ్యాయి. దట్టమైన అడవులతో నిండిన ఎత్తైన కొండలు ఎక్కగానే మళ్ళీ వెంటనే కనుమల్లోకి దిగాలి. ఫిరంగులనూ మందుగుండ్లతో నిండిన బండ్లనూ మనుషులే లాగాల్సివచ్చింది. మంచు కురిసేది, మళ్ళీ వెంటనే కరగడం మొదలయ్యేది. ఇహ దాంతో రోడ్లన్నీ రొంపిమయమై ప్రయాణం దుస్సాధ్యమైపోయేది. దారిలో నదులు దాటాల్సివచ్చింది. శత్రువు కురిపించుతున్న అగ్నివర్షంలోనే వంతెనలు నిర్మించి నదులు దాటాం.

ఎలాగైతేనేమి, ల్వోవ్ పట్టణానికి అరవై కిలోమీటర్లు చేరువగా వచ్చేశాం.

# ద్రోహపూరితమైన నిశ్శబ్దత

నీవిశ్న గ్రామం దగ్గరకు వచ్చాం. గ్రామంలో శత్రు గస్తీచౌకి ఏదీలేదని స్కౌట్లు రిపోర్టు చేశారు. నాకు ఆశ్చర్యం వేసింది. ఇంతవరకూ జర్మన్లతో సర్వత్రా ఘర్షణలు జరుగుతూనే వచ్చాయి, మరి ఇక్కడేమో ప్రశాంతంగా వుందాయె.

గ్రామంలో ప్రవేశించాం—నిజంగానే, అంతా ప్రశాంతంగా వుంది. మా మనుషులకి గ్రామంలోని ఇళ్ళల్లో బసలు ఏర్పాటుచేయడం ప్రారంభించాం. స్టాఫ్ క్వార్టర్స్‌ను గ్రామం చిట్టచివర వున్న గుడిసెలో పెట్టుకున్నాం. నేను ఆ గుడిసె లోపలికి వెళ్ళాను. వెళ్ళి గుడిసె యజమాని, వయసుమళ్ళిన రైతునీ, అతని భార్యనీ పలకరించాను. గుడిసెలోపల గోడకు లౌడ్‌స్పీకరు ఒకటి తగిలించి వుండడంచూశాను.

"పని చేస్తుందా?" అని అడిగాను గుడిసె యజమానిని.

"పనిచేస్తూంది. మా గ్రామంలో చర్చీ, స్కూలూకూడా పనిచేస్తున్నాయి."

"ఈ చుట్టుపక్కల జర్మన్లు వున్నారా?"

"లేరు, ఇప్పుడెవ్వరూ లేరు."

"మరి, మిమ్మల్ని ఎలా చూస్తున్నారు?"

"ఫర్వాలేదు, ఏదో చూస్తున్నారులెండి."

"వాళ్ళు తరచుగా వస్తుంటారా?"

"వస్తూంటారు."

"తరుచుగానా ?"

"ముగ్గురూ నలుగురూ వస్తూంటారు. అడవిలోనుండి కలప తెచ్చుకుంటారు."

స్కౌట్లను గ్రామంలోకి పంపించి, ఇంతకంటె ఇంకా హెచ్చు సమాచారం తెలుసుకుని రమ్మనమని లుకిన్‌న్ని ఆదేశించాను. ఓ గంటలోపల స్కౌట్లు తిరిగి వచ్చేసి, అంతా ప్రశాంతంగా వుందని రిపోర్టు చేశారు. మా మొదటి కంపెనీ కమాండరు యెర్మోలిన్‌న్ని పిలిచి :

"గొడవలేకుండా నెమ్మదిగానే వుంది, కాని ఏమైతేనేం, నువ్వు మాత్రం అదనపు చౌకీలను ఏర్పాటుచేయి" అని చెప్పాను.

మా మనుషులు అలసిపోయున్నారు, ఇక నిద్రపోయేందుకని అందరూ నడుం వాల్చారు. నాకుమాత్రం నిద్రపట్టలేదు. నెలరోజులకు పైగా నాకు వొంట్లో

ఏమీ బాగుండడంలేదు, అందునా గత కొద్ది దినాలనుండి ఇండిలోనుంచి లేవనేలేదు. రజాయి కప్పుకొని అలాపడుకునే వున్నాను. నా పక్కను నిరంతరం ఎవరో ఒక హర్కారా వుంటూండేవాడు. ఇహ జబ్బునుండి ఇప్పుడు నాకు కన్ను అసలుమూత పడడంలేదు. ఉదయమవుతూంది, ఇంకా చిరుచీకటిగానే వుంటున్నా, ఇహ ఏమైనా సరే, నేను లేచి వెళ్ళి, చౌకీలను తనిఖీ చేద్దామని నిశ్చయించుకున్నాను. ఎంతోకష్టం మీద ఓవర్‌కోటు తొడుక్కున్నాను, టోపీ పెట్టుకున్నాను, పిస్తలు జేబులో వేసు కున్నాను, గోడపట్టుకుని లేచి, పడుకుని నిద్రపోతున్న మనుషులను దాటుకుంటూ బయటికి వెళ్ళాను. స్టాఫ్ క్వార్టర్స్ ఎదుట పహరా కాస్తూన్న సెంట్రీ నన్ను చూసి సెల్యూటు చేశాడు.

చెట్ల కొమ్మలతో పెట్టిన కంచెగోడకి ఓ చిన్న గేటు వుండడం కనబడింది. అది సరాసరి ఒక కూరగాయల పెరట్లోకి దారితీసింది. పెరటి ఎదుట బారుగా పొలాలున్నాయి. బూడిదెరంగు ఆకాశపు వెలుగులో ఆ పొలాల్లో నల్లని ఛాయా విగ్రహాలను గమనించాను. ఆ ఆకారాలను చూసి, నా ఆదేశాల ప్రకారం మొదటి కంపెనీ కమాండరు సెంట్రీలను నియమించుతున్నాడనే అనుకున్నాను. కాని ఆ నల్లని ఛాయావిగ్రహాలు సెంట్రీల ఆకారాలు కావని మరు క్షణంలో గ్రహించాను. ఆ ఆకారాలను శ్రద్ధగా గమనించాను : మనుషులు గొలుసు మాదిరిగా ఒకరితరువాత ఒకరు నడుస్తున్నారు, గ్రూపులుగా నడవడం లేదు. ఆ ఛాయావిగ్రహాలను మరింత స్పష్టంగా గమనించేందుకని నేలమీద కూర్చున్నాను. అవును, గొలుసు మాదిరిగానే నడుస్తున్నారు, మనిషికీ మనిషికీ సమానమైన దూరం వుంది, ఆ మనుషులు నాకు చేరువగా వస్తూన్నకొద్దీ ఆ దూరం మరింత హెచ్చు అవుతూంది.

ఒక్క నిమిషమే—ఆ నిమిషం తరువాత, ఆ మనుషులు సరాసరి నా ఎదుటకొచ్చేశారు. నాకూ వారికీ వున్న దూరాన్ని చిరుచీకటి మూలానా సరిగా అంచనా కట్టలేకపోయాను. పీరు శత్రువులేనా ఏమిటి ? నేను లేచినుంచుని :

"ఎవరావెళ్తున్నది ?" అని కేకేశాను.

జవాబులేదు, నిశ్శబ్దం. ఆ మనుషులు నన్ను చుట్టుముట్టడం మొదలెట్టు తూన్నట్టు గమనించాను.

నేను మళ్ళీ కేకేశాను :

"ఎవరా వెళ్తున్నది ?"

"ఎవరునువ్వు ?"

"కమాండర్ని, కర్నల్ని."

"ఇలారా!"

కమాండరునే "ఇలారా!" అని ఆజ్ఞాపించడమంటే – స్పష్టంగానే అర్థమవుతూంది; వాళ్ళు బందిపోటు దొంగలని. నేను పిస్తలు తీశాను. పిస్తలు కాల్చాలను కునే లోపునే నాకేసి సబ్‌మెషీన్‌గన్ను బుల్లెట్ల రౌండ్లు వచ్చిపడ్డాయి–ఒకటి... రెండు. జర్మన్ భాషలో ఇచ్చిన ఆజ్ఞవినబడింది. నేనుపిస్తలుతో రెండుసార్లు కాల్చాను ఎవరో నేలకూలారు.

మా వాళ్ళు శత్రువుపై కాల్పులు జరిపారు. ఇది బాగానే వుండెను, కాని నేనుమాత్రం ముందునుండీ వెనుకనుండీ వస్తూన్న కాల్పుల నడుమ చిక్కుపడి పోయాను. నాకు ఐదుమీటర్ల దూరాన శత్రువులున్నారు, ఇరవై మీటర్ల దూరాన మా వాళ్ళున్నారు. వారూవీరూ పరస్పరం కాల్పులు సాగిస్తున్నారు. నా వైపు రివ్వురివ్వున బుల్లెట్లు ఎగురుతున్నాయి; ఒకటి నా టోపీని ఎగరగొట్టేసింది. నేను నేలపైన బోరగిల పడుతున్నాను. "నేను గనుక మా వాళ్ళదగ్గరికి పాకుతుంటూ వెళ్ళానంటే, నేను కదలడం చూసి నాజీలు నేనింకా బతికేవున్నానని గ్రహించి నా మీద కాల్పులు ఆరంభిస్తారు. తమవైపు ఎవడో పాకుతుంటూ రావడం చూసి మా వాళ్ళు నా మీద కాల్పులు మొదలెడతారు. ఏమిటి చేయడం?"–అని నేను తలపోశాను.

నన్నెవరో కాలు పట్టుకని లాగుతూన్నట్టు తటాలున అనిపించి, నేను వెనక్కి తిరిగిచూశాను–జర్మన్ హెల్మెట్టు పెట్టుకున్న ఓ మనిషి నా ఫర్‌బూట్లను గుంజి కాజేసేందుకు ప్రయత్నిస్తున్నాడు.నేను చచ్చిపోయిన శవాన్ని అనుకున్నాడా మనిషి. వాణ్ణి నేను పిస్తలుతో కాల్చేశాను

కాల్పులు ఇంకా సాగుతూనే వున్నాయి. పేలుడు బుల్లెట్టు ఒకటి నా ఓవర్‌కోటు కాలరుకున్న హోదాపట్టీని చీరేసింది. నా శక్తి అంతటితోనూ అరచాను :

"కాల్పులు ఆపండి!"

కాని మెషీన్‌గన్ను కాల్పుల చప్పుడులో నా గొంతు వినబడడం కష్టమైంది. నాకేక ఎవ్వరికీ వినబడలేదు. మళ్ళీ మరొకమాటు అరచాను :

"కాల్పులు ఆపండి! నేనూ – మెద్వెదెవ్‌ని!"

నా కేక విన్నారు! మా సైనికుల వరుసలు "కాల్పులు ఆపండి... కాల్పులు

ఆపండి... కర్నల్ ఉన్నాడక్కడ" అంటూ, నా ఆజ్ఞను ఒకదానికొకటి అందిచ్చాయి.

శత్రువు కురిపిస్తూన్న బుల్లెట్ల వర్షంలో నేను మావాళ్ళ దగ్గరకు పాకుకుని వెళ్ళాను. కంచెదగ్గర వున్న మావాళ్లు నన్ను పట్టుకుని లేవదీశారు, కాని నాకు సాయం అవసరంలేకపోయింది. ఈ అత్యంత ఉద్రిక్తపూరిత క్షణంలో నేను పూర్తిగా ఆరోగ్యంగా వున్నట్టే నాకనిపించింది, నేను ఎప్పట్లానే నాయకత్వం వహించాను.

కమాండాంట్ ప్లటూన్‌లోని ఒక గ్రూపు సైనికులతో కలసి షెవ్‌చూక్, స్త్రిలిన్‌స్కియ్, నొవాక్, గ్నెద్యూక్‌లు శత్రు పంక్తులపై విజృంభించి, సరాసరి కట్టెదుట వున్న శత్రువుపై కాల్పులు జరిపారు. చిట్టికోల్యా కంచెగోడకున్న ఒక దడి వెనుక దాగి, పారిపోతూన్న శత్రువుపై హఠాత్తు జల్లుల్లా బుల్లెట్లు కురిపించాడు.

త్సెస్సార్‌స్కియీ, ఇతర వైద్యసిబ్బందీ బసచేసివున్న గుడిసె స్టాఫ్ క్వార్టర్సుకి కుడివైపునా, మరింత బారుగా వున్న పొలాలమధ్యనూ వుంది. పోరాటం ఆరంభమైన మొట్టమొదటి గడియల్లోనే బందిపోటుదొంగలు ఆ గుడిసెలోకి చొరబడగల్గారు. త్సెస్సార్‌స్కియ్ తన మౌసర్ పిస్తలును పేల్చేలోపునే, రెండు గ్రెనేడ్లు ఒకదానివెంట ఒకటి అతడున్న గదిలో పేలాయి. త్సెస్సార్‌స్కియ్ ప్రమాదకరంగా గాయపడ్డాడు. మరొక ఇద్దరు డాక్టర్లూ, ఇద్దరు నర్సులూ కూడా గాయపడ్డారు. బందిపోటుదొంగలలో ఒకడు ఏదో ఆజ్ఞ ఇవ్వడం త్సెస్సార్‌స్కియ్ విని, అతడు:

"ఏయ్, కుర్రాళ్లూ, మనని చుట్టుముట్టేశారు! అడవిలోకి పారిపోదాం!" అని కేకేశాడు.

బందిపోటుదొంగలు ఇది విని, తమ కమాండరే తమను ఆజ్ఞాపించుతున్నాడనుకుని, పిక్కసత్తువ చూపించారు.

ఓ నలభై నిమిషాల తరువాత, సద్దుమణగి, మళ్ళీ నిశ్శబ్దం నెలకొంది. కాల్పుల చప్పుడు సుమారు రెండు కిలోమీటర్ల దూరంనుండి—మా మనుషులు శత్రువును వెంటతరుముతూవున్న చోటనుండి—వినబడుతూంది. శత్రువు ముప్పై శవాలను యుద్ధరంగంపై వదిలిపెట్టేశాడు.

నా ఓవర్‌కోటుకి పన్నెండు బుల్లెట్లు కన్నాలు పడ్డాయి, టోపీకి రెండు కన్నాలు పడ్డాయి, కాని నాకు మాత్రం వొళ్లు అయినా గీసుకుపోలేదు.

"ఈవేళ మీ రెండవ పుట్టినరోజండీ!" అన్నాడు నాతో నికొలాయ్ షుశ్రితిన్‌స్కీయ్, నా ఓవర్‌కోటుకీ, టోపీకి పడిన కన్నాలు లెక్కపెట్టుతూనూ.

నేను నడవలేక నడవలేక కాళ్ళు ఈడ్చుకుని నడుస్తూ, మెడికల్ కోర్ వున్న గుడిసెకి వెళ్ళాను. గాయపడిన త్సెన్సార్‌స్కీయ్‌కీ, అతని సహాయకులకూ కడమ డాక్టర్లు అప్పుడే కట్టుకట్టేశారు. డెంటిస్టుకి నఖశిఖపర్యంతమూ బేండేజీ కట్లే: గ్రెనేడ్ తునుకలు తగిలి అతని వొళ్ళు అంతటికీ గాయాలు తగిలాయి.

సుహేన్‌కొ నా దగ్గరకు వచ్చి:

"కామ్రేడ్ కమాండర్! దార్‌బేక్ అబ్ద్రియీమొవ్ మీతో మాట్లాడగోరుతున్నాడు" అని చెప్పాడు.

"ఏడీ, ఎక్కడున్నాడు?"

"పొరుగు గుడిసెలో వున్నాడు. అతడికి ప్రమాదకరమైన గాయం తగిలింది."

నేను అతణ్ణి చూడ్డానికి వెళ్ళాను.

"కమాండర్! బతికే వున్నావూ? గాయపడలేదూ?" అని అడిగాడు దార్‌బేక్ నన్ను చూడగానే.

"బతికేవున్నా, గాయపడలేదు."

"సంతోషం..."

అతడు చిరునవ్వు నవ్వుతూ చేయిచాచి, బలహీనంగా కరచాలనంచేశాడు. ఇటునుండీ అటునుండీ వస్తూండిన కాల్పులలో నేను చిక్కుకున్నప్పుడు వేసిన కేకను అతడు మొదట విని, నా వైపు దూసుకురాగా, మెషిన్‌గన్ను బుల్లెట్లు తగిలి అతడు గాయపడ్డాడు.

"నీ వంట్లో ఎలా వుంది?" అని దార్‌బేక్‌ని అడిగాను.

"ఏమీ బాగులేదు, కామ్రేడ్ కమాండర్!"

"దార్‌బేక్! అదేమిటామాట? నీ 'కజాఖ్ బావ'ను మమ్మల్నిహ తినొద్దంబావా ఏమిటి?" అన్నాన్నేను.

అతడేమీ జవాబుచెప్పలేదు. చిరునవ్వు నవ్వి వూరకున్నాడు.

మరికొద్ది గంటలకు అతడు చనిపోయాడు.

శత్రువు మళ్ళీ మరొకసారి దాడిచేస్తాడనే మేం అనుకుని, అందుకు సన్నాహాలు చేయసాగాం. నేను ఒక బండిలో కూచుని గ్రామమంచుట్టూ తిరిగి, అవసరమైన ఆర్డర్లన్నీ ఇచ్చాను. స్టాఫ్ క్వార్టర్స్ బసచేసిన గుడిసె యజమానీ, అతని భార్య అక్కడనుంచి అదృశ్యమై పోయారు.

"ఇది నిజంగా ప్రశాంతమైన గ్రామమే!" అన్నాన్నేను.

లుకీన్‌కి ఇప్పుడు అసలు సంగతంతా తెలిసింది. మేం బసచేసిన గుడిసె యజమాని ఆ గ్రామపెద్ద అనీ, అతడు దేశద్రోహి అనీ, మేము ఆ గ్రామంలో ప్రవేశించినట్టు అతడు నాజీలకు రిపోర్టుచేశాడనీ ఇప్పుడు స్పష్టమైంది

మరికొద్ది సేపటికల్లా శత్రు సైనికబలాలు దాడి ప్రారంభించాయి. కవచ శకటాలూ, టాంకులూ ప్రత్యక్షమయ్యాయి. పెద్ద కేలిబర్ మెషీన్‌గన్నూ, ఫిరంగులూ, మోర్టార్లూ రంగంలోకి దిగాయి.

ఆర్టిలరీ కాల్పులు ప్రారంభమైన మొదట్లోనే, గ్రామం పొలిమేరనున్న గుడిసెలు తగలబడ్డాయి. మేం ఎటువైపు వెళ్ళవలసి వుండెనో ఆ వైపునుండి, అనగా పడమటివైపు నుండి వచ్చారు నాజీలు, కాని గ్రామంలోకి చొరబడేందుకు మాత్రం జంకారు.

మా వద్ద మందుగుండు తక్కువగా వుంది, అందుకని సాయంకాలపు మునిచీకటిలో అక్కడనుండి వైదొలగేందుకు నిశ్చయించుకున్నాం. ఓ టక్కరి తనంచేసి మరీ అక్కడనుండి వైదొలగాం: మొట్టమొదట, డిటాచ్‌మెంటు వెళ్ళి పోయింది, ఒక కంపెనీని మాత్రం గ్రామంలో వుంచేసింది; ఈ కంపెనీ శత్రువుపై కాల్పులు సాగించుతూనే వుంది. తరువాత ఈ కంపెనీ వెళ్ళిపోయింది-ఒకప్లటూన్ని మాత్రం గ్రామంలో వుంచేసింది. ఈ ప్లటూను యుద్ధం సాగించింది. తరువాత ఈ ప్లటూనూ అక్కడనుండి జారుకుంది- జర్మన్లు మాత్రం వృధాగా కాల్పులు సాగించు తూనే వున్నారు

యుద్ధం జరిగిన తరువాత, మొదటి మజిలీలోనే లీద షెర్‌స్తన్యోవ ఒక రేడియో గ్రామును నాకు అందించింది మేం వెనక్కి తిరిగివెళ్ళి, ఎర్రసైన్యం ఏ స్థలంలోనైతే మాకు మిక్కిలి చేరువగా వుందో ఆ స్థలంలో ఎర్రసైన్యపు వెనుక భాగంలోకి వెళ్ళవలసిందని మా కమాండ్ పంపిన ఆజ్ఞ అది. అన్నిటికంటె మిక్కిలి చేరువ స్థలం మేం ఎక్కడైతే రోవ్నొ-యాత్స్కి రైల్వేలైను దాటామో ఆ స్థలమే అవుతుందని మేం వేసిన లెక్క ప్రకారం తేలింది. ఇప్పుడు డిటాచ్‌మెంటు వెనక్కి మళ్ళింది-వచ్చిన దారినే మళ్ళీ వెళ్ళింది.

ఫిబ్రవరి 6 ఉదయాన రోవ్నొ—లూత్స్క రైల్వేలైనుకు సుమారు మూడు వందల మీటర్ల దూరాన ఎర్రసైన్యపు కేవెల్రీ యూనిట్లు విడిసివున్న స్థానాలు మాకు ఎదురయ్యాయి. ఇది ఇంకా యుద్ధశ్రేణి కానేకాదు; జర్మన్ తిరోగమనాన్ని అడ్డం కొట్టేందుకని శత్రుసేనల వెనుక ప్రాంతంలోకి చొచ్చుకొనిపోయినట్టి మన సైన్యపు పురోగామి మొబైల్ యూనిట్లు మాత్రమే ఇవి. మోటార్ శకటాలతో తిరోగమించు తూన్న ఒక పెద్ద జర్మన్ సైనికుల కాలమ్ ఆ హైరోడ్డువెంట వస్తూందని తెలిసి, ఈ యూనిట్లు ఆ కాలమ్ కోసం హైరోడ్డుకి అడ్డంగా కాశాయి. జర్మన్లు హైరోడ్డు మీదనుండి వచ్చి, ఎర్రసైన్యపు యూనిట్లతో ఢీకొని, హైరోడ్డును వదలిపెట్టేసి చుట్టు తిరిగి మా డిటాచ్‌మెంటు విశ్రాంతి తీసుకుంటూన్న గ్రామం దిశగా వచ్చారు. పిరంగి గుండ్ల, మందుపాతరల పేలుడులకి గ్రామంలో ఇళ్ళకి నిప్పంటుకుంది. మేం అడవి లోకి పైదొలగి, అక్కడ స్థానాలు తీసుకుని కాల్పులు సాగించాం.

జర్మన్లు తమ సామాను బండ్ల వరుసను వదలిపెట్టేసి, మా ఎదుటనుండి మళ్ళీ పక్కకు తిరోగమించారు.

ఈ యుద్ధంలో మా మనుషులు ఎనమండుగురు మరణించారు, ఇదే మా కడపటి యుద్ధంకూడా. ఫిబ్రవరి 6 సాయంకాలం మేం రైల్వేలైను దాటి శత్రువు నుండి విముక్తి కాబడిన మాతృదేశపు గడ్డపై అడుగుపెట్టాం.

ఫిబ్రవరి చివరిరోజుల్లో ఒక అంబులెన్సు విమానం నన్ను మాస్కో తీసుకు వెళ్ళింది. చిట్టికోల్య, త్సెస్సార్‌స్కియ్‌లతో సహా క్షతగాత్రులు కూడా నాతోనే వచ్చారు. స్తెహొవ్ నాయకత్వాన డిటాచ్‌మెంటు అక్కడే వుండిపోయింది.

## కుజ్నెత్సోవ్ రాసిన వుత్తరం

...నేను ఒక మాస్కో హాస్పిటల్లో వున్నాను. నెలలతరబడిని పోరాటంతో నిండి ప్రమాదభరితమైన జీవితాన్ని సాగించిన తరువాత, ప్రశాంత నిశ్చల వాతావరణాన్ని ఇప్పుడు అనుభవించుతున్నాను. కాల్పుల చప్పుడు వినబడ్డంలేదు, మనుషులు ఎదురుపడడంలేదు. వార్డుకి అప్పుడప్పుడు వస్తూన్న డాక్టర్లూ, నర్సులూ మాత్రమే అవుపడుతుంటారు. ఒంటరిగా వుండటం నాకు అలవాటులేక నాకదేమిటో దిగులుగా వుంటూండేది. ఏరోజు కారోజు తాజాపత్రికలు, బేటరీలు ఎక్కడ అయిపోతాయో అనే బెంగలేకుండా రేడియో వినే అవకాశం—ఇవే నాకు ఊరటకల్గించేవి. శత్రుశ్రేణి వెనుకప్రదేశాల్లో మేం గడిపిన జీవితాన్ని స్వల్పవివరాలతో సహా రోజుల తరబడి జ్ఞప్తికి తెచ్చుకునేవాణ్ణి, ఇలా జ్ఞప్తికి తెచ్చుకున్నప్పుడు, అదేమిటో చిత్రమని

పించేది—అప్పుడు, యుద్ధం జరుగుతూన్నప్పుడు, నిరర్థకములనిపించిన కొన్ని విషయాలు, ఇప్పుడు, నా నాయకత్వం గురించి నేను నా మనసులో బేరీజు వేసుకున్నప్పుడు, ఎంతో ప్రధానమైనవిగా కనబడ్డాయి.

రైల్వేల కార్యకలాపాలు; శత్రు హెడ్‌క్వార్టర్సుల, సైనికబలాల, ఆయుధ సామగ్రుల చలనాలు; ఆక్రమణ అధికారుల చర్యలు; ఆక్రమిత ప్రాంతంలోని పరిస్థితులు— వీటి గురించి బోలెడంత విలువైన సమాచారాన్ని మా కమాండ్‌కు అందించాం. శత్రువుతో మేం చేసిన యుద్ధాల్లోనూ, పోరాటాల్లోనూ ఇంచుమించు పన్నెండువేలమంది శత్రు ఆఫీసర్లనూ, సైనికులనూ మేం నాశనంచేసివేశాం. ఈ సరిపోల్చినట్టయితే మా నష్టాలు స్వల్పమే : ఆ కాలమంతటిలోనూ మా హతులసంఖ్య నూటపది, గాయపడినవారి సంఖ్య రెండువందల ముప్పై. మా జిల్లాలలో, నాజీలపై క్రియాశీలంగా ప్రతిఘటన సాగించేందుకు అక్కడ నివసించుతూన్న సోవియట్ ప్రజలను మేము సంఘటితపరిచాం. మిలిటరీ రైళ్ళనూ, రైల్వే వంతెనలనూ పేల్చివేశాం, నాజీ ఎస్టేట్లనూ, వ్యాపార సంస్థలనూ, గిడ్డంగులనూ ధ్వంసంచేసి వేశాం, శత్రువుయొక్క మోటారు రవాణా వసతులను నాశనం చేయగల్గినంతవరకు నాశనం చేసివేశాం, లేదా నష్టపరచగల్గినంతవరకు నష్టపరచాం, ఆక్రమణదార్ల మొనగాళ్ళను వధించాం.

నికొలాయ్ కుజ్నెత్సోవ్‌ను రోజుకి పెక్కుసార్లు తల్చుకున్నాను. అతడు ఎక్కడున్నాడో ? ఏంచేస్తున్నాడో ? వాళ్ళను కలుసుకున్నాడో లేదో ?

ఒకనాడు అతనిగురించి కబురు తెలిసింది.

హెడ్‌ఫోన్సు తగిలించుకుని పక్కమీద పడుకుని తాజా రేడియో వార్తలు వింటున్నాను. పదినిమిషాలు తక్కువ పన్నెండుకి విన్నాను వార్త.

"స్టాక్‌హోమ్. ల్వోవ్ పట్టణపువీధుల్లో పట్టపగలు జర్మన్‌యూనిఫారంలో వున్న ఒక వ్యక్తి గెలీషియా డిప్యూటీ గవర్నరైన డాక్టర్ బౌవర్‌నూ, ష్నయ్‌డర్ అనే ఉన్నతోద్యోగినీ హత్యచేశాడు. హంతకుడు దొరకలేదు—అని 'ఆఫ్టన్‌బ్లాడెట్' దినపత్రిక రిపోర్టుచేసింది."

పడుకున్నవాణ్ణల్లా లేచి కూర్చుందుకు ప్రయత్నించా, కాని బాధవల్ల కూర్చోలేకపోయాను. చేయిచాచి గంట బటన్ నొక్కా.

ఇదంతా ఏమీ అవసరంలేకపోయింది: నే నెవ్వరినీ పిలువకుండా వుండాల్సింది.

నర్సువచ్చింది.

"తలనొప్పిగా వుంది పిరమిదోన్ టాబ్లెట్లు ఇవ్వండి. దయచేసి" అన్నాను.

"ఇప్పుడే పట్టుకొస్తానండి!"

నే నావార్త ఇక్కడ ఎవరితో చెప్పేది గనుక!

అయితే, ఉజ్నెత్సోవ్ "దొరకలేద"న్నమాట! ఆ పని చేసినవాడు అతడే, అందుకు సందేహంలేదు. ఏమంటే, ఆనాడు గుర్రాలను కట్టి లాగించిన కారులో అతనూ, మేమూ కూర్చుని ఈ విషయం గురించే మాట్లాడుతున్నాం. కాని ఉజ్నెత్సోవ్ ల్వోవ్‌లో గడపిన కాలం గురించి వివరాలు ఆరు నెలలుగడచినతరువాత మాత్రమే నాకు తెలిశాయి.

ఆనాడు నేను ల్వోవ్ పట్టణానికి పంపిన మొబైల్ గ్రూపు మనుషులు క్రూతికొవ్, ద్రొజ్‌దోవ్, పస్తుహోవ్‌ల గురించి మాకు కబురు తెలిసింది. మొబైల్ గ్రూపు మనుషులందరూ హతులై వుంటారనే డిటాచ్‌మెంటులో మేం అనుకున్నాం. కాని అలా జరగలేదు.

గెలీషియా సరిహద్దులో జర్మన్లు మాటుకాసి ఈ గ్రూపుపై దాడిచేశారు. ఇరవై మందిలోనూ ఏడుగురు మరణించారు గ్రూపు కమాండరు క్రూతికొవ్ గాయపడ్డాడు. రేడియో ఆపరేటరు నేలకొరిగాడు అందుకని ఆ గ్రూపుతో మాకు సంబంధం తెగిపోయింది ఆ గ్రూపు మరికొంత దూరం వెళ్ళిన తరువాత జరిగిన ఒక పోరాటంలో ద్రొజ్‌దోవూ, ప్రిస్తూప అనే మరొక గెరిల్లా తమ గ్రూపు నుండి విడిపోవడం తటస్థించింది. కడమవారు మాత్రం తమ గమ్యస్థానం ఎలాగో చేరుకున్నారు

ఆ పట్టణాన్ని బాగా ఎరిగిన పస్తుహోవ్, కొవెల్యాత్స్కియ్‌లు ఆ పట్టణంలోనే వుండిపోయి, తమ పనులు సాగించారు. ల్వోవ్ రైల్వేస్టేషన్ని రెకన్నాయిటర్ చేశారు, పట్టణంలోని భూగర్భ సొరంగాలను గురించి రోజుల తరబడి సమాచారం సేకరించారు. 1944 జూలై 20న ఎర్రసైన్యం ల్వోవ్‌ను సమీపించినప్పుడు

పస్తుహోవ్, కొవెల్యాత్స్కియ్‌లు ఈ భూగర్భ సొరంగాలగుండా పట్టణాన్ని వదిలి పెట్టి, 88వ సేనతాలూకు స్కౌట్లను కలుసుకుని, దుర్గనిర్మాణాల పంక్తి, మందు పాతరల క్షేత్రాలు, మోర్టారూ ఆర్టిలరీ బేటరీల స్థానాలు, సైనికబలాల మోహరింపు మందుపాతరలు పెట్టిన కట్టడాలూ గుర్తుపెట్టి వున్న పట్టణపు మ్యాపును వారికిచ్చారు. ఆటుతరువాత పస్తుహోవ్, కొవెల్యాత్స్కియ్‌లు ఒక పెద్ద గ్రూపు ఎర్రసైనికులను భూగర్భ సొరంగాల గుండా మందుపాతరల క్షేత్రాలపక్కగా, వూరి మధ్యకు తీసు కెళ్ళారు. ఈ ఎర్రసైనికుల గ్రూపు నాజీలవెనుక భాగంపైదాడిచేసింది. పస్తుహోవ్ కొవెల్యాత్స్కియ్‌లు ఈ పోరాటంలో పాల్గొన్నారు.

క్రూతికొవ్ గ్రూపునుండి విడిపోయిన ద్రొజ్‌దోవ్, ప్రిస్తూపలు స్థానిక వాసులలోనుండి ఒక గెరిల్లా డిటాచ్‌మెంటును ఆర్గనైజు చేశారు. పస్తుహోవ్, ద్రొజ్ దోవ్‌లు కుజ్నెత్సోవ్‌ను చూశారుకూడా. కుజ్నెత్సోవ్‌ను పస్తుహోవ్ లోవ్యలో చూశాడు, కుజ్నెత్సోవ్‌ను ద్రొజ్‌దోవ్ ఒక అడవిలో చూశాడు. వారు ఇలాచెప్పారు:

గెలీషియా డిప్యూటీ గవర్నర్ బౌవర్ స్థానిక జర్మన్ ప్రభుత్వపు ఉన్నతాధికారులతో సమావేశం జరుపుతాడనీ, ఈ సమావేశం థియేటరులో జరగ బోతుందనీ కుజ్నెత్సోవ్‌కి తెలిసింది. సమావేశం జరుగుతూండగా కుజ్నెత్సోవ్ ఏదో ఒక విధంగా ఆ సమావేశ మందిరంలోకి ప్రవేశించగల్గాడు. అధ్యక్షవర్గంలో కూచున్న బౌవర్‌ను అతడు జాగ్రత్తగా కనిపెట్టిన తరువాత, అతడు అక్కడనుంచి బయటికి వచ్చేసి, థియేటరు దగ్గరే కనిపెట్టుకుని నుంచున్నాడు. సమావేశం అయి పోయింది. థియేటరులోనుంచి జర్మన్లుబయటికివచ్చేస్తున్నారు. బౌవర్ తన సెక్రెటరీతో కలిసి థియేటరునుండి బయటికి వచ్చి, అక్కడ హాజరుగా వున్న కారులో ఎక్కి వెళ్ళిపోయాడు. కుజ్నెత్సోవ్ తన కారులో కూచుని, బౌవర్ కూచుని వెళ్తూన్న కారు వెంబడే తన కారు వెళ్ళనిచ్చాడు. బౌవర్ ఎక్కడ నివసించుతున్నాడో కుజ్నెత్సోవ్ తెలుసుకున్నాడు.

మర్నాడు కుజ్నెత్సోవ్ తన కారులో కూచుని; ఇవాన్ ఫ్రంకో వీథిలో వున్న బౌవర్ ఇంటిపక్క నుండి వెళ్తూండగా, అతని కారు ఆ ఇంటిపక్కనే తటాలున "చెడిపోయింది." బెలోవ్ కారులోనుంచి బయటకువచ్చి, ఇంజను మరమ్మతు మొదలుపెట్టాడు. కుజ్నెత్సోవ్‌కూడా కారులోనుంచి దిగి, డ్రైవరుని జర్మన్ భాషలో బిగ్గరగా చివాట్లు పెట్టసాగాడు:

"కారుకి అస్తమానూ ఏదో ఒకటి వస్తూనేవుంది। బద్ధకం బలిసిపోతూం దయ్యా మీకు, కారు గురించి తాపత్రయమే లేదు కదా. మీ సోమరిపోతుతనం మూలాన నాకు ఆలస్యమైపోతూంది..."

ఇంకా అలాచివాట్లు పెట్టుతూనే, వీథిఎదుటివైపు ఓ కన్ను వేసి జాగ్రత్తగా కనిపెట్టసాగాడు. ఎదుటి వరుసలోవున్న ఒక అందమైన సౌధంఎదుట ఒక చక్కని కారువుంది.

ఆ సౌధంలోనుండి సరిగా ఉదయం పదిగంటలకు ఇద్దరు వ్యక్తులు వచ్చి, కారుదగ్గరకు వెళ్ళారు. కారులో కూచునున్న డ్రైవరు కారులోనుంచి చప్పున దిగిపోయి, వినయ విధేయతలతో కారు తలుపు తెరచాడు. అచ్చంగా ఆ వేళకే కుజ్నెత్సోవ్ ఆ కారును సమీపించి:

"డాక్టర్ బౌవర్ మీరేనా?" అని వారిద్దరిలో ఒకరిని అడిగాడు.

"అవును, బౌవర్ని నేనే."

"అయితే, నాకు కావలసినవారు మీరే।" అన్నాడు కుజ్నెత్సోవ్.

అలా అని, కొద్దిసార్లు తన పిస్టల్ కాల్చి, బౌవర్నీ అతని సెక్రెటరీని హత్యచేసేశాడు. ఆ వెనువెంటనే కుజ్నెత్సోవ్ తన కారుకేసి దూసుకుపోయాడు. ఈ లోపున కమీన్స్కియ్, బెలోవ్లు ఆ సౌధం ఎదుట పహరా కాస్తూన్న సెంట్రీని తుపాకితో కాల్చేశారు.

డార్గెల్ ఉదంతాన్ని కుజ్నెత్సోవ్ జ్ఞాపకంపెట్టుకుని, ఈసారి పొరపాటు చేయకుండా వుండేందుకని, బౌవర్ పేరు అడిగేందుకు నిశ్చయించుకున్నట్టుంది బహుశ.

ఆ కారు ల్వోవ్ వీథులగుండా అమితవేగంతో దూసుకుపోయి, వూరు దాటిపోయింది. ల్వోవ్నుండి సుమారు ఇరవై కిలోమీటర్లు వెళ్ళేసరికి, కూరొవ్త్సి గ్రామం దగ్గర సాయుధ పోలీసులు కారుని ఆపారు. కుజ్నెత్సోవ్ చూపెట్టిన డాక్యుమెంటుని గెస్టాపోలు చాలా సేపు తనిఖీచేశారు. కారులోవున్న వారికేసి శ్రద్ధగా పరిశీలనగా చూశారు; ఇంకా అదనపు డాక్యుమెంట్లను చూపెట్టవలసిందని డిమాండు చేశారు. ఇక అక్కడ అట్టేసేపు ఆగితే కొంప మునుగుతుందని కుజ్నెత్సోవ్

గ్రహించి, తెరచివున్న కారు కిటికీలోనుంచి తన సబ్‌మెషీన్‌గన్నుతో టపటప కాల్పులు కాల్చాడు. ఆ కాల్పులకి గెస్టాపొ మేజరూ, నలుగురు సాయుధ పోలీసులూ చచ్చిపోయారు.

తమ కారుని వెంబడించుతూ ఇతర కార్లు హైరోడ్డు మీదనుండి వస్తూన్నట్టు మనవాళ్లు కనిపెట్టారు. బెలోవ్ కారును జోరుమీద పోనిచ్చాడు: స్పీడామీటరు 100 110,120 కిలోమీటర్లు చూపుతూంది. ఇహప్పుడు చిక్కొచ్చి పడింది: పెట్రోలు అయిపోయింది. కుజ్నెత్సోవ్, కమీన్‌స్కియ్, బెలోవ్‌లు కారులోనుండి గంతేసి, అడవిలోకి పారిపోయారు. అది గనోవిచ్‌స్కియ్ అరణ్యం. ఆ అరణ్యంలో మీరు మూడు రోజులు తిరుగుతూ తిరుగుతూ వుండగా వారికి ద్రొజ్‌దోవ్ డిటాచ్‌మెంటు అవుపడింది. కాని ద్రొజ్‌దోవ్ దగ్గర ట్రాన్స్‌మిటర్ లేదు, జర్మన్ యూనిఫారంలోనే వున్న కుజ్నెత్సోవూ, అతని కామ్రేడ్లూ ఎర్రసైన్యపు వెనుక భాగాన్ని చేరుకుందుకని యుద్ధశ్రేణిదిశగా వెళ్ళారు.

ఇంతకు మించి కుజ్నెత్సోవ్ గురించి పస్తుహోవ్‌కి కాని, ద్రొజ్‌దోవ్‌కి కాని మరేమీ తెలియదు. ఇక ఈలోపున ఎన్నో రోజులు గడిచిపోయాయి.

అతనిగురించి కడపటి సమాచారం ల్వోవ్ పట్టణపు గెస్టాపొ పత్రాల నుండి మాకు తెలిసింది. గెస్టాపొ ఆఫీసులో మేం స్వాధీనం చేసుకున్న కాగితాలను పరిశీలించుతూండగా, గెస్టాపొ బెర్లిన్‌కు పంపిన ఒక అర్జంటు టెలిగ్రాం నకలు మాకు దొరికింది. అందులో ఇలా వుంది:

"1944 మార్చి 2 న సాయుధ పోలీసు డిటాచ్‌మెంటు ముగ్గురు సోవియట్ పారషూటిస్టులను ఒక అడవిలో పట్టుకుంది. వారిదగ్గర ఫోర్జరీచేయబడిన జర్మన్ డాక్యుమెంట్లూ, మ్యాపులూ, జర్మన్, పోలిష్, ఉక్రెయినియన్ వార్తాపత్రికలూ దొరికాయి. ఆ పత్రికలలో డాక్టర్, బౌవర్, డాక్టర్ ష్నెయిడెర్, మరణాలపై సానుతాపోపన్యాసం ప్రకటించబడిన 'గజ్యేత ల్వోవ్‌స్కా' వార్తాపత్రిక సంచికవుంది. పట్టుబడినవారిలో ఒకడు తన కార్యకలాపం గురించి తాను రాసిన రిపోర్టు కూడా వుంది. ఈ ఏజంటుని (జర్మన్ డాక్యుమెంట్లప్రకారం ఇతడి పేరు పాల్ సీబెర్ట్) గుర్తుపట్టడమైంది. ఇతడు సోవియట్ గెరిల్లా- రోవ్నోలో శిక్షపడకుండా తన కార్యకలాపాన్ని బహుకాలంగా సాగించుతూ హత్యలను, అందునా ప్రత్యేకమూ

డాక్టర్ ఫుంక్ హత్యనూ, అపహరణలనూ, అందునా ప్రత్యేకమూ జనరల్ ఇల్‌గెన్ అపహరణనూ సాగించిన గూఢచారీ, విధ్వంసకుడూనూ. ల్వోవ్‌లో 'సీబెర్ట్' గవర్నర్ వేక్టర్‌ను తుపాకితో కాల్చి హత్యచేసేందుకు పథకంవేసు కున్నాడు. ఇది అతడికి సాధ్యపడలేదు. గవర్నర్‌కు బదులుగా డెప్యూటీ గవర్నర్ డాక్టర్ బౌపర్‌నూ, అతని సెక్రటరీ డాక్టర్ ష్నయిదర్‌నూ హత్యచేశాడు. ఈ ఇద్దరు జర్మన్ ఉద్యోగులూ తమ బసలకు చేరువగా తుపాకికాల్పులకు గురి అయి చనిపోయారు. ఈ హత్య స్వల్పాతిసల్ప వివరాలన్నిటితోనూ 'సీబెర్ట్' రాసిన రిపోర్టులో వర్ణించబడింది."

" 'సీబెర్ట్' ల్వోవ్‌లో బౌవర్‌నీ, ష్నయిదర్‌నే కాకుండా, మేం చాలా కాలంగా వెతకుతూన్న సాయుధ పోలీస్ ఫీల్డ్‌మేజర్ కాచెర్‌నూ, ఇంకా ఇతర వ్యక్తులనేకులనూ తుపాకితో కాల్చి హత్యచేశాడు."

"ఈ హత్యలు జరిగిన స్థలాలూ, కాలాలూ గురించీ, హతులకు తగిలిన గాయాలను గురించీ, వశపరచుకొనబడిన ఆయుధాలను గురించీ, యింకా యితరము లను గురించీ ఆ రిపోర్టులో పేర్కొనబడిన వివరాలు సరిగానే ఉన్నట్టు కనబడు తూంది. 'పౌల్ సీబెర్ట్'నూ, అతని యిద్దరు కుమ్మక్కుదార్లనూ తుపాకులతో కాల్చి వేసినట్టు ప్రిట్‌మన్ సైనిక గ్రూపునుండి రిపోర్టు అందింది."

జర్మన్ ఆక్రమిత ప్రభుత్వ ప్రతినిధులను అపూర్వ సాహసంతో నాశనంచేసినట్టీ, మృగప్రాయులైన మన మాతృదేశ శత్రువుల శ్రేణులలో కం పరము పుట్టించినట్టీ మన సహయోధుడు నికొలాయ్ కుజ్నెత్సోవ్ ఈ విధంగా మర ణించాడు.

కుజ్నెత్సోవ్ మరణవార్త తెలిసిన తరువాత కొందరు కామ్రేడ్లూ, నేనూ అతడు రాసిన ఉత్తరం విప్పాం. ఆ ఉత్తరంలో యిలా ఉంది :

"నా మరణానంతరం దీనిని విప్పవలెను. కుజ్నెత్సోవ్.

"1943 జూలై 24. జర్మన్ ఆక్రమణదార్లు మోపిన గాటకింద క్రుంగి, దుఃఖంతో మూల్గుతూన్న మన తల్లులూ, అన్నదమ్ములూ నెత్తురునూ కన్నీటినీ కార్చినందుకు శత్రువుపై నిర్దాక్షిణ్యంగా పగ సాధించేందుకై నేను శత్రుశ్రేణి వెనుక

ప్రాంతంలో అడుగుపెట్టి రేపటికి పదకొండు నెలలు పూర్తి అవుతుంది, 1942 ఆగస్టు 25న, 24 గంటల 05 నిమిషాలకు పారషూట్‌తో అక్కడ దిగాను.

పదకొండు నెలలపాటు శత్రువును అధ్యయనంచేశాను. జర్మన్ యూనిఫారాన్ని ఉపయోగించి, సర్వోన్నత మండలాధిపతి, ఉక్రైనియాలో జర్మన్ కంటకుడూ అయిన ఏరిక్ కోఖ్ దయ సంపాదించి అతని సమక్షానికి తోల్పుకువెళ్ళాను.

ఇప్పుడు కార్యానికి దిగుతున్నాను.

జీవితమంటే నాకు ప్రేమ, నేనింకా యువకుణ్ణి. కాని, కన్నతల్లిని ప్రేమించినట్టుగా నేను ప్రేమించుతూన్న నా దేశంకోసం నా జీవితాన్ని త్యాగం చేయడం అవసరమైన పక్షంలో అందుకు నేను సిద్ధమే. రష్యన్ దేశభక్తుడూ, బోల్‌షెవికూ ఎంతటి సమర్థవంతుడో ఫాసిస్టులు తెలుసుకొందురుగాక. సూర్యుణ్ణి రూపుమాపడం ఎంత అసాధ్యమో, మన ప్రజను లొంగదీయడమూ అంత అసాధ్యమే అని వారు తెలుసుకొందురుగాక.

నేను మరణించవచ్చుగాక, కాని నా ప్రజల స్మృతిలో దేశభక్తులు అమరులు.

'నువ్వు చనిపోవు, నిజమే! కాని జడుపు ఎరగని దిటవు గుండెలనుండి వెడలే పాటలో నువ్వు ఎల్లప్పుడూ సజీవమైన ఉదాహరణగా, స్వాతంత్ర్యానికి వెలుగుకూ సగర్వమైన పిలుపుగా వుంటావు!...'

గోర్కీ రచనలలో నాకు ప్రియతమమైన వాక్యమిది. దీనిని మన యువకులు మరింత తరుచుగా పఠింతురుగాక.

మీ

కుజ్నెత్సోవ్."

* * *

1944 నవంబరు 5న, సోవియట్ యూనియన్ సుప్రీమ్ సోవియట్

ఆజ్ఞప్రకారం 'సోవియట్ యూనియన్ వీరుడు' అనే బిరుదు నికొలాయ్ కుజ్నె త్సోవ్‌కి మరణానంతరం బహూకరించబడింది.*

## ఉపసంహారం

"ఈ మనుషులం మనమే? ..." అన్నాడు లుకిన్ ఆశ్చర్యంతో, ఫ్రొలోవ్, త్సెస్నార్‌స్కియ్, తనూ నన్ను మాస్కోలో చూడ్డానికి వచ్చి, మాగెరిల్లా జీవితాన్ని జ్ఞాపకం తెచ్చుకుని కబుర్లు చెప్పుకుంటూన్నప్పుడు.

ఈనాడు సివిలియన్ దుస్తులు తొడుగుకొని, సౌఖ్యమైన ఇంట్లో కూచుని శాంతియుత కార్యకలాపంలో సంపూర్ణంగా నిమగ్నులమైన మేమేనా ఆ మనుషులం నిజంగానే? అనేక యుద్ధాలు చేసి, అత్యంత సాహసకార్యాలను సాగించినవారం మేమేనా? రోగపీడితులమై, క్షతగాత్రులమై, క్షుద్భరమైన నడక, మరిగించిన మంచి నీరూ గురించి ఆలోచించుకోకుండా బురదతోనూ గతుకులతోనూ నిండిన రోడ్లపై నాటుబండ్లలో ప్రయాణించిన మనుషులం మనమే? ... మనం కామేమో – ఒకవేళ? మనలో ప్రతి వొక్కరిలోనూ ఎంతటి ప్రాణ, ఎంతటి ఉల్లాసమూ ఉండెనో కదా!

---

* నికొలాయ్ కుజ్నెత్సోవ్, అతని కామ్రేడ్ల మరణం గురించి బయట పడిన నూతన విషయాలు సోవియట్ పత్రికలలో ప్రచురించబడ్డాయి.

ఈ కొత్త సంగతులనుబట్టి, కుజ్నెత్సోవ్, కమీన్‌స్కియ్, బెలోవ్‌లు యుద్ధశ్రేణిని సమీపించేందుకు ప్రయత్నించినట్లూ, మార్చి 1వ తేదీని ఒక గ్రామానికి వెళ్ళినట్లూ, తెలిసింది. గెరిల్లాలు ఇక్కడ ఒక ఉక్రైన్ జాతీయవాద బందిపోటు దొంగల గ్రూపుతో తలపడి, అసమానమైన భీషణయుద్ధంలో నేలకొరిగారు.

గెరిల్లాల మృతశరీరాలను నాజీలు సోదాచేయగా, కుజ్నెత్సోవ్ రాసిన నివేదిక – తాను మరణించిన పక్షమందు, ముందుగానే తాను ఎర్రసైన్యపు హైకమాండుకు రాసివుంచిన రిపోర్టు–వారికి దొరికింది. జర్మన్ ఆఫీసరుగా చెలామణి అయిన పౌల్ సీబెర్ట్ వాస్తవానికి సోవియట్ స్కౌట్ అని నాజీ గూఢచారి శాఖకి అప్పుడు మాత్రమే తెలిసింది.–సం.

ఈనాడు ఇదంతా "పాత చరిత్ర" అయిపోయింది.

నా గెరిల్లా కామ్రేడ్లు సోవియట్ యూనియన్ నలుదిక్కులా చెదరి పోయారు. కొందరు తన వెనుకటి ఫ్యాక్టరీలకూ మిల్లులకూ, కొందరు తమ వెనుకటి సమిష్టి క్షేత్రాలకూ వెళ్ళిపోయారు, మరికొందరు చదువుకుందుకని ఇన్‌స్టిట్యూట్లకూ, ఉన్నతపాఠశాలలకూ వెళ్ళిపోయారు. గెరిల్లాలలో, అధికసంఖ్యాకులు యుద్ధంముందు తాము నివసించినట్టి, యుద్ధకాలంలో మా డిటాచ్‌మెంటు పనిచేసినట్టి ప్రాంతాల్లోనే వుండిపోయారు అందరూ శాంతియుత కార్యాలలోనే నిమగ్నులై, యుద్ధానంతరం బ్రహ్మాండస్థాయిలో జరుగుతూన్న నిర్మాణకార్యానికే తమ విజ్ఞానాన్నీ, శక్తినీ అర్పించుతున్నారు.

నా గెరిల్లా కామ్రేడ్ల దగ్గరనుండి నాకు తరచు వుత్తరాలు వస్తూంటాయి. వారు తమ సొంత పనులపై అప్పుడప్పుడు మాస్కో వస్తూంటారు, వచ్చినప్పుడల్లా తప్పకుండా నన్ను చూడ్డానికి వస్తారు. ఆ కారణంచేత వారిలో చాలామందిని గురించి వారు ఎక్కడ వుంటూన్నదీ, ఏమి చేస్తూన్నదీ, నాకు తెలుస్తూ వుంటుంది

1946 లో వాల్యా నన్ను చూడ్డానికని మాస్కో వచ్చింది ఆమె అత్యంత కఠిన పరీక్షలను ఎదుర్కొనవలసి వచ్చింది. మేము విముక్తప్రాంతాలకు చేరి అప్పుడే కొంతకాలం అక్కడ గడుపుతూండిన రోజుల్లో, ఆమె మాత్రం గెస్టాపొ చేతుల్లో ఘోరమైన చిత్రహింసలు అనుభవించుతూంది. "పౌల్ సీబెర్ట్" ఎక్కడ వున్నదీ, సాంకేతిక స్థలాల చిరునామాలూ, మా కామ్రేడ్ల పేర్లూ చెప్పవలసిందని ఆ హంతకులు ఆమెను బాధించారు. వాల్యా నోరు మెదపలేదు. జర్మన్లచే హత్యచేయబడి నెత్తుటి మడుగుల్లో మునిగితేల్తూన్నట్టి సోవియట్ ప్రజల మృతకాయాలున్న నేలమాళిగల్లోకి ఆమెను తోసివేసి తాళంవేసేశారు. తుపాకి కాల్పులకు బలిపెట్టుతామని ఆమెను తీసుకువెళ్ళారు. పందొమ్మిదేళ్ళకే చనిపోవడమంటే ఎంత ఘోరమో కదా! అయినప్పటికీ వాల్యా అన్ని బాధలూ భరించిందేగాని, నోరుమాత్రం విప్పలేదు. ఏమైనా సరే వాల్యానుంచి కూపీ లాగాలనే ఉద్దేశంతో, ఆమెను ల్వోవ్‌కి అక్కడనుండి పశ్చిమ జర్మనీకి బదిలీచేశారు.

విజయ దినాన వాల్యా ఒక జర్మన్ కాన్సెంట్రేషన్ క్యాంపులో ఖైదీగా వుంది. అక్కడ నుండి ఆమె స్వదేశానికి తిరిగివచ్చింది.

తెరేన్ఠియ్ నొవాక్, బొరిస్ క్రూతికొవ్, మా మాజీ స్కౌటువలెన్‌టిన్ సెమ్యోనొవ్, ఇంకా దజన్ల కొద్దీ ఇతర కామ్రేడ్లు విద్యాలయాల్లో ప్రవేశించారు.

రేడియో ఆపరేటరు మరీన కిహ్ తన స్వస్థలం ల్వోవ్ పట్టణానికి తిరిగి వెళ్ళిపోయింది. తన చదువు తిరిగి ప్రారంభించింది.

"ఒక సంతోషకరమైన వార్తను మీకు తెలియజేసేందుకు తొందరపడు తున్నాం. మన మరీన కిహ్ ఉక్రైనియా సుప్రీమ్ సోవియట్‌కు సభ్యురాలుగా ఎన్ను కోబడింది." అని మా మాజీ గెరిల్లాలు ల్వోవ్‌నుండి నా పేర రాశారు.

యుద్ధం ముగిసిన తరువాత చిట్టి కోల్యా స్కూల్లో ప్రవేశించాడు, తరువాత మోటార్ మెకానిక్ అయ్యాడు. అతడిప్పుడు చిట్టి కోల్యా కానేకాడు, తన కమాండరు కంటె పొడుగ్గా వున్నాడు. తన ప్రథమశ్రేణి గెరిల్లా పతకాన్ని అతడు సగర్వంగా ధరిస్తాడు.

కోల్యా యుద్ధకాలపు నేస్తం, వొలోద్యా, ఇప్పుడు తండ్రిదగ్గర వుంటు న్నాడు. స్కూలు చదువు పూర్తిచేస్తున్నాడు.

1946 మే నెలలో, సోవియట్ యూనియన్‌లో నివసించుతూన్న పోలిష్ దేశభక్తుల కేంద్రసంఘం, గ్రిన్‌స్పాన్ అనే ఒక పోలిష్ స్త్రీ నుండి వారికి అందిన వుత్తరాన్ని నాకు పంపించింది. ఆ వుత్తరంలో, "తుపాకి కాల్పులను తప్పించు కున్నట్టి, వదంతులననుసరించి మెద్వెదెవ్ డిటాచ్‌మెంటుచే రక్షించబడి విమానంలో మాస్కోకు పంపబడినట్టి తన కుమారుని గురించి సమాచారం తెలుపవలసింది'' అని ఆమె కోరింది.

పీన్య కోసం మేం వెతకనవసరం లేకపోయింది. ఆ కుర్రవాడు మాస్కోకు చేరువనున్న ఒక అనాథశరణాలయంలో వున్నాడని మేం ఎరుగుదుం గనుక, ఆ అనాథశరణాలయపు చిరునామాను ఆమెకు తెలియజేశాం. ఏనాడో చనిపోయాడని తను నమ్మిన కొడుకును ఆమె ఇప్పుడు కలుసుకుంది.

ఆల్బెర్ట్ త్సెస్సార్‌స్కియ్ తన వెనుకటి వృత్తిని వదిలిపెట్టి వేరొక వృత్తిని చేపట్టాడు : అతడిప్పుడు రంగస్థలనటుడు. మా గెరిల్లా డిటాచ్‌మెంటులో వున్నప్పుడే, అతడు రంగస్థలం గురించి కలలు కంటూండేవాడు.

త్సెస్నార్‌స్కీయిచే అవయవచ్ఛేదం చేయబడి కాలు తీసివేయబడిన నికొలాయ్ ఫదేయెవ్ మోల్దావియాలో ఒక రోలింగ్ మిల్లుకి డైరెక్టరుగా వున్నాడు. 1946 చలికాలంలో అతడు నన్ను చూడ్డానికి వచ్చాడు.

"పరిస్థితులు గడ్డుగా వున్నాయి, కామ్రేడ్ కమాండర్! మా మిల్లుకి ఇంచుమించు పనేలేదు. పంటల్లేవు, చినుకులేక అంతా ఎండిపోయింది" అన్నాడతడు.

"మరగాలు ఎలా వుంది ? దానివల్ల చికాకేమీ లేదుకదా ?"

"బాగా అలవాటైపోయింది! అది నా కాలే అనుకుంటూంటాను!"

1947 సెప్టెంబరులో అతనిదగ్గరనుంచి నాకు ఉత్తరం వచ్చింది: "మిల్లులో పని ముమ్మరంగా సాగుతూంది, ఊపిరి తీయడానికైనా తీరుబడిలేదు. ఈ యేడాది పంట పుష్కలంగా పండింది" అని రాశాడు.

ఇటీవలనేను రోవ్నా, ల్వోవ్ నగరాలనూ, యుద్ధకాలంలో మా డిటాచ్ మెంటు పనిచేసిన ఇతర స్థలాలనూ చూడ్డానికి వెళ్ళాను. స్త్రిలిన్‌స్కీయ్‌సోదరులూ, షెవ్‌చూకూ, గ్నెద్యూకూ నేను మా కార్యకలాపాలతో సంబంధం వున్నటువంటి అనేక స్థలాలను దర్శించాం. అన్నిచోట్లా మా వెనుకటి సహయోధులను కలుసుకున్నాం. మా డిటాచ్‌మెంటుకి చెందిన వెనుకటి గెరిల్లాలు సమావేశం కావడమనే ఆలోచన మాకు అప్పుడు తట్టింది. సమావేశం షెవ్‌చేంకో పార్కులో కులికొవ్, గలూశా తదితర సాహసిక దేశాభిమానుల సమిష్టి సమాధివద్ద జరిగింది.

* * *

వాల్యా నాకు రాసిన ఒక వుత్తరంలో, నికొలాయ్ కుజ్నెత్సోవ్ ఒకనాడు అన్న మాటలు గుర్తుకు తెచ్చింది :

"విజయం సాధించిన మరి ఐదేళ్ళూ, పదేళ్ళ తరువాత మన యావత్తు దేశమూ మూడు పూవులూ, ఆరుకాయలుగా ఎలావర్ధిల్లుతుందో నేను ఊహించుకో గలను. అప్పుడు జీవితం ఎంత చక్కగా వుంటుందో కదా!... నాకు ఏమైనా సంభవించినట్టయితే, జీవితం ఈ విధంగా రూపొందేందుకు నేనుపోరాడాను కాబట్టి, ప్రపంచంలోకెల్లా నేను అతి అదృష్టవంతునిగా భావించుకున్నానని నమ్మండి."

వాల్యా స్వహస్తంతో రాసిన ఈ మాటలను ఇప్పుడు నేనుమళ్ళీ చదివాను. చదివి ఇలా తలపోశాను :

"నిజమే ! మేం సాగించిన గెరిల్లా పోరాటాలు, మేం అనుభవించిన కఠోర పరీక్షలు సర్వం—ఇది గొప్ప అదృష్టం కాకపోతే ఇంకేమిటి ?"

"ఈ మనుషులం మేమే ?" అని నేను తలపోశాను.

అవును, ఈ మనుషులం మేమే, సామాన్య సోవియట్ ప్రజలం. ఆ రోజుల్లో మన మాతృదేశాన్ని ఆవరించిన ప్రమాదమూ, పార్టీ ఇచ్చిన పిలుపూ మన బలాన్ని పదింతలు ఇనుమడింపచేశాయి. మన దేశంపై దాడిచేదామని మళ్ళీ ఎవరికైనా బుద్ధిపుట్టిన పక్షంలో, వేలకి వేలూ, లక్షలకు లక్షలూ సామాన్య సోవియట్ ప్రజలు తమ మాతృదేశ రక్షణకై మళ్ళీ లేస్తారు, తమ మాతృభూమికోసం తమ సర్వస్వమూ అర్పించుతారు.

1948.

